# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 12  సంచిక : 5  హైదరాబాద్  154  మే 2014  పేజీలు : 68  రు. 20

- చుండూరు దళితుల్ని చంపిందెవరు?
- ఎన్నికలపై ఎనిమిది వ్యాసాలు
- నరేంద్ర మోడీ నిజస్వరూపం
- కొత్త రాష్ట్రంలో రాయలసీమ
- రిలయన్స్ బందిపోటు వృత్తాంతం
- బాల్కో వ్యతిరేక పోరాట గాథ
- అఫ్ఘనిస్తాన్, ఇరాక్ ప్రజా ప్రతిఘటనలు

# విడి ప్రతి ధర, చందా రేట్లు పెరిగాయి!

## పాఠకులకు విజ్ఞప్తి!
## వీక్షణం విడిప్రతి వెల, సంవత్సర చందాల రేట్లు
## పెంచక తప్పడం లేదు

**వీ**క్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక విడిప్రతి వెల, చందారేట్లు జనవరి 2011 సంచిక నుంచి మూడు సంవత్సరాల పాటు ఏ మార్పూ లేకుండా ఉన్నాయి. ప్రతి నెలా న్యూస్ ప్రింట్ ఖరీదు, ముద్రణా వ్యయం, నిర్వహణా వ్యయం ఎంతగా పెరిగిపోతున్నా, ప్రతి సంచిక విడిప్రతి ఉత్పత్తి వ్యయంలో సగమే వెనక్కి వస్తున్నా, ప్రతినెలా పెద్ద ఎత్తున లోటుతో, ఆర్థిక ఇబ్బందులతో నడుస్తున్నా, ఆ భారాన్ని పాఠకుల మీద వేయకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ వచ్చాం. ఇక తప్పనిసరి పరిస్థితులలో ఏప్రిల్ 2014 సంచిక నుంచి వీక్షణం విడిప్రతి వెల, చందా రేట్లు పెంచాం.

మారిన రేట్ల ప్రకారం విడిప్రతి వెల రు. 20, సంవత్సర చందా రు. 200, మూడు సంవత్సరాలకు రు. 540, ఐదు సంవత్సరాలకు రు. 900, పది సంవత్సరాలకు రు. 1700 ఉంటుంది. వీక్షణంను ఆదరిస్తున్న పాఠకులు ఈ పరిస్థితిని అర్థం చేసుకుని ఎప్పటిలాగే సహకరిస్తారని ఆశిస్తున్నాం. కొత్త విడిప్రతి వెల, చందా రేట్లు 1 ఏప్రిల్ 2014 నుంచి అమలులోకి వచ్చాయి.

**వీక్షణం మీ పత్రిక**

**వీక్షణం ప్రజల పత్రిక**

**వీక్షణంను నాలుగు కాలాల పాటు నిలబెట్టుకునే బాధ్యత ప్రజలదే**

154

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మే 2014
సంపుటి : 12
సంచిక : 5




## లోపలి పేజీల్లో...



### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత




ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజెన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191



'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com


### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో కలువల మాధవరెడ్డి (జనగాం), వకుళాభరణం రామకృష్ణ (హైదరాబాద్)లు రు. 1500 విరాళం ఇచ్చారు. డెమోక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్ కరీంనగర్ జిల్లా విద్యా మహాసభలు (జమ్మికుంట), వరంగల్ జిల్లా విద్యా మహాసభలు (నర్సంపేట) సందర్భంగాను, పాలమూరు యూనివర్సిటీ స్పాట్ వాల్యుయేషన్ సందర్భంగాను ఉపాధ్యాయ, అధ్యాపక మిత్రులు వందకు పైగా చందాలు చేర్పించారు. వారికి కృతజ్ఞతలు. - సం.**

వీక్షణం ఏప్రిల్ 2014 సంచికలో రంగనాయకమ్మ 'కార్మికవర్గ విప్లవ నియంతృత్వం' వ్యాసంలో – 'విప్లవ నియంతృత్వం' కూడా ఎల్లకాలం ఉండేది కాదు. దోపిడీ వర్గం తన తప్పు తను గ్రహించి, న్యాయమైన, సంస్కారవంతమైన, సమానత్వ సంబంధాల్ని ప్రేమించడం ఎంత తొందరగా నేర్చుకుంటే, విప్లవ నియంతృత్వంతో అవసరం అంత తొందరగా ఆగిపోతుంది. శాంతి కాంతి అంత తొందరగా వెలుగుతుంది' అని అన్నారు. ఔనా, దోపిడీ వర్గానికి ఈ హృదయపరివర్తన కలుగుతుందా? వారు 'సంస్కారవంతమైన సమానత్వ సంబంధాల్ని ప్రేమించడం' నేర్చుకుంటారా? ఏమి మార్క్సిజం ఇది?

**– కె. వెంకటేష్**
హైదరాబాద్

వీక్షణం ఏప్రిల్ సంచికలో నలమాస కృష్ణ రాసిన వ్యాసం చదివిన తరువాత ఒక విషయం జ్ఞాపకం వచ్చింది. మార్క్సిజం సెమినార్ ఏర్పాటు చేయడానికి హైదరాబాద్‌లో జరిగిన సమావేశంలో ఒక ప్రముఖ ఎన్‌జిఒ నేత ఇచ్చిన సలహా ఏమిటంటే ఆ సెమినార్ జరిగిన తరువాత, తెలంగాణలో ఏర్పడబోయే ప్రభుత్వానికి సలహాలు ఇచ్చే కమిటీ ఏర్పడి 'అభివృద్ధి'కి తోడ్పడాలని. దాన్ని సీరియస్‌గా విన్న వారిని చూస్తే నవ్వాలో, ఏడ్వాలో అర్థం కాలేదు. రాజ్యానికి వర్గ స్వభావం లేదు, అది ఏదో ఒక ప్రైవేట్ ఆస్తిని (శ్రమశక్తిని ఒక వర్గం సొంతం చేసుకోవటాన్ని) రక్షించదు అనే భ్రమలు కల్పించడం, 21వ శతాబ్దపు విప్లవం అనే భ్రమలు కల్పించడమే ఇటువంటి ప్రతిపాదనల వెనుక ఉద్దేశం. కనీసం ఆ సెమినార్ కార్మికుల పోరాటాలకు మద్దతుగా నిలిచే కమిటీని కూడా ఏర్పరచినట్లు కనబడదు. హైదరాబాద్‌లోనే ఇటువంటి సంస్థల్లో కనీసం 20 వేల మంది పని చేస్తున్నారని అంచనా. వీటిని రాజకీయంగా ఎదుర్కోవడం అంటే సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోవడంలో భాగమే. సుమారు 25 సంవత్సరాల క్రితం హైదరాబాద్‌లోని బీడీ కార్మికుల (వారు మొత్తం స్త్రీలే) ఉద్యమానికి మద్దతుగా జరిగిన సమావేశంలో ఎన్‌జిఒ సంఘాలు చేసిన ప్రతిపాదన – స్త్రీలు సహకార సంఘాలు ఏర్పరచుకొని తమ బీడీలు తామే అమ్ముకోవాలని – సరిగ్గా లేబర్ కమిషనర్ అయిన ఒక ఐఎఎస్ అధికారి చెప్పిన మాట. స్త్రీలు అలా సహకార సంఘం ఏర్పరిస్తే, బీడీ కంపెనీలు కొత్త కార్మికులను తీసుకొని వారిని దోచుకోరా అనే ప్రశ్నకు మాత్రం జవాబు లేదు!

ఇక లాటిన్ అమెరికా తోవలో తెలంగాణ నిర్మాణం మాటకొస్తే, ఈ రకమైన బ్లూప్రింట్‌లకు కాలం చెల్లింది. ఉన్నదల్లా నిర్దిష్ట పరిస్థితుల, నిర్దిష్ట పరిశీలన, అన్ని స్థాయిల్లో ఘర్షణ, వర్గ పోరాటాలు పదునెక్కించడం. కార్మిక వర్గ (కేవలం పారిశ్రామిక కార్మికులే కాదు) అగ్రగామి పాత్ర. వీటితో పర్యావరణ, ప్రజాస్వామిక ఉద్యమాలను కలుపుకు పోగలగడం.

**– నరేంద్రమోహన్**
ఆస్ట్రేలియా

వీక్షణం ఏప్రిల్ సంచికలో నలమాస కృష్ణ ఎన్‌జిఒల ప్రమాదం గురించి రాసిన వ్యాసం చదివాను. సులువుగా అర్థం చేయించే ప్రయత్నం బాగుంది. అయితే వ్యాస ప్రారంభంలో చెప్పిన పిట్టకథలో చిన్న సవరణ చేస్తే ఇంకా సరిగ్గా సరిపోతుంది. బస్సు ప్రయాణంలో రైతు సంచిలోని డబ్బును దొంగిలించిన పెద్దమనిషిని పాలకవర్గాలు అనుకుంటే, ఆయన పక్క సీటులో కూర్చున్న సౌమ్యమైన ముఖం గల సమాజ సేవకుడు పెద్దాయన దొంగిలించడాన్ని కళ్లారా చూస్తాడు. అది గమనించి పెద్దాయన ఆయన జేబులో ఓ వంద నోటు ఉంచగా అప్పుడు సమాజ సేవకుడి ముఖం ఉన్నాయన గట్టిగా 'పాపం ఆ రైతు సొమ్ము దొంగిలించిన దొంగ రాస్కెల్ ఎవడో వాడిని పట్టుకుని తగిన విధంగా శిక్షించాలని' అరిచి, 'ఇప్పుడా రైతు ఇంటికెలా వెళ్తాడు' అంటూ తన జేబులోని దొంగ పెద్దాయన ఇచ్చిన వంద రూపాయల నుండి ఓ పది రూపాయలు సహాయంగా ఇచ్చి పెద్దాయనతో సార్ మీరు కూడా సహాయం చేసి పుణ్యం కట్టుకోండని అడగడం, పెద్దాయన దొంగ సొమ్ములోంచి ఓ వంద రూపాయలిచ్చి దానకర్ణుడ నిపించుకోవడం, ఇదంతా ఏమి తెలియని రైతు ఆ ఇద్దరిని తన పాలిట దేవదూతలుగా భావించి పదే పదే కృతజ్ఞతలు చెప్పుకోవడం. కథ ఇలా ఉంటే పాలకవర్గాలను, ఎన్‌జిఒల పాత్రను అర్థం చేసుకోవడానికి సరిగ్గా సరిపోతుంద నిపిస్తుంది. ఆలోచించండి.

**– నటాషా**
(వీక్షణం బ్లాగ్‌పై)

ఈ సారి రచయితల సమావేశానికి నేను రాలేకపోయాను. బహుశా వచ్చి ఉండుంటే మీ వివరణాత్మక రిపోర్ట్ మీద అప్పుడే నా ప్రతిస్పందన ఉండేది. మీరు లేవనెత్తిన అనేక అంశాలను ఆమోదిస్తూనే స్త్రీల రచనలు రాకపోవడం గురించి మీరు చేసిన వ్యాఖ్యానం మీద నా విమర్శను ఇప్పుడు రాతపూర్వకంగా పంపుతున్నాను. 'వీక్షణం రచయితలలో మాత్రమే కాదు, తెలుగు రాజకీయార్థిక, సామాజిక విశ్లేషకులలోనే మహిళలు అతి తక్కువ.' దీనికి పైనున్న పేరాలో 'నిజానికి తెలుగుసీమలో ప్రగతిశీల దృక్పథం కలిగినవాళ్లు వేలాదిగా ఉన్నారని, వారిలో కొన్ని డజన్ల మంది అయినా లోతైన ఆలోచనలు చేయగలిగినవాళ్లు, రాయగలిగిన వాళ్లు ఉన్నారని చూసినప్పుడు కొద్దిపాటి శ్రద్ధతో ఈ రంగాలలో వ్యాసాలు రాయడం సాధ్యమేనని అర్థమవుతుంది' అని రాశారు.

నిజానికి నేను ఈ వాక్యాలను ఎందుకు పోలిక తీసుకున్నానంటే, ముందు వాక్యం స్త్రీలను ఉద్దేశించినది అయితే, రెండోది పురుషులను ఉద్దేశించినది. అలా కాదు, నేను ఇద్దరినీ ఉద్దేశించి రాసినది అని మీరు చెప్పొచ్చు. కాని స్త్రీలను రచయితలుగా ఉద్దేశించినపుడు 'వారి సంఖ్య వీక్షణం లోనే కాదు, బయట కూడా తక్కువే' అన్నారు. అయితే నిజానికి ఈ సంఖ్య తక్కువ ఉందా లేక రాస్తున్న వాళ్లను (రాయగలిగిన వాళ్లను) మీరు (సమాజం) గుర్తించడం లేదా? 'కొద్దిపాటి శ్రద్ధతో ఈ రంగాలలో వ్యాసాలు రాయడం సాధ్యమేనని అర్థమవుతుంది' అని రచయితల గురించి ఒక సానుకూల దృక్పథం చూపించి నప్పుడు, ఇదే సానుకూల దృక్పథం రచయిత్రుల మీద కూడా ఉండొచ్చు. అలా కాకుండా ఒక తీర్పుగా చెప్పేశారు. వీక్షణం లాంటి పత్రిక సంపాదకులుగా మీ నుంచి ఇలాంటి వ్యాఖ్య సమంజసం కాదు.

రెండోది వీక్షణం లాంటి పత్రిక నిర్వాహకులు కొంచెం దృష్టి పెట్టి ఆలోచిస్తే మీకు పరిచయం ఉన్నవారిలోనే రాసే వాళ్లు చాలామంది స్త్రీలు ఉండి ఉంటారు. కొత్తగా రచయితలు కాగలిన స్త్రీలను గుర్తించడం మంచిదే, కాని ఇప్పటికే వివిధ సామాజిక అంశాల మీద అద్భుతమైన విశ్లేషణలు చేసిన, చేస్తున్న వాళ్లు చాలా మంది ఉన్నారు. వారితో సంభాషణ (కమ్యూనికేషన్)లోకి వెళతారని ఆశిస్తాను. అలా రాయగలిగిన కొంతమందికి ప్రతినెల లేదా రెండు నెలల కొకసారి కాలమ్ లాగా రాసే బాధ్యత అప్పగిస్తే రొటీన్ అంశాలు కొంచెం తగ్గే అవకాశం ఉంది. ఆలోచించండి.

**– సజయ**
హైదరాబాద్

తెలంగాణ అభివృద్ధిపై గత ఏప్రిల్ సంచికలో వేణుగోపాల్ రాసిన వ్యాసం చదివాను. తెలంగాణ అభివృద్ధి, కె.సి.ఆర్, జానారెడ్డి, తెలుగుదేశం వలన జరగదు. అక్కడి దేశభక్తి పూరిత వామపక్ష రాజకీయ వాదుల వల్లనే అభివృద్ధి జరుగగలదు అనే విషయాన్ని స్పష్టంగా చెప్పారు.

**– వి.వి. నరసింహాచార్యులు**
కావలి, నెల్లూరు

ఏప్రిల్ సంచికలో మార్చ్ 9న జరిగిన రచయితల సమావేశంలో పాల్గొన్న వారి ఫొటోలు రెండవ కవర్‌పై ఉన్నాయి. కాని వారి పేర్లు వరుస క్రమంలో ఆ పేజీలో గాని, సమావేశ వివరాలున్న పేజి 62-63లలో గాని రాసి ఉంటే

(మిగతా 63వ పేజీలో...)

వీక్షణం

# ఈ బవిరి గడ్డపు హిట్లర్‌ను అడ్డుకుందాం!

ఏడు దశాబ్దాల కింద మట్టికరిచిన నరహంతకుడు అడాల్ఫ్ హిట్లర్ వికటాట్టహాసం ఇవాళ నరేంద్ర మోడీ రూపంలో భారత దేశమంతటా వినిపిస్తున్నది. ఇతర మతస్తుల పట్ల ద్వేషం, మతోన్మాదం, భిన్నాభిప్రాయాల పట్ల అసహనం, నిరంకుశత్వం, దేశభక్తి పేరిట సంపన్నుల సేవ, ప్రజలను మోసం చేసే సమ్మోహక వక్తృత్వశక్తి, ప్రజలకు అబద్ధపు కలలను అమ్మగల నేర్పు వంటి అనేక అంశాలలో హిట్లర్ కూ మోడీకీ దగ్గరి పోలికలున్నాయి. హిట్లర్ లాగనే మోడీ కూడ అవకాశం వస్తే తన అసహనాన్ని, విద్వేషాన్ని ఊచకోతలుగా మార్చగలనని 2002 గుజరాత్ మారణకాండలో చూపుకున్నాడు. మొదటి ప్రపంచ యుద్ధ విరమణ ఒడంబడికలో జర్మనీకి అన్యాయం జరిగిందనీ, అందువల్లనే ఆర్థిక దుస్థితి వచ్చిందనీ నిజమైన కారణాలు చూపి హిట్లర్ ఎట్లాగైతే జాతీయోన్మాదాన్నీ, మూర్ఖత్వాన్నీ, హంతక ప్రవృత్తినీ రెచ్చగొట్టగలిగాడో, యువతను ఆకర్షించగలిగాడో, సరిగ్గా అలాగే మోడీకి కూడ కాంగ్రెస్ పాలన అవినీతి, నిరుద్యోగం, ఆర్థిక సంక్షోభం, అభివృద్ధి రాహిత్యం వంటి నిజమైన కారణాలున్నాయి. కాని హిట్లర్ అధికారానికి వచ్చిన తర్వాత ప్రపంచానికి ఎంత పెనుముప్పుగా మారాడో, ప్రపంచాన్ని ఎట్లా కబళించాడో, లక్షలాది మందిని ఎట్లా ఊచకోత కోశాడో, కోట్లాది మందిని యుద్ధంలో ఎట్లా బలితీసుకున్నాడో చరిత్ర చదివిన మనం మరి ఈ ఇరవై ఒకటో శతాబ్దపు హిట్లర్‌ను అధికారంలోకి రానిద్దామా అనేదే ఇవాళ ఈ దేశ ప్రజల ముందు, బుద్ధిజీవుల ముందు ఉన్న ప్రశ్న. ఇరవయో శతాబ్ది జర్మన్ సమాజం తెలిసి తెలిసీ అడాల్ఫ్ హిట్లర్‌ను అధికారానికి రానిచ్చి మహామానవ హననానికి కారణమైంది. ఇరవయో ఒకటో శతాబ్ది భారత సమాజం ఆ తప్పు చేయగూడదు.

ఏడు దశాబ్దాల తర్వాత వస్తున్న ఈ ఆధునిక హిట్లర్ యువతను ఆకర్షిస్తున్న పద్ధతి చాల ప్రమాదకరంగా, భయం గొలిపేలా ఉంది. దేశ పురోగతి కుంటుపడడం మీద, అవినీతి కుంభకోణాల మీద ప్రజల్లో ఉన్న ఆందోళనను సొమ్ము చేసుకోవడానికి అభివృద్ధి మంత్రాన్ని జపిస్తున్నాడు. ఆరు దశాబ్దాలలో జీవనం ధ్వంసమైపోయిన చేతివృత్తుల, వెనుకబడిన కులాలను ఆకర్షించడానికి తానే ఎన్నడో మరిచిపోయిన, తన మనువాద భావజాలం ప్రకారమే అణచివేతకు గురవుతున్న కులాన్ని పైకి తీస్తున్నాడు. తానూ అట్టడుగు శ్రామిక జీవితం నుంచి వచ్చానని చూపుకుని దేశంలోని అశేష శ్రామిక జనాన్ని ఆకట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. తన మాతృసంస్థ ఆర్ఎస్ఎస్ భావజాలంలో భాగంగా ముస్లింల మీద విద్వేషం, హైందవ బ్రాహ్మణీయ ఆధిపత్యం సరేసరి. గత కాలపు సంఘపరివార్ నాయకులందరికంటే కూడ ప్రమాదకరమైన, విషపూరితమైన రసాయనాన్ని ఈ దేశప్రజలకు అవసరమైన ఔషధమనీ, పానీయమనీ అందించడానికి ప్రయత్నించడమే మోడీ ఘనత.

మరి మోడీత్వ రూపంలోని సంఘ పరివార భావజాలం వ్యాపించడానికి ప్రస్తుతం నెలకొని ఉన్న సానుకూల భౌతిక సామాజిక పరిస్థితి ఏమిటి? అపారమైన సంపద ఉన్నప్పటికీ, ప్రపంచంలోనే అతి ఎక్కువ శాస్త్ర సాంకేతిక నిపుణులు ఉన్నప్పటికీ, దేశ ఆర్థిక వ్యవస్థ దిగజారుతుండడం, పేదరికం, అవిద్య, అనారోగ్యం, విపరీతమైన నిరుద్యోగం, ప్రతిభకు తగిన గుర్తింపు లేకపోవడం, వ్యవసాయం పట్ల చిన్నచూపు, రోజురోజు బైటపడుతున్న అవినీతి కుంభకోణాలు, పాలనలో అడుగడుగునా అక్రమాలు నిండిన ఈ వ్యవస్థ పట్ల ప్రజలలో, యువతరం లో గూడు కట్టుకుని ఉన్న నిరాశా నిస్పృహలే ఆ భౌతిక పరిస్థితి. ఆ నిరాశా నిస్పృహలనుంచి వారిని విముక్తి చేసే మార్పుకోసం, నాయకత్వం కోసం, సిద్ధాంతం కోసం, ప్రజావెల్లువ కోసం ప్రజలు, ముఖ్యంగా యువతరం ఎదురుచూస్తున్నారు. అటువంటి మార్పు ఆలోచనలు గాని, నాయకత్వం గాని, సిద్ధాంతం గాని, ప్రజావెల్లువ గాని వారికి అందుబాటు లో లేకపోవడం వల్ల, ఎక్కడైనా ఉన్నా వాటి పట్ల భయం, అనుమానం, అపోహలు వ్యాపించి ఉండడం వల్ల, వాటి మీద పాలకవర్గాలు భయానకమైన అణచివేతను ప్రయోగిస్తుండడం వల్ల విశాల భారత దేశంలో ప్రజలకు, యువతరానికి ప్రత్యామ్నాయం లేని దిక్కుతోచని స్థితి ఉంది. ఆ స్థితిలో ఏ గడ్డిపోచ దొరికినా అందుకోవడానికి సిద్ధంగా ఉన్నారు. భారతీయ జనతా పార్టీ కూడ పాలకవర్గాల తానులోని ముక్కే అని తెలిసినా, కొంత భిన్నంగా కనబడుతున్న గడ్డిపోచ నరేంద్ర మోడీ. వరదలో కొట్టుకుపోతున్న ప్రజలకు గడ్డిపోచలా కనబడుతున్న విషసర్పం నరేంద్ర మోడీ.

మోడీకి దొరుకుతున్న ఆదరణలో ఎక్కువభాగం సంపన్నుల నుంచీ, బహుళజాతి సంస్థల నుంచీ, కార్పొరేట్ సంస్థల నుంచీ, ప్రచార సాధనాల నుంచీ మాత్రమే. కాని అంతమాత్రమే అయితే అది ఇంత పెద్ద ఎత్తున ఉండేది కాదు. కొనసాగుతున్న వ్యవస్థ మీద అసంతృప్తి. ఆ అసంతృప్తిని అర్థవంతమైన మార్గాలలో వ్యక్తీకరించే అవకాశం లేకపోవడం, మెరుగైన బతుకు కోసం తపన అనే భౌతిక సామాజిక పునాది ఆ ఆదరణను పెంచుతున్నది. కనుక మోడీ వ్యతిరేక, సంఘ పరివార వ్యతిరేక ప్రచారం కేవలం మోడీ మీద, సంఘ పరివారం మీద కేంద్రీకరిస్తే సరిపోదు. అలా కేంద్రీకరిస్తే అది పొరపాటుగా కాంగ్రెస్‌కు, సోనియా గాంధీ – రాహుల్ గాంధీలకు మద్దతుగా కనబడవచ్చు కూడ. నిజానికి ఆ పాలకవర్గ ముఠా కూడ సమానంగా ప్రమాదకరమైనదే, దుర్మార్గమైనదే, నరహంతక పాలనను, ప్రజావ్యతిరేక పాలనను నడిపినదే. గుజరాత్ మారణకాండ 2002 ఎంత దుర్మార్గమైనదో 1984 ఢిల్లీ మారణకాండ అంతే దుర్మార్గమైనది. ఏ రంగం చూసినా రెండు పాలకవర్గ ముఠాల ప్రజాద్రోహ, వినాశకర చరిత్ర ఒకటే.

అందువల్ల మోడీకీ, సంఘపరివారానికీ అవకాశం ఇస్తున్న భౌతిక సామాజిక పునాదిని, అంటే వ్యవస్థ లోపాన్ని, వ్యవస్థ పరివర్తన జరగవలసిన అవసరాన్ని కలిపి చెప్పగలిగినప్పుడే ప్రజలకు నిజమైన ప్రత్యామ్నాయం గురించి, ప్రజా ప్రత్యామ్నాయం గురించి ఆలోచనలు కలుగుతాయి. మోడీ పట్ల వ్యక్తమవుతున్న ఆదరణలో కొంతభాగం ప్రజలలోని గాఢమైన మార్పు ఆకాంక్షకు వ్యక్తీకరణ అనీ, కాకపోతే అది ఒక వక్రమైన వ్యక్తీకరణ అనీ గుర్తించాలి. ఆ మార్పు ఆకాంక్షను బలపరచి, దాని వక్రతను తొలగించడానికి ప్రయత్నించాలి. ఆ ప్రజా ఆకాంక్ష నిజంగా తీరే మార్గం ఏమిటో చూపడానికి ప్రయత్నించాలి. అటువంటి చైతన్యపూర్వకమైన ప్రయత్నం మాత్రమే ఈ కొత్త హిట్లర్‌ను ఆపడం మాత్రమే కాదు, సమాజంలో స్వపరిపాలన పట్ల, ప్రత్యామ్నాయం పట్ల చైతన్యాన్ని పెంచుతుంది. వీ

# చుండూరు నరహంతలు నిర్దోషులట!

ఆధునిక తెలుగు సమాజానికి మాయని మచ్చ వంటి చుండూరు నరమేధం మీద ఘనత వహించిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అత్యంత దుర్మార్గమైన, హాస్యాస్పదమైన, విషాదకరమైన తీర్పును ప్రకటించింది. గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని చుండూరు గ్రామంలో 1991 ఆగస్ట్ 6న రెడ్డి భూస్వాములు, ఇతర కులాల అనుచరుల సహాయంతో ఆ గ్రామ మాల, మాదిగల మీద దాడిచేసి, అత్యంత పాశవికంగా ఎనిమిది మందిని అక్కడికక్కడే నరికి చంపి, మృతదేహాలను గోనెసంచు లలో కుక్కి కాలువల్లోకి విసిరేశారు. (ఆ దారుణానికి కొనసాగింపుగా మరో నలుగురు దళితులు మరణించారు). ఆ అమానుషమైన దాడి వివరాలు విని దేశమంతా ఆగ్రహావేశాలతో అట్టుడికిపోయింది. సాధారణంగా ఇటువంటి దురాగతాలను ప్రోత్సహించే, చూసీచూడనట్టుండే, హంతకులను రక్షించే పాలకవర్గాలు కూడ ప్రజాఆగ్రహానికి, స్పందనకు జడిసి కనీస న్యాయవిచారణ చర్యలు చేపట్టక తప్పలేదు. చుండూరులోనే ప్రత్యేక న్యాయస్థానం ఏర్పాటయి, బాధితులు కోరుకున్న, బాధితులకు నమ్మకం ఉన్న న్యాయవాదులే వారి తరఫున వాదించే అవకాశం వచ్చింది. నేరంలో పాల్గొన్నవారిలో కొందరిని తప్పించడం, ముద్దాయిలలో కొందరు గ్రామంలో బహిరంగంగా తిరుగుతున్నా అరెస్ట్ చేయకపోవడం, నేరానికి సహకరించిన పోలీసు, ప్రభుత్వ అధికారుల గురించి ప్రస్తావించకపోవడం వంటి లోపాలతోనైనా 212 మంది ముద్దాయిలమీద కేసు నడిచి పదహారు సంవత్సరాల తర్వాత తీర్పు వెలువడింది. విచారణలోని ఈ జాప్యంతో 33 మంది ముద్దాయిలు సహజ మరణం పొంది, శిక్ష తప్పించుకున్నారు. అప్పుడైనా ప్రత్యేక కోర్టు 2007 జూలై 31న ఇచ్చిన తీర్పులో 123 మందిని నిర్దోషులుగా విడిచిపెట్టి, 56 మందికి నేరంలో భాగం ఉందని తేల్చింది. వారిలో 21 మందికి యావజ్జీవ శిక్ష, మిగిలినవారికి ఏడాది జైలు శిక్ష విధించింది. నిజానికి జరిగిన ఘోరమైన నేరంతో పోలిస్తే ఆ శిక్షలే చాల తక్కువ. కాని ఆ శిక్షల మీద విచారణ జరిపిన రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ఎల్ నరసింహారెడ్డి, జస్టిస్ ఎం ఎస్ కె జైస్వాల్ లు ఆ శిక్షలను కూడ రద్దు చేస్తూ నిందితులందరూ నిర్దోషులని తేల్చారు. వారు నేరం చేశారని ప్రాసిక్యూషన్ రుజువు చేయలేకపోయిందని సాంకేతిక కారణాలు చూపారు. అంత బహిరంగంగా, పథకం ప్రకారం జరిగిన అమానుషమైన దారుణ మారణకాండ విషయంలో హైకోర్టు ఇటువంటి తీర్పునివ్వడం ఘోరమైన అన్యాయం. న్యాయమూర్తులిద్దరూ అగ్రవర్ణాలకు చెందినవారు, వారిలో ఒకరు నిందితుల కులానికి చెందినవారు కావడం, విచారణ క్రమంలోనే వారు నిందితులకు అనుకూలంగా, బాధితులకు వ్యతిరేకంగా వ్యాఖ్యలు చేయడం వంటి అంశాలు ఇప్పుడు బైటికి వస్తున్నాయి. అంటే న్యాయం జరగకపోవడం మాత్రమే కాక, కనీసం న్యాయం జరిగిందనే అభిప్రాయం కలిగించడానికి కూడ న్యాయమూర్తులు ప్రయత్నించలేదన్నమాట. ఈ దేశంలో ఇంకా చట్టబద్ధ పాలన రాలేదని, ఇప్పటికీ అగ్రవర్ణాలకు కులవిద్వేషంతో కింది కులాల వాళ్లను చంపే హక్కు ఇచ్చిన మనుస్మృతి పాలనే నడుస్తున్నదని ఈ తీర్పు చెప్పకనే చెపుతున్నది. వ్యవస్థ మారకుండా, కుల అసమానతలు, కుల వివక్ష, కుల విద్వేషం తొలగిపోకుండా, న్యాయస్థానాల వంటి ఆధునిక నిర్మాణాలను తెచ్చుకున్నంత మాత్రాన ప్రయోజనమేమీ లేదనీ, వ్యవస్థ మార్పు అవసరాన్నీ ఈ తీర్పు మరొకసారి చెపుతున్నది. వీ

# కాగితపు పులి గొప్పలను బైటపెట్టిన విమాన ప్రమాదం

ప్రపంచమంతా కుగ్రామమైపోయిందనీ, ప్రపంచాన్నంతా తమ అరిచేతిలో క్షణంలో చూడగలిగిన సాంకేతిక పరిజ్ఞానాన్ని సాధించామనీ, ఎక్కడ ఏమి జరిగినా తమ ఉపగ్రహాలు, తమ సాంకేతిక సాధనాలు కనిపెడతాయనీ సామ్రాజ్యవాదులూ, వారి దళారులూ గత కొంతకాలంగా చెప్పుకుంటున్న గొప్పలన్నీ పచ్చి అబద్ధాలని మలేషియా విమాన ప్రమాదం అక్షరాలా రుజువు చేస్తున్నది. మానవ రహిత విమానాల (డ్రోన్ల) ద్వారా ఫొటోలు, విడియోలు సేకరించి 'తీవ్రవాదులు' ఎక్కడ ఉన్నా కనిపెట్టి వారి మీద నేరుగా బాంబులువేసి నిర్మూలిస్తామని అమెరికా పాలకుల దగ్గరినుంచి ఆపరేషన్ గ్రీన్‌హంట్ నిర్వాహకుల దాకా ప్రకటించినవన్నీ ప్రగల్భాలేనని ఎందరో అమాయకుల బలితో ఇదివరకే రుజువైంది. ఆయుధ శక్తి, సాంకేతిక శక్తి ఎంతటిదైనా మానవశక్తి ముందు బలాదూరేనని మానవజాతి చరిత్ర అంతా వేనోళ్ల చెపుతున్నది. ఆ జాబితా లోకి కొత్తగా వచ్చి చేరినది ప్రమాదానికి గురైన మలేషియా ప్రయాణ విమానం. మలేషియా రాజధాని కౌలాలంపూర్ నుంచి చైనా రాజధాని బీజింగ్‌కు మార్చ్ 8న బయలుదేరిన ఈ విమానం ప్రయాణం ప్రారంభించిన గంటసేపటికే కనబడకుండా పోయింది. సిబ్బందితో సహా 240 మంది ప్రయాణిస్తున్న ఈ విమానం బీజింగ్‌కు చేరవలసిన సమయానికి చేరకపోయినప్పుడే ప్రమాదానికి గురై ఉంటుందని ప్రకటనలు వెలువడ్డాయి. అసలు ప్రయాణం ప్రారంభించిన కొద్ది గంటలలోనే దానికి విమానాశ్రయాలతో సంబంధం తెగిపోయిందని, ఉపగ్రహ చిత్రాలలో కూడ అది కనబడకుండా పోయిందని ఆ తర్వాత బైటపడింది. అమెరికా, బ్రిటన్, రష్యా, చైనా, జపాన్, భారత్‌లతో సహా 26 దేశాలకు చెందిన ప్రభుత్వాలు, 60 ఓడలు, 50 విమానాలతో మలేషియా ప్రభుత్వానికి సహకారం అందించి, అన్వేషణ జరిపి కూడ ఆ విమానం ఎక్కడ కూలిపోయిందో, అసలు కూలిపోయిందో లేదో చెప్పలేకపోయాయి. ఆ విమానంలో ఏవో రహస్యాలు తెలిసిన శాస్త్రవేత్తలు ఉన్నారని, వారిని అపహరించడానికి హైజాకింగ్ జరిగి ఉంటుందని, లేదా వారిని చంపివేయడం కోసం విమానాన్ని పేల్చివేయడం జరిగి ఉంటుందని, విమానపు సాంకేతిక వ్యవస్థ మీద సైబర్ దాడి జరిగి ఉంటుందని, అమెరికా ప్రభుత్వం ఆ విమానాన్ని డీగో గార్షియాలో రహస్యంగా దించి ఉంటుందని, కనీసం 13 కుట్ర సిద్ధాంతాలు కూడ ప్రచారంలోకి వచ్చాయి. ఈ కుట్ర సిద్ధాంతాలలో ఏ ఒక్కటి నిజమైనా విమానం గురించి వివరాలు ఆ తర్వాతనైనా బైటపడి ఉండేవే. కాని విమానం తప్పిపోయి ఏడువారాలు కావస్తున్నా హైజాకింగ్, దారి మళ్లింపు వివరాలు బైటపడలేదంటే అవి నిజం కాదన్నమాటే. విమానాన్ని గాలిలో పేల్చడం జరిగి ఉన్నా సముద్ర జలాలలో విమాన శకలాలు దొరికి ఉండేవి. సాధారణంగా విమానాలలో ఉండే బ్లాక్‌బాక్స్ సంకేతాలు పంపుతుంది గాని అన్వేషణ ఆలస్యమైన కొద్దీ ఆ బ్లాక్‌బాక్స్‌లోని బాటరీ కాలం అయిపోతుంది. అది పనిచేస్తున్నప్పుడు పంపిన సంకేతాలుగా భావిస్తున్న వాటి మీద ఆధారపడి హిందూ మహాసముద్ర దక్షిణ భాగంలో దాదాపు అరవైవేల చ.కి.మీ. ప్రాంతంలో ఇంకా అన్వేషణ సాగుతున్నది గాని అక్కడ సముద్రం కనీసం నాలుగు కి.మీ. లోతు ఉండడం వల్ల విమానం అట్టడుగుకు పడిపోయిందేమో తెలియడం లేదు. ఈ మొత్తం వ్యవహారం నుంచి గ్రహించవలసిందేమంటే సామ్రాజ్యవాదం తన సాంకేతిక పరిజ్ఞానం గురించి చెప్పుకుంటున్న గొప్పలలో వాస్తవం కన్న అవాస్తవం, సామర్థ్యం కన్న అసమర్థత ఎక్కువని. అంటే అది కాగితపు పులి మాత్రమే అని. అది తెలియడం కూడ ఆహ్వానించవలసిందే. వీ



❖ **హక్కుల చరిత్రలో చట్టాల జాడలు** (స్త్రీలు-చట్టాలు) - హేమలలిత (హైకోర్టు న్యాయవాది) - ఆమె సమానత్వం ప్రచురణ - 151 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: హేమలలిత, ఫ్లాట్ నెం. 181, రోడ్ నెం. 6, హేమనగర్, బోడుప్పల్, హైదరాబాద్-39; సెల్: 9912195330, 7396802440



❖ **మహిళ లేని చరిత్ర లేదు** - ఉద్యమాలలో భారత మహిళలు - వి. గార్గి, తెలుగు అనువాదం: మధుమాలతి, సూరి - మహిళామార్గం ప్రచురణలు - 328 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం



❖ **బుద్ధధర్మం - జీవనశాంతి** - డి. నటరాజ్ - 64 పేజీలు, 1/8 డెమీ, వెల: ధమ్మానుసరణ, ప్రతులకు: సెక్యులర్ ఇంప్రెషన్స్, సింహాచలం, విశాఖపట్నం-28; సెల్: 7702355076



❖ **చరిత్ర మరచిన రోజు - తెలంగాణ విమోచన దినం 17-09-1948** - కపిలవాయి రవీందర్ - 90 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: శ్రీ విజయ ఎంటర్‌ప్రైజెస్, 2-12-395, విద్యారణ్యపురి, హన్మకొండ, వరంగల్ - 506 009; సెల్: 7386775678, 8341287633; అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు



❖ **విలోచనం** (సాహితీ విమర్శ వ్యాసాలు) - డా. అనుగూరు చంద్రశేఖర రెడ్డి - 156 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: డా. అనుగూరు చంద్రశేఖర రెడ్డి, ఇ.నెం. 12/305, హనుమప్ప వీథి, కడప - 516 001; సెల్: 9949299458



❖ **చంద్రస్మృతి** - భువనగిరి చంద్రశేఖర్ స్మారక సంఘం, గుంటూరు - 151 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు : ఎ. సుబ్రహ్మణ్యం, జిఎఫ్1, సుధా అపార్ట్‌మెంట్స్, 6/13ఎ, బ్రాడిపేట, గుంటూర్-522001; సెల్: 9000389389; email : subrahmanyam.a@gmail.com



❖ **కెవిఆర్ సాహిత్య వ్యాసాలు** - రెండో భాగం - కెవిఆర్, శారదాంబ స్మారక కమిటీ కవిత్వం - 678 పేజీలు, 1/8 డెమీ, రు. 250



❖ **కెవిఆర్ సాహిత్య వ్యాసాలు** - మూడో భాగం - కెవిఆర్, శారదాంబ స్మారక కమిటీ కవిత్వం - 598 పేజీలు, 1/8 డెమీ, రు. 250

పై రెండు ప్రతులకు: డా. ఎన్. రామకృష్ణ, శాంతి నర్సింగ్‌హోం, నిర్మలా కాన్వెంట్ ఎదురుగా, పటమట, విజయవాడ - 520 010; సెల్: 98490 83137



❖ **హైద్రాబాదు సిర్ఫ్ హమారా** - నిధి - అడుగు జాడలు పబ్లికేషన్స్ - 39 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు: అడుగుజాడలు పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం. 302, వైష్ణవి నెస్ట్, తిరుమల మ్యూజిక్ సెంటర్ వెనుక, మూసారాంబాగ్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500 036



❖ **మిగిలేటోళ్లు** - బాసిత్ కథలు - విప్లవ రచయితల సంఘం ప్రచురణ - 87 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : పాణి, ఇ.నెం. 50-348-ఎల్/19బి2, అరోర నగర్, బి-క్యాంప్, కర్నూల్-2; దిశ పుస్తక కేంద్రం; నవోదయ బుక్‌హౌస్



❖ **ఉన్నత విద్య వ్యాపారీకరణ** (వ్యాస సంకలనం) - పిడిఎస్‌యు రాష్ట్ర కార్యవర్గం - 72 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: ఎడిటర్, తిరుగుబాటు, ఇ.నెం. 2-1-716 (బి-6, ఎఫ్-4), ఎస్వీఎస్ స్కూల్ ఎదురుగా, ఒ.యు. మెయిన్‌రోడ్, విద్యానగర్, హైదరాబాద్-44; ఫోన్: 040 - 27668471; email : pdsu1974@gmail.com



❖ **పువ్వర్తి అమరులు** - జీవిత చరిత్ర - దిక్సూచి ప్రచురణలు - 40 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **మహోన్నత భారతీయుడు** - బొర్రా గోవర్ధన్ - బుద్ధభూమి ప్రచురణ - 40 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు: బుద్ధభూమి, డోర్ నెం. 11-450/సి1, ఎన్‌సిసి రోడ్, మంగళగిరి - 522 503, గుంటూరు జిల్లా; సెల్: 9848199098



❖ **లెనిన్ ప్రసిద్ధ రచన - రాజ్యమూ - విప్లవమూ** - మార్క్సిస్టు రాజ్య సిద్ధాంతమూ, విప్లవంలో కార్మికవర్గ కర్తవ్యాలు - కుప్తీకరణ - ఎన్‌వివిఎస్ నాగభూషణ్ - తరిమెల నాగిరెడ్డి మెమోరియల్ ట్రస్ట్ - 48 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: మైత్రీబుక్‌హౌస్, 28-29-6, జలీల్ వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్డు, విజయవాడ - 2



❖ **విభిన్న కోణాలు** వ్యాసాలు (సామాజిక, సాహిత్య, పార్శ్వాలు) - పంజాల జగన్నాథం - పంజాల పబ్లికేషన్స్ - 98 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: పంజాల జగన్నాథం, 7-2-92, మంకమ్మతోట, కరీంనగర్ - 505 001; సెల్ : 9948531985; అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు



❖ **ఇదుపు కాయితం** - కవిత్వం - డా. కాసుల లింగారెడ్డి - శైలి పబ్లికేషన్స్ - 112 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: డా. కాసుల లింగారెడ్డి, ఫ్లాట్ నెం. 63, ఇ.నెం. 3-9-318/1, సరస్వతినగర్, చింతల్‌కుంట చెక్‌పోస్ట్, ఎల్.బి. నగర్, హైదరాబాద్ - 500 074

## ఎన్నికల నోటిఫికేషన్

తెలంగాణలోని 17 లోక్‌సభ, 119 అసెంబ్లీ స్థానాలకు ఏప్రిల్ 2న రాష్ట్ర ఎన్నికల ప్రధాన అధికారి భన్వర్‌లాల్ నోటిఫికేషన్ విడుదల చేశారు. నామినేషన్ల స్వీకరణ ఏప్రిల్ 2 నుండే ప్రారంభమై 9న ముగుస్తాయి అన్నారు. తెలంగాణలోని 119 అసెంబ్లీ స్థానాలకు 3700 నామినేషన్లు, 17 లోక్‌సభ స్థానాలకు 472 నామినేషన్లు వేశారు. ఈ నెల 30న ఎన్నికలు జరుగుతాయన్నారు. ఆంధ్రప్రదేశ్‌కు ఏప్రిల్ 12న నోటిఫికేషన్ విడుదల చేశారు. నామినేషన్ల స్వీకరణ ఏప్రిల్ 12న ప్రారంభమై 19న ముగుస్తాయని తెలిపారు. మే 7న 25 లోక్‌సభ స్థానాలకు, 175 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరుగుతాయని భన్వర్‌లాల్ అన్నారు. మే 16న ఓట్ల లెక్కింపు అవుతుందన్నారు.

## సీనియర్ జర్నలిస్ట్ నరేందర్ మృతి

సీనియర్ పాత్రికేయులు ప్రముఖ క్రీడా విశ్లేషకులు రేవెళ్లి నరేందర్ (49) ఏప్రిల్ 2న మృతిచెందారు. ఆయన కొద్ది రోజులుగా మెదడు వ్యాధికి సికింద్రాబాద్‌లోని కిమ్స్ ఆసుపత్రిలో చికిత్సపొందుతూ మృతిచెందారు. ఆయన కరీంనగర్ జిల్లా వాసి. ఆయన పాత్రికేయ జీవితం కరీంనగర్‌లోని జీవగడ్డ పత్రికతో ప్రారంభమైంది. 1986లో ఆయన ఆంధ్రజ్యోతి క్రీడా విభాగంలో చేరి అనంతరం ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఎక్స్‌ప్రెస్ మీడియా సర్వీసెస్‌లో పనిచేశారు. గత కొంత కాలంగా క్రీడా విశ్లేషకునిగా పనిచేస్తున్నారు.

## స్థానిక ఎన్నికల ఫలితాలు

మున్సిపల్, ఎంపిటిసి, జడ్‌పిటిసి ఫలితాలు సాధారణ ఎన్నికలపై ప్రభావం చూపే అవకాశం ఉందన్న కారణంతో పిటిషన్ దాఖలైంది. ఈ పిటిషన్ పై విచారించిన సుప్రీంకోర్టు ఎన్నికలు పూర్తయ్యేవరకు ఫలితాలను నిలిపివేయాలని ఎన్నికల సంఘాన్ని సుప్రీంకోర్టు ఏప్రిల్ 7న ఆదేశించింది. మే12 పురపాలక సంఘ ఫలితాలను, మే 13న జడ్‌పిటిసి, ఎంపిటిసి ఫలితాలను వెల్లడిస్తామని రాష్ట్ర ఎన్నికల సంఘం కార్యదర్శి నవీన్ మిట్టల్ ఏప్రిల్ 21న తెలిపారు.

## ఎన్నికల సందర్భంగా పట్టుబడ్డ నగదు

సాధారణ ఎన్నికల సందర్భంగా పోలీసులు, రాష్ట్ర ఎన్నికల సంఘం నిర్వహించిన సోదాల్లో ఏప్రిల్ 23 నాటికి రు. 102 కోట్ల నగదు, అక్రమంగా తరలిస్తున్న 4.16 లక్షల లీటర్ల మద్యం, 69.5 కిలోల బంగారం, 292 కిలోల వెండి స్వాధీనం చేసుకున్నట్లు రాష్ట్ర ఎన్నికల ప్రధాన అధికారి భన్వర్‌లాల్ తెలిపారు.

## చుండూరు దోషులకు శిక్ష రద్దు

1991 ఆగస్టు 6న చుండూరులో 8 మంది దళితులను అగ్రకులస్తులు చంపిన కేసులో నిందితులకు ప్రత్యేక కోర్టు విధించిన శిక్షను రద్దు చేస్తూ ఏప్రిల్ 22న హైకోర్టు తీర్పు వెల్లడించింది. ఈ ఘటనకు బాధ్యులుగా పేర్కొంటూ 21 మందికి జీవిత ఖైదు, 35 మందికి ఏడాదిపాటు జైలు శిక్ష విధిస్తూ ప్రత్యేక కోర్టు 2007 జూలై 31న తీర్పునిచ్చింది. దళితులపై దాడికి బాధ్యులను గుర్తించడం లోనూ, సంఘటన జరిగిన ప్రాంతాన్ని రుజువు చేయడంలోనూ, చనిపోయివారు ఎప్పుడు చనిపోయారో నిరూపించడంలోనూ విచారణ కోర్టులో ప్రాసిక్యూషన్ విఫలమైందని హైకోర్టు తెలిపింది. జైలులో ఉన్నవారిని విడుదల చేయాలని, వారు జరిమాన చెల్లించి ఉంటే తిరిగి ఇచ్చివేయాలని హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎల్. నర్సింహారెడ్డి, ఎం.ఎస్.కె. జైస్వాల్‌తో కూడిన ధర్మాసనం వెల్లడించింది.

## జూనియర్ లైన్‌మెన్ల మహాధర్నా

తెలంగాణ ప్రాంతానికి చెందిన జూనియర్ లైన్‌మెన్లను వెంటనే క్రమబద్దీకరించాలని కోరుతూ తెలంగాణ విద్యుత్తు ఉద్యోగుల ఐకాస ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని విద్యుత్‌సౌధలో ఏప్రిల్ 23న జూనియర్ లైన్‌మెన్లు మహాధర్నా నిర్వహించారు. ఈ సందర్భంగా రఘు 2006లో రాష్ట్రవ్యాప్తంగా 10 వేల మంది జూనియర్ లైన్‌మెన్లను గుత్త పద్ధతిలో నియమించారన్నారు. 2009లో రాయలసీమ, ఆంధ్రకు చెందిన ఒప్పంద ఉద్యోగులను క్రమబద్ధీకరించి, తెలంగాణ వారిని మాత్రం పట్టించు కోలేదని విమర్శించారు. ఈ సమస్యపై ఎపి ట్రాన్స్‌కో, సిపిడిసిఎల్, ఎస్‌పిడిసిఎల్ అధికారులు స్పందించి న్యాయం చేయాలని కోరారు.

## వ్యవసాయ శాస్త్రవేత్త ఎం.వి. రెడ్డి మృతి

వరి వంగడంలోని సాంబమసూరి (బిపిటి-5204) సృష్టికర్త రాష్ట్రానికి చెందిన ప్రముఖ వ్యవసాయ శాస్త్రవేత్త ఎం.వి. రెడ్డి (88) బెంగుళూరులో ఏప్రిల్ 23న మృతిచెందారు. ఆయన స్వగ్రామం అనంతపురం జిల్లాలోని చీకటివారిపల్లె. ఆయన బాపట్ల వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో ఆయన వరి సాగులో పరిశోధనలు చేస్తూ 1986లో సాంబమసూరిని కనిపెట్టారు.

## శోభా నాగిరెడ్డి మృతి

కర్నూలు ఆళ్లగడ్డ శాసన సభ్యురాలు, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి శోభానాగిరెడ్డి (46) ఏప్రిల్ 23న రాత్రి ఎన్నికల ప్రచారం ముగించుకొని ఆళ్లగడ్డకు తిరిగి వస్తున్న సమయంలో ఆమె ప్రయాణిస్తున్న కారు ప్రమాదానికి గురైంది. ఈ దుర్ఘటనలో ఆమె తీవ్రంగా గాయ పడడంతో హైదరాబాద్ కేర్ ఆస్పత్రిలో చికిత్స ప్రారంభించారు. ప్రమాదంలో ఆమె ఛాతి ఎముకలు విరిగి, ఊపిరితిత్తులు, గుండెకు గుచ్చుకోవడంతో పాటు ఆమె తలపై తీవ్ర గాయాలయ్యాయని వైద్యులు తెలిపారు. ఏప్రిల్ 24న ఉదయం 11 గంటలకు ఆమె మరణించినట్లు వైద్యులు ప్రకటించారు. ఆమె స్వగ్రామం ఆళ్లగడ్డ. 1968, నవంబర్ 16న పుట్టారు.

## శాసనసభ రద్దు

ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన పొడిగిస్తూ ఏప్రిల్ 25న కేంద్ర మంత్రివర్గం నిర్ణయం తీసుకుంది. రాష్ట్రపతి పాలనను పొడిగించా ల్సిందిగా రాష్ట్రపతికి కేంద్ర మంత్రివర్గం సిఫారసు చేసింది. రాష్ట్రపతి ఆమోదం తెలపడంతో రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన కొనసాగనుంది. దీంతో 13వ శాసనసభ రద్దు అయింది. రాష్ట్ర విభజన నిర్ణయం నేపథ్యం లో కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయడంతో కేంద్ర ప్రభుత్వం ఫిబ్రవరి 28న రాష్ట్ర అసెంబ్లీని సుప్తచేతనావస్థలో ఉంచింది. రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించింది. వీ

# చుండూరు దళితుల్ని చంపిందెవరు?

***దేశంలో న్యాయవ్యవస్థ డొల్లగా మారిందనీ, అగ్రకులాల చేతుల్లో, రాజకీయ నాయకుల కనుసన్నల్లో నీరుగారిపోయిందనీ, అణగారిన వర్గాలకు న్యాయం ఎంత దూరమైందో చుండూరు కేసులో తేలిపోయిందనీ అంటున్నారు*** **దుడ్డు ప్రభాకర్**

**1991** ఆగస్టు 6న పట్టపగలు 11 గంటల సమయంలో చుండూరు, వలివేరు, మోదుకూరు, మున్నంగివారిపాలెం గ్రామాలకు చెందిన రెడ్డి, కాపు కుల హంతక మూకలు పోలీసుల సహకారంతో చుండూరు దళితుల్ని వెంటాడి వేటాడి, నరికి చంపారు. నాలుగు రోజుల తర్వాత తుంగభద్ర కాల్వలో 8 శవాలు (ఏడు మంది మాలలు – జాలాది మత్తయ్య, జాలాది ఇమ్మానుయెల్, జాలాది ఇస్సాకు, మల్లెల సుబ్బారావు, మంద్రు రమేష్, దేవరపల్లి జయరాజ్, సంకురు శాంసన్; ఒక మాదిగ – అంగల కుదురు రాజమోహన్) బయటపడ్డాయి. శవాలన్నీ ఉబ్బి, పురుగులు పట్టాయి. ఆ స్థితిలో మంద్రు రమేష్ శవాన్ని చూసి అతని అన్న పరిశుద్ధరావు గుండెపగిలి చనిపోయాడు. హంతకుల అరెస్టుకై ఉద్యమం నడుపుతున్న కొమ్మెర్ల అనిల్ కుమార్‌ను నిరాహార దీక్షా శిబిరంలోనే కాల్చిచంపారు. చలో ఢిల్లీ కార్యక్రమంలో రోడ్డు దాటుతుండగా వాహనం గుద్ది గూడూరు లేయమ్మ అక్కడికక్కడే చనిపోయింది.

నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉండగా, హోంమంత్రి మైసురారెడ్డి అండదండలతో హంతకమూకలు రెచ్చిపోయి చేసిన హత్యాకాండలో మొత్తం పదకొండు మంది చుండూరు దళితులు బలయ్యారు. 16 సంవత్సరాల తరువాత 2007 జూలై 31న చుండూరు ప్రత్యేక కోర్టు తీర్పు ప్రకటించింది. ఆ తీర్పులో 21 మందికి జీవిత ఖైదు, 35 మందికి సంవత్సరం జైలుశిక్ష విధించింది. 2014 ఏప్రిల్ 22న జస్టిస్ ఎల్ నరసింహారెడ్డి, జస్టిస్ ఎం.ఎస్.కె. జైస్వాల్‌లతో కూడిన హైకోర్టు ధర్మాసనం ఆ 56 మందిని నిర్దోషులుగా విడుదల చేస్తూ తీర్పు ఇచ్చింది.

మరి చుండూరు దళితుల్ని గొడ్డళ్లతో నరికి, బరిసెలతో పొడిచి, గోతాల్లో కుక్కి తుంగభద్రలో తొక్కింది ఎవరు? హంతకులుగా ప్రత్యేక కోర్టులో నిర్ధారించబడిన వాళ్లంతా విడుదలైన సందర్భంగా ఈ దేశంలోని పీడిత కులాల ప్రజల మెదళ్లలో మెదులుతున్న ప్రశ్న ఇది.

ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంగా చెప్పుకుంటున్న మనదేశంలో రాజ్యాంగ చట్టాలు, పరిపాలనా వ్యవస్థ, రక్షణ వ్యవస్థలు ఇప్పటికే ప్రజలకు దూరమయ్యాయి. ఈ తీర్పుతో కోర్టుల్లో భారత శిక్షాస్మృతికి బదులుగా మనుస్మృతి నిరాటంకంగా అమలౌతుందని దళితులకు నిర్ధారణ అయింది. గాఢాంధకారంలో చిరుదివ్వెలా కోర్టులపై కొద్ది ఆశలతో బతుకుతున్న ఎస్.సి, ఎస్.టిలకు ఈ తీర్పు నిరాశ, నిస్పృహల్నే మిగిల్చింది. మానవత్వం కోల్పోయి అగ్రకులోన్మాదంతో విరుచుకపడే హంతక మూకలు కోర్టుల్లో నిర్దోషులుగా విడుదలైతే ఇక దళిత పీడిత కులాల మాన ప్రాణాలకు రక్షణ ఎక్కడ? కోర్టులు కూడా ప్రజల విశ్వసనీయతకు దూరమైతే ప్రజాస్వామ్యానికి దిక్కేది? కాబట్టి ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోవాలనుకునే ప్రజలందరూ ఇలాంటి తీర్పులను ముక్తకంఠంతో వ్యతిరేకించాలి.

అగ్రకుల హంతకులూ, పోలీసులూ, పాలకులూ అందరూ నిర్దోషులైతే చుండూరు గ్రామ నడిబొడ్డున రక్తక్షేత్రంలోని ఆ స్మృతి చిహ్నాలెక్కడివి? ఎనిమిది మంది దళితులను హత్యచేసిన హంతకులందరూ నిర్దోషులు సరే, అనిల్ కుమార్ హంతకులపై ఎఫ్ఐఆర్ కూడా కాలేదు. మంద్రు పరిశుద్ధరావు, గూడూరు లేయమ్మ పరోక్ష హత్యలకు కారకులెవ్వరు? ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కోవాలి. హంతకుల్ని కాపాడుతూ, పోలీసుల్ని రక్షణ వలయంగా మార్చుకొన్న అగ్రకుల భూస్వామ్య పాలకవర్గాల కుటిల ఎత్తుగడల్ని, వారందర్నీ రక్షిస్తూ సచ్చీలురుగా వదిలేస్తున్న కోర్టులను వేరుగా చూడలేని స్థితిని చుండూరు కేసు తీర్పు కల్పించింది.

### చుండూరు హత్యాకాండలో పోలీసుల పాత్ర

ఆగస్టు 6 నాటికి మూడు నెలల ముందు నుండి చుండూరు దళితులపై సాంఘిక బహిష్కరణ అమలవుతుంది. గ్రామంలోని దళిత వాడలో పోలీసు పికెట్ ఉన్నప్పటికీ దళితులపై చెదురు మదురు దాడులు జరుగుతూనే ఉన్నాయి. ఆగస్టు 4న హోం మంత్రి మైసురా రెడ్డి తెనాలి బస్‌స్టేషన్ ప్రారంభానికి వచ్చిన సందర్భంగా చుండూరు రెడ్లు, కాపులు ఆయన్ని కలిసిన తర్వాత మాత్రమే హంతకులు క్రూరమైన దాడికి తెగబడ్డారు. పక్కా పథకం ప్రకారం నరమేధం జరిగింది. ఆగస్టు 6న వందమందికి పైగా పోలీసులు దళితవాడకొచ్చి 'పదకొండు మంది మీద దాడిచేయడానికి రెడ్లు, కాపులు మారణాయుధాలతో సిద్ధంగా ఉన్నారు, వారిని ఆపేటంతమంది పోలీసులు మాదగ్గర లేరు. మీరు పారిపోయి ప్రాణాలు రక్షించుకోండి' అని దళితుల్ని పల్లె నుండి చెదరగొట్టారు. అంతేకాదు. 'వారు ఇటువైపు నుండి వస్తారు. మీరు అటువైపుగా పారిపోండి' అంటూ హంతకమూకలకు అనువైన మార్గాన్ని చూపించారు. ఆ విధంగా పోలీసులు హంతకులకు సహకరించారు. పోలీసులు కాబట్టి, పోలీసులే రాజ్యం కాబట్టి పోలీసుల పన్నాగం విధి నిర్వహణలో భాగమయింది. అందుకే పోలీసులెవ్వరూ కుట్రలో భాగస్తులుగా ఎఫ్ఐఆర్ నమోదుకాలేదు. వారిపై కూడా కేసు నమోదు చెయ్యాలని, హంతకులందర్నీ వెంటనే అరెస్టు చేయాలని డిమాండ్ చేస్తున్న చుండూరు దళితవాడలో నడుస్తున్న శిబిరంపై దాడిచేసి చుండూరు దళిత బాధితుల పోరాట కమిటీ ఉపాధ్యక్షుడు, ప్రధాన ప్రత్యక్ష సాక్షి అయిన కొమ్మెర్ల అనిల్ కుమార్‌ను పట్టపగలే పోలీసులు కాల్చి చంపారు. అనిల్ కుమార్‌ను చంపిన పోలీసులపై హత్యానేరం కింద కేసు నమోదు కాలేదు. నక్సలైట్లను చంపినప్పుడు ప్రాణరక్షణ

కోసం ఎదురుకాల్పులు జరపగా ఆ కాల్పుల్లో నక్సలైట్లు చనిపోయారని, రౌడీషీటర్లను చంపిన సందర్భాలలో పారిపోతుంటే తప్పనిసరి పరిస్థితుల్లో కాల్పులు జరపాల్సి వచ్చిందని చెప్తున్న పోలీసులు శాంతియుతంగా నిరాహార దీక్షలో ఉన్న అనిల్‌కుమార్‌ను చంపి ఏ సాకూ చూపలేకపోయారు. ఇప్పటివరకు ప్రధాన నిందితుల్లో ఏడుగురిని చిన్న చిన్న టెక్నికల్ కారణాలు చూపి అరెస్టు చెయ్యలేదు. నిందితులను కాపాడాలనే ప్రధాన లక్ష్యంతోనే తప్పుల తడక చార్జిషీట్ వేశారు. చార్జిషీట్‌లో ఉన్న లోపాల కారణంగా వందమందికి పైగా హత్యాకాండలో పాల్గొన్నవారు కింది కోర్టులోనే తప్పించుకున్నారు. అక్కడ శిక్షపడ్డ వాళ్లను నిర్దోషులుగా విడుదలచేస్తూ హైకోర్టు ధర్మాసనం కూడా చార్జిషీట్ లోపాలను ఎత్తిచూపింది.

### నిందితులకు కోర్టుల సహకారం

దేశ వ్యాప్తంగా సంచలనం సృష్టించిన ఈ కేసులో నిందితులు, పోలీసులు కలిసి కోర్టుల ద్వారా 14 సంవత్సరాలు కేసు విచారణకు రాకుండా అడ్డుకున్నారు. అందుకు చట్టాల్లోని లొసుగుల్ని ఉపయోగించు కొని హైకోర్టు ద్వారా అనేక స్టే ఉత్తర్వులు తీసుకున్నారు. బాధితులు క్రైస్తవ మతానికి చెందినవారని, కాబట్టి వారిని బిసి (సి)గా గుర్తించాలని, అందువల్ల ఈ కేసు ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం కిందకు రాదని, కావున ప్రత్యేక కోర్టులో న్యాయ విచారణ జరపరాదని హైకోర్టుకు వెళ్లి స్టే తెచ్చారు. కొంతకాలం తర్వాత గుంటూరులోని ఫాస్ట్‌ట్రాక్ కోర్టులో విచారణ జరపాలని ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. గుంటూరు కోర్టుకు హాజరుకావాలని సాక్షులకు కోర్టు సమన్లు పంపింది. చుండూరు దళితులు వ్యతిరేకించారు. ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి నిందితుల ఆస్తులను జప్తుచేసి దళితులకిస్తానన్నాడు. కనీసం విచారణ అయినా చుండూరులో జరిపించాలని బాధితులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఎట్టకేలకు 2003లో చుండూరు ప్రత్యేక కోర్టులో విచారణ ప్రారంభమైంది. అనుకుంటుండగానే నిందితులు మళ్లీ హైకోర్టు కెళ్లారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లైన బి. చంద్రశేఖర్, శివనాగేశ్వరరావులకు నక్సలైట్లతో సంబంధాలున్నాయని, కాబట్టి వారి పిపి నియామకాన్ని రద్దుచేయాలని మళ్లీ హైకోర్టుకెళ్లారు. దాదాపు 13 సంవత్సరాలు హైకోర్టు ఇచ్చిన స్టేల ద్వారా కాలయాపన జరిగింది. చివరకు 2004 డిసెంబర్ 1న చుండూరులోని ప్రత్యేక కోర్టులో విచారణ ప్రారంభమయింది. కేసు విచారణ దశలో ఉండగా నిందితులు మళ్లీ హైకోర్టుకెళ్లారు. అప్పటికే సగం మందికి పైగా సాక్షుల విచారణ పూర్తయింది. బాలయోగి, బసవయ్యలు ఆ విచారణ పూర్తిచేశారు. తర్వాత ప్రభాకరరావు అనే జడ్జి ప్రత్యేక కోర్టులో విచారణకు నియమింపబడ్డారు. కేసు విచారణ నిమిత్తం ప్రభాకరరావు అనే జడ్జీ రాబోతున్నారని (అప్పటికి ఇంకా రాలేదు) తెలుసుకున్న నిందితులు అతని నియామకాన్ని నిరసిస్తూ హైకోర్టుకెళ్లారు. 'ప్రభాకరరావు దళితుడు కాబట్టి, ఆ జడ్జి దళితులకు అనుకూలంగా ఉంటాడు. మాకు తీవ్ర అన్యాయం జరిగే అవకాశం ఉంది, కాబట్టి అతన్ని మార్చాల'ని వాదన చేశారు. ప్రభాకరరావుపై ఒక నిందా పత్రాన్ని తయారుచేసి ఆయన చేతికే ఇచ్చారు. అందులో 'ఈ కేసు మీరు విచారించిన యెడల ఏవిధంగానూ న్యాయపరమైన తీర్పు వస్తుందని మాకు నమ్మకం లేదు కనుక అన్యధా భావించక, మీ అధికారమును మాపై చూపక వేరే జడ్జి ద్వారా విచారణ జరిపించ గలందులకు తగుచర్యలు తీసుకోవలసినదిగా ప్రార్థించుచున్నాం' అని రాశారు. కేవలం పదిమంది సాక్షుల్ని మాత్రమే విచారించిన ప్రభాకరరావు అకస్మాత్తుగా బదిలీపై వెళ్లారు. ఆ తర్వాత సత్యనారాయణ, చివరగా శ్రీమతి అనీస్ జడ్జిగా ఉన్నప్పుడు విచారణ పూర్తయింది. 2004 డిసెంబర్ 1లో ప్రారంభమైన విచారణను ఐదుగురు జడ్జీలు పూర్తిచేశారు. 2007 జూలై 31న ప్రత్యేకకోర్టు తుది తీర్పు ప్రకటించింది.

### ప్రత్యేక కోర్టులో తీర్పు

మొత్తం 219 మందిపై పోలీసులు చార్జిషీట్ దాఖలు చేశారు. వారిలో 7 మంది అరెస్టు కాలేదు. విచారణ ప్రారంభం నాటికి 23 మంది నిందితులు చనిపోయారు. 189 మందిపై విచారణ జరిగింది. మొత్తం 79 మంది సాక్షుల్ని విచారించారు. 2007 జూలై 31న శ్రీమతి అనీస్ తీర్పు ప్రకటించారు. ఆ తీర్పులో 21 మందికి జీవిత ఖైదు, 35 మందికి సంవత్సరం మాత్రమే జైలు శిక్ష విధించారు. ఈ కేసు అరుదైన కేసుల్లో అత్యంత అరుదైన కేసుగా కోర్టు గుర్తించలేదు. అత్యంత విషాదకర విషయమేమంటే, ఎస్‌సి, ఎస్‌టి చట్టం ప్రకారం కేసు రిజిస్టరై, చార్జిషీట్ దాఖలు చేయబడి, ఎస్‌సి, ఎస్‌టి చట్టం ప్రకారం సాధించుకున్న ప్రత్యేక కోర్టులో ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్లు వాదించిన ఈ కేసు ఎస్‌సి, ఎస్‌టి చట్టం ప్రకారం కాకుండా 302 ఐపిసి కింద తీర్పు ఇవ్వడం జరిగింది. చుండూరు కేసేకాదు 'ఖైర్లాంజి' తీర్పు కూడా ఎస్‌సి, ఎస్‌టి చట్టం ప్రకారం చెప్పలేదు.

మహారాష్ట్రలోని భండారా జిల్లా ఖైర్లాంజి అనే గ్రామంలో మహర్ కులానికి చెందిన 5 మంది సభ్యులు గల ఒకే కుటుంబంలోని నల్గురిని అతి దారుణంగా సామూహిక అత్యాచార, హత్యలు చేశారు. అదే గ్రామంలోని కున్బీ, మరాఠా కులాలకు చెందిన ఆర్ఎస్ఎస్ గూండాలు సురేఖ, ప్రియాంకలపై సామూహిక అత్యాచారం చేసి హత్య చేశారు. రోషన్, సుధాకర్‌లను హతమార్చి శవాలను వేరు వేరు ప్రాంతాలలో పడేశారు. భండార జిల్లా ఫాస్ట్‌ట్రాక్ కోర్టు 2008లో 6 మందికి మరణశిక్ష, ఇద్దరికి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. కానీ ఎస్‌సి, ఎస్‌టి చట్టం కింద తీర్పు చెప్పలేదు. ఎస్‌సి, ఎస్‌టి చట్టం కింద తీర్పు ప్రకటిస్తే హైకోర్టుకు వెళ్లినప్పుడు ముద్దాయిలే మేం నేరం చేయలేదని నిరూపించుకోవాలి. 302 ఐపిసి ప్రకారం శిక్ష విధిస్తే ముద్దాయిలు నేరం చేశారని ప్రాసిక్యూషన్ రుజువు చేయాలి. కావున ముద్దాయిలను రక్షించే ఉద్దేశంతోనే కోర్టులు ఎస్‌సి, ఎస్‌టి చట్టం కింద తీర్పులు చెప్పడంలేదు.

### హంతకులకు హైకోర్టు క్లీన్‌చిట్

మేము నిర్దోషులమంటూ ముద్దాయిలు హైకోర్టుకు అప్పీల్ చేశారు. బాధితులు మాకు ప్రత్యేక కోర్టులో న్యాయం జరగలేదని హైకోర్టులో ప్రైవేట్ కంప్లెంట్ వేశారు. ప్రభుత్వం కూడా దళితుల తరపున హైకోర్టులో అప్పీల్ చేసింది. ముద్దాయిల తరపున ఒకటి, దళితుల తరపున 7 మొత్తం 8 అప్పీల్స్ హైకోర్టు బెంచ్ ముందుకొచ్చాయి. దళితుల తరపున (1) సంవత్సరం శిక్షపడ్డ 35 మందికి కూడా జీవిత ఖైదు విధించాలని, (2) మొత్తం 116 మంది మీద సాక్ష్యాలు న్నాయని, (3) 302 రెడ్‌విత్ 149 సెక్షన్ కింద అక్రమ సమూహంలో సభ్యులుగా నిర్ధారించబడి మారణాయుధాలతో అల్లరికి పాల్పడ్డారని సాక్ష్యాలతో రుజువు చేయబడ్డ అందరికీ (35+60) జీవిత ఖైదు విధించాలని ప్రధాన అప్పీల్‌లు ఉన్నాయి.

2014 ఫిబ్రవరి 13న హైకోర్టులో వాదనలు ప్రారంభమయ్యాయి. దళితుల తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటర్లుగా బొజ్జాతారకం, వి. రఘునాథ్‌లను దళితుల విజ్ఞప్తి మేరకు ప్రభుత్వం నియమించింది. బాధితుల తరఫున అప్పీల్స్‌ను, నిందితుల తరఫున అప్పీల్స్‌ను విని తీర్పు చెప్పాలని ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్లు ధర్మాసనాన్ని కోరారు. పి.పి.ల విజ్ఞప్తిని ధర్మాసనం తిరస్కరిస్తూ 'ఇవన్నీ చాలా టైం పట్టవచ్చు. ఎంత కాలమని వాళ్లు జైల్లో మగ్గుతారు. ముందుగా నిందితుల అప్పీల్‌పై వాదనలు మాత్రమే వింటాం' అంది. కనీసం ఎస్‌సి, ఎస్‌టి చట్టం ప్రకారం తీర్పు చెప్పాలని పి.పి.లు అభ్యర్థించారు. అందుకూ బెంచ్ అంగీకరించ లేదు. ఐదు రోజులు విచారణ జరిగిన తర్వాత చుండూరు దళితులు, పి.పి.లు జస్టిస్ ఎల్. నరసింహారెడ్డి, జైస్వాల్‌ల ధర్మాసనంపై అవిశ్వాసాన్ని ప్రకటించి కేసును వేరే బెంచ్‌కి బదిలీ చేయవలసినదిగా లిఖిత పూర్వకంగా విజ్ఞప్తి చేశారు. దాంతో ఆగ్రహించిన ధర్మాసనం వారి విజ్ఞప్తి కోర్టు ధిక్కారంగా ప్రకటించింది.

ఇక్కడ ఒక విషయం గుర్తు చేయాలి. ప్రత్యేక కోర్టుకి మొట్టమొదటి సారిగా బాలయోగి అనే దళిత జడ్జి నియమితులయ్యారు. అతను దళితుడు కాబట్టి ఈ కేసు విచారించడానికి వీలులేదని నిందితులు తమ రాజకీయ పలుకుబడిని ఉపయోగించి కోర్టుకు వచ్చిన వారం తిరక్కుండానే బదిలీ చేయించుకున్నారు. జడ్జి ప్రభాకరరావును మార్చడానికి ప్రత్యేక కోర్టులో, హైకోర్టులో నానా రగడ చేశారు. కానీ ఏ కోర్టుకి గానీ, న్యాయమూర్తికి గానీ, హత్యాకాండలో పాల్గొన్నట్లు ఆరోపించబడ్డ అగ్రకులస్తులు చేసింది కోర్టుధిక్కారణ నేరంగా కనబడ లేదు. మొత్తం పదకొండు మంది రక్త సంబంధీకులను కోల్పోయిన దళితులు చేసిన విజ్ఞప్తి మాత్రం జస్టిస్ ఎల్. నరసింహారెడ్డికి కోర్టు ధిక్కారంగా అనిపించింది. అయితే ఆ సందర్భంగా ధర్మాసనం, మీడియా చేసిన వ్యాఖ్యలు కోర్టులపై కోటి ఆశలతో బతుకుతున్న సామాన్య ప్రజానీకాన్ని తీవ్ర భయాందోళనకు గురిచేశాయి. 'ఏదైనా కేసు విచారించే టప్పుడు పిటిషనర్ల తరఫు న్యాయవాదుల నుండి, అవతల పార్టీల కేసులు చూస్తున్న వారి నుండి కోర్టు సర్టిఫికెట్ తీసుకోవాలా! వారి సంతృప్తి మేరకే విచారణ సాగించాలా? సంతృప్తి లేకపోతే విచారణ ఆపేయాలా? వేరే బెంచ్‌కి మార్చాలా? వారి విశ్వాసాన్ని ఎలా చూరగొనాలా అని ఆత్మపరిశీలన చేసుకోవాలన్నమాట. ఏ కోర్టులైనా, న్యాయమూర్తులైనా, ఇటువంటి అభ్యర్థనలను మన్నిస్తూ పోతే వారు న్యాయవ్యవస్థకు మరణ శాసనాన్ని లిఖించినట్లే' అని వ్యంగ్యంగా వ్యాఖ్యానించాడు. రెడ్డి, కాపు కులస్థులు న్యాయ వ్యవస్థను అపహాస్యం చేస్తూ న్యాయమూర్తికి కులాన్ని అంటగట్టి ప్రత్యేక కోర్టు నుండి హైకోర్టు వరకు అవమానపరిచినపుడు ఏ జడ్జి నుండైనా, కోర్టు నుండైనా ఒక్క కామెంట్ కూడా రాలేదు. ఈ దేశంలోని ప్రతి అణువూ కుల వివక్షతతో నిండి ఉందనడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

జస్టిస్ ఎల్. నరసింహారెడ్డి తనకు తాను మానవాతీతుడిగా న్యాయ వ్యవస్థే తనుగా, తనే న్యాయ వ్యవస్థగా అనుకుంటే చేసేది ఏమీలేదు. కానీ ఇంతవరకు హైకోర్టు బెంచ్‌లపై ఎవ్వరూ అవిశ్వాసం ప్రకటించినట్లు వ్యాఖ్యానించడం విడ్డూరంగా ఉంది. చుండూరు దళితులు బెంచ్ మార్చ మనడంతో భూగోళం బద్దలైనట్లు స్పందించడం వింతగానూ ఉంది. గనుల మాఫియా గాలి జనార్ధన్ రెడ్డికి బెయిల్ ఇవ్వడానికి కోట్ల రూపాయల నోట్ల కట్టలను మూటగట్టుకున్న న్యాయమూర్తులు జైలు ఊసలు లెక్కబెట్టిన సంఘటనలు జరుగుతున్న నేపథ్యంలో కోర్టులపై ప్రజలకు విశ్వాసం కలిగించే విధంగా ప్రతి న్యాయమూర్తి వ్యవహరించాలి. ఆ విధంగా వ్యవహరించని వారు ప్రజాస్వామ్యాన్ని సమాధి చేయడానికి గోతులు తీస్తున్నట్లే లెక్క. 'మీ మీద మాకు విశ్వాసం లేదు' అన్న తర్వాత కూడా 'మేమే వింటాం, మేమే తీర్పు చెబుతాం' అని ప్రకటించి, కోర్టు ధిక్కార నోటీసులు జారీచేసి బాధితుల్ని బెదిరించి తీర్పు చెప్పడం బహుశా హైకోర్టు చరిత్రలోనే మొట్టమొదటి సంఘటన కావచ్చు. ఏ న్యాయమూర్తయినా తనకున్న అధికారాన్ని ఉపయోగించి బాధితుల్ని బెదిరించడం ద్వారా నోరు మూయించగలరేమో గాని ప్రజలకు కోర్టులపై విశ్వాసం కలిగించలేదు.

## భయందోళనలో ఎస్‌సి, ఎస్‌టిలు

ప్రతిరోజు సగటున ముగ్గురు దళిత మహిళలు అత్యాచారానికి బలైతూ, ఇద్దరు దళితులు హత్య చేయబడుతూ, పదకొండు మంది దళితులు దాడులకు గురవుతూ కేసులు పెడితే చంపినా, చంపుతామని బెదిరించినా స్టేషన్‌లో కేసులు పెడుతుంది ఎందుకు? కోర్టుల్లో న్యాయం జరుగుతుందనే చిన్న విశ్వాసం మూలంగానే. ఆ ఆశతోనే స్టేషన్ మెట్లెక్కుతున్నారు. రాజకీయ నాయకుల వత్తిళ్లకు, ప్రలోభాలకు లొంగిన పోలీసులు కేసులు రిజిష్టర్ చేయరు. తప్పని పరిస్థితుల్లో ఎఫ్ఐఆర్ పెట్టవలసి వస్తే పోలీసులే నిందితుల్ని ప్రోత్సహించి కౌంటర్ కేసులు పెట్టించి స్టేషన్లలోనే రాజీలు చేస్తున్నారు. అది సాధ్యపడని పక్షంలో నిందితుల్ని అరెస్టు చేయించడానికి బాధిత దళితులకు నెలల తరబడి ఉద్యమాలు చేయాల్సి వస్తుంది. ఈలోపు నిందితులు కోర్టు నుండి 'స్టే' తెచ్చుకుంటారు. దళిత, ప్రజా ఉద్యమాల ఒత్తిడి మేరకు అరెస్టు చేయవలసి వస్తే అనేక లోపాలతో కూడిన చార్జ్‌షీట్ వేస్తారు. కేసు కోర్టు మెట్లెక్కేముందే సాక్షుల్ని బెదిరించి, భయపెట్టి హంతకులు శిక్ష నుండి తప్పించుకుంటారు. ఇన్ని అడ్డంకుల్ని అధిగమించి కేసు కోర్టు బోనెక్కితే న్యాయాన్యాయాలు జడ్జీ ఇష్టాయిష్టాల మీద ఆధారపడి ఉంటాయి. న్యాయమూర్తులకు నమ్మబుద్ధి కాకపోతే అడ్డంగా కొట్టేస్తారు. రాజస్తాన్‌లోని భన్వారీదేవి అనే దళిత మహిళ అగ్రకుల మృగాల సామూహిక అత్యాచారానికి బలై అనేక కష్టాలుపడి కేసును కోర్టుదాకా ఈడ్చుకొచ్చింది. చివరకు న్యాయమూర్తి కేసు కొట్టేస్తూ 'ఒక అంటరాని మహిళపై అగ్రకులాలకు చెందిన వ్యక్తులు అత్యాచారం చేశారనడం నమ్మశక్యంగా లేద'న్నాడు. భన్వారీదేవి విషయంలోనే కాదు ఈ దేశంలో అంటరానివారి ప్రతి విషయంలో మనువాద భావజాలాన్ని మెదడులో నింపుకున్న ప్రతి ఉన్మాది దగ్గరా తనకుతాను దగ్ధమౌతూ ఎదుటివారి నమ్మకాలపై, దయా దాక్షిణ్యాలపై బతుకుతున్నారు. అందుకు భిన్నంగా ఎక్కడ వ్యవహరిస్తే అక్కడ తల తెగిపడుతుంది.

చుండూరులో జరిగింది అదే. కేవలం పిడికెడు ఆత్మగౌరవం కోసం పరితపించినందుకు ముక్కలుగా నరక బడ్డారు. పోలీసులు చట్టాన్ని దుర్వినియోగం చేస్తున్నారన్నందుకు తూటా గుండెల్లో దిగబడింది. రెడ్లు, కాపులు అడిగినట్లు మనం కూడా కోర్టుకి విజ్ఞప్తి చేద్దామనుకుంటే ధిక్కరణ వేటు వేస్తాం జాగ్రత్త అన్నారు. న్యాయాన్ని హత్య చేశారు. ఒకరు మానవత్వాన్ని, మరొకరు చట్టాన్ని, ఇంకొకరు న్యాయాన్ని నరుక్కుంటూ పోయారు. ఇలాంటి వాళ్లనే పాలకులు అక్కున చేర్చుకుంటున్నారు. అందులో లెక్కిస్తున్నారు. బలమైన వ్యవస్థలుగా వర్ధిల్లుతున్న ఈ నాలుగు వ్యవస్థలూ దళిత పీడిత కులాలపై ఉమ్మడిగా, వ్యూహాత్మకంగా నలుదిక్కుల నుండి చేస్తున్న క్రూరమైన దాడుల ఫలితంగానే 'చుండూరు' తీర్పు ఆ విధంగా వచ్చింది.

'చుండూరు' హైకోర్టు తీర్పు కొత్తకాదు. వింతాకాదు. కారంచేడు

# మౌలిక సమస్యల ఊసెత్తని ఎన్నికల ఎజెండాలు

***రాజకీయ పార్టీల ఎన్నికల ప్రణాళికలు ప్రజలను తాత్కాలిక ప్రయోజనాలకే పరిమితం చేసి, దీర్ఘకాలంగా నాయకుల ఆస్తులను పెంచుకోవడానికే ఉపయోగపడుతున్నాయని అంటున్నారు*** **బి. రామకృష్ణ**

**రా**ష్ట్రంలో వరుసపెట్టి ఎన్నికలొచ్చాయి. స్థానిక సంస్థలు, అసెంబ్లీ, పార్లమెంట్‌లకు ఎన్నికలే ఎన్నికలు. ప్రజాస్వామ్యం అంటే ఎన్నికలనే భ్రాంతి కొనసాగుతోంది. ఓటు పవిత్రమైనదని, తప్పనిసరిగా వేయాల్సిన హక్కు అని, అవినీతి రహిత ప్రతినిధులను ఎన్నుకోవాలనీ, ఓటు మీ జీవితాలను మార్చే ఆయుధమని ప్రచారం సాగుతోంది. ఎన్నికల సందర్భంలో ఓటర్లను ఆకట్టుకోవడమనేది ఓ కళగా మారింది. ఆ కళల్లో మాటల గారడీలు, హావభావాలు, వింతైన ప్రచార పద్ధతులు, విచ్చలవిడి డబ్బు, మద్యం, సినీ తారల మెరుపులు, ఏదైతేనేమి మరెన్నో పనిచేసుకుంటూ పోతున్నాయి. ఈ గారడీ నాటకాల్లో ఎన్నికల ప్రణాళికలు ఓ భాగమయ్యాయి. గతంలో ఇచ్చిన హామీలను అమలు చేయకపోయినప్పటికీ, ఎంతో చేశామని, మరెంతో చేస్తామని మాటల ధాటితో, ప్రచార ఆర్భాటాలతో, రాతపూర్వక ప్రణాళికలతో ఓటర్ల ముందుకు వస్తుంటారు. ఈ నాటకంలో కోరుకున్నంత వినోదం పంచబడుతుంది. ప్రజల్లో రాజకీయ అవగాహన చైతన్యస్థాయి పెరుగుతూ ఉంటే గనుక ఇన్ని కప్ప గంతులు, కుప్పి గంతులు, కపట నాటకాలు ఆడడానికి రాజకీయ నాయకులకు అవకాశముంటుందా అని అనిపించక మానదు.

ఓట్ల జాతరలో గెలుపొంది అధికారం దక్కించుకోవడం కోసం లిఖిత పూర్వక హామీలెన్నో ఎన్నికల ప్రణాళికల్లో పొందుపరుస్తారని తెలిసిన విషయమే. ఈ ప్రణాళికలు ఎంతమందికి చేరతాయనేది ఒకటైతే, అందినా కూడా చదువేరాని వారెంతో మంది ఉన్నప్పుడు వాటి గురించి తెలుసుకునే అవకాశముంటుందా? చదువగలిగే వారిలో కూడా ఈ ప్రణాళికలను ఎంతమంది చదువుతారు? చదివినవారిలో ఎంతమందికి వాటిలోని హామీల సాధ్యాసాధ్యాల గురించి చింతన ఉంటుంది? గతంలో ఇచ్చిన హామీలు అమలయ్యాయా అని పోల్చుకునేది ఎంత మంది? మరి ఇప్పటి ఆకర్షణీయమైన హామీలు అమలవుతాయా? అని తర్కించుకునే వారి సంఖ్య ఎంత ఉంటుందంటే చాలా తక్కువేనని తెలియక మానదు. ఈ మేనిఫెస్టోల్లో ఏమైనా మౌలిక సమస్యల పరిష్కారం గురించి చర్చించారేమో అని చూస్తే వాటి రంగేమిటో తేలిపోతుంది. అవినీతి అక్రమాలకు ఆస్కారమిచ్చి, విపరీతంగా వ్యక్తిగత ఆస్తులు పేరుకుపోవడంపై న్యాయబద్ధమైన, హేతుబద్ధమైన పరిమితుల విషయం ఏ ఒక్క దాంట్లోనూ కనిపించదు.

విద్య గురించి కెజి నుండి పిజి వరకు ఉచితం అని అంటున్నారు. అయితే ఎక్కడ కూడా విద్యా ప్రైవేటీకరణ నిలుపుదల గురించి మాట్లాడలేదు. అంటే ఇప్పుడున్న ప్రైవేట్, కార్పొరేట్, వ్యాపారాత్మక విద్యా సంస్థలు కొనసాగుతాయని చెప్పకనే చెబుతున్నారన్నమాట. అసమానతలతో కూడిన విద్య, డబ్బుపెట్టి కొనుక్కోగలిగే వారికో విద్య, డబ్బు వెచ్చించలేని వారికో విద్య అందిస్తున్నారు. వీటిని కొనసాగిస్తూ ఉచిత విద్య గురించి, నాణ్యమైన విద్య గురించి మాట్లాడడమంటే ఎంత దగాకోరుతనమో అర్థం చేసుకోవచ్చు. ఫీజుల రియింబర్స్‌మెంట్ గురించి మాట్లాడుతున్నారు గాని అసలు విషయమైన ఫీజులే లేని వ్యవస్థ గురించి కుట్ర పూరితంగానే దాచేస్తుంటారు. గాట్ ఒప్పందంలో విద్యను ఒక వ్యాపారంగా గుర్తించారు. దీన్ని వ్యతిరేకించిన దాఖలాలు మేనిఫెస్టోల్లో కానరాదు. దేశంలోకి చొచ్చుకు వస్తున్న విదేశీ విశ్వవిద్యాలయాలను నిలువరించే యోచనలు లేనేలేవు. కెజి నుండి పిజి వరకు విద్యారంగం ప్రైవేట్ పరం అవుతూ ఇంకా ఇంకా వ్యాపారాత్మకం అవుతూ సామాన్య, మధ్యతరగతి ప్రజలకు నాణ్యమైన విద్య అందని ద్రాక్ష అవుతోంది. మొత్తం విద్యా రంగాన్ని ప్రైవేట్ రంగం నుంచి తప్పించి అందరికి సమానమైన, నాణ్యమైన ఉచిత విద్యను అందించే కార్యక్రమం ఏ ప్రణాళికల్లోనూ కాగడాలు పెట్టి వెతికినా కనిపించదు. 50 ఏళ్ల కిందనే కొఠారీ కమిషన్ ప్రతిపాదించిన కామన్ స్కూల్ వ్యవస్థ గురించి కనీస ప్రస్తావన లేకపోవడం అనేది విద్యా వ్యవస్థపట్ల పాలక వర్గాలకున్న చిత్తశుద్ధి ఏపాటిదో అర్థం చేసుకోవచ్చు. మౌలిక వసతులతో కూడి ఉన్న జిల్లాకో యూనివర్సిటీ ఆవశ్యకతను ఏపార్టీ గుర్తించినట్లు లేదు. మొత్తంగా విద్యా రంగంపై బడ్జెట్ శాతంను చెప్పకుండా నోటిమాటగా ఉచిత విద్య అనే వాగ్దానమైతే కనిపిస్తున్నది.

---

కేసుకూడా హైకోర్టు దాకా వచ్చి కొట్టివేయబడింది. వేంపెంట కేసు కోర్టు మెట్లయినా ఎక్కలేదు. కంచికచర్ల కోటేశు హత్యనుండి కారంచేడు మారణ కాండదాకా ఏ కోర్టు భవనం మూలనా న్యాయం దొరికింది లేదు. కానీ చుండూరు కేసు సందర్భంగా హైకోర్టు ధర్మాసనం బహిరంగంగా వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆందోళన కలిగిస్తున్నాయి. కోర్టుల్లో న్యాయం దళితులకు ఎండమావే అనే అభిప్రాయం బలపడుతుంది. కోర్టుల్లో కూడా న్యాయం దొరకదని నిర్ణయానికి వచ్చిన రోజున స్టేషన్‌కు వెళ్లాల్సిన అవసరమే ఉండదు. ఈ నిచ్చెనమెట్ల కుల వ్యవస్థలో బలహీన కులాలకు, చావడమా, చంపడమా, రెండే ఆప్షన్‌లు ముందుకొస్తాయి. ఏది జరిగినా అప్పుడు పారే నెత్తురుకి వెలకట్టలేం. ప్రజాస్వామ్యం ప్రశ్నార్థకమవుతుంది. అందుకే న్యాయం కోసం, చట్టాల అమలు కోసం గొంతెత్తి అరుస్తున్న దళితుల గొంతులో గొంతు కలుపుదాం. చుండూరు తీర్పుకు వ్యతిరేకంగా ఊరూరా ఉద్యమిద్దాం. భవిష్యత్తులో ఇలాంటి తీర్పులు రాకుండా న్యాయ వ్యవస్థను కాపాడుకుందాం. అంటరాని కులాల బతుక్కి భరోసా ఇద్దాం.

(రచయిత కులనిర్మూలన పోరాట సమితి అధ్యక్షులు) వీ

వైద్యం నేడు ఖరీదైన విషయం. డాక్టర్ల ఫీజులు, మందుల బిల్లులు, మల్టీ, సూపర్ స్పెషాలిటీ దవాఖానాల్లో వైద్యం సామాన్యులకు సరేసరి, మధ్యతరగతి వారికి సహితం చేరువలో లేకుండా పోయింది. ఉన్న తక్కువ ప్రభుత్వ వైద్యశాలలు కూడా కునారిల్లి పోయేలా చేసే విధానాలను అన్ని ప్రభుత్వాలు ఒకేలాగ అమలు చేస్తున్నాయి. ఆరోగ్య హక్కు అనీ, హెల్త్‌కార్డులనీ, ఆరోగ్య బీమాలనీ అక్కడక్కడ ఎన్నికల ప్రణాళికల్లో కనిపిస్తున్నాయి. అయితే అసలు విషయమైన వైద్య రంగాన్ని మొత్తంగా పబ్లిక్ రంగంలోనే ఉంచి అందరికి ఉచిత, నాణ్యమైన వైద్యం, మందులు సరఫరా సౌకర్యాన్ని కల్పించడానికి ఎవరూ సిద్ధంగా లేరు. కనీసం అటువైపుగా అడుగులు వేసేటందుకు ప్రయత్నిస్తామన్న ప్రస్తావనలూ లేవు. నిరంకుశుడనబడ్డ నిజాం సహితం ఇంత దుర్మార్గానికి ఒడిగట్టలేదు. తాను స్థాపించిన ఉస్మానియా దవాఖానలో అందరికి ఉచితంగా వైద్యం, మందులు అందించాడు. అంతేకాదు రోగికి, రోగితోపాటు ఉండే సహాయకులకు కూడా ఉచిత భోజనం అందించాడు. ఆధునికం, నాగరికం అనబడే నేటికాలంలో చాలా వరకు వైద్యం ప్రైవేట్ పరం అయిపోయింది. ప్రజల నుండి ముక్కుపిండి ధనార్జన చేసుకునే మల్టీ, సూపర్ స్పెషాలిటీ, కార్పొరేట్ అసుపత్రులు, మందుల కంపెనీలకు విచ్చలవిడిగా అనుమతులు మంజూరవుతున్నాయి. వాటిపై నియంత్రణ కోల్పోయి వాటికి అనుకూలమైన విధానాలను దేశ, రాష్ట్ర స్థాయిలో తీసుకుంటున్న తీరు చూస్తుంటే కర్కశుడు అని అనుకుంటున్న నిజాంకున్న మానవీయ కోణం నేటి పాలకవర్గ పార్టీలకు లేకపోవడం ఎంత అసహ్యకరమో అర్థం చేసుకోవచ్చు. ఐడిపిఎల్ వంటి ప్రభుత్వ రంగంలో నడిచే మందుల కంపెనీలను మూసేసి వ్యాపారాత్మక ఫార్మాసూటికల్స్‌కు రెడ్ కార్పెట్ వేశారు. ఫలితంగా మందుల ధరలు విపరీతంగా పెరిగి పోతున్నాయి. అంతర్జాతీయ దోపిడిపూరిత ఒప్పందాల్లో దేశీయ, విదేశీయ కార్పొరేట్ ఫార్మాసూటికల్స్ కంపెనీలకు అనుకూలమైన, భారత ప్రజానీకానికి వ్యతిరేకమైన విధానాలను అన్ని రకాల ప్రభుత్వాలు చేపట్టాయి. అది కాంగ్రెస్ కావచ్చు, బిజెపి కావచ్చు లేదా అధికారంలో పాలుపంచుకున్న ఏ ఇతర పార్టీలైనా కావచ్చు. ఔషధాలపై పేటెంట్ చట్టాలు చేయడం, జనరిక్ డ్రగ్స్‌పై ఆంక్షలు విధించడం అనేది సర్వసాధారణం అయింది.

ఏదేశంలోనైనా, ఏ ప్రాంతంలోనైనా వైద్య రంగం మొత్తం పబ్లిక్ రంగంలోనే ఉంటూ నాణ్యమైన, నమ్మకమైన ఉచిత వైద్యం ప్రజలకు అందుబాటులో ఉండాలి. ఈ విధానం నిజానికి ఆధునిక, నాగరిక సమాజాల్లో మరింతగా మెరుగుపరచబడి అమలు చేయబడాలి. నాగరిక సమాజం ఉన్నత విలువల్లో ఇదీ ఒకటి. దీన్ని సాధించడం కొరకు ఏ ప్రణాళికల్లో కూడా ప్రస్తావన లేదు. విద్యా, వైద్యం అనేవి జీవించే హక్కులో (ఆర్టికల్ 21) భాగంగా రాజ్యాంగం గ్యారంటీ చేసింది. ఇంతటి ప్రాధాన్యతగల విద్యా, వైద్యం ప్రైవేటీకరణ చెందకుండా చూసేందుకు ఎన్నికల మేనిఫెస్టోల్లో తగు స్థానం లభించకపోవడం అనేది వాటికి రాజ్యాంగం పట్ల, దాని అమలు పట్ల ఉన్న గౌరవం ఏపాటిదో అర్థం చేసుకోవచ్చు. అన్ని పార్టీలు కూడా రాజ్యాంగం, చట్టం, న్యాయం గురించి, ప్రజా సంక్షేమం గురించి, సుపరిపాలన గురించి దండకాలపై దండకాలు చదువుతుంటాయి. 'ప్రజలకేమి తెలుసులే' అనుకుంటారో, వారికి ఏమి చెప్పినా తలలూపే గొర్రెలుగా చూస్తారో, లేకపోతే 'ఎవరేమనుకుంటే నాకేమి సిగ్గు' అనుకుంటారేమో గాని వారి అనర్గళ ప్రసంగాల్లో అలవోకగా ఎన్నో అబద్ధాలు, మోసపూరిత, దగాకోరు మాటలు దొర్లిపోతుంటాయి.

భూములు, ఖనిజాలు, అటవీ సంపద మొత్తంగా సహజ వనరులను దేశీయ, అంతర్జాతీయ కార్పొరేట్ సంస్థలకు, శక్తులకు అప్పనంగా అప్పగించేస్తున్నారు. ఏమంటే అభివృద్ధి అంటారు. సహజ వనరులను ప్రైవేట్‌పరం చేసి ఆ వనరులపై ఆధారపడిన ప్రజలను, ముఖ్యంగా ఆదివాసులను నిరాశ్రయులను చేస్తున్నారు. ఆదివాసుల రక్షణకై ఉద్దేశించబడిన రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్, అటవీ సంరక్షణ చట్టం, అటవీ హక్కుల చట్టం, పిఇఎస్ఎ, 1/70 చట్టం వంటి అనేక గిరిజన అనుకూల చట్టాలెన్నో నిత్యం ఉల్లంఘించబడుతున్నాయి. ఆదివాసుల హక్కుల ఉల్లంఘనలు ఎలా జరుగుతున్నాయో బి.డి. శర్మ రాసిన 'అన్ బ్రోకెన్ హిస్టరీ ఆఫ్ బ్రోకెన్ ప్రామిసెస్' అనే గ్రంథంలో వివరంగా చెప్పి ఉన్నారు. అనేక రకాల ఖనిజాల తవ్వకాల్లో దేశవ్యాప్తంగా ఎన్నో కుంభకోణాలు జరిగాయి. వీటిపై షా కమిషన్ రిపోర్టును ఇటీవలే అందించింది. జరిగిన అక్రమాలపై, చట్ట ఉల్లంఘనలపై, పాల్గొన్న పాలనా యంత్రాంగం రాజకీయ వ్యవస్థలపై ఈ రిపోర్టులో ఘాటుగానే స్పందించింది. ఈ నేరాలపై కఠినమైన చర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి సిఫార్సు చేసింది. అయితే ఎవరిపైనా ఏ చర్యలు తీసుకోబడవని అర్థం చేసుకోవడం కష్టమేమి కాదు. ఆయా ప్రాంతాల లోని సహజ వనరులు కొల్లగొట్టబడకుండా, ఆ సంపదంతా కూడా ప్రజలకే చెందేలా తీసుకునే చర్యల గురించి ఏ ప్రణాళికలోనూ చోటు చేసుకోలేదు.

తెలంగాణ విషయానికొస్తే సింగరేణి బొగ్గు గనుల్లో పర్యావరణానికి, అక్కడి ప్రజల జీవితాలకు ప్రమాదకరమైన ఓపెన్‌కాస్ట్ మైనింగ్‌ను రద్దు చేసే ప్రస్తావన ఏ ప్రణాళికల్లోనూ లేదు. పోలవరం ప్రాజెక్ట్ వల్ల 3 లక్షల మంది ఆదివాసుల జీవితాలు బుగ్గిపాలవుతున్నాయి. ఈ ప్రాజెక్ట్ పర్యావరణపరంగా, అడవులపరంగా, ఆదివాసుల జీవితాల పరంగా చూసినా, దానిపై వెచ్చించే అధిక వ్యయం పరంగా చూసినా ఏ విధంగానూ లాభదాయకం కానే కాదనీ, కేవలం ప్రైవేట్ పరిశ్రమల కొరకు ఆంధ్ర ప్రాంతంలో మూడో పంట కొరకు ఉద్దేశించినదనీ ఎన్నో అధ్యయనాలు చెబుతున్నాయి. అటువంటి నిరర్థక, ప్రమాదకర పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణం ఆపివేయాలని ఏ ఒక్క రాజకీయ పార్టీ ప్రతిపాదించడం లేదు. ఈ ప్రాజెక్ట్‌పై ఖర్చుపెట్టే ధనాన్ని ఈ ప్రాజెక్ట్ వల్ల ముంపుకు, విస్థాపనకు లోనయ్యే స్థానిక ఆదివాసులకు విద్య, వైద్యం, సాగునీరు, భూములు అందించడానికి ఉపయోగిస్తే మూడు లక్షలకుపైగా ఉన్న ఆదివాసులు బాగుపడతారు కదా. వారి అభివృద్ధి, సంక్షేమం అవసరమా? వీరి జీవితాలను నాశనం చేస్తూ వారి సమాధుల పైనుంచి ప్రాజెక్ట్ పోనిచ్చి మరెవరికో లాభం అని, వేరెవరికో అభివృద్ధి అంటుంటే నోరు మెదపని ఎన్నికల ప్రణాళికలు ఆదివాసులకు ఏమి వాగ్దానం చేస్తున్నాయి?

ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) పేరుతో ప్రజా భూములను బడా పారిశ్రామిక వర్గాలకు ధారాదత్తం చేస్తున్నాయి. వీటిలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు (ఎఫ్‌డిఐ) 100 శాతం వరకు పెట్టొచ్చు. వాటిలో దేశీయ చట్టాలకు ఎన్నింటికో సాధికారత ఉండదు. ఎఫ్‌డిఐలనేవి మిడతల దండు వంటివి. పంటచేలపైపడి రసమంతా పీల్చేసి ఎక్కడికో ఎగిరి పోయేవి మిడతలు. అలాంటి మిడతల దండులైన ఎఫ్‌డిఐలపై నియంత్రణ గురించి ప్రస్తావించకపోవడం గమనించవచ్చు. ఎఫ్‌డిఐలు రిటైల్ రంగంలోకి, నిత్యావసర వస్తువుల వ్యాపారాల్లోకి కూడా చొచ్చుకు వచ్చాయి. వాటికి సహకరించి, వాటిని వేగిరం చేసేందుకు యుపిఎ ప్రభుత్వం గాని, గతంలో ఎన్‌డిఎ ప్రభుత్వం గాని పనిచేస్తూ పోయాయి.

ప్రపంచవ్యాప్తంగా ఎన్నో దేశాల ఆర్థికవ్యవస్థలను కొల్లగొట్టి, పరాధీనతను పెంచి అవినీతి, అక్రమాలకు బాటలు వేసిన ప్రపంచ బ్యాంకు విధానాలను, సామ్రాజ్యవాద ప్రభావాలను వ్యతిరేకించే కార్యక్రమం ఏ మేనిఫెస్టోల్లోనూ కనిపించదు. అంటే ఏ పార్లమెంటరీ రాజకీయ పార్టీ అయినా ప్రపంచ బ్యాంకు విధానాలకు దాసోహమని చెప్పకనే చెబుతున్నాయి. ప్రపంచ బ్యాంకు, అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో దేశాల్లో తీసుకొచ్చిన దోపిడీ, దుర్మార్గ, అవినీతి, అనైతిక విధానాల గురించి, ఆ విధానాల అమలులో భాగస్తుడై ఉండిన జాన్ పెర్కిన్స్ అనే వ్యక్తి పశ్చాత్తాపంతో ఒక దళారీ పశ్చాత్తాపం అనే పుస్తకం సాధికారికంగానే ఉంది. ప్రైవేటీకరణ వేగవంతమై ప్రభుత్వ రంగంలో ఉద్యోగాలు అంతరించిపోతున్న దశలో ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్ల గురించి సామాజిక న్యాయం గురించి ఏ పార్టీ కూడా ఊసెత్తలేదు.

వ్యవసాయరంగంలో హరిత విప్లవం కాలం నుండి చేపడుతున్న విధానాల వల్ల నేడు రైతు స్వయం నిర్ణయాధికారాన్ని కోల్పోయాడు. విపరీతమైన రసాయనిక ఎరువులు, పురుగుల మందుల వాడకం పెరిగిపోతోంది. హానికర జన్యుమార్పిడి పంటలు వెల్లువలా వచ్చిపడుతున్నాయి. భూమి సారం కోల్పోయి, నీరు, వాతావరణం కలుషితమై, ఆహారధాన్యాలు కలుషితమై, ఫలితంగా అనారోగ్యాలు నిత్య సత్యాలైనాయి. రైతుకు విత్తనాలు కొనుక్కుంటేగాని దొరకవు. అందులో ఏవి అసలువో, ఏవి నకిలీవో పోల్చుకోలేం. ఏ విత్తనాలు ఎంచుకోవాలో, ఏ పంటలు పండించాలో ఇవ్వాళ మార్కెట్ శక్తులు నిర్ణయిస్తున్నాయి. వ్యవసాయంలో పెట్టుబడి విపరీతంగా పెరిగి అది గిట్టుబాటుకాని రంగంగా మారిపోయింది. మొత్తంగా వ్యవసాయ రంగంపై మోన్‌శాంటో, సిన్‌జెంటా, కార్గిల్, డూపాంట్ వంటి ప్రపంచ వ్యాపిత కార్పొరేట్ సంస్థల గుత్తాధిపత్యం పెరిగిపోయింది. వీటి విషకౌగిలి నుండి బయటపడే విధానాల గురించి ఏ ప్రణాళికల్లోనూ కానరాదు. స్థానిక పంటలను, సాగు పద్ధతులను మెరుగుపరచకపోవడం, వాటి కోసం విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు చేయించడం లేది. ఇక్కడ జరిగే పరిశోధనలు సహితం బహుళజాతి సంస్థలకు అనుకూలంగా ఉండడమనేది విషాదకరం. సాగునీటి వసతులు పెంచి, వ్యవసాయ యోగ్యమైన భూములను పంచి, సుస్థిర వ్యవసాయం పరిరక్షించబడే నిర్దిష్టమైన మార్గాలు ఏ ఒక్క ప్రణాళికలోనూ లేవు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వంతో నక్సలైట్ల చర్చల సందర్భంగా భూముల పంపకం అనేది ప్రధానంగా ముందుకొచ్చింది. దున్నేవానికే భూమి అనేది ఎవరి నినాదమైతేనేమిగాని అది ప్రజానుకూలమైన, ప్రగతిశీలమైన, అవసరమైన కార్యక్రమం. దీనిపై చాలా వరకు పార్టీల ప్రణాళికల్లో లేకపోవడం అంటే, ఆయా పార్టీలకు ప్రజా సంక్షేమంపై ఉన్న అపేక్ష ఎలాంటిదో తేలిపోతోంది. టిఆర్ఎస్, తెలంగాణ కాంగ్రెస్ ప్రణాళికల్లో కొన్ని ప్రస్తావనలైతే వచ్చాయి కాని అవి ఎన్నికల ఎండమావులు కావని నమ్మకం కలగడం కష్టమే.

భారతదేశంలో సహజ సంపదలకు, వనరులకు కొదవేలేదు. ఈ దేశంలో ఓవైపు ప్రపంచంలోనే అధిక సంపన్నులైనవారు ఉన్నారు. మరోవైపు ఒక్క పూటకు కూడా సరైన తిండి దొరకక దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నవారు 40 శాతంకి పైగా ఉన్నారు. ఒక పార్టీని మరో పార్టీ తిట్టుకోవడం, ప్రజలను నమ్మింపచేసే ప్రయత్నం చేస్తున్నాయి తప్పిస్తే ఇవన్నీ ఒకేతాను ముక్కలేనని తెలుసుకోవడం కష్టమైన పనేం కాదు. అధికారం కోసం పాకులాట, ఆస్తులు పెంచుకోవడంలో పోటీ తప్పిస్తే మౌలికంగా ఇవి ఛేదించే విషయాలేవి లేవు.

ప్రజాస్వామిక హక్కుల కోసం, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను ముందుకు తెచ్చే ప్రక్రియలో ఉద్యమించే ప్రజారాసులపై దమనకాండ, అణచివేతను, నిర్బంధాలను, బల ప్రయోగాన్ని, హింసను, హత్యలను, జైళ్లను, పోలీస్ స్టేషన్లను ఉపయోగించడంలో పాలక పార్టీలకు మధ్య భిన్నాభిప్రాయం లేదు. అందుకు రుజువుగా ఏ పార్టీ ప్రణాళికల్లో కూడా పౌర, ప్రజాస్వామిక హక్కులను గౌరవించి కాపాడతాయని, వాటి పరిరక్షణకోసం కృషి చేస్తామని రాజ్య హింసను నియంత్రిస్తామనే హామీలు లేకపోవడం గమనించవచ్చు.

ఎన్నికల హామీల్లో, వాగ్దానాల్లో జనాకర్షకమైన, ప్రజానుకూలమైనవి లేవని అనలేం. ఎన్నో ఉన్నాయి. ఉచిత విద్య, వైద్యం, ఉపాధి ఉద్యోగాలు, సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రుల నిర్మాణం, ఇళ్లు కట్టిస్తామనడం మొదలగు మరెన్నో ఉండడం చూడొచ్చు. కొంచెం లోతుల్లోకెళ్లి గత ఆరేడు దశాబ్దాలుగా ఎన్నికల్లో గుప్పించిన హామీలు, వాగ్దానాల అమలును పరిశీలిస్తే, మరింత సీరియస్‌గా అధ్యయనం చేస్తే వాటిలోని డొల్లతనం, కపటత్వం, మోసం, జూదం, మాటిచ్చి ఎగ్గొట్టే దుర్మార్గం, ఏరు దాటేదాక ఓడ మల్లన్న, ఏరు దాటాక బోడి మల్లయ్య అన్న మాటలు అర్థం అయిపోతుంది. ఎన్నికల హామీలుగాని, వాగ్దానాలు గాని రేపు అధికారంలోకి వచ్చాక అమలు చేయాల్సిన తప్పనిసరి పరిస్థితినిగాని, చట్టబద్ధత గాని, రాజ్యాంగబద్ధతగాని లేనేలేదు. కాబట్టి ఎన్నికల సందర్భాలలో రాజకీయ పార్టీలు అరచేతిలో వైకుంఠం చూపిస్తుంటాయి. అధికారం చేజిక్కించుకోవడానికి ఎన్నైనా నాటకాలు, వేషాలు, దగుల్బాజీతనాలు చేయవచ్చు. అధికారంలోకి వచ్చాక ప్రజలే మమ్మల్ని గెలిపించారని దబాయిస్తూ ఆయా పార్టీలు, దాని వెనక ఉండే వర్గాలు తమ వర్గ ప్రయోజనాల కోసం ఎంతటి నికృష్ట పాలననైనా కొనసాగిస్తాయి. రాజ్యాంగం పేరుతోనే ప్రజాస్వామ్యాన్ని, రాజ్యాంగ స్ఫూర్తిని తూట్లు పొడుస్తాయి. ఈ క్రమంలో ప్రజల్లో ప్రజాస్వామిక అవగాహన, సామాజిక చైతన్య స్థాయి పెరగడం ఎలా అన్నదే ముఖ్యమైనది. ఈ చైతన్య స్థాయే సమానత్వానికి దారులు వేయగలు గుతుంది. సమానత్వం సాధించబడనిదే ప్రజాస్వామ్యానికి అర్థం లేదు.

ఆంగ్లేయ పాలన అంతమయి ఏడు దశాబ్దాలు గడుస్తున్నప్పటికీ దేశ జనాభాలో మూడో వంతుకుపైగా దారిద్ర్య రేఖకు దిగువన ఉండడం యూనివర్సిటీ చదువుల స్థాయికి 10వ వంతు కూడా చేరుకోకపోవడం, నేటికి తగు వసతులేక బహిరంగ ప్రదేశాల్లో మల విసర్జన చేస్తున్నవారు 60 శాతంపైగా ఉండడం, పోషకాహారలేమితో బాధపడుతున్నవారు సగానికిపైగా ఉండడం, విద్యుత్ సరఫరాలేని, సొంత గూడులేని కుటుంబాలెన్నో ఉండడం - ఇలా చెబుతూపోతే లిస్టు పెద్దదిగానే ఉంటుంది. వీటన్నిటి నేపథ్యంలో నేటికి స్వయం నిర్ణయాధికారం, స్వావలంబన, సమానత్వం దిశగా ముందుకు ప్రయాణం సాగకపోవడం స్పష్టమైంది. విపరీత ఆర్థిక వ్యత్యాసాలు పెచ్చరిల్లడానికే అధికారంలో ఉన్న అన్ని పార్టీలు పనిచేశాయని తెలుస్తున్నది. ప్రజా సంక్షేమ పథకాలు, హామీలు, వాగ్దానాలన్నీ కూడా ఈ దేశంలో, రాష్ట్రంలో మౌలికంగా ప్రజా జీవితాల్లో గుణాత్మక మార్పును తీసుకురాలేక పోయాయి. నిజానికి మానవ సమాజ పరిణామ క్రమంలో ఎన్నికలనేవి ఒక ముందంజగానే చెప్పుకోవచ్చు. అయితే అవి నిజమైన అర్థంలో కాకుండా కొన్ని వర్గాలు అధికారంలోకి వచ్చి, వారి వర్గ ప్రయోజనాలు కాపాడుకోవడానికి, అత్యధిక ప్రజానీకాన్ని మరింత సంక్షోభంలోకి తోయడానికి సహకరించబడడం అనేదే విషాదం.

*(రచయిత ఉపాధ్యాయులు, డిటిఎఫ్ సభ్యులు)* వీ

# మానిఫెస్టోల్లో వ్యవసాయ రంగానికి అన్యాయం

***పార్టీలు తమ ఎన్నికల ప్రణాళికలలో వ్యవసాయ రంగంపై చేసిన హామీలు వోట్లు రాల్చడానికి మాత్రమే పనికి వచ్చేవనీ, అవి చిన్న, సన్నకారు రైతులకు ఎటువంటి హామీ, వృద్ధీ కలుగజేయవనీ అంటున్నారు*** **ఎస్. ఆశాలత**

గత 62 ఏళ్లుగా భారతదేశంలో చట్ట సభలకు ఎన్నికలు జరుగుతున్నాయి. ఎన్నికలలో పోటీచేసే రాజకీయ పార్టీలన్నీ ఓటర్లను ఆకర్షించడానికి తమ ఎన్నికల మానిఫెస్టోలలో వాగ్దానాలను గుప్పిస్తూనే ఉన్నాయి. 2014 ఎన్నికలలో ప్రధాన రాజకీయ పార్టీలు విడుదల చేసిన మానిఫెస్టోలలో ఈ వాగ్దానాలు పరాకాష్టకు చేరాయి. పార్టీలు తమ తమ మానిఫెస్టోలను ఎంత చిత్తశుద్ధితో తయారు చేస్తున్నాయి, ఏ అంశాలకు ప్రాధాన్యతను ఇస్తున్నాయి, గెలిచిన తర్వాత వాటిని ఎంతవరకు అమలు చేస్తున్నాయి అనేది ఒక ప్రశ్న అయితే స్వతంత్రం వచ్చిందని చెబుతున్న 67 సంవత్సరాల తర్వాత కూడా దశాబ్దాల తరబడి అధికారంలో ఉన్న పార్టీలు కూడా తమ తమ మానిఫెస్టోలలో అరచేతిలో స్వర్గం చూపిస్తూ ప్రజాకర్షక హామీలను కుమ్మరిస్తున్నాయంటే ఈ పార్టీలన్నీ ఇన్ని సంవత్సరాలుగా ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించడంలో విఫలమయ్యాయని నిర్ధారణ అవుతున్నదా అనేది రెండవ ప్రశ్న.

ఈ సందర్భంగా భారతదేశంలో ప్రాథమిక రంగమైన వ్యవసాయానికి సంబంధించి రాజకీయ పార్టీలు తమ తమ మానిఫెస్టోలలో ప్రకటించిన అంశాలను విశ్లేషించి చూస్తే వ్యవసాయ రంగ మౌలిక సమస్యలను పరిష్కరించే ఉద్దేశమే వాటికి లేదనేది అర్థమవుతుంది. బ్రిటిష్ వారు మన దేశం వదిలి వెళ్లేనాటికి 80 శాతం మంది ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి బతుకుతున్నారు, ఇప్పుడది 60 శాతానికి తగ్గింది. ఇందుకు కారణం మనదేశంలో వ్యవసాయ రంగం అభివృద్ధి చెంది దాని నుండి వచ్చే మిగులుతో వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు పెట్టి వ్యవసాయ రంగంపై అదనపు భారంగా ఉన్న జనాభాకు ఉపాధి కల్పించడం ఎంతమాత్రం కాదు. పేద రైతులు, వ్యవసాయ కూలీలకు వ్యవసాయం చేసుకోవడానికి భూమిలేక, ఉన్నా పెట్టుబడులు పెరిగిపోయి సాగు గిట్టుబాటు కాక, ఆదాయం రాక అప్పులపాలై రైతులు వ్యవసాయాన్ని వదిలేస్తున్నారు. లేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. గత 18 సంవత్సరాలలో దేశంలో 2,86,000 మంది, రాష్ట్రంలో 35,898 మంది రైతులు ఆత్మహత్య చేసుకుంటే దేశంలో సగటున రోజుకు 2500 మంది రైతులు, రాష్ట్రంలో 350 మంది రైతులు వ్యవసాయం వదిలేసి పట్టణాలకు వలసపోయి భవన నిర్మాణ కూలీలుగా, సెక్యూరిటీ గార్డులుగా ఇంకా రకరకాల రోజు కూలీలుగా బతుకుతున్నారు. ఈ సంక్షోభం అంతటికి కారణం గత 30-40 సంవత్సరాలుగా అధికారంలో ఉన్న పార్టీలు అమలు చేస్తూ వచ్చిన విధానాలు, పథకాలు మాత్రమే. 1990ల తర్వాత మనదేశంలో దూకుడుగా ముందుకొచ్చిన నయా ఉదారవాద విధానాలు పెద్దఎత్తున ప్రైవేటీకరణను, మార్కెట్‌కు అనుకూలమైన పంటలను ప్రోత్సహించి వ్యవసాయాన్ని రైతు చేతి నుండి తప్పించి కార్పొరేట్ కంపెనీలకు గుత్తాధి పత్యాన్ని కల్పించాయి. భూమి, నీరు, విత్తనాలు వంటి వనరులపై రైతులకు, ప్రజలకు ఉన్న హక్కులను కాలరాసే విధానాలను ప్రోత్సహించాయి.

ఇప్పుడు ఈ సమస్యలను పరిష్కరించాలంటే మౌలికంగా వ్యవసాయ విధానాలలో మార్పు రావాలి, అయితే ఏ పార్టీ కూడా విధానాలలో మార్పు తీసుకొస్తామని చెప్పడం లేదు. రైతులకు తక్షణం భారంగా కనిపించే సమస్యలపైనే చాలా పార్టీలు హామీలు ఇస్తున్నాయి. కొన్ని పూర్తిగా రైతు వ్యతిరేక అంశాలను ప్రకటించాయి, ఇంకా అనేక సమస్యలపై పూర్తి నిశ్శబ్దాన్ని వహించాయి.

తెలుగుదేశం పార్టీ గెలిచి అధికారంలోకి వస్తే రైతుల వ్యవసాయ రుణాలను డ్వాక్రా మహిళల రుణాలను మాఫీ చేస్తామని హామీ ఇచ్చింది. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ డ్వాక్ర మహిళల రుణ మాఫీ గురించి వాగ్దానం చేసింది. టిఆర్ఎస్ పార్టీ లక్ష రూపాయల లోపు పంట రుణాలను మాఫీ చేస్తామని వాగ్దానం చేసింది. 2013-14లో తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌తో కలిపి మొత్తం 67 వేల కోట్ల వరకు వ్యవసాయ రుణాలు అందాయి. డ్వాక్రా మహిళలకు 23 కోట్ల వరకు రుణాలు, ఇవన్నీ కలిపితే మొత్తం 90 వేల కోట్లకు పైగా ఉంటాయి. అంటే 2013-14 సంవత్సరానికి ప్రవేశపెట్టిన రాష్ట్ర బడ్జెట్ (1,83,129 కోట్లు) లో ఇది 50 శాతం. మరి దీనిని తెలుగుదేశం పార్టీ ఎట్లా అమలు చేస్తుంది అనేది ఒక సమస్య అయితే ఒకవేళ అమలుచేస్తే ఏ వర్గాల వారికి లబ్ధి చేకూరుతుంది అనేది రెండవ సమస్య.

వాస్తవానికి చిన్న, సన్నకారు, మధ్యతరగతి రైతు కుటుంబాలన్నీ ప్రైవేట్ అప్పుల ఊబిలో కూరుకుపోయి ఉన్నాయి. వారికి అందిన సంస్థాగత రుణాలు చాలా తక్కువ. వ్యవసాయం చేయకపోయినా భూమి యజమానులకు, వ్యవసాయ రుణాల పేరుమీద కంపెనీలకు, వ్యాపారులకు మాత్రమే వ్యవసాయ రుణాలు అందుతున్నాయి. ఈ పరిస్థితిలో రాష్ట్ర బడ్జెట్‌లో సగం వెచ్చించి రుణ మాఫీ చేస్తే లాభపడేది భూస్వాములు, కంపెనీలు, వ్యాపారులే తప్ప వ్యవసాయంపై ఆధారపడిన రైతాంగం కాదు. అందుచేత రుణ మాఫీ వల్ల మెజారిటీ రైతాంగానికి పెద్దగా ప్రయోజనం ఉండదు.

సుప్రీం కోర్టు తీర్పుకు అనుగుణంగా పార్టీల ఎన్నికల మానిఫెస్టోలకు సంబంధించి ఎన్నికల కమీషన్ జారీచేసిన మోడల్ కోడ్ ఆఫ్ కండక్ట్‌లోని సెక్షన్ 8 ప్రకారం రాజకీయ పార్టీలు మానిఫెస్టోలలో ఇచ్చే హామీలకు బడ్జెట్ ఎంత అవసరమవుతుంది దానికి అవసరమైన నిధులను ఎక్కడ నుండి సమీకరిస్తారు, హామీల వల్ల ప్రయోజనం పొందే లబ్దిదారులు ఎవరు, హామీల అమలుకు నియమ నిబంధనలు ఏమిటీ అనే వివరణలను ముందుగానే ఇవ్వాలి. కాని పెద్ద హామీలు ఇచ్చిన ఏ ఒక్క పార్టీ కూడా ఆవిధంగా చెయ్యలేదు, కాబట్టి అవి ఎన్నికల కమీషన్ మోడల్ కోడ్ అఫ్ కండక్ట్‌ను ఉల్లంఘించినట్లే అవుతుంది. పార్టీల మానిఫెస్టోలలో ప్రధానంగా రుణ మాఫీలాంటి ప్రజలను ప్రలోభ పెట్టే

హామీలే ఎక్కువగా ఉండగా కాంగ్రెస్, బిజెపి జాతీయ మానిఫెస్టోలలో వ్యవసాయాన్ని మరింతగా కార్పొరేట్ అనుకూల మార్గంలోకి నెట్టే వాగ్దానాలున్నాయి. కాంగ్రెస్ పార్టీ మానిఫెస్టో వ్యవసాయంలోకి పెట్టుబడులను పెంచడానికి తద్వారా రైతుల సమస్యలకు పరిష్కారాలుగా చిల్లర వర్తకంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను, పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యాలను ప్రోత్సహించడంతో ప్రధానంగా ముందుకు తెచ్చింది. ఇక బిజెపి మానిఫెస్టో వ్యవసాయానికి సంబంధించి ఏకైక జాతీయ వ్యవసాయ మార్కెట్‌ను ఏర్పాటు చేస్తామనీ, వ్యవసాయ ఉత్పత్తుల మార్కెటింగ్ చట్టాన్ని సవరిస్తామని ప్రముఖంగా పేర్కొంది. ఇవన్నీ ప్రైవేటీకరణను మరింత ప్రోత్సహించే నయా ఉదారవాద మార్కెట్ శక్తులకు అనుకూలమైన విధానాలని వేరుగా చెప్పనక్కరలేదు.

ఇక లోక్‌సత్తా పార్టీ జన్యు మార్పిడి పంటలపై అన్నిరకాల నియంత్రణలను తొలగిస్తామని ఎన్నికల మానిఫెస్టోలో ప్రకటించింది. జన్యు మార్పిడి పంటల వల్ల మనుషుల, పశువుల ఆరోగ్యానికి, జీవ వైవిధ్యానికి, పర్యావరణానికి హాని ఉందని అనేక శాస్త్ర పరిశోధనలు నిరూపించిన తర్వాత, ప్రజల నుండి, రైతుల నుండి తీవ్ర వ్యతిరేకత ఎదురైన తర్వాత కూడా ఇటువంటి హామీ ఇవ్వడం పూర్తిగా రైతు వ్యతిరేకం, బయోటెక్నాలజీ పరిశ్రమకు అనుకూలం. పైగా జన్యు మార్పిడి పంటలపై సుప్రీమ్ కోర్టులో ఒక కేసు నడుస్తున్న కారణంగా వాటిపై నియంత్రణలు విధించబడ్డాయి. లోక్‌సత్తా పార్టీ నాయకుడు జయ ప్రకాశ్ నారాయణ్ కూడా ఈ కేసులో పిటిషనర్‌గా ఉన్నాడు. కోర్టులో వివాదం పెండింగ్‌లో ఉండగా దానిపై ఎన్నికల హామీ ఇవ్వడం చట్టవిరుద్ధం అవుతుంది కూడా.

వ్యవసాయానికి కీలకమైన వనరు భూమి. మన దేశంలో భూమి యాజమాన్యంలో తీవ్రమైన అసమానతలు ఉన్నాయి. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 30 శాతం మంది భూమిలేని వారున్నారు. 30 శాతం మందికి ఒక హెక్టారు మించి భూమి లేదు. ఈ 60 శాతం మంది చేతిలో మొత్తం భూమిలో 15 శాతం మాత్రమే ఉంది. వ్యవసాయంలో పనిచేస్తున్న దళిత బహుజన చిన్న సన్నకారు రైతాంగం అంతా ఈ 60 శాతంలోనే ఉన్నారు. 55 శాతం భూమి 11 శాతం మంది చేతిలో కేంద్రీకృతమై ఉంది. అంటే వ్యవసాయం చేస్తున్న వారిచేతిలో భూమిలేదు. భూసంస్కరణలు అమలుచేసి దున్నేవాడికే భూమి ఇవ్వనిదే మన దేశంలో వ్యవసాయ సమస్య పరిష్కారం కాదు. కాని ఇంతటి కీలకమైన అంశాన్ని ఏ ఒక రాజకీయ పార్టీ కూడా తన మేనిఫెస్టోలో పేర్కొనకపోవడం తీవ్రంగా ఖండించవలసిన విషయం. భూమి లేనివారికి భూమి కొని ఇస్తామని కొన్ని పార్టీలు హామీ ఇచ్చాయి, కొంత మంది వ్యవసాయం చెయ్యని వారి వద్ద భూమి పోగుపడి ఉండగా వారి నుండి సేకరించి భూమిలేని వారికి పంచి ఇవ్వాలని భూ గరిష్ట పరిమితి చట్టాలు చెబుతుండగా భూమి కొని ఇవ్వడం అనేది అర్థంలేని హామీ.

భూమి సమస్యతో పాటు అనేక ఇతర అంశాలపై చాలా పార్టీలు పూర్తి మౌనం వహించాయి, లేక వాటిని అసలు గుర్తించనేలేదని చెప్పవచ్చు. వ్యవసాయంలో 75 శాతానికి పైగా గ్రామీణ మహిళలు వ్యవసాయం పై ఆధారపడి బతుకుతున్నారు. వ్యవసాయంలో 70 శాతానికి పైగా పనులు మహిళలే నిర్వహిస్తున్నారు. సంప్రదాయకంగా విత్తనాలు దాచిపెట్టడం లాంటి ముఖ్యమైన పని మహిళలు నిర్వహిస్తూ వచ్చారు. అయితే ఈ రోజున కొత్త పరిజ్ఞానాలు, వాణిజ్య పంటలు వచ్చి మహిళలను వారి నిర్ణాయక పాత్ర నుండి పక్కకు నెట్టివేశాయి. మహిళలకు భూమి హక్కులు ఉండాలనే డిమాండ్ చాలా కాలంగా ముందుకు వస్తున్నప్పటికీ, దానికి సంబంధించి కొంత వరకు విధానాలు, చట్టాలలో మార్పు వచ్చినప్పటికీ అవి అమలుకు నోచుకోలేదు. ఎంఎస్ స్వామినాథన్ రూపొందించిన మహిళా రైతుల హక్కుల బిల్లు రాజకీయ పార్టీల నిర్లక్ష్యం కారణంగా కాలపరిమితి ముగిసి మూలన పడిపోయింది. వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న మహిళలను రైతులుగా గుర్తించకుండా వారికి భూమి తదితర హక్కులను కల్పించకుండా వ్యవసాయ రంగ సమస్యలు పరిష్కారం కావు. దీనిని ఏ ఒక్క పార్టీ కూడా మేనిఫెస్టోలో కనీసం ప్రస్తావించనైనా లేదు.

అట్లాగే పంటల సాగులో ఎరువులు పురుగు మందుల వాడకం విపరీతంగా పెరిగిపోయి భూమి నీరు ఆహారం విషపూరితంగా తయారైన నేపథ్యంలో పర్యావరణ పరంగాను రైతులకు ఖర్చు తగ్గించేందుకోసం రసాయన రహిత సుస్థిర వ్యవసాయ పద్ధతులను ప్రోత్సహించవలసిన అవసరం ఎంతైనా ఉంది. కాని ఇది మెజారిటీ రాజకీయ పార్టీల మేనిఫెస్టోలలో చోటు చేసుకోలేదు. అదే విధంగా విత్తనాలపై రైతుల హక్కుల పరిరక్షణ, కౌలు రైతుల సమస్యలను పరిష్కరించడం, ఆదివాసీ ప్రాంత వ్యవసాయానికి, అక్కడి సాంప్రదాయ పంటలు వ్యవసాయ పద్ధతులను నిలబెట్టడం, వారి వనరులు, జ్ఞానంపై వారి మద్దతు అందించడం, వ్యవసాయ భూములను వ్యవసాయేతర అవసరాలకు పెద్ద ఎత్తున మళ్లించడాన్ని నిరోధించడం, గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ ఆధారిత పరిశ్రమలను ప్రోత్సహించడం ఇవేవి పార్టీల మేనిఫెస్టోలలో పెద్దగా చోటు చేసుకోలేదు.

అన్నిటికంటే మించి వ్యవస్థ సంక్షోభానికి ప్రమాద సూచికగా ప్రస్తుతంగా కనిపిస్తున్న రైతు ఆత్మహత్యల గురించి ఏ ఒక్క పార్టీ కూడా కనీసం ప్రస్తావించలేదు. రైతు ఆత్మహత్యలను నివారిస్తామని గాని, ఆత్మహత్య చేసుకున్న కుటుంబాలను ఆదుకుంటామని గాని ఎటువంటి హామీలు ఇవ్వలేదు. దీనిని గుర్తించలేదంటే అసలు సంక్షోభాన్ని గుర్తించనట్లేనని భావించవలసి ఉంటుంది.

ఉచిత విద్యుత్, పంటల ధరల స్థిరీకరణ నిధి ఏర్పాటు, సాగు నీటి ప్రాజెక్టులు, పంటల భీమా వంటి హామీలు కొన్ని పార్టీల మేనిఫెస్టోలలో ఉన్నప్పటికీ మొత్తం మీద వ్యవసాయ రంగంలో లోతుగా పాతుకుపోయిన విధాన పరమైన మౌలిక సమస్యలను పరిష్కరించే హామీలు ఏ ఒక్క పార్టీ కూడా చెయ్యలేదని పార్టీల మేనిఫెస్టోలను విశ్లేషించి చూస్తే తెలుస్తుంది. పైగా రైతులకు, మరీ ముఖ్యంగా చిన్న సన్నకారు రైతుల ప్రయోజనాలను మరింత దెబ్బతీసి వ్యవసాయం నుండి మరింతగా బయటికి తోసివేసే హామీలనే ముందుకు తెచ్చినట్లు అర్థమవుతుంది. భూమి సమస్య వంటి మౌలిక సమస్యను పరిష్కరించుకోవడానికి, కార్పొరేట్ కంపెనీలకు లాభాలు చేకూర్చే హామీలను ముందుకు తేవడానికి వెనుక ఆయా పార్టీలుఏ వర్గాలకు ప్రాతినిథ్యం వహిస్తున్నాయో, ఏ వర్గాల ప్రయోజనాలను కాపాడుతున్నాయో కూడా స్పష్టంగా అర్థమవుతుంది. రైతులను మభ్యపెట్టి వారి నుండి ఓట్లు దండుకోవడానికి ఆచరణ సాధ్యంకాని హామీలను ఇచ్చి గెలిచి అధికారంలోకి వచ్చిన తర్వాత ఆ హామీలను అమలుపరచని రాజకీయ పార్టీలపై చర్య తీసుకునే వ్యవస్థ మన దేశంలో లేదు. అట్లా కాకుండా గెలిచి అధికారంలోకి వచ్చిన తర్వాత నిర్దిష్ట కాలపరిమితిలో ఆ హామీలను నెరవేర్చకపోతే ఆ రాజకీయ పార్టీల గుర్తింపును రద్దుచేయాలనీ, అటువంటి నియమ నిబంధనలను అధికారికంగా తీసుకురావాలని బుద్ధిజీవులు రైతులు అందరు డిమాండ్ చేయాలి.

*(వ్యవసాయ శాస్త్రవేత్త డా. జి.వి. రామాంజనేయులు, వ్యవసాయ విధాన విశ్లేషకులు డా. డి. నరసింహారెడ్డిలకు కృతజ్ఞతలతో)*

*(రచయిత రైతుస్వరాజ్య వేదిక రాష్ట్ర కన్వీనర్)* వీ

# గెలుపే ధ్యేయంగా పొత్తులు, వలసలు

**పార్టీల విధానాలు అప్రధానమై, రాజకీయాలు సంపాదనకు మార్గంగా మారాయనడానికి ఒకే రోజు మూడు పార్టీలు మారడం, పార్టీల మధ్య పొత్తులు చూస్తే అర్థమవుతుందని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి**

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు జరుగబోతున్న సందర్భంలో పార్లమెంటుకు ఉభయ రాష్ట్రాలకు (తెలంగాణ, ఆంధ్రప్రదేశ్) ఎన్నికలు జరుగుతున్నాయి. ఈ నేపథ్యంలో ఒకవైపు పార్టీల మధ్య పొత్తుల చర్చలు, సీట్ల సర్దుబాటు కోసం నాయకుల భగీరథ ప్రయత్నాలు, మరో వైపు పొత్తులు వద్దంటూ ఆయా పార్టీల కార్యాలయాల ఎదుట నిరసనలు వెల్లువెత్తుతున్నాయి. మొదటి నుండి పార్టీలో పనిచేసిన వారికే టికెట్ ఇవ్వాలంటూ ఆందోళనలు, పొత్తుల వల్ల తమకు అన్యాయం జరిగితే పార్టీని వదిలేస్తామంటూ హెచ్చరికలు, తాము కోరిన చోట సీట్లు ఇవ్వకుంటే మరో దారి చూసుకుంటామని బెదిరింపులు కొనసాగుతున్నాయి. చిత్ర విచిత్ర సంఘటనలతో తెలంగాణలో, సీమాంధ్రలో రాజకీయం రంజుగా మారింది. తెలంగాణ రాష్ట్రం తమ పోరాటంతో సాధ్యమైందని చెప్పుకుంటున్న టిఆర్ఎస్, ఇచ్చిన మాటకు కట్టుబడి సోనియాగాంధీ మాట నిలబెట్టుకున్నారని అంటున్న కాంగ్రెస్ పార్టీ, తమ లేఖతోనే తెలంగాణ వచ్చిందంటున్న టిడిపి, తమ మద్దతు లేకుంటే తెలంగాణ వచ్చేది కాదంటున్న బిజెపిలు ఎవరికివారే బీరాలు పలుకుతున్నా ఎన్నికల భయం పట్టుకుంది. పొత్తులు లేకుంటే గెలవలేమన్న భయం కూడ పట్టుకుంది.

భావసారూప్యం, సైద్ధాంతిక ఏకరూపత కలిగిన జన సమూహాల వేదికగా ఏర్పాటయ్యే రాజకీయపక్షానికి, ప్రజాస్వామ్య లక్షణాలు ఉండడం మౌలికావసరం. పార్టీ సిద్ధాంతాలపట్ల నిబద్ధత, విధానాలపట్ల విశ్వాసం కలిగిన కార్యకర్తల శ్రేణులే పార్టీకి జీవం. అన్ని స్థాయిల్లోనూ పార్టీ వ్యవస్థలు సుదృఢంగా ఉంటే, గోడదూకి వచ్చేవాళ్లకోసం పార్టీలు ఎర్ర తివాచీలు పరవాల్సిన అవసరం ఎందుకొస్తుంది? కార్యకర్తల్లో నుంచే సత్తాగల నేతలు ఎదిగిరావడం ఆ పార్టీకే కాదు, దేశ ప్రజాస్వామ్యానికీ ఎంతో మేలు చేస్తుంది. ఏ దేశంలోనైనా నిర్ణీతకాలం పార్టీలో సభ్యత్వం కలిగి ఉన్నవారికే టిక్కెట్ ఇస్తారు. మన దగ్గర నిన్న చేరిన వారికి ఇవ్వాళ డబ్బు తీసుకొని పార్టీ టికెట్ ఇవ్వడమే ఎందరికో ఆదర్శమవుతోంది. పార్టీ విధేయత సంతలో సరుకు కావడం ప్రజాస్వామ్యమా అన్నది మౌలిక ప్రశ్న. నేడు దేశంలో ఉన్న ఆరు జాతీయ పార్టీలు, నలభైకి పైగా ప్రాంతీయ పార్టీలు అంతర్గత ప్రజాస్వామ్యం లుప్తమై, వ్యక్తిస్వామ్యం స్థిరపడిన దుష్ఫలితమే ఇదంతా! అన్ని పార్టీలు ఏక వ్యక్తి స్వామ్యంగా మారాయి. పార్టీలల్లో అంతర్గత ప్రజాస్వామ్యం మృగ్యం. ఇది ప్రజాస్వామ్యం ఎలా అవుతుంది?

మన రాష్ట్రంలో (తెలంగాణ, పరిశేష ఆంధ్రప్రదేశ్) ఎప్పుడు లేనంతగా పార్టీలు మారడం ఊపందుకుంది. ఇవి గతంలో కంటే మరింత ఎక్కువగా జరిగాయి. టికెట్లు రాని నేతలు, గెలవలేమనుకున్న నేతలు పార్టీల మార్పుకు ప్రాధాన్యత ఇచ్చారు. పచ్చగా ఉన్నచోట తిని, వెచ్చగా ఉన్నచోట పడుకోవడమే నయా రాజకీయమని త్రికరణశుద్ధిగా నమ్మిన అభ్యర్థులు – చొక్కాలు మార్చినంత సులువుగా పార్టీ విధేయతల్ని మార్చేస్తున్న తీరు ఊసరవెల్లులనే మరిపిస్తున్నాయి. పార్టీ నాయకత్వాలు కూడ అలాంటి వారికోసం గేట్లు తెరిచే ఉంచాయి. అధికారమే లక్ష్యంగా పనిచేస్తున్న అన్ని పార్టీలు తలుపులు బార్లా తెరిచి వచ్చిన వారందరినీ అక్కున చేర్చుకున్నాయి. జంపింగులను అవసరమైన చోట వాడుకోవడానికి ముందుగానే వారికి స్థానాలు సిద్ధం చేసుకున్నాయి. ముఖ్యంగా తెలంగాణలో టిడిపి, కాంగ్రెస్ నుంచి టిఆర్ఎస్‌లోకి, టిఆర్ఎస్, టిడిపిల నుంచి కాంగ్రెస్‌లోకి నువ్వానేనా అన్నట్లుగా ఈ జంపింగులు కొనసాగాయి. టిడిపి కూడ అక్కడక్కడా ప్రయత్నం చేసింది. కానీ తెలంగాణలో పరువుపోగొట్టుకున్న టిడిపిలోకి ఎవరు తొంగి చూసిన జాడలేదు.

2009 ఎన్నికల్లో గెలిచిన ఎంఎల్ఎల్లో 111 మంది గెలిచిన పార్టీ నుండి వేర్వేరు పార్టీల్లోకి మారిపోయారు, అలాగే 15 మంది ఎంపిలు గెలిచిన పార్టీని వీడి వేరే పార్టీలోకి వెళ్లారు. దీంతో రాష్ట్ర విభజన తర్వాత తెలంగాణ, పరిశేష ఆంధ్రప్రదేశ్ రాజకీయ ముఖ చిత్రమే మారిపోయింది. పొత్తులు, ఎత్తులు, వ్యూహాలు, ప్రతివ్యూహాలు ప్రజల్లో గందరగోళం సృష్టించాయి. ఏ దారిలో గెలిచామన్నది ఈ కాలంలో పూర్తిగా అప్రధానమైపోయి, గెలవడం ఒక్కటే ప్రధానమయింది. ప్రతి ఒక్కరూ అడ్డదారిలో గెలవాలని చూస్తున్నారు. ప్రజాస్వామ్యమన్నది ధనస్వామ్యం, కుల స్వామ్యం, గుండా స్వామ్యంగా మారి నేతల భోజ్యమైపోయింది. ఎన్నికలంటే అమాయక ప్రజల పొట్టగొట్టే లాభసాటి వ్యాపారంగా నేటి రాజకీయం వర్ధిల్లుతోంది. రాజకీయాల్లో సంపాదించడం ఒక్కటే ప్రధానమైపోతే ఏమవుతుంది? అక్రమ మార్గాల్లో సంపాదనకు ఎగబడతారు. ప్రజాస్వామ్య విలువలు పతనం కావడం ఇక్కడే మొదలయింది. అది ఎన్నికల్లో ఎంపి అభ్యర్థుల నుంచి గ్రామపంచాయతీ సభ్యుడిదాకా అందరూ అనుసరించే మార్గమయింది.

2002లో గుజరాత్‌లో నరమేధాన్ని సృష్టించిన మోడీ చర్యలను చంద్రబాబు అప్పట్లో ఖండించాడు. ఆయన రాజీనామా చేయాలని డిమాండ్ చేశాడు. జన్మలో బిజెపితో జతకట్టనని చెప్పిన చంద్రబాబు తాత్కాలిక ప్రయోజనాలు చూసుకొని ఇప్పుడు బిజెపితో పొత్తు కుదర్చుకోవడం అవకాశవాదానికి పరాకాష్ట. నరేంద్రమోడీ 'గాలి' వీస్తోందన్న భ్రమలో, గతంలో వాజ్‌పేయి గాలిలా అది టి.డి.పి అధికారంలోకి రావడానికి తోడ్పడుతుందని ఆయన నమ్ముతున్నారు. ఈ 'బలహీనతను' ఆధారం చేసుకున్న బి.జె.పి స్వంత బలం లేకున్నా తెలంగాణలో 47 ఎంఎల్ఎ, 8 ఎంపి, సీమాంధ్రలో 5 ఎంపి, 15 ఎంఎల్ఎ సీట్లు అడుగగలిగింది. ఇందుకు టిడిపి భవిష్యత్తులో భారీ మూల్యం చెల్లించుకోక తప్పదు. టిడిపి – బిజెపి పొత్తు తమ గెలుపు అవకాశాలను పెంచుతుందని టిటిడిపి నేతలు ఆశిస్తుండగా, ఇంతకాలం రెండుకళ్ల సిద్ధాంతాన్ని అనుసరించిన టిడిపితో బిజెపి పొత్తు తెలంగాణలో బిజెపికి సానుకూలం కాకపోవచ్చుననే సందేహాలు కూడ వ్యక్తమవుతున్నాయి. తెలంగాణలో 47 స్థానాలు పోటీ చేస్తున్నందున టిఆర్ఎస్, కాంగ్రెస్‌లో టికెట్ దొరకనివారు కొందరు బిజెపిలోకి వెళ్లారు. బిజెపితో టిడిపి పొత్తు అంతిమంగా తెలంగాణలో బిజెపి బలపడడానికి సాధనమై తద్వారా ఆ పార్టీకి తోకగా మారి దానిపై ఆధారపడే స్థితి తెచ్చుకోక తప్పదు.

తెలంగాణ ఉద్యమాన్ని వ్యతిరేకించిన కొండా దంపతులను, జలగం వెంకట్రావు, మహేందర్ రెడ్డిలను టిఆర్ఎస్ పార్టీలో చేర్చుకోవడం తెలంగాణ ఉద్యమకారులను దిగ్భ్రాంతికి గురి చేసింది. పైగా తమ పార్టీకి ఎక్కడ

అవసరమో అక్కడనుండే చేరుతున్నారని కెసిఆర్ సమర్ధించుకోవడం సముచితంగా లేదు. టిక్కెట్ గ్యారంటీ అనుకున్న ఉద్యోగ, విద్యార్థి సంఘాలనేతలు కూడ కొందరు టిఆర్ఎస్‌లో చేరారు. దిలీప్‌కుమార్, రవీంద్రనాయక్‌లతో పాటు బిజెపి, టిఆర్ఎస్‌లకు చెందిన కొందరు టిఆర్ఎల్‌డి పార్టీలో చేరారు.

గత సంవత్సరం టిఆర్ఎస్ తీర్థం పుచ్చుకున్న వెంకటస్వామి తనయులు వివేక్, వినోద్‌లు తిరిగి కాంగ్రెస్‌లో చేరారు. వైఎస్ఆర్‌సిపిలో చేరిన అల్లోల ఇంద్రకరణ్‌రెడ్డి, కోనేరు కోనప్పలు కాంగ్రెస్ కండువా కప్పుకున్నారు. ఉద్యోగ, విద్యార్థి, మహిళా జెఎసిటి నేతలకు టికెట్లు ఇస్తామంటూ వారిలో కొందరిని కాంగ్రెస్‌పార్టీ లాకుంది. ఎవరు ఏ పార్టీలోకి పోతున్నారో, ఆ పార్టీలో ఎన్ని రోజులు ఉంటారో, ఎవరికి అంతు చిక్కని పరిస్థితి మన రాష్ట్రంలో తొలిసారిగా చోటు చేసుకుంది.

పరిశేష ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ పార్టీ పరిస్థితి కడు దైన్యంగా ఉంది. గుర్తింపు కలిగిన కాంగ్రెస్ నాయకులు – మాజీ కేంద్ర, రాష్ట్ర మంత్రులు, ఎంఎల్ఎలు, ఎంపిలు – వగైరాలు కాంగ్రెస్‌ను మునిగిపోతున్న పడవగా భావించి అధికార వ్యామోహంతో ఫిరాయింపులకు పాల్పడ్డారు. పదవుల చాటున రాజభోగాలు అనుభవించిన నేతలు రాత్రికి రాత్రే ప్లేట్ పిరాయించి కాంగ్రెస్ పార్టీ నుండి తెలుగుదేశం పార్టీలో చేరారు. ఇక మాజీ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి పరిమిత బృందం ఎంపిలు లగడపాటి రాజగోపాల్, హర్షకుమార్, సబ్బంహరి, సాయిప్రతాప్, ఉండవల్లి అరుణ్‌కుమార్, ఎంఎల్ఎలు నీరజారెడ్డి, తులసీరెడ్డిలు ఉన్నారు. సొంత పార్టీ పెట్టి రాష్ట్రాన్ని మళ్లీ కలుపుతామని పగటికలకంటున్నారు. సీమాంధ్రలో టిడిపిలోకి కాంగ్రెస్ ప్రజాప్రతినిధుల ఫిరాయింపు జోరుగా సాగుతుంటే, ఇది కొన్ని చోట్ల అంతర్గత సమస్యలు సృష్టించింది. పదేళ్లకుపైగా విరుద్ధపార్టీల్లో ఉండి ఎన్నో దూషణలకు, ఘర్షణలకు దిగిన టిడిపి, కాంగ్రెస్ నేతలు ఇవాళ ఏకంకావడం జుగుప్సాకర రాజకీయం కాదా! పచ్చ కండువాలు కప్పుకున్న కాంగ్రెస్ నేతలు పగటి వేషగాళ్లుగా ప్రజలను వినోదింపజేస్తున్నప్పటికీ ఇన్నాళ్లూ జెండాలు మోసిన టిడిపి కార్యకర్తలు జీర్ణించుకోలేకపోతున్నారు. వీరి రాకతో సీట్లు కోల్పోయిన టిడిపి నేతలు నిరాశ చెందారు. బిజెపితో పొత్తు కుదరడంతో మరికొందరు మరింతగా దిగాలు చెందారు. బిజెపి, టిడిపిల మధ్య పొత్తు కుదరడంతో ఇరు పార్టీల్లో అగ్గి రాజేసింది. తెలంగాణలో బిజెపి శ్రేణులు, సీమాంధ్రలో టిడిపి శ్రేణులు ఆగ్రహావేశాలు వ్యక్తం చేశారు. ఆందోళనకు దిగారు, రాజీనామాలు చేశారు.

పార్టీలు మారడానికి కొందరికి కాంట్రాక్టులు, వ్యాపారాలు, అధికారం కారణమవుతుంటే మరికొందరికి సామాజిక కారణాలు కూడ ఉన్నాయి. కోస్తాంధ్రలో కాళోజీ చెప్పినట్లు రెండున్నర కులాలు, రెండున్నర జిల్లాలు ప్రబల రాజకీయ ఆర్థిక శక్తిగా ఉన్నాయి. ఇంత కాలం ఉమ్మడి రాష్ట్రంలో వారే ఆధిపత్యం చెలాయించారు. మారిన పరిస్థితుల్లో చంద్రబాబును లేదా వెంకయ్య నాయుడును ఆశ్రయించడం తప్ప వారికి మరో గత్యంతరం లేదు. పవన్‌కళ్యాణ్ పార్టీ పెట్టి బిజెపిని బలపర్చడం, అక్కినేని నాగార్జున మోడీని కలువడం వెనుక హైద్రాబాదులో వాళ్ల అక్రమ ఆస్తులను రక్షించుకునే వ్యూహం తప్ప మరొకటి లేదు. మాజీ కేంద్ర మంత్రి పురందేశ్వరి బిజెపిలో, మరికొంత మంది కాంగ్రెస్, టిడిపి నుంచి బిజెపిలో చేరారు.

కేంద్ర, రాష్ట్ర మంత్రులు, ఎంపిలు, ఎంఎల్ఎలు కాంగ్రెస్ నుంచి టిడిపిలో చేరడం అగ్రకుల సామాజిక సమీకరణగానే కనిపిస్తుంది. తమ పార్టీలో ఉంటే కష్టమని భావించిన నేతలు, అధికారంలోకి ఏ పార్టీ వస్తుందో ముందుగానే బేరీజు వేసుకుని, ఆయా పార్టీల్లో ఏ సామాజిక వర్గానికి పెద్దపీట వేస్తారో విశ్లేషించుకుని వాటిలో చేరిపోయారు.

భారత్ ప్రపంచంలోనే అన్నింటి కంటే పెద్ద ప్రజాస్వామ్య దేశం అని చెప్పడానికి, వినడానికి బాగానే అనిపిస్తుంది. నిజానికి మన ప్రజాస్వామ్యంలో సామ్యం, సమానాధికారం ఛాయలు ఉన్నాయా? రాజ్య పరిపాలన విషయంలో ప్రజాస్వామ్యమే ఉత్తమమైన ఏర్పాటనే దాంట్లో ఎలాంటి ప్రశ్నలకూ తావు లేదు. కానీ దేని ఆధారంగా ఆ ప్రజాస్వామ్యం అభివృద్ధి చెందుతుందనేదే అసలు ప్రశ్న. వర్గ సమాజంలో ప్రజాస్వామ్యం వర్గాలుగా విడిపోయిన సమాజాన్నే అన్ని విధాలా పెంచి పోషిస్తుంది. ఫలితంగా వర్గసమాజం వర్గవైషమ్యాలను, సంపన్నుల ప్రభావాన్ని పెంచుతుంది. పేరుకు ప్రజాస్వామ్యం అన్నా అది నిజానికి ప్రజల ప్రజాస్వామ్యంగా మిగలదు. రాజకీయ పార్టీలు, నేతల స్వార్థం ముందు ప్రజాస్వామ్యం ఓడిపోయింది. ప్రజాస్వామ్య విలువలు విచ్ఛిన్నమైతే వ్యవస్థ మనుగడ కష్టమైపోతుందనే సత్యాన్ని ఏ పార్టీ, ఏ నాయకుడు పట్టించుకోవడంలేదు. ఒకసారి అధికారం దక్కితే, ఆ అధికారం శాశ్వతంగా తనకే ఉండాలని భావిస్తున్న నేతలు అనేక కుతంత్రాలకు పాల్పడుతున్నారు. ఆచరణకు నోచుకోని వాగ్దానాలతో ప్రజలను గందరగోళ పరుస్తున్నారు. సాధారణ ప్రజలు ఓటు వేసినా వారి నిజమైన ప్రతినిధి మాత్రం ఎన్నిక కావటం లేదు. ధనబలం, కండబలం ఉన్నవారే నాయకులుగా ఎన్నుకోబడుతున్నారు.

దేశంలో ప్రపంచీకరణ విధానాలు అమలు అనంతరం నుంచి ఎన్నికల్లో సంపన్నులే అభ్యర్థులుగా నిలుస్తున్నారు. ఈ రోజుల్లో డబ్బులు లేకుండా ఎన్నికల్లో గెలవడం అన్నది అసంభవంగా మారింది. ఎన్నికల్లో డబ్బుతో గెలువడమంటే డబ్బున్న వాళ్లే నాయకులు అవ్వాలని కదా! అందరు డబ్బున్న వాళ్లే చట్టసభల్లోకి వస్తే 80 శాతంగా ఉన్న పేద ప్రజలకు ప్రాతినిధ్యం వహించేది ఎవరు అన్న సంశయం కలుగకమానదు. మరోవైపు రాజకీయాల్లో కుటుంబ తత్త్వం ప్రభావం పెరుగుతున్నది. నాయకులు, మంత్రులు, ప్రజా ప్రతినిధుల వరకూ ఒకే కుటుంబానికి చెందినవారే ఎక్కువగా అభ్యర్థులు అవుతున్నారు. ఎన్నుకో బడుతున్నారు. ఇంకో అవాంఛనీయ ధోరణి ఏమంటే నేరస్తులు, కండబలం ఉన్నవారు ఎక్కువగా ఎన్నికల్లో అభ్యర్థులవుతున్నారు, ఎన్నుకోబడుతున్నారు కూడా. పెట్టుబడి కేంద్రీకరణతో రాజకీయాల్లో వారి ప్రభావం పెరుగుతున్నది. ఈ సారి ఎన్నికల్లో తెలంగాణలోని పలువురు వ్యాపార ప్రముఖులు, విద్యాసంస్థల యాజమానులు, రియల్టర్స్, కాంట్రాక్టర్లు ఎన్నికల్లో నిలబడడం గమనార్హం.

రాజకీయ పక్షాలు కూడా వారికి అనుగుణంగానే మారిపోతున్నాయి. ఇదివరకు పారిశ్రామికవేత్తలు, వర్తకులు రాజకీయ పార్టీలకు నిధులు సమకూర్చేవారు. ఇప్పుడు వారే స్వయంగా రాజకీయాల్లోకి ప్రవేశించి పార్లమెంటు, శాసనసభ సభ్యులైపోతున్నారు. ఆ తర్వాత మంత్రులు కూడా అవుతున్నారు. ఇప్పుడు కోటీశ్వరులు, శతకోటీశ్వరులైన పార్లమెంటు సభ్యుల, మంత్రుల పెత్తనమే ఎక్కువ. వారే పార్టీలోని, ప్రభుత్వంలోని విధానాలు రూపొందించడంలో ప్రధాన పాత్ర పోషిస్తున్నారు. ఎన్నికల్లో గెలిస్తే లెక్కలేనంత డబ్బు సంపాదించుకోవచ్చు. అందుకే పోటీ పడడానికి టిక్కెట్టు కోసం అంత ఆరాటం. సిద్ధాంతాలు, విధానాలు, ఆశయాలకు ప్రాధాన్యత తగ్గిపోయింది. ఎన్నికలు ఎందుకోసం, ఎవరి కోసం అనేది అప్రస్తుత మైపోతున్నది. దేశం కోసం, ప్రజల కోసం పని చేసే మనస్తత్వం అంతరించిపోయింది. ప్రజాస్వామ్య విలువలు కూడా అంతరించాయి. ఇప్పుడున్న ప్రజాస్వామ్యంలో ప్రజలను ఓటు వేసే కీలుబొమ్మలుగా మార్చివేసి దాని ఫలాన్నంతా సంపన్నులే లూటీ చేస్తున్నారు.

బంగారు తెలంగాణ, సామాజిక తెలంగాణ, నవ తెలంగాణ, అభివృద్ధి అంటూ ప్రచారం చేసుకుంటున్న పార్టీలు అభ్యర్థుల ఎంపికలో సామాజిక సమీకరణలను పక్కన పెట్టాయి. ఎక్కువ స్థానాల్లో గెలుపే ధ్యేయంగా ఆర్థికంగా బలమైన అభ్యర్థులను ఎంపిక చేశాయి. పార్టీలో చాలకాలంగా పనిచేస్తున్న వారిని పక్కన పెట్టి వలస వచ్చిన వారికి 25 నుంచి 30 శాతం సీట్లు కేటాయించాయి. తెలంగాణలో టిఆర్ఎస్ కేటాయించిన స్థానాల్లో 30 శాతం టిడిపి నుంచి వచ్చిన వారే, ఆలాగే సీమాంధ్రలో టిడిపి కాంగ్రెస్ నుంచి

వచ్చిన వారికి అధికంగా సీట్లు కేటాయించింది. ఇక బిజెపి అయితే అన్ని పార్టీల నుంచి జంప్ చేసి వచ్చిన వారికి, బడా వ్యాపారులకు అత్యధికంగా టికెట్లు కేటాయించింది. తెలంగాణ రాష్ట్రంలో ఎస్‌టిలు 12 శాతం, ముస్లింలు 12 శాతం, ఎస్‌సిలు 15 శాతంగా ఉన్నారు. వీరికి జనాభా దామాష ప్రకారం 40 శాతం సీట్లు ఇవ్వాలి, మహిళలకు 50 శాతం సీట్లు ఇవ్వాలి. కాని 10 శాతం మించి వీళ్లకు టిక్కెట్లు ఏ పార్టీ ఇవ్వకపోవడం శోచనీయం.

పచ్చని తెలంగాణ, బంగారు తెలంగాణ, సామాజిక తెలంగాణ నిర్మించాలంటే ప్రజలందరికి విద్య, ఆరోగ్యం, సామాజిక భద్రత, పౌరప్రజాతంత్ర హక్కులు కల్పించడం. సంపద – ఉత్పత్తి సమానంగా పంపిణీ చేసే ఒక ప్రగతి శీలమైన వ్యవస్థీకృత విధానం ఉండాలి. కేవలం బిసి ముఖ్య మంత్రిని చేస్తే సామాజిక న్యాయం అనే విధంగా ప్రచార ఆర్భాటం చేస్తున్నారు. సామాజికన్యాయం అంటే ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక అసమానతలను తొలగించి, సమానత్వం సాధించాలి. ఈ విధానం ప్రస్తుతం ఎన్నికల్లో నిలబడుతున్న పార్టీలు అమలు పర్చగలవా? ఆ నిబద్ధత, పట్టుదల రాజకీయ పార్టీలకు ఉందా? అలాంటి ప్రణాళిక అమలు చేయగలరా? ఉత్పత్తి, ఆదాయం సమంగా అందరికీ పంపిణీ చేయగలరా? అలా చేసినప్పుడే సామాజిక న్యాయం గురించి మాట్లాడే నైతికత వారికి ఉంటుంది.

గత 67 సంవత్సరాలుగా దగా పడ్డది బడుగు బలహీన వర్గాలే. వీరి అభ్యున్నతికి ఏ పార్టీ ఏమి చేస్తారో చెప్పడం లేదు. ప్రజలు తమ హక్కుల కొరకు, జీవన భద్రత కోసం, కనీస అవసరాలకోసం చేసే ఉద్యమాలను పక్కదారి పట్టించడానికి నెరవేరని హామీలను మెనిఫెస్టోలో చేర్చడంతో ప్రజా ఉద్యమాలను ఆపడం ఎంత మాత్రం సాధ్యంకాదు. హక్కుల కొరకు ఉద్యమిస్తున్న ఉద్యమాలు అభివృద్ధికి అటంకంగా మారాయని గగ్గోలు చేస్తున్నారు. యథార్థానికి పరిశ్రమల ఏర్పాటును ఏ ఉద్యమం, ఏ సంఘం అడ్డుకోదు. ప్రజల్ని పణంగా పెట్టి, వారి జీవనాధారాలను కొల్లగొట్టి, నిర్బంధంగా భూములు లాక్కోవడం, నిర్వాసితులను చేయడం ద్వారా పెట్టుబడిదారుల ప్రయోజనాలు కాపాడే చర్యలను మాత్రమే తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. ఉపాధి రహిత అభివృద్ధిని అడ్డుకుంటున్నారు. పర్యావరణ వినాశనానికి దోహదం చేసే చర్యలను వ్యతిరేకిస్తున్నారు. అయినా సామ్రాజ్యవాద విధ్వంసకర అభివృద్ధి నమూనాను మార్చుకుంటామని ఏ పార్టీ ప్రజలకు హామీ ఇవ్వడం లేదు. ప్రజాతంత్ర హక్కులకు భరోసా ఇవ్వని పార్టీలు, వాటి పరిరక్షణకు హామీలివ్వని పార్టీలు నవ నిర్మాణం ఎలా చేస్తాయి? ఇవ్వాళ ఏ పార్టీ ప్రపంచ బ్యాంకు ఆదేశాలను వ్యతిరేకించే స్థితిలో లేదు. సామ్రాజ్యవాదులకు సేవలందించడానికి పోటీపడుతున్నాయి తప్ప ప్రజలకు మేలు చేయడానికి కాదని పార్టీల మేనిఫెస్టోలు స్పష్టం చేస్తున్నాయి.

వాటిని పరిశీలిస్తే వేటగాడు పావురాలకు నూకలు చల్లినట్లు, ఓటర్లకు వరాలు చల్లుతున్నారు.

గత రెండు మాసాలుగా కాంగ్రెస్, టిఆర్ఎస్, టిడిపి, వైఎస్ఆర్‌సిపి, బిజెపి, సమైక్యాంధ్ర కాంగ్రెస్ పార్టీల మధ్య 'ఆయారాం – గయారాం'ల తీరును చూస్తే జుగుప్స కలుగక మానదు. నిజానికి ఈ పార్టీలన్నీ భూస్వామ్యం, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాదులకు, అగ్రకుల, మతోన్మాదులకు అటు ఇటుగా ఊడిగం చేసేవే. వీరెవ్వరు సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాను, కార్పొరేట్ దోపిడీని అడ్డుకునే వారు కాదు. అంతేగాక ఫ్యూడల్ తరహా వంశ పారంపర్యమూ, ఏక ఆధిపత్యాన్ని వ్యతిరేకించేవికావు. లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థను గౌరవించేవి అంతకంటే కావన్నది స్పష్టం. రోజురోజుకూ పెరుగుతున్న పేదరికం, నిరుద్యోగం, నిత్యావసర వస్తువులు, పెట్రోల్, డీజిల్ ధరలు, విద్యుత్ చార్జీలు, అధిక పన్నుల భారం, మౌలిక వసతుల కొరత, ప్రకృతి వనరుల విధ్వంసంతో పర్యావరణానికి వాటిల్లుతున్న ముప్పు, తదితర ప్రజా సమస్యలను రాజకీయ ఎజెండా మీదికి ఏ పార్టీ తీసుకురావడం లేదు. ఇప్పటిదాకా ఉమ్మడి రాష్ట్రంలో అమలైన ప్రపంచ బ్యాంకు విధానాలు తెలంగాణ, పరిశేష ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో ఇక ముందు అమలు చేయమని ఏ పార్టీ ప్రకటించలేదు. అంటే సామ్రాజ్యవాద అనుకూల విధానాలకే కట్టుబడి ఉన్నామని చెప్పకనే చెబుతున్నారు. ఎన్నికలు వస్తున్నాయి, పోతున్నాయి. కాని ప్రజల సమస్యలు పరిష్కారం కావడం లేదు. అన్ని పార్టీలను గతంలో ఏం చేశారు? రేపు ఏం చేస్తారు? అని ప్రజలు నిలదీసేవరకు రాజకీయ పార్టీలు వాగ్దానాలకు డబ్బు జోడించి పబ్బంగడువుకుంటూనే ఉంటాయి.

ఇవాళ రాజకీయాలు ఎంతగా దిగజారాయి అంటే – ఇప్పుడు ప్రజాసేవ ద్వారా ఎన్నికలలో గెలవడం అనేది అర్థం లేనిదిగా మారిపోయింది. రాజకీయం అంటే డబ్బు సంచులు కుమ్మరించే వారు ప్రత్యక్షంగా, పరోక్షంగా చెలాయించే అధికారంగా మారింది. వీరి ఆజమాయిషీలో మాఫియా ఉంటుంది. వీరి దృష్టిలో ఎన్నికలు అంటే డబ్బులు పంచడం. ఈ హీన కార్యాన్ని నిర్వర్తించే యంత్రాంగమే పార్టీ క్యాడర్. ప్రజలు అంటే వీరి దృష్టిలో డబ్బులు తీసుకుని ఓట్లేసే కిరాయి మనుషులు. అధికారంలో ఉండి కోట్లు దండుకోవచ్చు. ఎన్నికల తరువాత సిండికేట్లుగా ఏర్పడడం, వనరులను ఏ దేశీయ, విదేశీ కంపెనీకో కట్టబెట్టి దళారీ పాత్ర నిర్వహించడం, కమీషన్లు దండుకోవడం వర్తమాన రాజకీయాలుగా మారాయి. ఈ రాజకీయాలను విలువలు కాదు, కాసులు శాసిస్తున్నాయి. ఇటువంటి సంస్కృతిలో పుట్టి పెరిగిన వారు, ఇందులోనే ఆరితేరి నాయక పాత్ర పోషిస్తున్న వారు తెలంగాణ రాజకీయాలను భిన్నంగా మారుస్తారా? ప్రజల సమస్యలు పరిష్కరిస్తారా?

సామాజిక తెలంగాణ అనేది పదవుల పంపిణీ కాదు. బడుగు బలహీన వర్గాల ఉద్ధరణ ధ్యేయంగా సమాజ పునర్నిర్మాణం జరగాలి. అంటే సమాజంలో అట్టడుగు పేదవర్గాలైన ఆదివాసులు, దళితులు, ఇతర బలహీనవర్గాల భూమిసమస్య, పేదరికం, విద్య, ఆరోగ్యం, గృహవసతి, ఉపాధి కల్పన తదితర మౌలిక సమస్యల పరిష్కారం కోసం గానీ, ప్రజల జీవితాలను అతలాకుతలం చేస్తున్న నిత్యావసరాల ధరలు, పెట్రోలు – డీజిల్, విద్యుత్తు, రవాణా తదితర ఛార్జీల పెరుగుదలను అరికట్టేందుకు చేపట్టే చర్యల గురించి గానీ, – వీరి ప్రణాళికల్లో ఇసుమంతైనా చోటులేదు.

రాష్ట్రంలో అధికారం కోసం అర్రులు చాస్తున్న టిడిపి, టిఆర్ఎస్, వైఎస్ఆర్‌సిపి తదితర ప్రాంతీయ పార్టీలకు – కాంగ్రెస్, దాని కూటమి, బిజెపి, దాని కూటమి అనుసరిస్తున్న ఆర్థిక, రాజకీయ విధానాలతో ఎలాంటి పేచీ లేకపోగా, ఆ విధానాలనే అమలు జరుపుతామని అవి చెబుతున్నాయి. స్వర్ణాంధ్రలా, సింగపూర్‌లా చేస్తామంటూ, రాజన్న రాజ్యం తెస్తామంటూ, బంగారు తెలంగాణ చేస్తామని ఈ పార్టీలు ఇస్తున్న నినాదాలన్నీ సారాంశంలో సామ్రాజ్యవాదులకూ, బడా బూర్జువాలకూ, బడా భూస్వాములకూ సేవ చేసేవేనని గతంలో ఇవి పాలన సాగించిన సమయంలో అమలు జరిపిన విధానాలే తెలుపుతున్నాయి. కొత్తగా పార్టీ పెట్టిన వాళ్లు పాత పార్టీల నుంచి వచ్చిన వారేనని మరువకూడదు. ఎన్నికల ముందో లేదా తర్వాతనో ఈ ప్రాంతీయ పార్టీలు యుపిఏలోనో, ఎన్‌డిఏలోనో చేరతాయి. వాటి పొత్తులు, కూటములకు మూలం అధికార దాహం తప్ప ప్రజాసంక్షేమం కాదు.

నిజానికి ప్రజలు ఎప్పుడు ఎవరికి అనుకూలంగా ఓటు వేయడం లేదు. ఎప్పుడు ఏదో ఒక అధికార పార్టీకి లేదా వ్యక్తికి వ్యతిరేకంగానే ఓటు వేస్తున్నారు. ఇదొక విలోమ విలువ, ఎన్నికలు ఒక వ్యవస్థీకృత సర్దుబాటు మాత్రమే. నిజానికి ప్రజలు స్వావలంబన, స్వపరిపాలన ఆశిస్తున్నారు. దైనందిన అవసరాలైన కూడు, గూడు, గుడ్డ, విద్య, వైద్యం, ఉపాధి అడుగుతున్నారు. ప్రజల స్వేచ్ఛపైన అంక్షలులేని, సామాజిక ఆర్థిక అంతరాలులేని, విశ్వాసాలపైన నిర్బంధం లేని వ్యవస్థ కావాలని, ప్రజావసరాలు తీర్చే ప్రభుత్వాలు కావాలని ప్రజలు కోరుకుంటున్నారు. ఆ వ్యవస్థ వచ్చేవరకు, ప్రజావసరాలు తీరే వరకు ప్రజా ఉద్యమాలకు విరామం ఉండదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# నోటా వల్ల ఒరిగేదేమిటి?

***ప్రజలు పాలకుల విధానాల మీద విశ్వాసం కోల్పోయి ఓటింగ్‌కు దూరమవుతున్న క్రమంలో వచ్చిందే నోటా హక్కు తప్ప దానికి నిర్ణయాత్మక పాత్ర ఏమీ లేదంటున్నారు షేక్ కరిముల్లా***

గుంటూరు జిల్లా కలెక్టర్ ఒక దిన పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ ‘ఎన్నికల్లో ఓటు హక్కు వినియోగించుకోని వారికి ప్రశ్నించే హక్కు ఉండదని, వారికి ప్రశ్నించే హక్కు లేనట్లేనని’ సెలవిచ్చారు. ఓటు హక్కు వినియోగించుకున్నప్పుడే మేడిపండు ప్రజాస్వామ్యం పటిష్టమవుతుందని తెలిపారు. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రశ్నించే హక్కు ఎంతో మౌలికమైంది. అది ఒకరు ఇచ్చేది కాదు. ఇచ్చింది కాదు. ప్రజలు పోరాడి సాధించుకున్న ప్రజాస్వామిక హక్కు. కలెక్టర్ అలా మాట్లాడిన రోజే దినపత్రికలలో ‘ఒక టిడిపి ఎంఎల్ఎ 36 గంటలలో మూడు పార్టీలు మారి చివరకు టిఆర్ఎస్‌లో తేలారు’ అనే వార్త ఉదాహరణలతో ప్రచురితమైంది. ఇది ఒక్క ఆ నాయకుడే కాదు, ఈ ఎన్నికల సీజన్‌లో అన్ని రాజకీయ పార్టీలలో సాధారణంగా కనిపించే దృశ్యాలు, మునుపెన్నడు లేని విధంగా అన్ని పార్టీలు ఈ ‘జంప్ జిలానీ మాబు సుభానీల’ కోసం వలలు, గాలాలు వేసి ఎదురు చూస్తున్నాయి. వచ్చేవారి కోసం అభ్యర్థుల జాబితాల్లో ఖాళీలు నామినేషన్ల గడువు చివరి రోజు వరకు మంతనాలు. ఏ పార్టీ నాయకుడు ఏ గంటలో ఏ పార్టీ తీర్థం పుచ్చుకున్నాడో, ఏ స్థానానికి టికెట్ పొందాడో అర్థంకాని పరిస్థితి. పార్టీ జంప్‌చేయ్, మా పార్టీ తీర్థం పుచ్చుకో, ఆ వెంటనే టిక్కెట్ అందుకో. ఇది ప్రస్తుతం అన్ని రాజకీయ పార్టీలు చివరి నిమిషం వరకు ఇతర పార్టీల నుంచి తమ తమ పార్టీల్లో చేరే అభ్యర్థులకు ఇస్తున్న బంపర్ ఆఫర్. ప్రత్యర్థి పార్టీలు అభ్యర్థులను ప్రకటించగానే ఆ నియోజకవర్గాల్లోని అసంతృప్తులను తమవైపు తిప్పుకుని టికెట్లు ఇచ్చేస్తున్నాయి. గెలుపు గుర్రమా కాదా అనేదే ప్రాతిపదిక! గత కొద్ది రోజులుగా రాజకీయ పార్టీల శిబిరాల్లో ఈ తంతూ కొనసాగుతూ ఉంది. ఇలా వచ్చి కండువా కప్పుకోవడం, పార్టీ బి-ఫామ్ తీసుకొని వెళ్లి పోవడం షరా మామూలుగా మారిపోయింది. ఈ పార్టీ ఫిరాయింపులు సర్వ సాధారణం అన్న స్థాయికి చేరుకుంది. ఈ స్థితి దిగజారి పోయిన రాజకీయాలకు అద్దం పడుతుంది. రాజకీయ విలువలకు తావులేదని తేలి పోయింది. ఈ రాజకీయ అస్థిరత ప్రస్తుతం దేశంలో రాజకీయ సంక్షోభాన్ని తెలుపుతూ ఉంది.

ఎటువంటి విలువలు లేని రాజకీయాలకు, నేతలకు ఓట్లు వేయాలా? వేయకుంటే ప్రశ్నించే హక్కును కోల్పోయినట్లేనా? ఈ ప్రశ్నలు సమాజం నుంచి వస్తాయి. దీనికి జవాబు కూడా ఇలా మాట్లాడే వారే చెప్పాల్సి ఉంటుంది. పెద్ద ప్రజాస్వామిక దేశమైన మన దేశంలో 70 శాతం మించి ఏనాడు ఓటు వేయలేదు. రాజకీయ పార్టీల సిద్ధాంతాల కంటే, విధానాల కంటే ఎక్కువగా ఓటర్లను ప్రభావితం చేస్తున్న అంశాలు డబ్బు, మద్యం, కులం, మతం, రిగ్గింగ్, దొంగ ఓట్లు అన్నది అందరికి తెలుసు. ముఖ్యమైన విషయమేమంటే అధికారం చెలాయించిన ఏ పార్టీకి మొత్తం పోలైన ఓట్లలో సగం ఓట్లు ఏనాడు రాలేదు. మరి పాలించడానికి వీరికున్న అర్హత ఏమిటీ? గత ఆరు దశాబ్దాలుగా 15 సార్వత్రిక ఎన్నికలను చవి చూసిన ప్రజలు ఈ ఓట్ల వల్ల తమకు ఒరుగుతున్నదేమి లేదని తేల్చుకున్నారు. అందుకే 30 నుండి 40 శాతం మంది ఎన్నికలకు దూరంగా ఉంటూ ఓట్లు వేయడం లేదు. కాబట్టి ఈ అసంతృప్తులను ఎలా తృప్తి పరచాలి! పోలింగ్ శాతాన్ని ఎలా పెంచాలి! అనే ఆలోచన ఇసి (ఎన్నికల సంఘం) చేసింది. సుప్రీం కోర్టు కూడా దీనికి వత్తాసు పలికింది. అదే అదనపు మీట సిద్ధాంతం. ఇప్పటికే ఈ పద్ధతి కొన్ని దేశాల్లో అమల్లో ఉంది. ఫ్రాన్స్, బెల్జియం, అమెరికా, బ్రెజిల్, గ్రీస్, స్పెయిన్, రష్యా, చిలీ, కొలంబియా, బంగ్లాదేశ్, స్వీడన్ తదితర దేశాలలో అమల్లో ఉంది. కాలిఫోర్నియాలో 1976లో తొలిసారిగా అమల్లోకి వచ్చింది. అభ్యర్థులెవరూ నచ్చకుంటే తిరస్కార ఓటు వేసే హక్కును భారత రాజ్యాంగం ఎప్పుడో కల్పించింది. ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని 49 (ఓ) సెక్షన్ కింద ఓటర్లు ఈ హక్కును ఉపయోగించుకునే వీలుంది. అయితే ఇది రహస్య ఓటింగ్ పద్ధతికి సరిపోనందున, చాలా మంది ఓటర్లకు దీనిపై అవగాహన లేనందున అమలు కాలేదు. ఇప్పుడు ఈవిఎంలు వాడుకలోకి రావడంతో ఎన్నికల కమిషన్ చొరవ చూపింది. ప్రభుత్వం దీన్ని సహజంగానే వ్యతిరేకించింది. అప్పుడు పౌర హక్కుల సంస్థ పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్) నోటాకు మద్దతుగా సుప్రీంకోర్టులో ప్రజా ప్రయోజన వాజ్యం దాఖలు చేసింది. ఈ కేసులో 2013 సెప్టెంబర్ 27న సుప్రీంకోర్టు నోటాను ప్రవేశపెట్టాలని రూలింగ్ ఇచ్చింది. అది ఓటర్ల భాగస్వామ్యాన్ని పెంచుతుందని, రాజకీయ పార్టీలు నిష్కల్మషమైన అభ్యర్థులను నిల్పోబెట్టే నియమబద్ధ మార్పుకు ఇది దారితీస్తుందని చెప్పింది. ఫలితంగా గత ఏడాది ఐదు రాష్ట్రాలలో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో నోటా తొలిసారిగా అందుబాటులోకి వచ్చింది. చాలా చోట్లా ఓటర్లు కసితీరా నోటా మీటను నొక్కి అభ్యర్థులపై తమ ఆగ్రహాన్ని చాటుకున్నారు. కొన్ని చోట్ల గెలుపొందిన అభ్యర్థికి, ఓటమి పాలైన సమీప ప్రత్యర్థికి నడుమనున్న ఓట్ల వ్యత్యాసం కంటే నోటాకే ఎక్కువ ఓట్లు పడ్డాయి. ఛత్తీస్‌గడ్‌లో నోటాకు అత్యధికంగా 3 శాతం ఓట్లు పడ్డాయి. మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లలో 2 శాతం, ఢిల్లీలో 1 శాతం ఓట్లు నోటాకు పడ్డాయి.

ఇప్పుడు నోటాలోని డొల్లతనం చూద్దాం! నిజానికి నోటా వల్ల ఒరిగేదేమీ ఉండదు. ఒకవేళ బరిలో ఉన్న అభ్యర్థులందరి కంటే నోటాకే ఎక్కువ ఓట్లు వచ్చినా ఫలితాల్లో మార్పేమి ఉండదు. ఎక్కువ ఓట్లు దక్కిన అభ్యర్థినే విజేతగా ప్రకటిస్తారు. నోటాకు తిరస్కరణ హక్కుకు (రైట్ టు రిజెక్ట్) తేడా ఉంది. తిరస్కరణ హక్కు మనకు ఇంకా అందుబాటులోకి రాలేదు. నోటాను తిరస్కరణ హక్కుగా చాలా మంది పొరబడుతున్నారు. అది తిరస్కరణ హక్కు కాదంటూ మాజీ ప్రధాన ఎన్నికల కమీషనర్ ఖురేషి స్పష్టం చేశారు. నోటాకు పడ్డ ఓట్లను చెల్లని ఓట్లుగానే పరిగణిస్తామని ఎన్నికల కమిషన్ కూడా వివరణ ఇచ్చింది. నోటా ఓట్లు అభ్యర్థుల గెలుపును శాసించలేవు. అలాగే వాళ్ల అభ్యర్థిత్వాలను కూడా రద్దు పరచలేవు. కాబట్టి నోటా వల్ల ప్రయోజనం లేదనేది స్పష్టం. నోటాకు ఇప్పటి వరకు ఎలాంటి గుర్తును ఎలక్షన్ కమిషన్ కేటాయించలేదు. అక్షరాస్యులకు ఎలాంటి సమస్య లేకపోయినా, నిరక్షరాస్యులకు ఇది ఇబ్బందికరమని, నోటాకు గుర్తు

# నోటా ఆవశ్యకత

***ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్న పార్టీల చేష్టలను ప్రజలు తీవ్రంగా ప్రతిఘటించాలనీ, ఈ ఎన్నికలలో తిరస్కార ఓటు (నోటా) హక్కు ద్వారా నాయకులకు బుద్ధి చెప్పాలనీ అంటున్నారు* ఎం. కె. కుమార్**

**భా**రతీయ ఓటర్లు ఓటును వ్యతిరేకించే హక్కును కూడా కలిగి ఉన్నారు. ఎన్నికల బరిలో ఉన్న అభ్యర్థుల్లో ఏ ఒక్కరు తమ ఆకాంక్షలను నెరవేర్చరని తలచినప్పుడు పౌరులు నన్ ఆఫ్ ది అబవ్ (ఈ అభ్యర్థులెవరూ మాకొద్దు) (నోటా)ను ఉపయోగించ వచ్చు. ఎలక్ట్రానిక్ ఓటింగ్ మిషన్‌లో ఉండే ఈ నోటాకు ఒక గుర్తును కేటాయించాలని తాజాగా రాష్ట్ర హైకోర్టు తీర్పునివ్వడం ఆహ్వానించదగ్గ పరిణామం. అలాగే దీనిపై విస్తృతమైన ప్రచారాన్ని కలిగించాలని సుప్రీంకోర్టు అభిప్రాయపడింది. 16వ లోక్‌సభ ఎన్నికల నుంచి ఈ నోటా బటన్ మిషన్‌లో 16 మంది పేర్లకే అవకాశం ఉన్నప్పటికీ ఏర్పాటు చేస్తారు. గతంలో రహస్య ఓటు హక్కు ఉన్నప్పటికీ దానిపై ప్రచార లోపం వల్ల ఎక్కువ మంది వినియోగించుకోలేకపోయారు. ఘనత వహించిన రాష్ట్ర రాజకీయ నాయకులు, సీట్లను కోట్లకు అమ్ముకుంటున్న పార్టీలు, కులాల, మతాల ప్రాతిపదికన ప్రజలను చీలుస్తున్న పార్టీలను చూసి ప్రజలు విసిగెత్తి పోయారు. ఈ తరుణంలో తమ నిరసనను నోటా ఓటు ద్వారా తెలియపర్చవచ్చు. బెల్జియం, ఫ్రాన్స్, గ్రీస్, బ్రెజిల్, ఉక్రెయిన్, చిలీ, స్వీడన్, బంగ్లాదేశ్ తదితర దేశాల్లో నోటా అమల్లో ఉంది. 2013లో రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ, ఛత్తీస్‌గఢ్ అసెంబ్లీ సెగ్మెంట్‌లకు జరిగిన ఎన్నికల్లో తొలిసారిగా నోటా అమల్లోకి వచ్చింది. ఛత్తీస్‌గఢ్‌లో 46 వేలమంది నోటాను వినియోగించుకున్నారు.

ఎన్నికల బరిలో నిలిచిన అభ్యర్థులు నచ్చకపోతే తిరస్కరించే హక్కు ఓటర్లకు ఉంటుందని సుప్రీంకోర్టు తీర్పు స్పష్టం చేసింది. నచ్చని అభ్యర్థిని తిరస్కరించడం కూడా రాజ్యాంగం ప్రకారం లభించే వాక్ స్వాతంత్ర్యం, భావ వ్యక్తీకరణ హక్కులో భాగమేనని సుప్రీంకోర్టు పేర్కొంది. ఇకపై జరిగే ఎన్నికల్లో ఇవిఎంలలోనూ, బ్యాలెట్ పత్రాలలోనూ తిరస్కార ఓటు వేసేందుకు అవసరమైన ఏర్పాట్లు చేయాలని ఎన్నికల సంఘాన్ని ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ సదాశివం నేతృత్వంలోని త్రిసభ్య ధర్మాసనం ఆదేశించింది. ఎలక్ట్రానిక్ ఓటింగ్ యంత్రాలలో నోటా అనే ఆప్షన్ ఇవ్వాలని, ఈ ఓట్లు వేసిన వారి విషయంలో గోప్యత పాటించాలని కూడా సుప్రీంకోర్టు పేర్కొంది. 2004లో పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ కోర్టునాశ్రయించగా, 9 ఏళ్లు విచారణ జరిపిన తర్వాత సుప్రీంకోర్టు తన తీర్పును గత నెల 26న వెల్లడించింది.

నిజానికి ఎన్నికల నిబంధనల్లోని 49(ఓ) అధికరణ ప్రకారం ఎవరికీ ఓటు వేయబోమని చెప్పే హక్కు ఓటరుకుంది. తమకి నచ్చిన అభ్యర్థులు ఎవ్వరూ లేరని భావించినప్పుడు, ఎవ్వరికీ ఓటు వేయకుండానే వేలికి ఇంక్ మార్క్ పెట్టించుకోవచ్చు. పోలింగ్ బూత్‌లో లభించే 17(ఏ) పత్రంలో పేరును నమోదు చేసుకొని, దానిపై సంతకం పెట్టాలి. కాని ఈ అంశానికి రాజకీయ పార్టీలు, పాలకవర్గాలు ఎప్పుడూ ప్రచారం కల్పించలేదు. పార్లమెంట్‌లో తిరస్కార ఓటింగ్ విధానం ఎప్పటి నుండో అమలవుతోంది. పార్లమెంట్‌లో జరిగే ఓటింగ్‌లో పాల్గొనడానికి సభ్యుడికి ఇష్టం లేకపోతే దూరంగా ఉండడానికి (అబ్‌స్టెయిన్) సభ్యుడికి హక్కు ఉంది. ఈ అంశాన్ని కూడా సుప్రీంకోర్టు తన తీర్పులో ప్రస్తావించింది. తిరస్కార ఓటు హక్కు వల్ల ఇబ్బందులు తలెత్తుతాయన్న కేంద్ర ప్రభుత్వ వాదనను సుప్రీంకోర్టు తోసిపుచ్చింది. ఇటువంటి అంశాలను చట్టసభలు నిర్ణయించాలని, కోర్టులు కేటాయించాలని ప్రముఖ రచయిత సౌదా హైకోర్టులో 'పిల్' దాఖలు చేశారు. దీనిపై సానుకూలంగా స్పందించిన మన హైకోర్టు నోటాకు గుర్తు కేటాయించాలని, వీలైతే ఈ ఎన్నికలలోనే కేటాయించాలని ఎన్నికల సంఘంను ఆదేశించింది. నోటాకు గుర్తు ఈ ఎన్నికలలో కేటాయించే అవకాశం లేకపోయినా వచ్చే ఎన్నికల నాటి నుండి నోటాకు గుర్తు వస్తుంది.

మొత్తానికి ఎన్నికల సంఘం పదునులేని ఆయుధం ప్రజలకు ఇచ్చినా, ప్రస్తుతం జరుగుతున్న 16వ సార్వత్రిక ఎన్నికలలో నోటా ప్రభావం తక్కువేమి కాదు. చాలా చోట్ల పాలకుల నిర్లక్ష్యానికి గురైన ఓటర్లు ఈసారి నోటాకు ఓటు వేస్తారు. పలు రాష్ట్రాలలో నోటా గురించి ప్రచారానికి కొన్ని స్వచ్ఛంద సంస్థలు, ప్రగతి కాముకులు కమిటీలుగా ఏర్పడి అభ్యర్థులు నచ్చకుంటే నోటాకు ఓటు వేయాలని చెబుతున్నాయి. ఇప్పటికే ఒడిశాలోని కొంధోమాల్ గిరిజనులు, కోల్‌కత్తాలోని సెక్స్ వర్కర్లు నోటాకు ఓటు వేస్తామని ప్రకటించినట్లు పత్రికలలో వార్తలు వస్తున్నాయి. తమను పట్టించుకోని నాయకులకు, పార్టీలకు ఎందుకు ఓటు వేయాలని పలు వర్గాలు ప్రశ్నిస్తున్నాయి.

అసలు విషయమేమంటే పెద్ద ప్రజాస్వామిక దేశంగా చెప్పబడే మన దేశంలోని ప్రజలు ఓటింగ్‌కు ఎందుకు దూరంగా, అయిష్టంగా ఉంటున్నారనేది ప్రశ్న. ప్రజలకు ఓటింగ్ వ్యవస్థపై నమ్మకం పోతున్నది. ఓటు వేయడం ద్వారా జరుగుతున్న గుణాత్మకమైన మేలు ఏదీ వాళ్లకు కనబడడం లేదు. పలు రకాల రాజకీయ పార్టీలు వస్తున్నాయి. పోతున్నాయి. ఆయారాం, గయారాంలు వస్తున్నారు పోతున్నారు. కానీ తమకు మేలు జరిగిందేమీ లేదనే విషయం ప్రజలు ఆలస్యంగానైనా గ్రహించారు. ప్రజలలో కలిగిన నిరాశను, అసంతృప్తిని తగ్గించేందుకు, వాళ్లను ఓటు వేసేలా పోలింగ్ బూత్‌లకు తెచ్చేందుకు ఎన్నికల సంఘం చేసిన ఈ ప్రయోగం తాత్కాలిక తాయిలమే కానీ, శాశ్వత పరిష్కారం కాదు. కనీసం కొన్ని వ్యవస్థీకృత మార్పులు చేయక తప్పదు. రాజకీయ పార్టీల, నాయకుల, ప్రభుత్వాల తీరు మారేలా, పేదలపై ప్రభుత్వాలు సాగిస్తున్న దమన కాండలు నిలువరించేలా, ఎన్నికలలో గెలిచిన అభ్యర్థులను, పార్టీలను నిలదీసే విధంగా, ప్రకృతి వనరులు ప్రజలకు అందేలా, మౌలికంగా దేశంలోని పేదరికం నిర్మూలించే దిశగా, ప్రజల తలసరి ఆదాయాలు పెరిగే విధంగా, ఆదాయ అసమానతలు తగ్గే మొదలగు చర్యలు రాజ్యాంగ బద్ధ సంస్థలైనా తీసుకోవాలి. లేకుంటే ప్రజలలోని అసంతృప్తి రేపు వ్యవస్థ పునాదులను పెకిలించి వేసే స్థితికి చేరుకుంటుంది.

*(రచయిత ప్రభుత్వ ఉద్యోగి)* వీ

నిర్ణయించడం పట్ల అనేక సమస్యలు తలెత్తే ప్రమాదముందని రాజకీయ పార్టీలు అభిప్రాయపడ్డాయి. కలుషితమైన రాజకీయ వ్యవస్థను ఈ ప్రక్రియ శుద్ధిచేస్తుందని, ఓటర్లకు సాధికారత ఇచ్చినట్లు అవుతుందని, పార్టీలు సచ్ఛీలురనే అభ్యర్థులుగా నిలబెట్టే అవకాశాలు ఉంటాయని సుప్రీంకోర్టు ఆశాభావం వ్యక్తం చేసింది. పార్లమెంట్‌లో సభ్యులు ఓటును బహిష్కరిస్తున్నట్టు ఒక మీటను నొక్కి తన అభిప్రాయాన్ని వెల్లడించవచ్చు. కాని వారి ఓటు బిల్లు ఆమోదంపై కాని, వ్యతిరేకతపై గాని ప్రభావం చూపదని, అలాగే తిరస్కార ఓటు ప్రభావం ఎన్నికలపై ఏ మాత్రం ఉండబోదని పిటిషనర్ తరుపు న్యాయవాది సంజయ్ పారీఖ్ పేర్కొన్నారు. వ్యతిరేక ఓటును పరిగణలోనికి తీసుకోకూడదని తీర్పులో ఉండడం వల్ల, అనూహ్య పరిస్థితుల్లో 50 శాతం కంటే ఎక్కువ ఓటర్లు వ్యతిరేక ఓటు వేసినప్పటికీ, ఫలితాన్ని మిగిలిన ఓట్లే నిర్ణయిస్తాయి. గెలిచే ఓట్లకన్నా వ్యతిరేక ఓట్లు ఎక్కువ పడితే ఆ ఎన్నికను రద్దు చేసే విధంగా నిబంధన పెడితేనే ప్రయోజనం ఉంటుందని కొన్ని పార్టీలు అభిప్రాయపడ్డాయి.

ఎన్నికల సంస్కరణలను రాజకీయ పార్టీలతో సంప్రదించకుండా, పార్లమెంట్‌లో చర్చించకుండా సుప్రీంకోర్టు ఇలాంటి నిర్ణయాలు తీసుకోవడం పట్ల కొన్ని పార్టీలు అసహనాన్ని వ్యక్తపర్చాయి. న్యాయ కమీషన్ 170 నివేదికలో వ్యతిరేక ఓటు గురించి ప్రస్తావించింది. నేరగాళ్ల, అవినీతిపరుల, అవాంఛనీయ చరిత్ర గలిగిన అభ్యర్థులను రాజకీయ పార్టీలు ఎన్నికల్లో నిలబెట్టకుండా, వాటిపై ఒత్తిడి తీసుకురావాలంటే తిరస్కార ఓటు అవసరం అవుతుందని కమిషన్ అభిప్రాయ పడింది.

2001లోనే ఎన్నికల కమిషన్ తిరస్కార ఓటు లేదా తటస్థ ఓటు గురించి అప్పటి ఎన్‌డిఎ ప్రభుత్వానికి సూచించినప్పటికీ, ప్రభుత్వం స్పందించలేదు. 2004లో కూడా ఎన్నికల కమిషన్ హక్కుల, ప్రజాసంఘాల విన్నపాల మేరకు యుపిఎ ప్రభుత్వం దృష్టికి ఇదే అంశాన్ని తీసుకొచ్చింది. అయితే వ్యతిరేక ఓట్లు ఎక్కువుగా వచ్చినప్పుడు తిరిగి ఎన్నికలు నిర్వహించాల్సి వస్తుంది. తిరిగి ఎన్నికల్లో కూడా అభ్యర్థులు ఓటర్లకు నచ్చని విషయంలో ఏం చేయాలి అనే విషయం చర్చకు రావడం లేదు. ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని 49(ఓ) నిబంధన ప్రకారం ఓటరు తాను ఓటు వేయదలుచుకోలేదని సంతకం చేయడం కూడా రహస్య ఓటింగ్ అవగాహనకు విరుద్ధమని పియుసిఎల్ తన పిటిషన్‌లో పేర్కొంది. ఎన్నికల చట్టంలోని 49(ఓ) నిబంధనను ఉపయోగించుకున్న వారి వివరాలు రాజకీయ పార్టీలకు తెలిసే అవకాశం ఉన్నందున, ఈ విధానాన్ని ఓటర్లు వినియోగించుకోవడానికి ఉత్సాహంగా ముందుకు రావడం లేదనే అభిప్రాయం ఉంది. 2011 తమిళనాడు అసెంబ్లీ ఎన్నికల్లో 25 వేల మంది 49(ఓ) నిబంధనను వినియోగించుకున్నారని కాబట్టి తిరస్కార ఓటును రహస్యంగా ఉంచినంత మాత్రాన ఒరిగేదేమి ఉండదనే అభిప్రాయం ఉంది. వామపక్ష పార్టీలు బలప్రయోగం, డబ్బు వంటి అవలక్షణాలను నిరోధించడానికి ఎన్నికలను దామాషా ప్రాతిపదికన నిర్వహించాలని కొంతకాలంగా వాదన చేస్తున్నాయి.

ఎన్నికల సంస్కరణలలో భాగంగా తిరస్కార ఓటును స్వాగతించాల్సిందే. చట్టసభలు ఆ అంశాన్ని ఎప్పుడూ చర్చకు పెట్టలేదు కాబట్టే, కోర్టు దృష్టికి తీసుకెళ్లాల్సిన పరిస్థితి దాపురించింది. ఎన్నికల్లో పాల్గొనే అభ్యర్థులు తమపై ఏవైనా కేసులు పెండింగ్‌లో ఉన్నాయో లేదో నామినేషన్ పత్రంలో పేర్కొనాలని 1999లో అసోసియేషన్ ఆఫ్ డెమొక్రటిక్ రిఫామ్స్ సంస్థ ఢిల్లీ కోర్టును ఆశ్రయించింది. కోర్టు అనుకూలంగా తీర్పునిచ్చినప్పటికీ, బిజెపి ప్రభుత్వం కోర్టు తీర్పుకు వ్యతిరేకంగా సుప్రీంకోర్టుకు వెళ్లింది. సుప్రీంకోర్టులో కూడా ప్రభుత్వానికి చుక్కెదురు కావడంతో తప్పనిసరి పరిస్థితుల్లోనే ప్రజాప్రాతినిధ్య చట్టాన్ని సవరించింది. రాజకీయ పార్టీలకు చిత్తశుద్ధి ఉంటే తిరస్కార ఓటు అంశాన్ని పార్లమెంట్‌లో ఇప్పుడైనా చర్చకు పెట్టవచ్చు. కోర్టుల్లో దోషులుగా తేలినవారు చట్టసభల్లో కొనసాగకూడదనే తీర్పును సుప్రీంకోర్టు వెలువరించినా యుపిఎ ప్రభుత్వం దానికి వ్యతిరేకంగా ఆర్డినెన్స్‌ను తీసుకొచ్చింది. సుప్రీం తీర్పు సెక్షన్ 8 (1,2,3) ప్రకారం నమోదైన కేసులకే వర్తిస్తుంది, అది కూడా తీర్పు వెలువడిన 2013 జూలై 10 తర్వాతి కేసులకే. అంటే పాత కేసులలో శిక్ష పడేవారికి ఇది వర్తించదు. 2008లో పెండింగ్ కేసులున్న ఎంపి, ఎంఎల్‌ఎలు 0.5 శాతంగానే ఉన్నారు. వివిధ ఎన్నికల్లో పోటీకి నిలబడిన అభ్యర్థుల్లో 50 వేల మంది వివరాలను పరిశీలించినా వీరి సంఖ్య 160(0.3శాతం) గానే ఉంది. పాలకవర్గాలు చిత్తశుద్ధితో లేకపోవడం వల్లే న్యాయస్థానాల దృష్టికి ఇటువంటి రాజకీయపరమైన అంశాలు వస్తున్నాయి.

ఓటును తిరస్కరించడం కూడా రాజ్యాంగంలోని 19(1)(ఎ) అధికరణం కల్పించిన భావప్రకటనా స్వేచ్ఛ ప్రకారం ఒక హక్కే. అసంతృప్తితో ఉన్న ఓటరు తన ఓటు హక్కును వినియోగించుకోవడంలో ప్రస్తుత వ్యవస్థలో ఉత్సాహాన్ని చూపించడం లేదు. అతని రాలేని పరిస్థితిని అనుకూలంగా మార్చుకుంటున్న వ్యవస్థ అతని ఓటును అనైతిక శక్తుల ద్వారా వేసుకొనే వెసులుబాటును కల్పిస్తుంది. ఓటు తిరస్కార హక్కు వల్ల ఓటరుకు సాధికారత ఏర్పడి ఓటింగ్ శాతం పెరిగే అవకాశాలు మెరుగుపడతాయి. ప్రజాప్రాతినిధ్య చట్టంలోని సెక్షన్ 79(డి), 41(2)(3), 49(ఓ) ల కింద ఓటు హక్కును, ఓటు నిరాకరణ హక్కును చట్టబద్దంగా గుర్తించారు. దీన్ని గోప్యంగా ఉంచాల్సిన అవసరం ఉంది.

గ్రామాలలో ఓటర్లు పార్టీల ప్రాతిపదికన చీలిపోయుంటారు. తిరస్కార ఓటు వేసిన వారెవరో పార్టీలకు తెలిస్తే వారిపై దౌర్జన్యాలు జరిగే ప్రమాదముంది. ఓటరు నిర్ణయం బహిర్గతం కావడం కూడా ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని 79(డి), 128ని ఉల్లఘించడమేనని, రాజ్యాంగంలోని 19వ అధికరణాన్ని ఉల్లంఘించడమే నని సుప్రీంకోర్టు అభిప్రాయపడింది. 19 వ అధికరణ వ్యక్తికి మాట్లాడే, విమర్శించే, విభేదించే హక్కును కల్పించింది. ప్రజా సమూహాలు భిన్న అభిప్రాయాలను, విభిన్న రాజకీయ సిద్ధాంతాలను కల్గి ఉండే స్వేచ్ఛను కల్గిఉన్నాయి. నిజానికి ప్రజలు కులం, ప్రాంతం, మతాల వారీగా ఓట్లను వేస్తూ, డబ్బు, మద్యం, కండ, అర్థబలాలకు లొంగిపోవాల్సిన పరిస్థితిని రాజకీయ వ్యవస్థ కల్పించింది. ఈ నేపథ్యంలో తిరస్కార ఓటుహక్కు ప్రభావం పెద్దగా ఉండకపోవచ్చు.

బి.ఆర్.అంబేద్కర్ తిరస్కార ఓటుహక్కును సమర్థించాడు. ప్రతికూల ఓటింగ్ హక్కు రాజకీయాలను ప్రక్షాళన దిశగా నడిపించే ఆస్కారం ఉంది. 13 దేశాల్లో తిరస్కార ఓటు హక్కు ఉంది. పాకిస్థాన్ 2013లో తిరస్కార ఓటింగ్ హక్కును ప్రవేశపెట్టి మళ్లీ ఉపసంహరించుకుంది. ఉక్రెయిన్, గ్రీస్, స్పెయిన్, రష్యా, అమెరికాలోని నెవెడా రాష్ట్రమూ తిరస్కార ఓటింగ్‌ను ఉపసంహరించుకున్నాయి. దీనికి ప్రధాన కారణం అక్కడి రాజకీయ పార్టీలకు చిత్తశుద్ధి లేకపోవడమే. మన దేశం కూడా తిరస్కార ఓటును హక్కుగా గుర్తిస్తుందని, దానికి చట్టబద్ధత కల్పిస్తుందనేది అనుమానమే. పోలింగ్‌ను బహిష్కరించడాన్ని కూడా ప్రజా సమూహాలు ఒక నిరసన రూపంగా మన దేశంలో అవలంబిస్తున్నారు. తమ సమస్యల పరిష్కరించడానికి బ్యాలెట్‌ను బహిష్కరించడాన్ని పోరాట సాధనంగా ఎన్నుకున్నారు. ఈ నిరసన చర్యలకు చట్టబద్ధతను తిరస్కార ఓటింగ్ కల్పిస్తుంది. ఓటరు చైతన్యాన్ని పెంచేదానికన్నా, అతనికి ఎన్నికల ప్రక్రియ పట్ల , అభ్యర్థుల పట్ల ఉన్న భావనను తెలిపే సాధనంగా కూడా తిరస్కార ఓటు హక్కు ఉపయోగ పడుతుంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

# ఎన్నికల సందర్భంగా నాయకుల విమర్శలు

***ప్రభుత్వాల విధానాల వల్ల ప్రజల సమస్యలు పెరిగిపోతుంటే నాయకులు ప్రజల మౌలిక సమస్యల పరిష్కారానికి ప్రాధాన్యం ఇవ్వకుండా వ్యక్తిగత విమర్శలకు దిగుతున్నారని అంటున్నారు* వై రామచంద్రం**

భారత రాజ్యాంగాన్ని నమ్మి, పార్లమెంట్ రాజకీయాలను విశ్వసిస్తూ, ప్రజలకు ప్రజాస్వామ్య పాలన అందిస్తామన్న రాజకీయ పార్టీల నాయకులు ఇతర పార్టీల వ్యక్తుల మీద ఎలాంటి విమర్శలు చేస్తున్నారో తెలియజేయడమే ఈ వ్యాసం ఉద్దేశం.

గతంలో అధికారంలో ఉన్న పార్టీలు ప్రజలకు ఇచ్చిన వాగ్దానాలను ఏమేరకు నెరవేర్చాయో, ఏమి చేయలేక పోయాయో, ఎందువల్ల చేయలేక పోయాయో అనే విషయాన్ని సమీక్ష చేసుకోవాలి. మళ్లీ అధికారంలోకి వస్తే ఏమి చేస్తాయో అనే విషయానికి పరిమితమై ఎన్నికల ప్రచారంలో భాగంగా ప్రజల ముందుకు వెళ్లాలి. ఇప్పటివరకు అధికారంలోకి రాని పార్టీలు తాము అధికారంలోకి వస్తే ప్రజల ముందున్న సమస్యలను ఎలా పరిష్కరించాలని అనుకుంటున్నాయో తెలియపరుస్తూ ప్రజల వద్దకు వెళ్లాలి. ఇవేవి ఆయా పార్టీల ఎన్నికల ప్రచారంలో ప్రధానం కావడంలేదు.

దేశవ్యాప్తంగా జరుగుతున్న సాధారణ ఎన్నికల సందర్భంగా వివిధ రాజకీయ పార్టీల నాయకులు చేసుకునే విమర్శలను గమనిస్తే వీరిచేతనేనా మనం పాలించబడుతున్నది అని ఆశ్చర్యం కలుగక మానదు. రాజకీయ నాయకులు చేసే విమర్శలు ఆయా పార్టీల విధి విధానాలను పక్కన పెట్టి ప్రత్యర్థుల వ్యక్తిగత లోపాలు, వారి సామాజిక అస్తిత్వ మూలాలతో విమర్శలకు దిగుతున్న పరిస్థితి కొనసాగుతోంది. ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించడంలో పార్టీలు విఫలం చెందాయనే విషయాన్ని ఆయా పార్టీలు చేసే వ్యక్తిగత విమర్శలే చెపుతున్నాయి.

తాను ఒక మనిషిననే సంస్కారం లేకుండా 'ఇటలీకి చెందిన తల్లి, కొడుకులను బట్టలూడదీసి ఇటలీకి తరుముతామ'ని విమర్శలు చేస్తున్న నాయకులు రేపు మనల్ని పాలించాలనుకుంటున్నారు. ఇదీ నాయకులు ప్రజలకు నేర్పుతున్న సంస్కారం.

'తెలంగాణను మేమే తెచ్చినం' అని ఒక పార్టీ అంటే, 'తెచ్చింది మేమే, ఇచ్చింది మేమే' అనే విమర్శలకు వేరే పార్టీ దిగింది. 'మా సహకారం వల్లే తెలంగాణ వచ్చింది' అని ఒక పార్టీ అంటుంది. ఇందులో తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోసం తీవ్ర అణచివేతను, నిర్బంధాలను, కేసులను ఎదుర్కొన్న ప్రజలు గాని, పోలీసుల తూటాలకు ప్రాణాలు కోల్పోయిన యువకులుగాని, తెలంగాణ కోసం మలి దశ ఉద్యమంలో ఆత్మహత్యలు చేసుకున్నవారి త్యాగాలు ఏ పార్టీలకు లెక్కలేదు. అంతేకాదు, దేశవ్యాప్తంగా చాలామంది చనిపోతున్నారు, వారు కోరినట్లు చేయగలమా అని ఉద్యమకారుల త్యాగాలను సైతం హేళనచేస్తూ విమర్శిస్తున్న రాజకీయ నాయకులున్నారు.

తన పాలనలో మైనారిటీల రక్తం పారించిన హంతకులను దేశ ప్రధానిని చేస్తే ఇక దేశంలోని భిన్న మతాల ప్రజల పరిస్థితి ఎలా ఉంటుందని ప్రజలకు ఒక హెచ్చరికతో కూడుకున్న విమర్శలు ఉన్నాయి. మత తత్వ పార్టీలకు ఓటు వేస్తే మత దురభిమానం పెరిగిపోయి ప్రభుత్వాలే మత హింసకు నాయకత్వం వహించే పరిస్థితి వస్తుందని హెచ్చరిస్తున్నారు.

గత ఎన్నికల్లో ఓటు వేయనివారికి ఈ ఎన్నికల్లో ఓటేసే అవకాశం లేకుండా నిషేధం విధించాలని అంటున్నారు. మోడీకి ఓటు వేయని వారు పాకిస్తాన్‌కు వెళ్లిపోవాలని ముస్లింలను బెదిరిస్తున్నారు. హిందువులు నివసించే ప్రాంతాల్లో ముస్లింలు ఆస్తులు కొనుక్కోకుండా అడ్డుకోవాలని, కొనుక్కోవ దానికి ప్రయత్నించేవారిని రాళ్లతో, టైర్లతో, టమాటాలతో ఎదుర్కొండి అని పిలుపునిస్తున్నారు. ముజఫర్‌నగర్‌లోని దాడులు జరిగిన ప్రాంతాల్లో ఇరు వర్గాలను రెచ్చగొట్టే ప్రసంగాలు చేస్తున్నారు. గుజరాత్‌లాగా యుపిని చేయాలని ప్రయత్నిస్తే మోడీని ముక్కలు ముక్కలుగా నరకండని అంటున్నారు. ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్య దేశమని చెప్పుకునే దేశంలో ప్రజలను ఓట్లు అడుక్కుంటున్న తీరు ఇది. రేపు ఈ నాయకులు అధికారంలోకి వస్తే ప్రజల బతుకులకు భరోసా ఎవరు? పై సందేహాలన్నీ ఊరికే వచ్చినవి కావు. కడుపు కోతలతో, శవాల కమురు వాసనలతో వచ్చినవి.

గత ఎన్నికలలో శివకాశి నుంచి ప్రాతినిధ్యం వహించిన రికౌంటింగ్ మంత్రి, ఈ ఎన్నికల్లో పోటీ చేయకుండానే పారిపోయాడని చిదంబరం పేరు ఎత్తకుండానే మోడీ హేళన చేశాడు. మోడీ విమర్శకు కేంద్రంలో గతంలో హోంమంత్రిగా చేసి, ఇప్పుడు ఆర్థిక మంత్రిగా ఉన్న చిదంబరం స్పందిస్తూ తనను రికౌంటింగ్ మినిస్టర్ అని అంటుంటే.. తాను ఎన్‌కౌంటర్ ముఖ్యమంత్రి అంటానని అన్నారు. దీన్నిబట్టి పాలకుల మధ్య వైరుధ్యాలు ఏర్పడినపుడు వాస్తవాలు ఎలా బయటికి వస్తాయో తెలుస్తుంది. నరేంద్రమోడీని ఎన్‌కౌంటర్ ముఖ్యమంత్రి అనాల్సి వస్తుందని అన్నాడంటే దేశానికి సంబంధించి హోం మంత్రి బాధ్యతల్లో ఉన్న చిదంబరం ఎన్‌కౌంటర్ పేరుతో ఎంత మంది ప్రజలను చంపారో దీన్ని బట్టి అర్థంచేసుకోవచ్చు. పాలకులు తమ దుర్మార్గ పాలనను నిలబెట్టుకోవడానికే ప్రశ్నించే ప్రజల్ని ఎలా హత్యలు చేస్తున్నారో బుద్ధిజీవులు గమనించాలి.

ప్రభుత్వంలో కీలక శాఖలను నిర్వహిస్తున్న నాయకులు కనీసం ప్రజలు ఎన్నుకున్న వారు కారు. అలాంటప్పుడు వాళ్లకు ప్రజల సమస్యలు ఎలా అర్థమవుతాయి. ప్రభుత్వాలను దొర్లించడం తప్ప. ఈ విషయాలు ప్రజలు అంటున్నవి కాదు. పార్టీలు మారే సందర్భంలో సొంత పార్టీ నాయకులే చెప్పిన విషయాలు.

రోజు రోజుకు విమర్శలు నిబంధనలను అతిక్రమిస్తుంటే ఎన్నికల కమిషన్ మళ్లీ ఒకసారి మార్గదర్శకాలు జారీచేసింది. అభ్యర్థుల వ్యక్తిగత విషయాలు, జీవితాలకు సంబంధించి ఎటువంటి విమర్శలు చేయకూడదని స్పష్టం చేసింది. మతం పేరుతో చేసే విమర్శలు ప్రజల మధ్య విద్వేషాలకు దారితీస్తాయని అభిప్రాయపడింది.

దేశానికి 'స్వాతంత్ర్యం' వచ్చి 65 సంవత్సరాలు గడిచినా ప్రతి ఎన్నికల సందర్భంలో పేదరిక నిర్మూలనకోసం పాటుపడుతామని పార్టీలు పాత పాటే పాడుతున్నాయి అంటే, అవి చేయాల్సింది చేయలేదని ఇక ఆ పార్టీలు చేయలేవని గడిచిన కాలం రుజువుగా నిలిచింది. ఇన్ని ఏళ్ల కాలంలో వాళ్లు చేసిందల్లా అవినీతికి పాల్పడి వ్యక్తిగత ఆస్తులు సంపాదించుకున్నారు. ఈ విషయం విదేశాల్లో మూలుగుతున్న లక్షల కోట్ల డబ్బే దానికి సాక్ష్యం. ఇక

2014 ఎన్నికలు

# లెఫ్ట్ ఎందుకు బలహీన పడుతోంది?

***సిద్ధాంతపరమైన లోపాలు, అనైక్యత వల్ల వామపక్ష పార్టీలు ప్రజల్లో విశ్వాసం కోల్పోతున్నాయనీ, వాటికి ప్రతి ఎన్నికలలోను ఓట్లు, సీట్ల శాతం తగ్గిపోవడంలో వెల్లడవుతోందనీ అంటున్నారు* టంకశాల అశోక్**

సిపిఐ, సిపిఎంలతో కూడిన పార్లమెంటరీ వామపక్షాలు రాష్ట్రంలో ఎందువల్ల క్రమంగా బలహీనపడుతున్నాయి? ఒక ఎన్నిక నుంచి మరొక ఎన్నికకు మధ్య వేర్వేరు ప్రజా సమస్యలపై వారు పరిమితంగానైనా ఆందోళనలు చేయకపోవడం లేదు. వారి సభలు, ప్రదర్శనలు, ఆందోళనలకు తగినంత హాజరీ కూడా ఉంటున్నది. అయినప్పటికీ ఎన్నికల సందర్భంలో చూసినప్పుడు ఓట్లు, సీట్లు పెరగకపోవడమే గాక ఇంకా తగ్గుతున్నాయి. ఇందుకు కారణం ఏమిటి?

ఇందుకు సమాధానంగా మనం సాధారణంగా వినే మాటలు కొన్నున్నాయి. వారు తమ సిద్ధాంతాలను మరచిపోతున్నారనీ, పాటించడం లేదనీ, వారిలో నీతి నిజాయితీలు గతంలో వలెగాక లోపిస్తున్నాయనీ, త్యాగాలు చేసేవారు ఉండడం లేదనీ, ఐక్యత లేదనీ, 'బూర్జువా' పార్టీలను ఆశ్రయించడం ఎక్కువయిందనీ, సిద్ధాంతాలను వర్తమాన పరిస్థితులకు తగినట్లు పునర్నవీకరించుకోలేక పోతున్నారనీ, ఈ దేశ పరిస్థితులకు సరిపోయిన విధంగా అన్వయించడం లేదనీ – ఇంకా ఇటువంటివే చెప్తుంటారు. వీటిలో కనీసం కొన్నయినా నిజమని స్వయంగా ఆ పార్టీల నాయకులు కూడా, బయటకు కాకపోయినా ఇష్టాగోష్ఠి మాటలలో అంగీకరిస్తుంటారు. ఈ మాటల లో ఏదీ కొట్టివేయ దగ్గది కాదు. ఈ వైఫల్యాలు, పరిమితుల నుంచి బయట పడడం, ఎన్నికల పరంగా బలవంతులు కావడం ఎంతమాత్రం తేలిక కాదు. అదే సమయంలో, ఈ సమస్యను మరొక కోణం నుంచి కూడా చూద్దాం.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంటేనే ఒక రాజకీయ పార్టీ తన ఓట్ల పునాదిని (కానిస్టిట్యూయెన్సీ) తయారు చేసుకోవడం. అది ఎటువంటిదైనా కావచ్చు. కులం, మతం, ప్రాంతం వగైరా సామాజిక పునాది, ధనికులు, పేదల వంటి వర్గ పునాది, వీటన్నింటిని ప్రజాస్వామికత ఆధారంగా కలుపుకునే పునాది. ఏదో ఒక సామాజిక వర్గం కోసం, ఆర్థిక వర్గం కోసమే ఏర్పడినప్పటికీ రకరకాల హామీలతోనో, భ్రమలు కల్పించడం ద్వారానో, ఏవోకొన్ని ఇవ్వడం ద్వారానో ఇతరులను వెంటతీసుకుపోయే పద్ధతిలో విశాలమైన పునాది నిర్మాణం – వంటిది ఏదైనా కావచ్చు.

ఇటువంటి నికరమైన పునాది, దానిని స్థిరపరచుకోవడం, పెంచుకోవడం అన్నది పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో తప్పనిసరి. ఆపని ఎంత బాగా చేస్తే బలం అంత పెరుగుతుంది. ఎంత అసమర్థంగా చేస్తే పరిస్థితి అంత బలహీన పడుతుంది. ఇందులోని మంచి చెడుల గురించి ఇక్కడ మాట్లాడడం లేదు. వాస్తవ రూపంలో, ఆచరణలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు క్రీడ ఇది.

ఈ పునాదిని, బలాన్ని, చట్ట సభలలో సీట్లను ఉపయోగించి ఒక పార్టీ ఏమి చేయగలదన్నది మళ్లీ వేరే ప్రశ్న. ఏమి చేస్తానంటుంది, ఏమి చేస్తుంది, ఏమి చేయదు, చేసేపని ఎందుకు చేస్తుంది, చేయని పని ఎందుకు చేయదు, చేయదలచుకోనివి కూడా చేస్తానని చెప్పడం ఎందుకు, అసలు ఏమి చేయడం వారి లక్ష్యం అనే ప్రశ్నలు కూడా ఉన్నాయి. అవన్నీ చర్చనీయమేగాని అందుకిది సందర్భం కాదు. కనుక వాటిని పక్కన ఉంచితే, పునాది ఏర్పాటు కోసం మాత్రం ఒక రాజకీయ పక్షానికి ఇవన్నీ గమనించదగ్గ అంశాలవు తాయని మాత్రం మనం గుర్తించాలి.

సిపిఐ, సిపిఎం పరంగా ఆలోచించినప్పుడు, ఆ పార్టీలకు పునాది నిర్మాణానికి సంబంధించి అంతర్నిహితంగా కొన్ని పరిమితులున్నాయి. ఆచరణలు ఏవిధంగా ఉన్నప్పటికీ ప్రణాళికా పరంగా వారు వర్గాన్ని, వృత్తులను, ప్రజాస్వామిక విలువలను ఆధారం చేసుకుని, ప్రజాస్వామిక శక్తులను కలుపుకొనిగాని పునాదిని నిర్మించుకోలేరు. కులాలు, మతాలు, ప్రాంతాల వంటివి వర్గాలు, వృత్తులు, ప్రజాస్వామిక శక్తులనే చట్రానికి లోబడి ఆ పునాదిలో భాగం కాగలవే తప్ప యథాతథ రూపాలుగా (డినామినేషన్లు) కాదు.

ఉదాహరణకు ఎస్.సిలను తీసుకుంటే, అది సామాజికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా అణచివేతకు గురవుతూ వచ్చిన వర్గం గనుక ఆ ప్రశ్నను

---

ఈ నాటి రాజకీయాలు సంపాదనకు ఒక మార్గంగా అయిపోయాయి. ఈ అక్రమ సంపాదనే ఎన్నికల్లో గెలుపు ఓటములను నిర్ణయిస్తుందని పాలకులు నమ్ముతున్నారనే విషయం పంట పొలాల్లో, చెరువుల్లో దొరుకుతున్న మద్యం సీసాలు రుజువుగా నిలిచాయి. ఎన్నికల సిబ్బంది, పోలీసులు నిర్వహిస్తున్న సోదాల్లో దొరుకుతున్న కోట్ల రూపాయలు దీనికి అద్దం పడుతున్నాయి.

ఎన్నికల సందర్భంగా రాజకీయ నాయకులు ప్రకటించిన ఆస్తుల వివరాలే విస్తుపోయేలా ఉంటున్నాయి. ఇదే దేశంలో ప్రజానీకానికి అన్నం పెడుతున్న రైతాంగం అప్పుల బాధతో దిక్కుతోచక ఆత్మహత్యల చేసుకుంటున్న పరిస్థితి దేశవ్యాప్తంగా నెలకొని ఉంది. ఈ సమస్యలు మన నాయకులకు చెవికెక్కడం లేదు. రాజకీయ పార్టీలు తమ గెలుపు కోసం కులాల పేర, మతాల పేర, విశ్వాసాల పేరుతో ప్రజల్ని విడగొట్టి ఓట్లడగడమంటే పాలకులు 'అభివృద్ధి' చేశామంటున్న దాంట్లో వాస్తవం లేదని వారే ఒప్పుకున్నట్లైంది.

ఒకరి మీద ఒకరు ఇన్ని విమర్శలు చేసుకుంటున్నారు. పాలకులు తెస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు నిరసన తెలియపరుస్తుంటే మాత్రం పాలకులంతా ఒక్కటై ప్రజలను చైతన్యం కాకుండా, ఉద్యమాల వైపు వెళ్లకుండా అణిచివేస్తున్నారు. అనివార్యంగా ప్రభుత్వాల మీద ఆధారపడేలా చేస్తున్నారు. ప్రత్యేక తెలంగాణ కోసం ప్రజలు ఉద్యమాలు చేస్తుంటే ఆయా రాజకీయ పార్టీల నాయకులు ఢిల్లీకి వెళ్లి, రాష్ట్రంలో ఉద్యమాలు జరుగకుండా చూస్తామని ఒప్పందం కుదుర్చుకొని వచ్చి విద్యార్థుల మధ్య చీలికలు తెచ్చి ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించారు. దోపిడీ కోసం ఎన్నికలను ఒక ఆమోదంగా తీసుకొని ఆధిపత్య రాజకీయాలను నడుపుతున్న పాలకులు ఒక్కటైనపుడు దోపిడీ పీడనలకు గురవుతున్న ప్రజలు ఒక్కటి కావలసిన అవసరం ఎంతయినా ఉంది.

*(రచయిత వీక్షణం కరెస్పాండెంట్)* వీ

పరిశీలించడం, ఆ వర్గాన్ని పునాది చేసుకోవడం తప్పదు. అయితే వీరంతా ఇటువంటి వర్గమన్నది థియరెటికల్ అవగాహన అయి, వారిని పునాదిలో భాగం చేసుకోవడం ఆచరణాత్మక క్రియ అవుతుంది. అదే సమయంలో వ్యవహరణ అన్నది వారిని ఇతర పార్టీల వలె కులాలు, ఉప కులాలు, ఓట్లూ సీట్ల బ్యాంకులన్న దృష్టితో చూస్తూ సాగదు.

ఇతర పార్టీలతో పోల్చినప్పుడు ఈ విధమైన దృష్టితో వ్యవహరిస్తూనే ఆపని నిబద్ధతతో, నిజాయితీతో, ప్రజాస్వామిక విలువలతో చేయడం ద్వారా వారిని తమ పునాదిలో భాగం చేసుకోవడం సాధ్యమే. అది జరగడంలేదన్నది వేరే విషయం.

ఎస్.సిల గురించి చెప్పుకున్నది ఒక ఉదాహరణగా మాత్రమే. అయితే, అదే పద్ధతిలో, తమకు పునాదులు కాగల ఇతర సామాజిక వర్గాలు, వృత్తులు, ప్రజాస్వామిక వర్గాలకు సంబంధించి కూడా ఇదే విధమైన వైఫల్యాలుండడం వారి పునాది బలపడకపోవడానికి, క్రమంగా బలహీనపడడానికి ఒక కారణం.

అదే సమయంలో మరొక ముఖ్య కారణం ఉంది. పైన పేర్కొన్నది వారి వశంలో ఉండి జరగని పనికాగా, ఈ రెండవది వారిలో లేనటువంటిది. ఆచరణాత్మకంగా విచారించినప్పుడు వామపక్షాలు బలహీనంగా ఉండడంలో దీనిపాత్ర మొదటిదానికన్న తక్కువది కాదు.

భాతరదేశం వైశాల్యంరీత్యా సువిశాలమైనదేగాక వైవిధ్యత ఎటువంటిదో అందరికీ తెలిసిందే. అటువంటి వైవిధ్యత దృష్ట్యా అందరి సమస్యల పరిష్కారానికి, అందరి అభ్యున్నతికి, అన్ని ప్రాంతాల సమతుల్యమైన అభివృద్ధికి తగు చర్యలు అవసరమన్న భావన స్వాతంత్రోద్యమ కాలంలోనే రూపుదిద్దుకోవడం, రాజ్యాంగాన్ని కూడా అందుకు అనుగుణంగా రూపొందించడం కూడా అందరికీ తెలిసిందే.

కాని తర్వాత కాలంలో పరిపాలనా పరంగా ఇటువంటి 'పరిష్కారాలు, అభ్యున్నతి, సమతుల్య అభివృద్ధి' సాధించడంలో మొదట కాంగ్రెస్ విఫలమైంది. ఆ వైఫల్యాల నుంచి పుట్టుకువచ్చి తాము అదంతా సాధించగలమన్న ఇతర పార్టీలు కూడా విఫలమయ్యాయి. వాటిలో వృత్తి పార్టీలు, కులం పార్టీలు, మతం పార్టీలు, ప్రాంతీయ పార్టీలు, ఇజం పార్టీలు అన్నీ ఉన్నాయి. జాతీయ స్థాయి ప్రత్యామ్నాయాలమని చెప్పుకున్నవీ ఉన్నాయి.

ఇదంతా పరిపాలనా పరంగా తమ విధానాల ద్వారా, అమలు ద్వారా చేయలేకపోయిన పార్టీలకు నిజానికి ఆపని చేయాలన్న ఉద్దేశంగాని, నిజాయితీగాని లేవు. ఆ పార్టీలను నిర్వహించే కోర్ గ్రూపులు, వర్గాలు తమ ప్రయోజనాల కోసమే పాలిస్తూ పోయాయి.

ఈ విధమైన పరిపాలనా వైఫల్యాలను, నిజాయితీలేని తనాన్ని, స్వార్థాలను జనసామాన్యం గ్రహించినా కొద్దీ పాలకులు 'సంక్షేమ రాజ్యం' అన్నదాన్ని కాస్తా 'పాప్యులిస్టు పాలన'గా మార్చుతూ పోయారు. రెండింటికి తేడా తెలిసిందే. సంక్షేమ రాజ్యమన్నది పరిపాలనా పరంగా సాగేది. ఆ మార్గంలో 'పరిష్కారాలను, అభ్యున్నతిని, సమతుల్య అభివృద్ధిని' సాధించేది. పాప్యులిస్టు పాలనకు వ్యవస్థీకృత విధానాలు, ఆచరణతో నిమిత్తం ఉండదు. దీర్ఘకాలికత ఉండదు. నికరత్వం ఉండదు.

అధికారపు అవసరాల కోసం ఎప్పటికప్పుడు మద్దతు వర్గాలు, ఆశ్రిత వర్గాలు మారుతాయి. అందుకు ప్రాతిపదిక టికెట్ల పంపిణీ, డబ్బు పంపిణీ. అంతేతప్ప సిద్ధాంతాలు, విధానాలు కాదు. వాటిని ఒకవేళ పేర్కొన్నా ప్రజలను భ్రమపెట్టేందుకు మాత్రమే. ఈ ధోరణి క్రమంగా పెరిగి ఈ సరికి స్థిరపడిపోయింది.

అదేవిధంగా, ఎప్పటికప్పుడు వర్గాలను, ఆశ్రితులను, కులాలను, మతాల వారిని కలుపుకుని, వారికి టికెట్లు, డబ్బు, పదవులు ఇవ్వజూపి ఆకర్షించడం ఒక పద్ధతిగా సాగినట్లు, ఓటర్లకు కూడా హామీలు, డబ్బువంటివి ఎప్పటికప్పుడు ఇవ్వజూపి ఆకర్షించడం మరొక పద్ధతిగా సాగుతున్నది.

ఈ రెండు పద్ధతులు ఈ సరికి ఒక ధోరణిగా మారి స్థిరపడి పోయాయి. పరిపాలనా పరంగా 'పరిష్కారాలు, అభ్యున్నతి, సమతుల్య అభివృద్ధి' అన్న ఒరిజినల్ దృక్పథం కాస్తా మటుమాయమవుతూ, దాని స్థానంలోకి ఈ కొత్త ధోరణివచ్చి చేరింది. విధానాలు, మేనిఫెస్టోల ప్రకటనలు కేవలం లాంఛన ప్రాయం. ఈ కొత్తగా స్థిరపడిన ధోరణి మాత్రమే నికరమైనది.

ఆ విధంగా, ఒకవైపు మద్దతు వర్గాలకు, రెండవవైపు ఓటర్లకు అవీ ఇవీ ఇవ్వచూపడమన్నది ఒక ఆనవాయితీగా మారింది. కొన్ని దశాబ్దాల క్రితమే నెమ్మదిగా ఆరంభమైన ఈ ధోరణి క్రమంగా పూర్తి స్థాయికి వచ్చింది. విధానాలు, వాటి అమలు ఆధారంగా గెలవడానికి బదులు ఈ విధంగా గెలవజూడడమన్నమాట. దీనితో ఆయావర్గాల వారు, ప్రజలు కూడా అందుకు అలవాటు పడిపోయారు. విధానాలు, వాటి అమలు జరిగేది కాదని అనుభవపూర్వకంగా తెలియవచ్చింది. ఆ విషయమై ఒకప్పుడు ప్రశ్నించేవారు కూడా కాలక్రమంలో తగ్గిపోయారు. ఈ మార్పుల వల్లనే వర్గాలకు, ఓటర్లకు వరాల జాబితాలు పెరిగిపోతున్నాయి. వాటి ఖరీదు పెరుగుతున్నది. ఎన్నికల ఖర్చులు చూసి మనకు కళ్లు తిరుగుతున్నాయి. కోట్లకు కోట్లు ఖర్చుచేయగల వారు తప్ప పోటీకి సాహసించడం లేదు. ఖర్చు చేయగలవారే టికెట్లు అడగాలని పార్టీలు బహిరంగంగానే చేప్పే దశ వచ్చింది.

ఈ విధంగా మన ప్రజాస్వామ్యం కాస్తా పేట్రనేజ్ డెమోక్రసీ (విధానాలు, వాటి అనుసరణలు, ఆ విధంగా పైన పేర్కొన్న తరహాలో సమస్యల పరిష్కారాలు, అభివృద్ధి సాధనకు బదులు ఎప్పటికప్పుడు ఆయా వర్గాలకు, ఓటర్లకు అవీ ఇవీ ఇవ్వచూపటాలు) గా మారిపోయింది. అన్ని పార్టీలు కూడా ఈ పేట్రనేజ్ డెమోక్రసీ వలలో చిక్కుకునిపోయి ఆ విధంగా తప్ప వ్యవహరించలేని పరిస్థితులు వచ్చాయి.

అందుకు భిన్నమైన ఆలోచనలతో ఏ పార్టీ అయినా కొత్తగా ఏర్పడి ముందుకు వచ్చినప్పుడు, దానిని ఆదరించగల ప్రజాస్వామిక వర్గాలు ఒక మేరకు ఉన్నప్పటికీ అవి ఒక మేరకు, కొద్ది కాలం వరకే నిలబడ గలుగుతున్నాయి. పేట్రనేజ్ డెమోక్రసీ వల్ల విషపూరితమైన పరిస్థితులకు తట్టుకోలేక పోతున్నాయి.

వామపక్షాలను దెబ్బతీస్తున్న, బలహీనపరుస్తున్న రెండు ప్రధాన పరిస్థితులలో మొదట చెప్పుకున్నవారి స్వీయ వైఫల్యాలు ఒకటిగా కాగా, ఈ విధంగా పేట్రనేజ్ డెమోక్రసీ దేశంలో అవతరించడం రెండవది. ఈ రెండవ పరిస్థితి బలంగా తయారు కావడం వల్లనే, వారి సభలలో, ఆందోళనలలో పాల్గొన్నవారు కూడా అందరూ ఆ పార్టీలకు ఓటు వెయ్యరు. ఆ ఓటర్లలో ఆకర్షణలకు లొంగేవారు కొందరైతే, అంతకన్న ఎక్కువ మందికి 'ఈ పార్టీలు గెలిచేది లేదు, అధికారానికి వచ్చేది లేదు, కనీసం పనులు చేయించగలిగేది లేదు. అటువంటప్పుడు అవేవో చేసేవారికి ఓటు వేయడం మంచిది కదా' అనిపిస్తున్నది. అందుకు వారిని నిందించలేము. వారి జీవిత సంఘర్షణలు, అవసరాలు అటువంటివి.

ఈ రెండు పరిస్థితులలో ఏది కూడా సమీప భవిష్యత్తులో మారగల సూచనలు కనిపించడం లేదు. వామపక్షాలు తమ వైఫల్యాలను తొలగించుకోగలగడం గాని, ఎన్నికల వ్యవస్థను బందీ చేసిన పేట్రనేజ్ డెమోక్రసీలో ఇతర పార్టీలతో పోటీ పడగలగడం గాని ఎంత సుసాధ్యమో లేక అసాధ్యమో ఎవరైనా ఊహించవచ్చు.

ఇవి వామపక్షాలు అయినందున రెండవ అంశంలో పోటీపడాలని ఎవరూ కోరుకోరు. ఈ స్థితివల్ల వారు ఆమేరకు నిస్సహాయులు కావడం, దెబ్బ తినడం మాట నిజమే అయినప్పటికీ అటువంటి పోటీ అన్నది వారికి అసంబద్ధమవుతుంది. ఇక మిగిలింది మొదటిది. అది జరగగల అవకాశాలెంత? భవిష్యత్తు ఏమిటి? అన్నవి ప్రశ్నలు.

*(రచయిత సీనియర్ జర్నలిస్టు)* వీ

# భారతీయ వోటర్ పశ్చాత్తాపం

***భారతదేశపు సగటు వోటర్ భగవంతుడితో పెట్టుకున్న మొర రూపంలో భారత ప్రజాస్వామిక ఎన్నికల అసలు రంగును వ్యంగ్యంగా బైటపెడుతున్నారు హిందీ కవి బ్రజ్ రంజన్ మణి***

నేను శాపగ్రస్తుడినైన భారతీయ వోటర్‌ను. భగవాన్, నేను నికృష్టమైన స్థితిలో, దారుణమైన నిరాశలో నీ దగ్గరికి వచ్చాను. ఈ దౌర్భాగ్యుడి మీద జాలి చూపు. దయచేసి నా గురించి ఉన్న కట్టుకథలను నమ్మకు. అబద్ధాల దారాలతో అలంకరించిన కథలవి. అన్నిచోట్ల లాగనే భారతదేశంలో కూడ ఏ ఒక్కరూ కనబడినట్టుగా ఉండరు. ఒకరి గురించి ఏమనుకుంటామో అది ఎప్పుడూ నిజం కాదు. భగవాన్, చాల సందర్భాలలో గొప్పగా కనిపించే పాత్రలు వాస్తవంగా దొంగలుగా తేలుతారు. ఈ దేశానికీ, దాని పాపాత్ములైన నిర్వాహకులకూ, నా అనారోగ్యం గురించీ దుఃఖం గురించీ ఏమీ తెలియదు. కాని నీనుంచి దాయగలిగినదేమిటి ప్రభూ? నేను ఒక్కడిని కాదని, ఒక బహుముఖ జీవిననీ నీకు తెలుసు. నేనంటే సాష్టాంగపడిన ఒక మహా సమూహం. పెరుగుదల ఆగిపోయిన కోట్లాది జనం. పనిచెయ్యని అనంత కోటి మనసులు. ముక్కలైపోయిన కోటికోట్ల ఆత్మలు. భగవాన్, మామూలుగా చెప్పుకునే, షరతులు వర్తిస్తాయి అనే సూత్రం ఇక్కడా ఉంది. అవును, నేను బొర్రబాగా పెంచిన, అదృష్టవంతులైన కొద్దిమంది గురించి చెప్పడం లేదు. ఈ గణతంత్ర రాజ్యంలో తమ ఇష్టం వచ్చిన చోటు ఆక్రమించుకుని కూచున్నవారి గురించి చెప్పడం లేదు. ఓహ్ భగవాన్, నీకు ఇప్పటికే అంతా తెలుసు, కాని నా గురించి నాకు తెలుసునా? నా మెదడు నిండా నింపిన విధేయత, బానిసత్వ భావాల సుదీర్ఘ నిద్ర నుంచి ఇప్పుడిప్పుడే మేల్కొంటున్నాను. దేవుడు కూడ వదిలేసిన ఈ దేశాన్ని, దీని ప్రజాస్వామ్యాన్నీ దురాక్రమించిన ఖలనాయకులు నా కళ్లకు గంతలు కట్టి నన్ను బానిసను చేసుకున్నారు. లేదు ప్రభూ లేదు, నేను వంగిపోయి లేను. కాని నా వెన్నెముక విరిగిపోయింది. అందుకే ఇలా పిచ్చిగా కనబడుతున్నాను.

నువ్వు ఉత్తముడివీ, దయామయుడివీ కనుక నీ దగ్గరికి వచ్చాను. నువు నిజమైన వాడివీ, సత్యమైన వాడివీ అనీ, నువ్వు ఖలనాయకుల పక్షానా, నేరస్తుల పక్షానా ఉండవనీ నీ దగ్గరికి వచ్చాను. అవును ప్రభూ, నువ్వు ఈ దేశంలో డబ్బుతో, భూమితో, విద్యతో నేరసామ్రాజ్యాలు నడుపుతున్నవారిని సమర్థించవు గదా. క్షమించాలి. నేను బలహీనంగా ఉన్నాను, ముక్కలై ఉన్నాను. అర్థం పర్థం లేకుండా, పరస్పర భిన్నమైన గొంతులతో మాట్లాడుతూ ఉండవచ్చు. కాని భగవాన్, నా ఆర్తనాదాలు విను. నా మీద దయచూపు. నీ విధేయుడైన నా పట్ల గుండె రాయి చేసుకోకు. నాకు మిగిలి ఉన్న స్నేహపూర్వక శ్రవణేంద్రియం నీ ఒక్కడిదే. మానవత్వానికీ ప్రజాస్వామ్యానికీ శత్రువులైన వారందరి దుర్మార్గాన్నీ పటాపంచలు చేసి నీ మహత్తర కీర్తిని రక్షించుకో ప్రభూ.

నన్ను నేను మెరుగ్గా తెలుసుకోవాలని నువ్వు దీవించావు. ఆ దీవన కూడ 'సంపూర్ణంగా కాదు, కాని బలవత్తరంగా'. (భగవాన్, ఈ మాట నాది కాదు. తన పేరుకు ముందు పండిట్ అని తగిలించుకున్న మా గొప్ప వదరుబోతు, మొట్టమొదటి ఎన్నికైన రాకుమారుడు 1947 ఆగస్ట్ 14 అర్ధరాత్రి అన్న దారుణమైన మాట అది). భగవాన్ నీకన్నీ తెలుసు. అయినా నన్ను నా గోడు సాదాసీదా మాటల్లో వెలిబుచ్చుకోనీ. నేనేమైనా తప్పుడు పదాలు వాడితే, అప్పుడప్పుడు బూతులు మాట్లాడితే, ఊరికే అర్థం లేని మాటలు అంటే నన్ను క్షమించు. ఎన్నో సంవత్సరాల ఆకలి వల్ల, నిద్ర వల్ల, సోమరితనం వల్ల నేనింకా చికాకుగా, గందరగోళంగా ఉన్నాను. నీకన్నీ తెలుసు గాని, భగవాన్ నన్ను వెంటాడే చీకట్ల గురించీ, శూన్యాల గురించీ నీకు చెప్పుకోనీ. నన్ను బాధించేవారి కళ్లలో అధికార లాలస, అత్యాశ, దుర్మార్గం తళతళలాడడం నీ దయవల్ల నాకు కనబడుతున్నది. భారత దేశపు కథ అనే చిక్కుముడికి అనేక రూపాలు నన్ను చుట్టుముట్టి ఉన్నాయి. ఆ చిక్కుముడి వాస్తవం నీ ఒక్కడికే తెలుసు. ఇప్పుడు నా కళ్లు కూడ తెరుచుకున్నాయి. సంపూర్ణంగా కాదు, కాని బలవత్తరంగా. కృతజ్ఞతలు భగవాన్.

మొట్టమొదట నా గురించి జరుగుతున్న తప్పుడు ప్రచారాలను ఖండించనీ. ఇప్పటిదాకా నన్ను ఇతరుల చేతుల్లో మైనపు ముద్దలా, గాలిలో కొట్టుకుపోయే గడ్డిపోచలా చూశారు. మరోవైపు తెలివైనవాడిననీ, సర్వజ్ఞుడిననీ, అంతిమ పాలకుడిననీ వగైరా వగైరా ఎన్నో మాటలన్నారు. నిన్ను కీర్తించడానికి మాత్రమే ఉపయోగించవలసిన మహత్తరమైన మాటలన్నిటినీ ఈ నిస్సహాయ వోటర్‌కు, నాకు ఆపాదించారు. బుల్లితెర మీదా, అచ్చు పత్రికలలోనూ ఎప్పుడూ వదరుతూ ఉండే వర్గపు చెత్త అంతా, ఆ రెండు నాలుకల వెధవల, అధికార తాబేదార్ల అబద్ధాలన్నీ, అర్ధ సత్యాలన్నీ దేశాన్ని, ప్రత్యేకించి నన్ను, పక్కదారి పట్టించాయి. వారి బతుకులు చెడ. భగవాన్, ప్రపంచంలోకెల్లా తెలివిమాలిన వాడినైన నన్ను భూమండలం మీద అందరికంటె తెలివైనవాడిగా చూపించడంలోని కుట్రను నేను ఇప్పుడు నీదయవల్ల చూడగలిగాను. సంపూర్ణంగా కాకపోయినా, బలవత్తరంగా. కృతజ్ఞతలు, భగవాన్.

ఆ కుటిల పండిట్‌కు నేను పదే పదే వోటేశాను. (కొన్ని సార్లు ఖాళీ కడుపుతో, చింపుల బట్టలతో, కాళ్లతో కూడ వేశాననుకో). ఆయనకు నా పిల్లలను చదివించడం అంటే లెక్కలేదు గాని, తన పిల్లలను మాత్రం ముద్దుమురిపాలతో చూసుకున్నాడు. అవును ప్రభూ, మాటలు వేరు, చేతలు వేరు. ఆ తర్వాత నేను అహంకారం నిండిన ఆయన కూతురికి వోటేశాను. ఆమె గరీబీ హఠావో నినాదంతో నామీద కనికట్టు ప్రయోగించింది. ఆ తర్వాత నన్ను 21 శతాబ్దపు ఆధునికతలోకి తీసుకుపోతానని మైమరపించిన శూరుడైన ఆమె కొడుక్కు వోటేశాను. ఇక ఇప్పుడు, ఈ మూడో సహస్రాబ్ది రెండో దశాబ్దంలో ఆ కొడుకు కొడుకు నన్నూ భారతదేశాన్నీ నడుపుతున్నాడు. ప్రపంచంలోని

పేదలందరిలోనూ అత్యధికులు గుమిగూడిన ఈ దేశాన్ని. భగవాన్, విదేశీ బుద్ధిహీనులూ, భారతీయ దగాకోరులూ, సల్మాన్ రుష్దీ వంటి కొంటె రచయితలూ భారతదేశం ఒక నిగూఢదేశమనీ, అలాగే నిగూఢంగా ఉండిపోతుందనీ నిన్ను గందరగోళపరుస్తారేమో, నన్నొక మాట చెప్పనీ, భారతదేశంలోని ఎనభై కోట్ల పేదలలో అత్యధికులు నిరక్షరాస్యులు, లేదా అరకొర చదువుకున్నవారు. ఈ దేశపు 120 కోట్ల జనాభాలో 70 శాతానికి అక్షరాలే రావు, లేదా ప్రాథమిక పాఠశాల దాటి చదువుకోలేదు). ప్రధాన మంత్రి కాకుండానే ప్రధాన మంత్రి అయిన దయాహృదయపు తెలివితక్కువ మహారాణితో వంశపరిపాలన సజావుగా సాగుతున్నది. నాలో ఒక భాగానికి ఇంకా ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది – ఈ వంశపారంపర్య పాలనే లేకపోతే ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్యం అసలెట్లా కొనసాగేది అని! భగవాన్, నా జబ్బు నయం చెయ్యి. ఈ రోగగ్రస్త ప్రజాస్వామ్యాన్ని దీవించు.

ఇక ఆ తర్వాత, ప్రభూ, చేతుల్లో త్రిశూలాలు పట్టుకుని, ఖాకీ చెడ్డీలు తొడుక్కున్న కోతుల కుప్పిగంతులను మార్పు అని నాచేత నమ్మించారు. పెద్ద బొజ్జ మీద కాషాయరంగు ముసుగు వేసుకున్న హంతక ఉద్దేశాల హిందీ కవికి వోటు వేయమని వాళ్లు నన్ను పురికొల్పారు. నాగపూర్‌లోని ధోతులు కట్టుకునే ఆది మానవుల తప్పుడు పార్టీలో తప్పుడు మనిషి ఆయన. భారతీయులందరూ ఒక గీతం పాడాలని ఆయనన్నాడు. ఆ గీతం భావం మీకు తెలుసు ప్రభూ! 'భారతదేశం అందమైన దేశం కాని దానికి హిందూయేతర వ్యాధి సోకింది. హిందూయేతరులందరినీ హిందువులుగా మార్చండి. హిందువులందరినీ సైనికులుగా మార్చండి. అన్నిటికన్న ముఖ్యంగా మనకు సేవలు చేయడానికి అర్ధ హిందువులను (అంటే దళిత–ఆదివాసి, వెనుకబడిన కులాల వారిని) హనుమంతులుగా మార్చండి. హిందూ యేతరులలో భయోత్పాతం నింపండి, వగైరా వగైరా' – అదీ ఆ గీతం. ఆయన బంట్లు అమాయక ప్రజలను ఊచకోత కోస్తున్నప్పుడు ఈ కవిత్వం రాసే ప్రధానమంత్రి మతాంతరీకరణ మీద 'జాతీయ చర్చ' జరగాలని అన్నాడు. అంటే అర్థం ఈ హిందూ రాష్ట్రంలో బతికి ఉండాలంటే భారతీయులందరూ ఈ కులపు మతాన్ని అంగీకరించాలన్న మాట. దీనికి మద్దతుగా ఆయన ఆస్థాన చరిత్రకారులు పాఠశాల విద్యార్థుల పాఠ్యపుస్తకాలను తిరగరాశారు. కులసంస్కృతికి ఎంతటి విశ్వ మహత్యం ఉన్నదో చూపారు. వాణ్ని తగలెయ్య! భగవాన్, మళ్లీ ఒకసారి ఆయన శిష్యులు ఈ దేశాన్ని ఎత్తుకుపోతామనీ అత్యాచారం చేస్తామనీ బెదిరిస్తున్నారు. ఆ కవి ముసుగు ముఖాన్ని నమ్మినందుకు క్షమించు భగవాన్.

అలాగే నేను ఆ రాజవంశపు, కమలపు ముఖపు గ్వాలియర్ రాజమాతకూ, ఆమె లౌకిక కొడుకుకూ, మతవాద కూతురికీ, లౌకిక మనవడికీ కూడ వోటు వేశాను. క్షమించు ప్రభూ.

ఒకసారో రెండుసార్లో నేను మార్క్సిస్టు మాయగాళ్లకు కూడ వోటేశాను. సోషలిస్టు స్వప్నాన్ని ధ్వంసం చేయడమే వాళ్ల ఏకైక లక్ష్యం. వర్గం పేరు మీద కులం అనే వాస్తవికతను నిరాకరించడమే వాళ్ల పని. వాళ్లు మార్క్సును సంస్కృత మూలంలో చదువుకుని 'వర్గం వాస్తవమైతే కులం వాస్తవమెలా అవుతుంది' అని వాదించారు. ఫూలే, అంబేద్కర్‌లు సంస్కృతంలో రాయలేదు గనుక ఈ మార్క్సిస్టులు వాళ్లను చదవలేదు. ఇటువంటి కుహనా పండితుల నుంచి నన్ను రక్షించు భగవాన్! భద్రలోక్ వంచకులు విప్లవం తెస్తారని నమ్మిన నా తెలివిమాలినతనానికి నన్ను క్షమించు.

నేను ఆ కళ్లు మిటకరించే మైథిలీకి కూడ వోటు వేసి ముఖ్యమంత్రిని చేశాను. ఆయన పట్నాలో గాంధీ మైదానాన్ని అమ్మేశాడు (లేదా కనీసం అమ్మడానికి ప్రయత్నించాడు). ఆ నిరుత్సాహంలో నేను బీహార్ విదూషకుడిని ఎన్నుకున్నాను. ఆయన తన స్కూటర్ మీద బర్రెల మందను ఎక్కించుకు పోదామనుకున్నాడు. వినోదం కోసం అల్లల్లాడి పోతున్న జనాన్ని ఈ దృశ్యంతో మైమరిపింపజేసిన ఆ పెద్దమనిషి కోట్ల రూపాయలు వెనకేసుకున్నాడు. కొత్త గణతంత్ర రాజ్యంలో తన సొంత వంశపాలనను స్థాపించడంలో కూడ విజయం సాధించాడు. చివరికి ఆ బఫూన్ కూడ నన్ను మోసం చేయగలిగాడు. భగవాన్, నిజంగా నన్ను చూసి నాకే సిగ్గు వేస్తున్నది!

అలాగే నేను ఆ ఉత్తరప్రదేశ్ పందికొక్కుకు కూడ వోటేశాను (అవును, ఆ అక్షరం ముక్కరాని వస్తాదు ప్రొఫెసర్ కూడ అయి, ఎనిమిదేళ్ల కన్న తక్కువ వయసువాళ్లను మాత్రమే చేర్చుకునే విశ్వవిద్యాలయంలో పాఠాలు చెప్పాడు). ఆ తర్వాత ఆయన మురికి కొడుకునూ, మొత్తం మీసాల వంశాన్నీ ఎన్నుకున్నాను. మొత్తం వంశం పీకలదాకా తిన్నారు. త్రేవులు తీశారు. తమ బంధుజాలాన్ని చూడడానికి జంతు ప్రదర్శనశాలకు వెళ్లారు. సరిగ్గా ఆ సమయానికే శరణార్థి శిబిరాల్లో ఎంతో మంది చిన్నారి పిల్లలు ఆకలితో చచ్చిపోతున్నారని వార్తలు వస్తున్నాయి. (ఒక మత సమూహంపై పథకం ప్రకారం అత్యాచారాలు, ఊచకోతలు జరిపిన తర్వాత పెట్టిన శిబిరాలు అవి). ఈ గూండాలను మట్టి కరిపించలేని నా అశక్తతకు క్షమించు భగవాన్, వారిని బోనెక్కించు.

ఈ మధ్యలో నేను కాస్త సమయం చూసుకుని ఆ పేదల పక్షాన ఉన్నానన్న వీరయోధురాలికి కూడ వోటేశాను. ఆమె కరెన్సీ నోట్ల కట్టల దండలతో తన పుట్టినరోజు ఉత్సవాలు చేసుకుంటుంది. ఈ సామాజిక న్యాయ మహానేతకు అవినీతి వర్తనమే శిరోధార్య లక్షణం. ఆమె ఏమి చేయుచున్నదో ఆమెకు తెలియదు ప్రభూ, ఆమెను క్షమించు. ఒకసారో రెండుసార్లో ఆమె పక్కన నిలబడినందుకు నన్ను కూడ మన్నించు.

మా ప్రజాస్వామ్యం విస్తరిస్తూ ఉన్నదని టెలివిజన్ తెరలమీద వదరుబోతులు చెపుతూ ఉంటారు. అలా ప్రజాస్వామ్యం పెరిగినకొద్దీ నేను రాక్షస ఉన్మాద చర్యగా గుజరాత్‌లో మొరిగే కుక్కకు వోటు వేసి అధికారం అప్పగించాను. అది మొరిగే కుక్క మాత్రమే కాదు, దాని కాటు కూడ మొరుగంత విషప్రాయమైనదే. క్షమించాలి నేను ఆ కుక్క పేరు పలకలేను. ఈ దేశపు చట్టాలు ఆ పేరు పలకడాన్ని నిషేధిస్తాయి. కాని నీ నుంచి దాచేదేముంటుంది ప్రభూ? ఆ కుక్క నాగపూర్‌లో ధోతులు కట్టుకున్న ఆదిమ మానవుల పూర్వీకులు నడిపే మత విద్వేష పాఠశాలలో భయంకరంగా మొరగడంలో, కరవడంలో శిక్షణ పొందింది. వేరే మతాలకు చెందిన వారైనందువల్ల వేలాది మంది స్త్రీల, పురుషుల, చిన్నారి పిల్లల లేత శరీరాలలోకి తన కోరలను దించిందా కుక్క. భారత ప్రజానీకం అనే నేను ఆ కుక్క మతానికే చెందిన వాళ్లమైనందువల్ల ఆ కుక్కను మూడుసార్లు ఎన్నుకున్నాం. అవతలివాళ్లను చిత్తుగా ఓడగొట్టే ఆధిక్యత ఇచ్చాం. అక్కడ సూత్రం ఒకే ఒక్కటి – నా శునకం నీ దైవం కన్న మేలు! భగవాన్, నన్ను అసలు విషయం చెప్పుకోనీ, ఆ శునకమే భారతదేశానికీ ప్రపంచానికీ దైవం అయితే ఎంత బాగుండునని ఈ చీకటి నిండిన శూన్యపు క్షణాలలో నేను కలలు కంటున్నాను. అటువంటి

దుర్మార్గమైన ఆలోచన చేసినందుకు నన్ను శిక్షించు ప్రభూ. ఆ కుక్క మొరగకుండా, కరవకుండా దాని మూతికి పట్టీ వెయ్యి.

నేను కొన్నిసార్లు ఆ తమిళనాడు ధృతరాష్ట్రుడికి కూడ వోటు వేశాను. ఆయన తన సొంత చిల్లర రాజవంశాన్ని స్థాపించడం కోసం ద్రవిడ రాజకీయాలను ధ్వంసం చేశాడు. మరికొన్నిసార్లు దిక్కు తోచక, మరొక ప్రత్యామ్నాయం లేక నేను ప్రతీకారవాంఛతో రగిలిపోయే అమ్మకు కూడ వోటు వేశాను. (ఔనౌను. ఆమె వంద సంవత్సరాలలో ఒక్క పూట కూడ భోజనం చేయడం మానని ఆ అమ్మే). క్షమించు భగవాన్!

ఇలా చెపుతూ చెపుతూ పోగలను గాని నేను చేసిన ఆ భయంకరమైన ఎంపికల వివరాలు చెప్పడం ఏం ప్రయోజనం? కాని, భగవంతుడా, అవన్నీ జరిగిపోవడానికి నువ్వెట్లా అనుమతించావు? దుర్మార్గమైన పన్నాగాలతో నిండిన వాళ్ల ఆకర్షణీయ నినాదాలకు నేను పడిపోతుంటే, ఆ దుర్మార్గులు అలా సాగిపోవడానికి నువ్వెట్లా అనుమతించావు? అవును, భగవాన్, నేను చాల పాపాలు చేశాను, అందుకు నన్ను శిక్షించు, కాని ఒక్క విషయం గుర్తుపెట్టుకో, నా మెదళ్లలో వాళ్లు నింపిన విషఉద్బోధనలు ఇంకా ముగిసిపోలేదు. దాని గురించి ఏమన్నా చెయ్యి భగవాన్!

భగవంతుడా, నేను మంచి జీవితం గడపాలనుకుంటున్నాను. కష్టపడి పనిచేసి నా చిన్నారి పిల్లలకు చదువు చెప్పించాలనుకుంటున్నాను. వాళ్లు నాలాగా మరెవరో మెదళ్లలో నింపిన చెత్తను ఎక్కించుకుని, నాలాగ బానిస కాకుండా ఉండాలనుకుంటున్నాను. నేనూ, నా పిల్లలూ మరెవరి మీదా బరువు కాదలచుకోలేదు. మమ్మల్ని దోపిడీ చేసిన, వేదనకు గురిచేసిన ఘనచరిత్ర ఉన్న ఆ వెధవలు మా బాధ్యత వహించడం నాకు ఇష్టం లేదు. కాని నా పిల్లలూ నేనూ ఇంకా చీకట్లో వెతుకులాడుతున్నాం. భగవాన్, వ్యాపార ప్రకటనలతో, రాజకీయ ఎత్తుగడలతో, ప్రచారంతో మా కళ్లు బైర్లు గమ్ముతున్నాయి. రోజుకు ఇరవై నాలుగు గంటలూ అన్నిచోట్లా అవి మమ్మల్ని ముంచెత్తుతున్నాయి. ప్రభూ, కనీసం గతంలో మేం వ్యాపార ప్రచారాన్నీ రాజకీయ ప్రచారాన్నీ వేరుచేసి చూడగలిగే వాళ్లం. కాని ఇప్పుడు రెండూ ఒకటే అయిపోయాయి, తేడా ఏమీ లేదు. ఈ నాయకుడికి వోటు వేసినా ఆ నాయకుడికి వోటు వేసినా ఈ పార్టీకి వేసినా ఆ పార్టీకి వేసినా ఒకటే. వాళ్లందరినీ కూడ కార్పొరేట్ సంస్థలు సులభంగా కొనేస్తాయి. కార్పొరేట్ సంస్థలే ఎన్నికలకూ, నాయకులకూ పెట్టుబడి పెట్టి మొత్తం వ్యవస్థనే కలుషితం చేస్తాయి. అణగారిన కులాల నుంచి తలెత్తుతున్న రాజకీయ నాయకులు కూడ కేవలం తమ బొజ్జలు నింపుకుంటున్నారు. డబ్బున్నవారి కోసం తేనుస్తున్నారు. బడా ధనవంతులే అన్ని టెలివిజన్ ఛానళ్ల, వార్తాపత్రికల యజమానులు. ఇదంతా నీకు తెలుసు, భగవాన్. ఈ ధూర్తులే ఇవాళ ప్రపంచాన్ని పాలిస్తున్నారు. నీ ఆదేశాలను వెటకరిస్తున్నారు. కాని వాళ్లే మళ్లీ ఆలయాలకూ, మసీదులకూ, చర్చిలకూ భూరి విరాళాలు ఇస్తున్నారు. అయ్యో దేవుడా, వాళ్ల దుర్మార్గ రాజకీయాలు నీకు తెలుస్తున్నాయా!

నాకేమో చదువు కావాలి, విముక్తి కావాలి. కాని పాలించే లుచ్చాలేమో నాకు నిద్రమాత్రలిస్తున్నారు. ఇక వ్యాపార ప్రకటనల్లో, అన్ని ప్రచార సాధనాల్లో ముక్కున పెట్టుకున్న పుస్తకాల వాక్యాలే తప్ప వాస్తవంతో సంబంధం లేదు. ఈ వ్యాపార ప్రకటనల నిరంతర ప్రవాహంతో నా మెదడు మొద్దుబారిపోయింది. పాత పుస్తకాలలో శాఖాచంక్రమణం చేసే అధిభౌతిక జ్ఞానం లాగ. దీని ఏకైక లక్ష్యం నన్ను చూడకుండా, ఆలోచించకుండా చేయడమే. దగాకోర్లూ మాటకారులూ నాకు వ్యాపార ప్రకటనలు అమ్మి నా మెదడుతో ఆటలాడుకుంటున్నారు. సర్వమానవ ప్రేమ, న్యాయం లాంటి నీ మాటలను ఊరికే వల్లిస్తూ అసహ్యకరమైన రాజకీయాలనూ వ్యాపారాలనూ నడుపుతున్న దొంగనాయకులను నేను వీరులుగా అభిమానిస్తున్నాను. వారు సకల సౌఖ్యాలలో ఓలలాడుతుంటారు, నాకేమో కనీస అవసరాలు తీరవు. నన్ను నిరక్షరకుక్షిగా, అనారోగ్యపీడితుడిగా ఉంచడానికి వాళ్లు వందల కోట్ల రూపాయలు ఖర్చు పెడుతుంటారు. నాలోని నీచమైన, క్షుద్రమైన సహజాతాలను రెచ్చగొట్టడానికీ, పెంచి పోషించడానికీ వాళ్లు నా చుట్టూ ఎల్లవేళలా మిడిమిడి జ్ఞానపు విదూషకులతో, బూతు తారలతో, క్రికెటర్లతో ఆటలు ఆడిస్తుంటారు. ఈ ఆటలు ఆడేవాళ్లు మానవజాతి పొందిన గొప్ప కానుకలని నమ్మబలుకుతుంటారు. వాళ్లు హంతకులను, విధ్వంసకులను, అత్యాచారం చేసేవారిని కాపాడుతుంటారు. ఈ నేరాలన్నీ సాగిస్తూ నన్ను పాలిస్తున్న దుర్మార్గులు నన్ను, మొత్తం ప్రజాసమూహాన్ని ఆ విషయాల పట్ల అజ్ఞానంలో ఉంచుతారు. నా తరఫున ఆలోచించడానికీ, చూడడానికీ, మాట్లాడడానికీ, పనిచేయడానికీ తామున్నామని చిన్న పెద్దా ధూర్తులందరూ ముందుకొస్తుంటారు.

నువ్వు ఆలోచించనక్కరలేదు, ఫలానా నటుడు నీ కోసం ఆలోచించి పెడతాడు! నువ్వు చూడనక్కరలేదు, ఫలానా వేశ్య నీ కోసం చూసి పెడుతుంది! నువ్వు మాట్లాడనక్కరలేదు, ఫలానా టివి యాంకర్ నీకోసం మాట్లాడి పెడతాడు! నువ్వు పనిచేయనక్కరలేదు, ఫలానా కార్పొరేట్ ఉద్యోగి నీ కోసం పని చేసిపెడతాడు!

ఈ పోటీ పడే జనకర్షక రాజకీయాలలో ఆ గుజరాత్ పిచ్చికుక్క 2002లో తాను చంపిన, తిన్న మనుషుల బంధుమిత్రుల కోసం ఏడ్చి పెడతానని కూడ ముందుకొస్తున్నాడు. మురికివాడల గుడిసెలన్నిటినీ మెరిసిపోయే స్వర్గాలుగా చేస్తానని వాగ్దానం చేస్తున్నాడు. 'అబ్బ, అది ఎంత విప్లవకర వాగ్దానం' అని ప్రచార సాధనాలు ప్రశంసలు కురిపిస్తున్నాయి. కాని స్వోత్కర్షలో ఓలలాడే ఆ కుక్కకు సంతృప్తి కలగలేదు. 'నాది కేవలం వాగ్దానం కాదు, నిజమైన నిర్దిష్ట చర్య. గ్లాసు సగం ఖాళీగా ఉందని మీరంటారు. ఆ గ్లాసు నాదగ్గరికి తేండి, నా కన్నీళ్లతో నేను దాన్ని నింపుతాను. ఖాళీ గ్లాసు ఎట్లా నిండుతుందో నేను మీకు చూపుతాను. నన్ను మీకు దగ్గరిలో దీపస్తంభానికి ఉరివేసి చంపినా సరే, భారతదేశాన్ని అభివృద్ధి చేసి చూపుతాను...' అని మొరుగుతున్నాడు. భారత వ్యాపార వర్గమంతా కరతాళ ధ్వనులు చేస్తున్నది. భారతదేశం అభివృద్ధి చెందాలంటే ఈ మహాశునకంకన్న, ఈ మహాశునకపు బలవత్తర దూరదృష్టి కన్న మరొక ప్రత్యామ్నాయం లేదని ప్రకటిస్తున్నది. ఖాకీ చెడ్డీలు తొడుక్కున్న కోతులు బృందగానంలో జతకలుస్తున్నాయి. తమ కీచుగొంతులతో 'ఓ కుక్కా, మా కుక్కా, ఆడకుక్కను దరిజేరనివ్వని కుక్కా, ప్రేమ పాట ఎన్నడూ పాడని కుక్కా, ఎప్పుడైనా భారత్ మాతాకి జై అని మొరిగే కుక్కా, భారత్‌కు పూర్వ వైభవం రావాలంటే వీరోచిత నాయకుడి పాత్రను పోషించేది మా కుక్కే.. భారతదేశం ఎప్పుడూ అద్భుతాల, మహత్యాల పవిత్ర భూమి, ఏమైనా జరగవచ్చునిక్కడ, భగవంతునిలో విశ్వాసం ఉంచండి, మాలో విశ్వాసం ఉంచండి' అని పాడుతున్నాయి.

భగవాన్, చూడు వాళ్లు నీ పవిత్ర నామానికి కూడ మురికి అంటించారు! వాళ్ల మురికి రాజకీయాలు నీకు తెలుసు. రాజకీయ

హంతకులకూ, వ్యాపార నేరసామ్రాజ్యానికీ నువు మద్దతు పలకవని నాకు తెలుసు. ప్రభూ వాళ్ల రాజకీయాలను తుత్తునియలు చెయ్యి. వాళ్ల దుర్మార్గ వ్యాపారాన్నీ, రక్తపిపాస వినోదాన్నీ ధ్వంసం చెయ్యి.

వాళ్ల మనసులు కుళ్లిపోయాయి. వారి ఏకైక లక్ష్యం అమాయకులైన ప్రజాసమూహాన్ని మోసం చేయడమూ, దోపిడీ చేయడమూ మాత్రమే. వాళ్ల తప్పుడు తర్కానికి ఒక ఉదాహరణ చూడు ప్రభూ:

*'తమను తాము లౌకికవాదులమని చెప్పుకునేవారేమీ బుద్ధిపూసలు కారు. అప్పుడప్పుడు వారు కూడ ఘర్షణలు రెచ్చగొట్టి ఎన్నికల పంటలు కోసుకున్నారు. కనుక లౌకికవాదం అనేదే అనుమానించ వలసినది. మత ప్రాతిపదిక మీద ఘర్షణలు జరపడాన్ని ఒక రాజకీయ సూత్రంగా చూసేవారే సరైనవారు, అత్యుత్తమ లౌకికవాదులుగా గౌరవించ వలసినవారు. అందువల్ల తేలే నిర్ధారణ ఏమంటే: పూర్తి మతతత్వవాదుల చేతుల్లో భారతదేశాన్ని పెట్టడంలో ప్రమాదమేమీ లేదు. ఏది ఏమైనా మీకు కావలసి వస్తే మళ్లీ ఎప్పుడైనా కుహనా లౌకికవాదుల దగ్గరికీ పోవచ్చు. కాకపోతే ఈ ఇద్దరూ కాక మరొక ప్రత్యామ్నాయం గురించి మాత్రం ఆలోచించకండి.*

*కులం అంటే నరజాతి కాదు. భారతదేశంలో కులం ఒక సమస్యే కాదు. గతంలో కూడ అది ఎప్పుడూ సమస్యగా లేదు. కులం అనేది సామరస్యపూర్వకమైన శ్రమ విభజన అని మేం ఇతిహాసాలు, పురాణాలు, వాటి ఆధునిక పాఠాంతరాలు ఎన్నో రాశాం. జాతిపిత మహాత్ముడు కూడ ఇదే విషయం నొక్కిచెప్పారు. అంతేకాదు కులం అనేది భారతదేశపు బహుసంస్కృతుల తత్వానికి ఒక ఉజ్వలమైన ఉదాహరణ అని కూడ రాశాం. మన మహా పరిశోధకులెందరో తమ కొత్త కొత్త పరిశోధనల్లో ఈ విషయం రుజువు చేస్తున్నారు. అలాగే రాజకీయ నాయకత్వంలో అగ్రకులాల వాళ్లు ఎంత కుళ్లిపోయారో, దళిత, వెనుకబడిన కులాల వాళ్లు కూడ అంతగానే కుళ్లిపోయారనే వాస్తవమే కులం అసలు సమస్యే కాదని రుజువు చేస్తున్నది. అందువల్ల తేలే నిర్ధారణ ఏమంటే: కులాన్ని సమర్థించడంలో గాని, కుల సమస్యను తేలికగా విస్మరించడంలో గాని గాంధీ, నెహ్రూ, తదితర అగ్రకుల నాయకులు చాల ముందుచూపు ప్రదర్శించారు. కులానికీ, సామాజిక ప్రజాస్వామ్యానికీ చుక్కెదురు అని భావించిన పూలే, అంబేడ్కర్, తదితర దళిత-బహుజన నాయకులు దేశ వ్యతిరేకులు కాకపోవచ్చు గాని పొరపాటు పడ్డారు. కులం గురించీ, దాని పర్యవసానాల గురించీ పట్టించుకోవలసిన అవసరమే లేదు. చేయవలసిన ఒకేఒక్క పని దళితులకు, ఆదివాసులకు, వెనుకబడిన కులాలకు ప్రస్తుతం ఉన్న రిజర్వేషన్ విధానాన్ని రద్దు చేయడమే.*

*ప్రజల దారిద్ర్యాన్ని నిర్మూలించడానికి ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమాలేవీ విజయం సాధించలేదు. కనుక అసలు దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమాలే పొరపాటు. వృద్ధి మీద శ్రద్ధపెట్టండి. సహజ వనరుల నుంచి విద్య దాకా అన్నిటినీ ప్రైవేటీకరించండి. దీనినుంచి తేలే నిర్ధారణ ఏమంటే: ప్రభుత్వరంగం నిండా అక్రమాలు, అవినీతి ఉన్నాయి. ప్రైవేటు రంగమంటే సుగుణాల కుప్ప. మనలో కొంతమంది శతకోటీశ్వరులు అయితేనే ఆ వృద్ధి వీధుల్లో ఉన్న చిట్టచివరి మనిషి దాకా బొట్లుబొట్లుగా జారిపడుతుంది.'*

మాటలు మార్చి వాళ్లు మంచిని చెడు చేస్తారట, చెడును మంచి చేస్తారట. నన్ను మళ్లీ మళ్లీ మాయచేసి, మోసగిస్తారట. భగవంతుడా, నన్ను ముంచెత్తే వాళ్ల ఉపన్యాసాల్లో, మాటల్లో, ప్రకటనల్లో నిజాయితీ లేదు. ఈ వాణిజ్య, వ్యాపార ప్రకటనల, తమాషాల అబద్ధాలను నమ్మనివాళ్లను, మనస్సాక్షిని బట్టి నడుచుకునేవాళ్లను, వ్యవస్థాగత దుర్మార్గాలను ఎదిరించేవాళ్లను పాలకులు బెదిరిస్తున్నారు. ప్రజాస్వామ్యాన్ని అవమానిస్తున్నారనే పేరుతో, భారత దేశపు సమగ్రతను, సార్వభౌమత్వాన్ని సవాలు చేస్తున్నారనే పేరుతో శిక్షిస్తున్నారు.

అసహ్యకరమైన అధికారులు, నల్ల కోట్లు వేసుకునే రెండుముఖాల మనుషులు (వారిలో చాల మంది తమ దగ్గర పనిచేసే మహిళా ఉద్యోగులను లైంగికంగా వేధించేవారే) ప్రపంచంలోని పెద్ద ప్రజాస్వామ్యంలో విశిష్టమైన స్వాతంత్ర్యం, సమన్యాయం అమలవుతున్నాయనే పుక్కిటి పురాణాన్ని వ్యాపింపజేస్తూ తమ లుచ్ఛా రాజకీయ నాయకులకు సహాయ పడుతుంటారు. భగవాన్, వాళ్లు ప్రజాస్వామ్యం అనే మాట వల్లిస్తుంటారు గాని లంచగొండితనంలో, ఆశ్రిత పక్షపాతంలో మునిగి ఉంటారు. కశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా వంశపాలనను రుద్దుతూ ఉంటారు. వాళ్లు సామాజిక శాంతి గురించి మాట్లాడుతూ మతాల మధ్య ఘర్షణ బీజాలు నాటుతుంటారు. ఆ నీచులు రాజ్యాంగాన్ని ఉటంకిస్తుంటారు. ధనమదాంధులు నామీద జరుపుతున్న హింస లేనేలేదంటారు. వాళ్లు అభివృద్ధి గురించి మాట్లాడతారు గాని నా పిల్లలను ఎదగకుండా, చదువుకోకుండా చేసి తమకు బానిసలుగా మార్చుకుంటారు. భగవాన్, వాళ్లను శిక్షించు. వాళ్లను సజీవ నరకానికి పంపించు.

ఈ లోకం లోపాల మయం. కాని నువ్వు సమర్థుడివి గదా. భగవాన్, నీకు అసాధ్యమైనదేమీ లేదు గదా. నా దౌర్భాగ్యాన్నీ, విరిగిపోయిన మనసునూ చూసి అపహాస్యం చేసేవారిని మట్టికరిపించు. ఆ అసహ్యకరమైన రాక్షసులందరినీ ధ్వంసం చెయ్యి. నీ శక్తిమంతమైన ఉనికిని ప్రదర్శించు. నాస్తికులూ నిరాశావాదులూ చెప్పేవి పొరపాటని రుజువు చెయ్యి. మరికొందరైతే నిన్ను అపహాస్యం చేస్తుంటారు ప్రభూ, నీకిక మిగిలిన ఒకే ఒక్క సాకు నువ్వు లేవని చెప్పుకోవడమేనట. మరికొందరు ఇంకా ముందుకు వెళ్లి అసలు దేవుడనే వాడంటూ ఉంటే వాడు క్రూరుడూ, నిర్లక్ష్యం నిండినవాడూ అని అంటున్నారు. నిష్కారణంగా అనంత వేదన అనుభవిస్తున్న నవజాత శిశువులతో సహా కోట్లాది మంది మానవుల పట్ల దేవుడికి కరుణ లేదట. అంత దైవదూషణను నేనెలా భరించను ప్రభూ! ఏదో ఒకటి చెయ్యి. భౌతికమైనదైనా సరే, అధిభౌతికమైనదైనా సరే, ఏదో ఒకటి చెయ్యి. మానవ ప్రయత్నం గానీ, దైవలీల గానీ ఏదో ఒకటి చేసి భూమ్యాకాశాలను ఏకం చెయ్యి. విముక్తి కావాలంటే మానవ స్వభావాన్ని మార్చవలసి ఉంటే ఆపనైనా చెయ్యి భగవాన్. నా మనసులో లోతుగా ఉన్న కులం, వర్గం, పితృస్వామ్యం అనే సాంస్కృతిక అలవాట్లను, దురభిప్రాయాలను మార్చు. కనబడేదాన్ని అపనమ్మకంతో చూసే శక్తినివ్వు. అలా మాత్రమే నేను మంచినీ చెడునూ వేరు చేయగలుగుతాను, లుచ్ఛానూ అచ్ఛానూ వేరు చేయగలుగుతాను. 'ఒక మనిషి మరొక మనిషిని తక్కువ చేస్తే దేశాన్నీ, మానవత్వాన్నీ తక్కువ చేసినట్టే' అని నిజాయితీగా నమ్మేవాళ్లే అధికారం లోకి రానీ. భారతదేశంలోనైనా, ఇతరచోట్లనైనా అధికారంలో ఉన్న కార్పొరేట్ వంచకులనూ, లుచ్ఛాలనూ జైలుకే పంపిస్తావో, నరకానికే పంపిస్తావో, మరెక్కడికి పంపిస్తావో నీ ఇష్టం, ప్రభూ! తథాస్తు!

*(రచయిత హిందీ పాత్రికేయుడు, కవి. 'డిబ్రాహ్మణైజింగ్ హిస్టరీ: డామినెన్స్ అండ్ రెసిస్టెన్స్ ఇన్ ఇండియన్ సొసైటీ', 'నాలెడ్జ్ అండ్ పవర్: ఎ డిస్కోర్స్ ఫర్ ట్రాన్స్‌ఫర్మేషన్' వంటి అనేక పుస్తకాలు రాశారు. ఈ వ్యాసం ఇంగ్లిష్ లో www.countercurrents.org మీద 2014 జనవరి 19న అచ్చయింది).*

వీ

# నరేంద్ర మోడీ నిజస్వరూపం

***కరడుగట్టిన మతోన్మాదంతో, అధికారం కోసం ఎన్ని కుయుక్తులకైనా పాల్పడుతున్న నరేంద్ర మోడీ నిజస్వరూపం ఏమిటో వివరిస్తున్నారు బి.ఎస్. రాజు***

*కాషాయ కమలానికి / కార్పొరేట్ బంధానికి*
*పుట్టిన గుజరాత్ నమూనా / అభివృద్ధి అబద్ధాల ఘరానా*
*నరహంతక పాపాల ఖజానా*
*నకిలీ నమోః*
*వికాస్ బ్యాండ్-బాజా / నరేంద్ర మోడీ నిజస్వరూపం*
*ఓం నమో నమో! నరేంద్ర మోడీ నమో నమో !!*

ఎవరీ నమో? ఇతని నిజస్వరూపమేమిటి? భారతీయ జనతా పార్టీలో ఉద్దండ పిండాలను, ఉక్కు పురుషులను, తలపండిన సీనియర్లను, బాబ్రీ మసీదు కూల్చివేత నేత - రామ మందిర నిర్మాణ ప్రచార రథసారథి అద్వానీ వగైరాలను పనికిమాలిన పిడచ గుడ్డలుగా ఓ మూలకు విసిరి కొట్టి వారి కాషాయ పీఠం - ఆర్ఎస్ఎస్ (రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్) 2014 ఎన్నికల రణరంగంలో దేశ ప్రధాని పదవికి నరేంద్ర మోడీనే ఎందుకు ఎంచుకుంది? ఎందుకనంటే - నరేంద్ర మోడీ వీరందరికన్నా మిన్నగా చరిత్రను నిస్సిగ్గుగా వక్రీకరించగల సమర్థుడు.

వక్రీకరించిన చరిత్రను నిజమని నమ్మించగల వాగాడంబరుడు, బ్యాండ్-బాజా మాస్టర్. మతాన్ని అభివృద్ధి నామ జపంతో రంగరించి ప్రజలకు పంచగల దిట్ట. రాజకీయ లబ్ధికి ముస్లిం ప్రజల ఊచకోతలను కొనసాగించి ఆ మానవ మారణహోమానికి కాషాయ రంగు కప్పి చట్టాలను, న్యాయస్థానాలను మభ్యపెట్టి, మోసగించి తన పాదాక్రాంతం చేసుకోగల నేర్పరి. తనకు అడ్డువచ్చే, అడ్డురాగల ప్రతి ప్రత్యర్థినీ ఎన్‌కౌంటర్ చేయించగల ఘనుడు. డాబుసరి డబ్బా అభివృద్ధి బాకా ఊదగల ఆర్భాట ప్రచార పటాటోపాలతో ప్రజలకు కుచ్చుటోపీ పెట్టగల నేర్పరి. ఆధునిక ప్రచార సాధనాలను, అసత్య ప్రచార కార్పొరేట్ మీడియాను, గిడసబారిన మధ్యతరగతి బుద్ధిజీవు(హీను)లను కూడగట్ట గల బేహారి. నిజాలను అబద్ధాలుగాను, అబద్ధాలను నిజాలు గాను నమ్మించగల ప్రచార ప్రఖండుడు. ఇంతకాలం నెరవేరకుండా కలగానే మిగిలి ఉన్న ఆర్ఎస్ఎస్ అఖండ భారత్ వ్యూహాన్ని ముందు ముందు అమలుచేసే సమర్థత గల కాషాయ క్రూరుడు.

ఇన్నిరకాల కళలు కలవాడు కాబట్టే, ఆర్ఎస్ఎస్ మోడీని ఆధునిక నమోఃగా, వికాస పురుషునిగా, సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్‌కు ప్రతిరూపంగా చిత్రిస్తూ, ఆపై బి.సి కుల కార్డును, చాయ్-వాలా జిమ్మిక్కును కూడా జతగలిపి దేశానికి కాబోయే భారత ప్రధానిగా ముందుకు తెచ్చింది. గుజరాత్ మోడల్ మోడీత్వను ఆకాశానికెత్తి ప్రచార ఆర్భాటాన్ని కనీ వినీ ఎరుగని రీతిలో, అమెరికాలో జరిగే ఎన్నికల ప్రచార పద్ధతులను అందిపుచ్చుకుని మరీ ఉరకలు వేస్తోంది.

**ఆర్ఎస్ఎస్ - బిజెపిల వికాస పురుషుని వినాశ నీతి**

మనం ఒకసారి గడచిన లోక్‌సభ ఎన్నికల చరిత్రలోనికి తొంగి చూద్దాం! పార్లమెంటులో మెజార్టీ కోసం, రాజ్యాధికారం కోసం ఆర్ఎస్ఎస్ - బిజెపి కాషాయ ద్వయం ముందుగా హిందుత్వ ఐక్యతా ప్రచారాన్ని, ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టి దేశం నలుమూలలా మత కలహాలను, అల్లర్లను సృష్టించింది.

బాబ్రీ మజీద్‌ను కూల్చివేసింది. అద్వానీ నాయకత్వాన అయోధ్యలో రామమందిర నిర్మాణ ప్రచారాన్ని, రథయాత్రలను ఉవ్వెత్తున చేపట్టింది. మత పవిత్రతను, దేశ పవిత్రతను, హిందూ సాంప్రదాయాన్ని కాపాడే ఏకైక పేటెంట్ సంస్థగా గొప్పలు చెప్పుకునే ఈ ద్వయం రాముణ్ణి ఓట్ల సంతలో తాకట్టు పెట్టడానికి ఏ మాత్రమూ సంకోచించలేదు. దేశంలో ఏ రాజకీయ పార్టీ కూడా దేవునిగా ప్రజలు నమ్మే రాముని పేరును ఇంత నిస్సిగ్గుగా ఓట్లు దండుకోవడానికి వాడుకున్న దాఖలాలు లేవు. అయితే, రాముడు ఎన్నికల్లో చెల్లని నాణెమని తేలిపోయింది.

అందుచేత 2004 ఎన్నికలకు కాషాయ ద్వయం అయోధ్య రామున్ని అయోధ్య చీకటికే వదిలేసి, వెలిగిపోతున్న భారత్ (షైనింగ్ ఇండియా) ప్రచార ఆర్భాటాన్ని చేపట్టింది. అయితే ఇదీ గాల్లోనే కలసి పోయింది. దీన్ని ప్రజలు స్వీకరించలేదు. దాంతో ఈ ద్వయం, 2009 ఎన్నికలకు అద్వానీని లోహపురుషునిగా ప్రజల ముందుకు తెచ్చి ఓట్లు రాబట్టుకునే ప్రచారం చేసింది. అదీ వీగిపోయింది. దాంతో కాషాయ ద్వయం, అప్పటి లోహపురుషున్ని, ఇప్పుడు తుప్పు మనిషిగా జమకట్టి పక్కకు పెట్టింది. దేవుడైన రాముడి గతే, ఆ రాముణ్ణి వాడుకుని ఓట్లు దండుకోవాలనే వ్యూహ రచన చేపట్టింది. పట్టదా మరి! రాముడు ఊరుకుంటాడా మరి?

ఇప్పుడు 2014 ఎన్నికల సందర్భం. ఈ కాషాయ ద్వయానికి సరికొత్త అవతార పురుషుడు కావలసి వచ్చాడు. పురాణ పురుషుడైన శ్రీరాముడు సాధించలేని పనిని, లోహ పురుషుడైన అద్వానీ సాధించలేని పనిని, గుజరాత్ గుడు-గుడు అభివృద్ధి ఆయుధం చేబూనిన వికాశ్ పురుషుని రూపంలో ఇప్పుడు ఓ నరేంద్ర మోడీ కావలసి వచ్చాడు. ఈ నరేంద్ర మోడీ నమోః అవతార మూర్తిగా 2014 ఎన్నికల్లో విజయం సాధించవలసి ఉంది.

ఐతే, శ్రీరాముడు మోడీని భారతదేశ ప్రధానివి కమ్మని దీవిస్తాడో లేక ఆగ్రహించి ఆ పీఠం నీది కాదని శపిస్తాడో చూడాలి మరి!

ముందు ముందు ఎన్నికల ఫలితాలు, గెలుపు ఓటముల మాటెట్లున్నా, ప్రస్తుతం మోడీ దాంబిక ప్రచార ఆర్భాటాలు మట్టుకు

చెవులు చిల్లులు పొడిచేస్తున్నాయ్! దిగుమతి చేసుకున్న అమెరికా హైబ్రీడ్–హైబ్రీజ్ ప్రచార ఆర్భాటాలు, కార్పొరేట్ మీడియా మోడిత్వ వంకర సంకర వక్రీకరణలు అతి చవకబారు దివాళాకోరు సోషల్ మీడియా వికార చేష్టలు, అంతర్జాల ట్విట్టర్లు, ఫేస్ బుక్కు మేకప్‌ల అద్దుళ్ళు మొబైల్ ఎస్ఎంఎస్, సినిమాటిక్ ట్రిక్కుల తుక్కు ప్రచారమూ, (గిడస బారిన) యువ భారత్ (కార్పొరేట్ బూటకపు) నవ–భారత్ (వినాశ) వికాస–భారత్ వగైరా డంబాచార బ్యాండ్ బాజా మోతలు ఆకాశాన్నంటుతున్నాయి. వేల కోట్ల ఖర్చుతో, హైటెక్ ప్రచారంతో ప్రజల ఓట్లను దండుకుని రాజ్యాధికారం హస్తగతం చేసుకోవాలని కాషాయ సేన కల కంటోంది.

ఇక ఇప్పుడు ఈ కలను ఆరు నూరైనా సాకారం చేసుకోవడానికి నకిలీ ప్రచార ప్రణాళికా రూపకల్పనలో ఆరితేరిన మీడియా వ్యాపార సంస్థలతోనూ, నిపుణులతోనూ మంతనాలు జరిపి, అటువంటి వారికి కోట్లు గుమ్మరించి మోడీ తనకు ప్రచార సలహాదార్లుగా నియమించుకున్నాడు. బహుళజాతి కంపెనీలకు, జాతీయ ఘరానా దళారీ పెట్టుబడిదార్ల ముఠాలకు చెందిన మీడియాను కొనేసి తన చంకన పెట్టుకున్నాడు మోడీ. అర్నబ్ గోస్వామి వంటి మీడియా బందిపోటు ఇటువంటి వారిలో ఒకడు. ఇతనిది ఒక ఉదాహరణ మాత్రమే! కొంచెం హెచ్చు తగ్గులతో కార్పొరేట్ మీడియా అంతా మితిమీరిన మోడీత్వ ప్రచారానికి కొమ్ముకాసి కోట్లు దండుకోవడంలో తలమునకలై ఉంది.

'కళ్ళుండి చూడనిరాకరించే, బుర్రుండి ఆలోచించ నిరాకరించే గిడసబారిన మధ్యతరగతి బుద్ధిజీవులకు నాదో ప్రశ్న – మోడీ ప్రచార ఆర్భాటానికి వెచ్చిస్తున్న వేల కోట్ల ధనం ఎక్కడ నుంచి వర్షిస్తోందో చెబుతారా? ఇదంతా అయోధ్య రాముడు కురిపిస్తున్నాడా? లేదా ఈ సొమ్మంతా ఆదాని, అంబానీల నల్ల పాతర ఖజానాల నుండి తవ్వి తీసి వెదజల్లుతున్నదా? దయచేసి చెబుతారా? నుదుట తిలకం దిద్దుకుని, ఒంటికి కాషాయ కండువా కప్పుకున్నంత మాత్రాన అవినీతి పవిత్రతను సంతరించుకుని హిందూత్వ నీతిగా మారి పోతుందా?'

మోడీని ఆకాశానికి ఎత్తే ఈ డాంబిక తప్పుడు ప్రచారాన్ని ప్రణాళికాబద్ధంగా నిర్వహించడానికి ఆప్కో వరల్డ్ వైడ్ అనే సంస్థను నియమించి దేశ వ్యాప్తంగా నకిలీ ప్రజా సమ్మతిని, మానసిక యుద్ధాన్ని, అంకెల సర్వేల సాము గారడీలను కాషాయ ద్వయం ఉవ్వెత్తున నిర్వహిస్తోంది. ఇదంతా కూడా సామ్రాజ్యవాద అమెరికా దీవెనలతో, మార్గనిర్దేశంతో జరుగుతున్నది. ప్రధానంగా ఆప్కో వరల్డ్ వైడ్ సంస్థ పనేమంటే, దేశాన్ని పట్టి పీడిస్తున్న సకల ఆర్థిక సామాజిక రుగ్మతలకు, అవినీతికి, అవ్యవస్థకు ఒకే ఒక్క విరుగుడు మంత్రం మోడీత్వ తంత్రమేనని ప్రజలను నమ్మించడానికి పలువిధాల ప్రచారాల రూపకల్పన చేయడం.

ఇంతకీ, ఈ కంపెనీ నిర్వాహక మండలిలో డైరెక్టర్లుగా ఉన్నటువంటి వారెవరు? ఇజ్రాయిల్ దౌత్యకార్యాలయాల్లోనూ, సైనిక భద్రతా దళాల్లోనూ పనిచేసి రిటైరైన అధికారులే వీరంతా! నియంతల పాలనలో ఉన్న, ఉండిన వివిధ దేశాల్లో వారి నేరచరితలకు రంగులద్ది, అందమైన మెరుగులతో కప్పిపుచ్చడానికి అక్కడి నియంతలకు సలహాదారులుగా సేవలందించిన వారే వీరంతా! ఇంకా ఈ కంపెనీకి మరో ఘనచరిత్ర కూడా ఉంది. అమెరికాలోని పొగాకు, సిగరెట్ బడావ్యాపార సంస్థల తరపున నిలబడి పొగాకు నింపిన సిగరెట్లు తాగడం వల్ల క్యాన్సర్ రావడానికి ఆస్కారంలేదని తప్పుడు రిపోర్టు సృష్టించి ప్రపంచ ప్రజలను మోసం చేసే హీనమైన పనికి ఒడిగట్టినది ఈ సంస్థే!

హిందుత్వ చవకబారు ప్రచారం ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి గత సంవత్సరం ఉత్తరాఖండ్ రాష్ట్రాన్ని ముంచెత్తిన పెనువరదలు, అవి సృష్టించిన బీభత్సం ఓసారి మననం చేసుకోవాలి. ఆ విషాద సమయంలో కూడా మోడీని ఆకాశానికెత్తిన తీరు ఎంతో మోసపూరితంగా, జుగుప్సాకరంగా ఉంది.

అప్పటి ప్రకృతి బీభత్సంలో కేదార్‌నాథ్, బదరీనాథ్ పుణ్యక్షేత్రాల్లో చిక్కుకుపోయిన వేలాది భక్త జన సందోహాలను రక్షించి సురక్షిత ప్రాంతాలకు చేర్చడానికి దేశ సైనిక విమాన బలగాలు తమ సర్వశక్తులు ఒడ్డి హెలికాప్టర్ల సహాయంతో 10 రోజులపాటు అలుపెరుగక శ్రమిస్తే 40,000 మందిని సురక్షిత ప్రాంతాలకు చేర్చగలిగారు.

అసలు వాస్తవం ఇలా ఉంటే, మోడీ ప్రచారకులు ఈ విషాద సందర్భాన్ని కూడా మోడీని అపర భగవానునిగా, అతీత శక్తులుగల వీర హనుమంతునిగా చిత్రించి కట్టుకథలల్లారు. కేదార్‌నాథ్, బదరీనాథ్‌లలో చిక్కుకుపోయిన 15,000 మంది గుజరాతీ యాత్రికులను ఒక్కరోజు లోనే రక్షించి అద్దెకు తీసుకున్న 80 ఇన్నోవా కార్లలో అక్కడ నుండి సురక్షిత ప్రాంతాలకు చేర్చినట్లు ప్రచారం చేసుకుని ఆధునిక గుజరాతీ దైవం నమో మహిమాన్విత శక్తి యుక్తులను పెద్దఎత్తున మీడియాలో ప్రచారం చేయించుకుని ఆ నకిలీ ఖ్యాతిని మోడీ ఖాతాలో జమ చేయించారు. అంటే ముందు ముందు మోడీని దేశ ప్రధానిని చేస్తే ఎటువంటి అద్భుతాలను అతను సాధించగలడో, ఆధునిక యుగ భాగవతాన్ని హిందూ రాజ్యంలో ఎలా సృష్టించి దేశ ప్రజలను సకల కష్టాల నుండి కడతేర్చగలడో వారు మోడీ మార్కు మూర్ఖ ముద్రను ప్రజల మనస్సులో వేయదల్చుకున్నారు.

ఇంతకీ ఈ మోడీ ప్రచారమంతా యుపిఏ వెలగబెట్టిన అవినీతిమయ పాలన పైనే కదా? యుపిఏ సోనియా–మన్మోహన్–చిదంబరం ముఠాను ఇప్పటి ఎన్నికల ప్రచారంలో దుమ్మెత్తి పోస్తున్న కాషాయ సేన మరి ఇదే యుపిఏ పాలనలో పార్లమెంట్లో ఆమోదం పొందిన ప్రతీ ప్రజావ్యతిరేక బిల్లుకూ తన వత్తాసు పలకలేదా? సామ్రాజ్యవాదానికి సేవ చేయడంలో కాషాయ సేన, యుపిఏ ముఠా ఆకులు వక్కలు అందించుకోలేదా? సామ్రాజ్యవాద పెట్టుబడి ప్రేమజ్వరంతో వీరు ఒకే పాన్పుపై పవళించలేదా? మరి అటువంటప్పుడు కొత్తగా ఈ మోడీ చెప్పదలచుకున్నదీ, చేయదలచుకున్నదీ ఏమిటి?

ఈ నమో నామ మోడీ ప్రజలకు చెప్పాలనుకుంటున్నది ఒకే ఒక్క విషయం– అదేమంటే– నాకు ఓట్లేసి గెలిపించండి, నాకు ఈ దేశ ప్రధాన మంత్రి అయ్యే అవకాశమివ్వండి– ఇహ అప్పుడు చూడండి నా తడాఖా! హిందుత్వ మతతత్వానికి, కార్పొరేట్ పెట్టుబడికి, సామ్రాజ్యవాదానికి, ఎంత వేగంగా పట్టం కడతానో మీరే చూడండని.

ఇదికాక, మోడీ చెప్పేది ఇంకా వేరే ఏమైనా ఉందని ఎవరైనా అనగలరా? అందుచేత ఒకే నాణేనికి బొమ్మ, బొరుసు అయిన కాషాయ సేన, యుపిఏ ముఠా విధి విధానాలలో తేడాలేనప్పుడు, ఇక మరి వారి పాలనల మధ్య పెద్ద తేడా ఏముంటుంది?

# పారిశ్రామిక అభివృద్ధి - పంట భూముల విధ్వంసం

*గుజరాత్ అభివృద్ధి అంటూ దేశవ్యాప్తంగా ఎన్నికల నినాదంతో వస్తున్న మోడీ, వాస్తవ రూపంలో గుజరాత్‌లోని వ్యవసాయ రంగాన్ని ధ్వంసం చేసి, సాగు భూములను సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థలకు అప్పనంగా అప్పజెప్పాడని అంటున్నారు* **పి.వి. రమణ**

ఆసియాలోనే అతి పెద్ద గోల్డెన్ కారిడార్ గుజరాత్‌లో దాదాపు 400 కిలోమీటర్ల ప్రాంతంలో ఏర్పడబోతోంది. ముంబాయి నుండి సూరత్‌కి వెళ్లే మార్గంలో వల్సాద్ జిల్లా, వాపి గ్రామం నుండి ప్రారంభమైంది. దీనిలో 1048 పరిశ్రమలు ఇప్పటికే రిజిస్టర్ అయ్యాయి. ఇక్కడ ప్రధానంగా రసాయన ఎరువులు, మందుల పరిశ్రమలు రాబోతున్నాయి. ఆ ప్రాంతమంతా ఆకాశాన్నంటే భవనాలు, నల్లటి పొగ చిమ్మే చిమ్నీలతో నిండిపోయి ఉంటుంది. 2013 లోనే కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖ వాపి ప్రాంతాన్ని అత్యంత కాలుష్య ప్రదేశంగా ప్రకటించింది. అయినా పెరిగిపోతున్న కాలుష్య పరిమాణాల్ని చూసి ఆందోళనతో నవంబర్ 2013లో ఆ ప్రాంతంలో కొత్త ప్రాజెక్టుల నిర్మాణాన్ని నిషేధించింది.

మొదట 10 కిలోమీటర్ల ప్రాంతంలో రోడ్డు పక్కన వోక్స్‌వాగన్, చెవరలెట్, హూండాయ్, హోండా, నిస్సాన్, టాటా కార్ల షోరూమ్‌లతో కళకళలాడుతుంది. ఇక అక్కడి నుండి కోలక్, ఉద్వాడ, కాల్సన్, కికలా, సరన్, వోర్వాడ్, రెత్‌లావో, భగ్‌వారా గ్రామాల గుండా ప్రయాణిస్తే భరించలేని దుర్వాసన వస్తుంది. ఆ ప్రాంతంలో పారుతున్న కొలక్, దామన్ గంగ నదులు పూర్తిగా కాలుష్యంతో నిండిపోయి ఉంటాయి. సర్పంచ్ కిషోర్‌బాయ్ దితియా తాండల్ 'కోలక్‌లో ప్రతీ రెండో ఇంట్లో ఒక క్యాన్సర్ రోగి ఉన్నాడు. తమ జబ్బు గురించి ఇక్కడ జనం మాట్లాడుకోరు. ఎందుకంటే సమాజంలో ఆ జబ్బు అంటే ఉన్న చిన్నచూపే కారణం. చర్మ వ్యాధులు, అంగవైకల్యం, టీబీ, ఆస్తమా లాంటి జబ్బులన్నీ గత 10 సంవత్సరాలలో విపరీతంగా పెరిగిపోయాయి' అని చెప్పాడు.

80 సంవత్సరాల కాంతీభాయ్ మార్ఘండ్ (క్యాన్సర్ రోగి) – 'సాంప్రదాయంగా ఇది మత్స్యకారుల గ్రామం. మాకు 48 బోట్లు ఉండేవి. దాదాపు 7,000 మందిమి వీటి మీద బతికేవాళ్లం. పరిశ్రమలు వచ్చాక మొత్తం జలాలన్నీ కాలుష్యమైపోయి చేపలన్నీ చచ్చిపోయాయి' అని చెప్పాడు. ఆ ప్రాంతంలో నది చాలా నల్లగా, చిక్కగా భరించలేనంత విపరీతమైన దుర్వాసనతో ఉంటుంది. అక్కడ మంచినీళ్లు కూడా కరువే. ఆ ప్రాంత ప్రజలు గుజరాత్ ప్రభుత్వాన్ని అడిగి అడిగి విసిగిపోయి చివరకు 2010లో కొలక్ గ్రామస్తులందరూ చందాలు వేసుకుని స్వయంగా 15 లక్షల ఖర్చుతో వాటర్ ఫిల్టర్ ప్లాంట్‌ను ఏర్పాటు చేసుకున్నారు. 8 గ్రామాలలో దాదాపు 50,000 మందికి ఈ నీరు లభించే ఏర్పాట్లు చేసుకున్నారు. ప్రభుత్వం సరఫరా చేసే నీరు కేవలం బట్టలు ఉతుక్కోవడానికి పనికివస్తున్నాయని గ్రామస్తులు చెప్పారు.

దైనిక్ పటేల్ ఒకప్పుడు వరి, చెరకు పండించే రైతు. నేడు రోజు కూలీగా మారిపోయాడు. 'ఇక ఇక్కడ వ్యవసాయం చేసే పరిస్థితి లేదు. భూగర్భ జలాలన్నీ నాశనమైపోయాయి' అని చెప్పాడు.

గుజరాత్‌లో 13 ప్రత్యేక పారిశ్రామిక మండలాలు రాబోతున్నాయి. దీని కోసం 'గుజరాత్ స్పెషల్ ఇన్వెస్టిమెంట్ ఆక్ట్ 2009' చట్టాన్ని చేశారు. ఇది కేంద్ర భూ చట్టాన్ని అతిక్రమిస్తుంది. రాబోతున్న జోన్స్‌లో 'మండల్ – బేచార్జీ స్పెషల్ ఇన్వెస్టిమెంట్ రీజియన్' ఒకటి. ఇది 50,884 హెక్టార్ల

---

బహుశా ప్రజా వంచనా శిల్పంలో మోడీ, సోనియా – మన్మోహన్ ముఠాను తప్పక తలదన్నగలడు. సమస్త ప్రజా వనరులను సామ్రాజ్యవాద పెట్టుబడికి, హిందూ ఫ్యూడల్ భూస్వామ్య, దళారీ పెట్టుబడిదారులకు ధఖలు పరచడంలో, వారి పాదాక్రాంతం చెయ్యడంలో అతి దూకుడుగా వ్యవహరించగలడు. ఇదే మహా అభివృద్ధని కొంతకాలం అతను ప్రజలను నమ్మించనూ గలడు.

హిట్లర్ చేసినదదే కదా! నియంతలంతా ఇంతేకదా చేసేది? మరి ప్రజలూరుకుంటారా? నియంతలంతా చరిత్ర పెంటకుప్పల పైకి విసిరివేయ బడలేదా? మోడీకి కూడా అదేగతి, అధోగతి పట్టించకుండా ఈ దేశ శ్రామిక ప్రజలు విశ్రమిస్తారా? విశ్రమించరుగాక విశ్రమించరు. ఇది చరిత్ర గమనం, దీనిని ఎవ్వరూ అడ్డుకోలేరన్నది వాస్తవం.

హిందుత్వ మతపిచ్చిని రెచ్చగొట్టి, ముస్లింల ఊచకోతను రచించి తెరచాటు నుండి నడిపించడం – ముస్లిం ప్రజల ఆస్తి పాస్తులను తగలబెట్టడం, అన్యాక్రాంతంగా ఆక్రమించడం, వారిని తమ ఆవాసాల నుండి తరిమి వేయడం – వేలకోట్ల విలువైన ప్రజావనరులను, భూములను, ఆస్తులను, ఆదాయాలను అడ్డగోలుగా, అప్పనంగా, కారుచౌకగా.. అంబానీలకు, ఆదానీలకు, టాటాలకు, ఎస్సార్లకు, మరో గుప్పెడు బడా కార్పొరేట్ కంపెనీలకు దోచిపెట్టడం– శ్రమ జీవులైన రైతులను, కార్మికులను, మత్స్యకారులను దోచి, చట్టాలను, పర్యావరణ రక్షణను కాలరాసి, మధించిన ధనమదాంధులను మరింతగా పెంచి పోషించడం– ఇదీ.. నమో నామధారి, వికాస్ పురుష్, బాండ్–బాజా నరేంద్ర మోడీ గుజరాత్ అభివృద్ధి నమూనా– ఇటువంటి దుర్మార్గపు అభివృద్ధి ప్రజల వికాసానికి కాదని, పెట్టుబడి పాదసేవకేనని, అంతిమంగా ఇది దేశ సర్వనాశనానికి దారితీస్తుందని ప్రజలు గ్రహించి హిందూత్వ మోడీత్వను భూస్థాపితం చెయ్యాల్సిన సందర్భమిది.

*(రచయిత ఎడిటర్ శ్రామిక నేస్తం పత్రిక సంపాదకులు)* వీ

ప్రాంతంలో ఏర్పడబోతోంది. ఈ ప్రాంతంలో 44 గ్రామాలు, 7,600 కుటుంబాలు ఉన్నాయి. పచ్చని పంటలు పండే భూముల్ని వీటికి అప్పజెప్తున్నారు. ఈ ప్రాంతంలో పారిశ్రామిక పార్కులు, గృహ సముదాయాలు, జ్ఞాన కేంద్రాలు రాబోతున్నాయని పెద్ద ఎత్తున ప్రచారం జరుగుతుంది. ఆ ప్రాంత ప్రజలంతా తమ పంట భూముల్ని కాపాడుకోవడానికి పి.యు.సి.ఎల్ లాంటి ప్రజా, హక్కుల సంఘాల సహకారంతో ఉద్యమం కొనసాగిస్తున్నారు. జూన్‌లో 10,000 మంది ప్రజలతో, 500 ట్రాక్టర్లతో, 100 కార్లు, వందలాది మోటారు సైకిళ్లతో మోదీ ఆఫీసు ముందే భారీ ప్రదర్శన జరిపారు. ఉద్యమ తీవ్రత వలన దిగివచ్చిన ప్రభుత్వం 44 గ్రామాలలో 36 గ్రామాలను ప్రాజెక్టులకు ఇవ్వబోమని ఆ రాష్ట్ర ఆర్థిక మంత్రి నితిన్ పటేల్ ప్రకటించవలసి వచ్చింది. 'గత 12 సంవత్సరాలుగా మోదీకి వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకు ఇది పెద్ద విజయం' అని జమీన్ అధికార్ ఆందోళన్ గుజరాత్ (జె.ఎ.ఎ.జి) నాయకులు లాల్‌జీదేశాయ్ అన్నారు.

1999లో ముఖేష్ అంబాని గుజరాత్ తీర ప్రాంతంలో 3,000 హెక్టార్లలో ప్రపంచంలోనే అతి పెద్ద రిఫైనరీని నిర్మించాడు. ఈ రిఫైనరీ విస్తరణ కోసం 2006లో మోదీ ప్రభుత్వం మరో 4,000 హెక్టార్ల భూమిని రైతుల నుండి బలవంతంగా లాక్కొని అతి చౌకధరకు అప్పగించింది.

గుజరాత్ ప్రభుత్వం మారుతి సుజికి కంపెనీకి హన్సాల్ పూర్‌లో 647 ఎకరాల పంట భూములను ధారాధత్తం చేసింది. మోదీకి చాలా దగ్గరైన ఎల్. అండ్ టి. కంపెనీకి సూరత్‌లో హాజీరా పారిశ్రామిక జోన్ కోసం 8 లక్షల చదరపు మీటర్ల స్థలాన్ని ఎటువంటి నియమ నిబంధనలను పాటించకుండా చదరపు మీటరు ఒక రూపాయికి అమ్మేశారు. సర్వే నెంబర్ 446/ఎ లో సువాలీ, హాజీరా గ్రామాలలో 2,57,867 చదరపు మీటర్ల స్థలాన్ని అక్కడ ప్రభుత్వం నిర్ణయించిన భూమికి నిర్ణయించిన ధర 950 రూపాయలు ఉన్నా దానిని 700 రూపాయలకి ఇచ్చేశారు.

పశ్చిమ బెంగాల్, సింగూర్‌లో చావు దెబ్బ తిన్న టాటాలకు మోదీ ఎర్ర తివాచి పరచి సనంద్‌లో 1,100 ఎకరాల స్థలాన్ని మార్కెట్ రేటు చదరపు మీటరు 10,000 రూపాయలు ఉంటే 900 రూపాయలకి అమ్మేశారు. దీనివలన టాటాలకు దాదాపు 33,000 కోట్ల రూపాయలు లాభించింది. ఇంతేకాకుండా టాటాలకు 9,750 కోట్ల రూపాయలు 0.10 శాతం వడ్డీతో, 20 సంవత్సరాల తర్వాత తీర్చే విధంగా అప్పును ఏర్పాటు చేశారు. అసలు ప్రాజెక్టు అంచనా వ్యయం 2,200 కోట్ల రూపాయలు. ఏ బ్యాంకు అయినా ప్రాజెక్టు వ్యయంలో 70 – 80 శాతం మాత్రమే అప్పుగా ఇస్తారు. కాని టాటాలకు దాదాపు ప్రాజెక్టు వ్యయం కన్నా నాలుగున్నర రెట్లు ఎక్కువ ఇచ్చారు. వీటి వలన అక్కడ తయారయ్యే ప్రతి నానో కారు మీద గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వానికి 60,000 నష్టం వస్తుంది.

సుప్రీంకోర్టు ఆదేశాల ప్రకారం అటవీ భూములను, కోస్టల్ రెగ్యులేషన్ చట్టపరిధిలో ఉన్న భూములను అమ్మరాదు. కాని మోదీ 2.08 లక్షల చదరపు మీటర్ల స్థలాన్ని ఇక్కడ మార్కెట్ రేటు చదరపు మీటరు 3,000 రూపాయలు ఉంటే మొత్తం భూమిని 6,228 కోట్లకు అమ్మేశారు. నిజానికి దీని విలువ 62 కోట్ల 40 లక్షల రూపాయలు.

మోదీ రాకముందు గుజరాత్‌లో అదానీకి 3,000 ఎకరాల భూమి ఉండేది. కాని మోదీ వచ్చిన తరువాత 2 లక్షల ఎకరాలకు చేరుకుంది. అందులో 45,000 ఎకరాలు ప్రభుత్వ భూమే. అదానీకి చెందిన ముంద్రా పోర్టు స్థలం తీర ప్రాంతంలో 35 – 40 కిలోమీటర్ల ప్రాంతంతో దాదాపు ముంబై నగరానికి సమానంగా ఉంటుంది. దీని విలువ 3 వేల కోట్ల రూపాయలు ఉంటే 33 కోట్ల రూపాయలకు ఇచ్చేసాడు. అందువల్లే నేడు అదానీ 16 వేల కోట్ల రూపాయల ఆస్తితో భారత దేశంలో అత్యంత ధనవంతులలో 21వ స్థానంలో ఉన్నాడు.

రిలయన్స్, ఎస్సార్, అదానీ కంపెనీలకు పంట భూములను కారు చౌకగా అమ్మేయడం వలన రాష్ట్ర ప్రభుత్వానికి 580 కోట్ల రూపాయల నష్టం వాటిల్లిందని స్వయంగా 'కాగ్' 2013లో ప్రకటించింది.

ఈ విధంగా లక్షలాది ఎకరాల పంట భూమిని కార్పొరేట్ శక్తులకు ధారపోస్తున్న మోదీ ఒకవైపు ఆహార భద్రతకు ప్రమాదం తేవడంతో పాటు, పారిశ్రామిక అభివృద్ధి పేరుతో మరోవైపు పర్యావరణాన్ని సర్వనాశనం చేస్తూ లక్షలాదిమంది ప్రజల జీవితాలతో చెలగాటం ఆడుతున్న మోదీ వికాష్ పురుషుడో లేదా విధ్వంసకారుడో ప్రజలే నిర్ణయిస్తారు.

### గోవులపై కపట ప్రేమను ప్రకటిస్తున్న మోదీ

ఎన్నికల ప్రచారంలో భాగంగా మధ్యప్రదేశ్, బీహార్‌లలో మోదీ గుజ్జారులు అధికంగా ఉండే ప్రాంతంలో మాట్లాడాడు. ప్రత్యేకంగా పశువులను పెంచే వారిలో గుజ్జారులు అధికంగా ఉంటారు. అక్కడ మాట్లాడుతూ 'మేం దేశంలో తెల్ల (పాల) విప్లవాన్ని తెచ్చాం. కాని కాంగ్రెస్ గులాబి విప్లవాన్ని తేవాలనుకుంటుంది (ఆవుల మాంసం గులాబి రంగులో ఉంటుంది). ఆవులను పెంచుకోవడానికి రాయితీలివ్వని కేంద్ర ప్రభుత్వం వాటిని చంపి మాంసం అమ్ముకునే వారికి భారీగా రాయితీలు ఇస్తుంది' అన్నాడు.

'ఆవులను పూజించే దేశం మనది. వాటిని చంపే వారికి ఎనికల్లో మద్దతు ఇస్తారా' అని పరివార్ వర్గం ప్రశ్నిస్తుంది. చాన్నాళ్లుగా ఆర్ఎస్ఎస్ పెద్ద ఎత్తున గో సంరక్షణ ఉద్యమాన్ని కొనసాగిస్తుంది. ముస్లింలు గోవులను ఎత్తుకుపోవడం, చంపి మాంసాన్ని అమ్ముకోవడం వల్లనే గోవులు సంతతి నశించిపోతుందని ప్రచారం చేస్తోంది. ఆవులను చంపడానికి తీసుకెళ్తున్నారనే నెపంతో 2002, అక్టోబర్ 15న హర్యానా, జజ్జార్ జిల్లా, దులీనా పోలీస్ పోస్ట్ వద్ద ఐదుగురు దళితులను పరివార్ శక్తుల నాయకత్వంలో మూకుమ్మడి దాడిచేసి కొట్టి చంపేసారు. దళితులను ముస్లింలని పొరపాటుపడి ఈ దాడి చేసారని తరువాత తేలింది. పవిత్రమైన గోవులను కాపాడాలనే పేరుతో అబద్ధపు ప్రచారాలు చేస్తూ, సమాజంలో విభేధాలు సృష్టించి ఈ విధమైన హింసను కొనసాగిస్తున్నారు.

ఈ సంఘ్ పరివార్ ప్రమాదకరమైన ప్రచారంలో వాస్తవాలు పరిశీలించాల్సిన అవసరం ఉంది. భారత దేశంలో పశువుల మాంసాన్ని 1969 నుండే ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ప్రధానంగా ఈజిప్టు, సౌదీ అరేబియా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, థాయ్‌లాండ్,

మలేషియాలకు ఎగుమతి జరుగుతుంది. 2012-13 సంవత్సరంలో 17,412.9 కోట్ల రూపాయల వ్యాపారం జరిగింది. ఇది గత సంవత్సరం కన్నా 27 శాతం ఎక్కువ. 2003 - 04 సంవత్సరంలో 3.5లక్షల టన్నుల గేదె మాంసం ఎన్‌డిఎ హయాంలోని చివరి సంవత్సరంలో ఎగుమతి జరిగింది. గుజరాత్‌లో గత దశాబ్దంలో పశు వ్యధశాలలు రెట్టింపయ్యాయి.

2001-02లో గుజరాత్‌లో 10,600 మెట్రిక్ టన్నుల పశు మాంసం ఉత్పత్తి కాగా 2010-11 నాటి 22,000 మెట్రిక్ టన్నులకు పెరిగింది. దేశ వ్యాప్తంగా 18,59,430 టన్నుల నుండి 48,69,000 టన్నులకు పెరిగింది. అంటే 163 శాతం పెరిగింది. దేశంలో వ్యధ శాలలు ఉన్న 10 రాష్ట్రాలలో గుజరాత్‌లోనే 39 ఉన్నాయి.

మనదేశంలో ప్రధానంగా ఎగుమతి చేయబడుతున్న పశు మాంసంలో అధిక శాతం గేదెల మాంసమే. నిజానికి దేశంలో ఆవులు తగ్గిపోవడానికి కారణం రైతులకు గోవుల మీద ప్రేమ లేకపోవడం కాదు. ఆర్థిక పరమైన అంశాల కారణంగానే వారు ఆవులకు బదులు గేదెలను పెంచుతున్నారు. దీనికి తరచూ సంభవించే కరువులు ఒక కారణం. సాధారణంగా రైతులు పశువులను భూములు దున్నడానికి, తమ బండ్లను లాగడానికి, పేడను ఎరువుగా, వంట చెరకుగా ఉపయోగిస్తారు. వాటి పాలను వాడకానికి, అమ్మకాలకు ఉపయోగిస్తారు. కాని వ్యవసాయంలో ట్రాక్టర్లు, డీజిల్ ఇంజన్‌లు లాంటి సాంకేతిక యంత్రాలు రావడంతో వ్యవసాయంలో పశువుల భాగస్వామ్యం తగ్గిపోయింది. 1971 - 72లో 53 శాతం ఉంటే నేటికి కేవలం 5 శాతానికి పడిపోయింది.

పంటల ఉత్పాదకత పెంచడానికి అవసరమైన రసాయనిక ఎరువులు, పురుగుల మందులు వాడకం వలన 2011 జాతీయ గణాంకాల ప్రకారం పేడను వంటచెరకుగా వాడడం కేవలం 10.9 శాతానికి తగ్గిపోయింది. ఈ కారణాల వలన దేశంలో వ్యవసాయంలో పశువుల వాడకం గణనీయంగా తగ్గిపోయింది. ఈనాడు కేవలం పాల ఉత్పత్తికే పరిమితమైపోయాయి. మొత్తం దేశంలో స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుండి నేటికి 78 శాతం నుండి 65 శాతానికి పడిపోయింది.

ఆహార ఉత్పత్తి చేపట్టిన తరువాత పశువులను మచ్చిక చేసుకోవడం, వ్యవసాయానికి ఉపయోగించడం, ఆహారంగా కోసుకుని తినడం ఇట్లా కొన్ని వేల సంవత్సరాలు కొనసాగింది. బౌద్ధం ప్రవేశించిన తరువాత బ్రాహ్మణులు పశుమాంసాన్ని తినడం మానేసి గోవులను పూజనీయమైనదిగా భావించాలని చెప్పేవారు. వేద కాలంలో ప్రధానంగా గోమాంస భక్షకులుగా ఉన్న ఆర్యులు వ్యవసాయకులైన తరువాత గోమాంసాన్ని పూర్తిగా నిషేధించడం దీనికి ఉదాహరణ అని కొసాంబీ చెప్పారు.

బౌద్ధం పుట్టకముందు ప్రాచీన భారతదేశంలో జంతుబలులు సర్వసాధారణంగా ఉండేవి. మనుషులు, గుర్రాలు, దున్నపోతులు, గొర్రెలు, మేకలను యజ్ఞాలు, యాగాలలో బలిచ్చేవారు. అశ్వలాయన గృహ్య సూత్రంలో లేగదూడలను ఏవిధంగా కాల్చి తినాలో వివరించారు. ఎన్ని యజ్ఞాలు, యాగాలు చేసినా మాంసం తినని వాడు రాబోయే 20 జన్మలు జంతువుగానే పుడతాడని మనుధర్మ శాస్త్రం 35వ సూక్తం చెప్తుంది. ఆ రోజుల్లో అతిధులు వచ్చినప్పుడు ఆవు మాంసం వడ్డించడం ప్రతిష్ఠకు చిహ్నంగా ఉండేది. కనుకనే హోదా కలిగిన అతిథిని 'గోఘ్న' (ఆవును హరించేవాడు) అని పిలిచేవారు. బ్రాహ్మణులు చాలా కాలం గోమాంసం భుజించే వారని ప్రాచీన గ్రంధమైన ఋగ్వేదం చెప్తుంది. బౌద్ధం వచ్చిన తరువాత పశుమాంసాన్ని తినడం వదిలేసిన బ్రాహ్మణులు, వీళ్లను అనుకరించిన శూద్రులూ, దళితులను తక్కువగా చూడడంతో పాటు దీని వల్లనే అంటరానితనం వచ్చిందని చెప్పడం జరిగింది.

వ్యవసాయానికి ప్రధాన సాధనమైన పశువులను బలివ్వడం బౌద్ధం, జైనం తీవ్రంగా వ్యతిరేకించాయి. కేవలం బౌద్ధాన్ని జయించడానికి బ్రాహ్మణులు పశు మాంసాన్ని వదిలేశారే కాని, ఆవుల పట్ల ఉండే పవిత్ర భావం కారణం కాదు. గోమాంసం తినే అలవాటు భారతదేశాన్ని విదేశాల నుండి వలసవచ్చిన ముస్లింల ద్వారానే సంక్రమించిందని మతతత్వ వాదులు తప్పుడు ప్రచారం చేస్తున్నారు. రామాయణంలో భరద్వాజుడు ఒక ఆవు దూడను వధించి రాముడిని భోజనానికి ఆహ్వానించాడని ఉంది.

గోవును ఆహారంగా స్వీకరించవచ్చని తైత్తరీయ బ్రాహ్మణ్యం చెప్తుంది. యజ్ఞవల్క్యుడు ఆవు మాంసం కోరడం గురించి శత పథ బ్రాహ్మణ్యంలో ఉంది. రుగ్వేదం 10,14 - 1ల ప్రకారం రంజి దేవుని వంట గదిలో ఆవును వధించి ధాన్యంతో పాటు బ్రాహ్మణులకు మాంసం కూడా వడ్డించినట్లు ఉంది. అధర్మణ వేదం 11 - 2, 4 వేదాలలో గోమాంస భక్షణ ఋషులు ఇంద్రునికీ, శివునికీ గోవులు బలివ్వాలని, గర్భిణీ స్త్రీలు ఎర్ర ఆవు మాంసం తింటే పండంటి బిడ్డకు జన్మనిస్తారని యాజ్ఞవల్క్య స్మృతి చెప్తుంది. రాజును సర్వాధికారిగా నిలబెట్టే యాగంగా ఎందరో రాజులు చేసిన అశ్వమేధ యాగంలో యజ్ఞాశ్వంతో పాటు 600ల గోవులను బలిచ్చేవారు.

ఉత్తరప్రదేశ్‌లో కృష్ణుడి జన్మస్థానంగా కొలిచే మధురా, గోకుల్ బృందావన్‌లో 2007 లెక్కల ప్రకారం 7,22,854 గేదెలు ఉంటే, ఆవులు 1,41,326 మాత్రమే ఉన్నాయి. ఇదంతా జరిగింది ఆవుల్ని చంపే వ్యధశాలల వల్ల కాదు. దీనికి ఎవరినైనా నిందించాలంటే ఆవుల బదులు గేదెలను ఎంచుకోవలసి వచ్చిన పరిస్థితిని నింధించాలి. రైతులు ఆవుల స్థానంలో ఆర్థిక అంశాల కారణంగానే గేదెలను ఉపయోగిస్తున్నారు. కొనడం, అమ్మడంలో మత పరమైన ఇటువంటి పవిత్రతా నిబంధనలు లేకపోవడం వలన కూడా రైతులు ఆవులకు బదులు గేదెలనే ఎంచుకుంటున్నారు.

నేడు ఈ అగ్రవర్ణాల వారు నటిస్తున్న గోవుల మీద ప్రేమ పెద్ద అబద్ధం. వాటి నుండి జీవితాంతం పాలు పిండుకుని, ఉపయోగించుకుని చివరకు చనిపోయే పరిస్థితి వస్తే కనీసం వాటిని ముట్టుకోరు. మైలపడి పోతామని భయం. పైగా వాటిని తొలగించే పనిని దళితులకే అప్పజెప్తారు తప్ప తాము స్వయంగా ఆ పనికి పూనుకోరు. పై విషయాలు గమనిస్తే, గోవుల సంఖ్య తగ్గిపోవడానికి ముస్లింలే కారణమని చేస్తున్న ప్రచారం ఎంత అబద్ధమో తెలుస్తుంది. అధికారం సాధించడానికి అబద్ధపు ప్రచారాలతో ప్రజలను రెచ్చగొట్టి ఎంత విధ్వంసానికైనా సిద్ధంగా ఉన్నారని కూడా అర్థమౌతుంది.

*(రచయిత కార్మికోద్యమ నాయకుడు)* వీ

# కొత్త రాష్ట్రంలో రాయలసీమ భవిష్యత్తు

*ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన అనంతరం ఏర్పడబోయే కొత్త ఆంధ్రప్రదేశ్‌లో రాయలసీమకు అన్ని రంగాల్లో న్యాయమైన వాటా రావాలనీ, వాటిని సాధించేందుకు నాయకులూ, ప్రజలూ చైతన్యం పొందలనీ అంటున్నారు* **ఎం. భాస్కర్**

తెలుగు ప్రజల చరిత్రలో మరో కీలక మలుపు చోటు చేసుకుంది. ఈ మలుపు సుదీర్ఘకాలంగా కొనసాగుతూ వచ్చిన ప్రాంతీయ అసమానతల నుండి, వివక్షతల కొలిమి నుండి తెలంగాణకు విముక్తి కల్గించింది. ఐతే ఈ కీలక మలుపులో రాయలసీమ సమాజం తనదైన పాత్ర పోషించలేదు. రాయలసీమ పాలక ముఠాల ప్రయోజనాలచే బంధించబడి తన భవిష్యత్ నిర్మాణానికి ఆదర్శంగా తీసుకోవాల్సిన తెలంగాణ ఉద్యమాన్ని గుడ్డిగా వ్యతిరేకించింది. దీని పర్యవసానంగానే కొత్త ఆంధ్రప్రదేశ్‌లో తన హక్కులకు, ప్రయోజనాలకు కనీసమైన హామీ లేకుండానే కొనసాగాల్సిన దౌర్భాగ్య స్థితికి నెట్టేయబడింది.

నిజానికి తమిళుల నుండి వేరుపడి ప్రత్యేక రాష్టంగా ఉండడానికి 1910 నుండే ఆంధ్రరాష్ట్ర ఉద్యమం మొదలైనప్పుడు ఆ ఉద్యమంలో కలవడానికి రాయలసీమ నాయకత్వం అంగీకరించలేదు. చివరికి ఏర్పడబోయే కొత్త ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ అభివృద్ధికే ప్రథమ ప్రాధాన్యత ఇస్తామని కోస్తా నాయకులు హామీ ఇచ్చాకే రాయలసీమ ఆంధ్రరాష్ట్ర సాధన ఉద్యమంలో పాల్గొంది. శ్రీభాగ్ ఒప్పందంలో అట్లా పొందిన హామీలో భాగంగానే 1953లో ఏర్పాటైన ఆంధ్ర రాష్ట్రానికి కర్నూల్‌ను రాజధాని చేశారు. అట్లాగే ఆంధ్రా తెలంగాణ రాష్ట్రాలు కలిసి 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడే సందర్భంలో కూడా తెలంగాణ ప్రజలు అనేక డిమాండ్లు, షరతులు పెట్టి స్పష్టమైన ఒప్పందాలతోనే ఆంధ్రప్రదేశ్‌లో చేరారు. అయితే ఇచ్చిన ఏ ఒక్క హామీని కూడా ఆంధ్రా పాలకులు అమలు చేయకపోవడంతో మేల్కొన్నారు తెలంగాణ ప్రజలు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన 13 సంవత్సరాలకే 1956లో జరిగిన విలీనం రద్దు కావలసిందేనని తెలంగాణ ప్రత్యేక రాష్ట్రమే మా లక్ష్యమంటూ 1969లో ఉద్యమం మొదలుపెట్టారు. చివరికి అనేక ఆటుపోట్ల మధ్య ఒకవైపు ఆంధ్ర పెట్టుబడిదారులు, రాయలసీమ పాలకముఠాలు, తెలంగాణ నాయకుల నమ్మక ద్రోహాలను అధిగమిస్తూ 2014 నాటికి తమ కలను సాకారం చేసుకున్నారు.

కాని గత వంద సంవత్సరాల నుండి కోస్తాంధ్ర నాయకుల మోసాలతో పాటు 'శ్రీభాగ్' లాంటి చారిత్రక ఒప్పందాల ఉల్లంఘన పర్యవసానంగా శిథిలమై ఉన్న రాయలసీమ, ఏర్పడుతున్న కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఏ డిమాండ్స్ పెట్టకుండా, ఏ హామీలను పొందకుండా ఎలాంటి ఒప్పందాలు జరగకుండానే కోస్తాంధ్రతో కలిసి ఉండబోతున్నది. కేంద్ర ప్రభుత్వం సైతం రాయలసీమ ప్రజలు గుంపులుగా చీలిపోయి ముఠా నాయకుల అదుపుల్లో ఏ చైతన్యం లేకుండా ఉన్నారు కాబట్టి ఏమి ఇవ్వనక్కర్లేదనుకుంది. అంతేకాక తెలంగాణ ఉద్యమాన్ని గుడ్డిగా వ్యతిరేకించడం ద్వారా రాయలసీమ ప్రజలు ఇన్నేళ్లు కోస్తాంధ్ర నుండి తామనుభవిస్తున్న ప్రాంతీయ అసమానతలను, వివక్షతలను అంగీకరించినట్లైంది. మరొక విషయం ఏమిటంటే వంద సంవత్సరాల కోస్తాంధ్ర పాలక వర్గాల మోసాలను, నమ్మక ద్రోహాల చరిత్రను కడుపులో దాచుకున్న రాయలసీమ సమాజం ఇప్పటికి కూడా తన భవిష్యత్ పట్ల ఒక ప్రాథమిక అవగాహనకు, స్పష్టతకు రాలేకపోతోంది. ఇందుకు రాయలసీమ రాజకీయార్థిక, చారిత్రక కారణాలతోపాటు రాయలసీమ ముఠా నాయకులు కూడా ప్రథమ కారకులని చరిత్రనిండా కుప్పలు కుప్పలుగా సాక్ష్యాలున్నాయి.

ఇంతటి విషాదంలో, అచేతన పరిస్థితిల్లో ఉన్న రాయలసీమ ప్రజానీకం నదీ జలాల పంపిణీలో, విద్య, వైద్యం, పారిశ్రామిక రంగాల్లో, బడ్జెట్ కేటాయింపుల్లో విస్మరించబడిన చరిత్రకు కొనసాగింపుగానే కొత్త ఆంధ్రప్రదేశ్‌లో తన ప్రయాణాన్ని మొదలు పెడుతోంది. ఈ పరిస్థితుల్లో పాత కష్టాల కన్నీళ్ల కడవలను ఒక చారిత్రక మలుపు దగ్గర అధిగమించుకుంటుందా లేక అదనంగా కొత్త సమస్యలను కూడా కొని తెచ్చుకుంటుందా అనేదే నేడు రాయలసీమ సమాజం ముందున్న ఓ పెద్ద ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం వెతికే క్రమంలో కొత్త ఆంధ్రప్రదేశ్ స్వరూపం, స్వభావం ఎలా ఉండబోతున్నది, అందులో ఉన్న కొత్తదనం ఎవరిదీ, కోటిన్నర సీమ ప్రజానీకం పాత్ర ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో, చర్చించుకునే ప్రయత్నం చేద్దాం.

తెలంగాణ ఏర్పాటుకు అడ్డుగా ఉన్న కోస్తా పెట్టుబడిదారులను సంతృప్తి పరచడానికి విశాఖ నుండి చెన్నై వరకు భారీ పారిశ్రామిక కారిడార్‌గా ప్రకటించారు. కారిడార్‌లో పరిశ్రమల స్థాపనకై ప్రోత్సాహకాలు, మౌలిక వసతులు కల్పించడంతోపాటు పరిశ్రమలకు అవసరమైన నీటి కోసం పోలవరానికి జాతీయ హోదా ఇచ్చారు. దాని నిర్మాణానికి అడ్డంకులు ఎదురుకాకుండా ఉండేందుకు ముంపు ప్రాంతాన్ని ఆంధ్రాలో కలపాలని కూడా నిర్ణయించారు. ఆ కోస్తా కారిడార్‌లో జరిగే ఉత్పత్తులపై పన్ను రాయితీలకై కొత్త ఆంధ్రప్రదేశ్‌కు బిల్లులోనే ప్రత్యేక హోదా కూడా ఇచ్చారు. పారిశ్రామిక ఎగమతులు, దిగుమతులకై దుగరాజుపట్నంలో ఓడరేవు, విశాఖపట్నం, విజయవాడ, గుంటూరు, తెనాలి, మంగళగిరిలను కలుపుతూ భారీ మెట్రో రైలు ప్రాజెక్టు వగైరాలన్నీ కోస్తాంధ్ర అభివృద్ధికై రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ బిల్లులో కేంద్రం ఇచ్చిన హామీలు.

హైదరాబాద్‌కు దీటుగా గుంటూరు అభివృద్ధి, ప్రపంచస్థాయిలో విశాఖపట్నం, విజయవాడలను తీర్చి దిద్దుతామని అన్ని రాజకీయ పార్టీలు పోటీపడి హామీలు ఇస్తున్నాయి. ఈ హామీలు ఇస్తున్న నాయకులందరూ రాయలసీమకు చెందిన వాళ్లే కావడం గమనార్హం. పుష్కలంగా ఉన్న నీటి పారుదల వసతి వల్ల కోస్తా ప్రాంతంలో వ్యవసాయ అభివృద్ధి జరగడం వల్ల వ్యవసాయంలో పోగుబడిన అపారమైన

సంపదతో తయారైన వ్యాపార పెట్టుబడిదారి వర్గం రాయలసీమ పాలక ముఠాలను తమకు నమ్మకమైన దళారులుగా పెట్టుకుని 'మీకు పదవులు మాకు ప్రాజెక్టులు' అనే ఒప్పందంతో నేడు ప్రపంచం నలుమూలలకు విస్తరించింది. ఇంతటి బలమైన కోస్తా సంపన్న వర్గాల వ్యూహంలో భాగంగానే తెలంగాణ రాష్ట్రం ఇస్తే కొంపలు అంటుకుంటాయని, రాయలసీమ ఎడారిగా మారిపోయి ఆకలి చావులు సంభవిస్తాయని పచ్చి అబద్ధాలను పదే పదే ప్రచారం చేసిన రాయలసీమ పాలక ముఠా నాయకుల్లో ఏ ఒక్కరు కూడా తెలంగాణ బిల్లులో రాయలసీమ అభివృద్ధికి కాసింతయిన చోటు కల్పించాలని అడగలేదు. రాయలసీమ నాయకులు సాధించిందల్లా ఏమిటంటే తమ దళారీ రాజకీయ నైపుణ్యంతో సీమ ప్రజలను చివరి వరకు సమైక్య మత్తులో ఉంచడమే. కొత్త ఆంధ్రప్రదేశ్‌కు కాబోయే ముఖ్యమంత్రులం కచ్చితంగా మేమే కాబట్టి రాయలసీమ అవసరాల గురించి మాట్లాడితే కోస్తా వారి మనసు ఎక్కడ గాయపడి తమ దళారీ రాజకీయ జీవితం చెదిరిపోతుందోననే భయంతో, అమాయక సీమ ప్రజలను తమ ముఠా సంస్కృతిలో నిద్ర పుచ్చి రాయలసీమకు ఏమి రాకుండా అడ్డుపడ్డారు.

నిజానికి రాయలసీమకు ఇదేమీ కొత్త కాదు. 1947లో ప్రకాశం పంతులు మంత్రి వర్గంలో కడప కోటిరెడ్డికి ఒక్కరికే స్థానం దొరకడంతో ఆశించి భంగపడ్డ నీలం సంజీవరెడ్డి టంగుటూరి ప్రకాశం మంత్రి వర్గాన్ని పడగొట్టి తన రాజకీయ జీవితానికి రాయలసీమ సమస్యలను వారధిగా పెట్టుకున్నాడు. 1947 అక్టోబర్ 25, 26 తేదీలలో జరిగిన రాయలసీమ మహాసభలో నీలం సంజీవరెడ్డి రాయలసీమ సమస్యలు ప్రస్తావిస్తూ సీమకు న్యాయమైన హక్కులు నెరవేర్చకపోతే ఆంధ్ర రాష్ట్రంలో కలిసి ఉండమని, రాయలసీమ వేరే రాష్ట్రం అడగవలసి వస్తుందని కోస్తా నాయకులను హెచ్చరించారు. చివరికి 1949 లో పి.ఎస్. కుమార్ స్వామిరాజ మంత్రివర్గంలో స్థానం సంపాదించాడు. అట్లాగే 1953లో కూడా రాయలసీమ సమస్యలను అడ్డుపెట్టుకొని ఉప ముఖ్యమంత్రి పదవిని, ఆ తర్వాత 1956లో కర్నూల్ రాజధానిని హైదరాబాద్‌కు తరలించేందుకు ఒప్పుకొని ఏకంగా ఆంధ్రప్రదేశ్‌కు మొదటి ముఖ్యమంత్రి కాగలిగాడు. రాయలసీమ ప్రజల తలరాతలు మార్చడానికి 1951లో కేంద్ర ప్రణాళికా సంఘం అమోదం కూడా పొందిన కృష్ణా పెన్నార్ ప్రాజెక్టును విరమించుకోడానికి, కెసి కెనాల్ సామర్థ్యం 6000 క్యూసెక్కుల నుండి 3000 క్యూసెక్కులకు కుదించడానికి, సిద్దేశ్వరం స్థానంలో శ్రీశైలం ప్రాజెక్టును జలవిద్యుత్ ప్రాజెక్ట్‌గా మార్చడానికి, మొత్తంగా రాయలసీమ ప్రజలకు ఏకైక జీవనాధారంగా ఉన్న కృష్ణానదీ జలాలపై శాశ్వతంగా హక్కులు వదులుకునే షరతుపై నీలం సంజీవరెడ్డి తన రాజకీయ భవిష్యత్తును నిర్మించుకున్నాడు.

దీన్ని బట్టి తెలుస్తున్నదేమిటంటే జన్మనిచ్చిన కన్న తల్లిని తాకట్టు పెట్టడమనేది నీలం సంజీవరెడ్డితోనే మొదలైందని. ఆ వారసత్వాన్ని నేటివరకు రాయలసీమ నాయకులు కొనసాగిస్తున్నారని. ఇది దాచినా దాగని నగ్నసత్యం. ఆ వారసత్వ కొనసాగింపులో భాగంగానే తెలంగాణ బిల్లులో రాయలసీమ సమస్యల ప్రస్తావనే కరువైనా కూడా ముఖ్యమంత్రిగా ఉండిన కిరణ్‌కుమార్ రెడ్డి, మౌనంగా ఉండిన చంద్రబాబు, జగన్‌లు ఈ ద్రోహాన్ని కొనసాగించారు.

కొత్త ఆంధ్రప్రదేశ్‌కు మొదటి ముఖ్యమంత్రి పీఠాన్ని చేజిక్కించుకోవాలంటే కోస్తాంధ్ర పెట్టుబడిదారులకు దళారులుగా ఉండడం తప్పనిసరి. రాయలసీమ ప్రజలు మా ఫ్యాక్షన్ ముఠా అదుపుల్లో పడిఉన్నారు కాబట్టి రాయలసీమ అనే పదాన్ని ఉచ్చరించకపోయినా పరవాలేదు, మా నమ్మకమైన ఓటు బ్యాంకు ఎక్కడికి పోదు అనే భరోసాతోనే వీరు అలా చేశారు. అందరు అనుకుంటున్నట్లు ఏర్పడుతున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం రాయలసీమకు ఎంత మాత్రం కొత్త రాష్ట్రం కాదు. పాత సమస్యల కొనసాగింపుతోనే కొత్త ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు అవుతున్నప్పుడు సీమ ప్రజలకు అందులో కొత్తదనం ఏముందని? హైదరాబాదుకు ధీటుగా మెట్రో రైలు ప్రాజెక్టు, పారిశ్రామిక అవసరాలకే కాక 3వ పంటకు కూడా నీటి భరోసా, కృష్ణా డెల్టా స్థిరీకరణ ఇలా కొత్త కొత్త ప్రాజెక్టులు, పథకాలు, ఇంకా బిల్లులో పొందు పరచకుండానే పొందిన దక్షిణ భారతదేశంలోనే మొదటిసారిగా విశాఖలో పెట్టిన క్యాన్సర్ ఇన్‌స్టిట్యూట్, విజయవాడలో నేషనల్ ఫ్యాషన్ డిజైనింగ్ ఇన్‌స్టిట్యూట్, ఆమోదానికి సిద్ధంగా ఉన్న విజయవాడ కేంద్రంగా రైల్వే జోన్... ఇలా అన్ని రకాలుగా అధికారికంగా, అనధికారికంగా కేంద్రం దగ్గర రహస్య ఒప్పందాల ద్వారా కోస్తాంధ్ర కడుపునిండా ఊహించనన్ని హామీలు పొందింది. కాబట్టి, ఎట్ల చుసినా బహుళ రంగాలలో బహు విధాలుగా కొత్తదనాన్ని పొందిన ఆంధ్రా వారికే ఇది కొత్త రాష్ట్రంగా రంగురంగుల కొత్తదనంతో ఉండబోతున్నది.

మరి రాయలసీమకు? గడిచిన రెండు శతాబ్దాలలో దాదాపు 80 కరువుల రుచి చూసిన సీమ ప్రజలకు ఇక కరువులు ఉండబోవని కొత్త రాష్ట్రం వాగ్దానం చేస్తున్నదా? కృష్ణానది పరీవాహక ప్రాంతంలో కరువుల చరిత్ర, సగటు వర్షపాతం, భూగర్భ జలాల లభ్యత ఇలా ఏ కొలమానంతో చూసినా చివరికి సహజ న్యాయసూత్రాల ప్రకారంగానైనా కృష్ణానది జలాలు రాయలసీమ హక్కని కొత్త రాష్ట్రంలో అధికార పీఠం ఎక్కే పాత పాలకులు అనగలరా? కోస్తావారిని ఒప్పించి సీమ గొంతును తడపగలరా? కృష్ణా, గోదావరి డెల్టాల కింద సాగవుతున్న భూమిలో కనీసం ఒక సెంటు భూమికి కూడా నీటి కొరత రాకుండా ఉండేదుకు జల మండళ్ల ఏర్పాటు ద్వారా శాశ్వతంగా తమ బంగారు భవితకు హామీ పొందుతున్న కోస్తా వాళ్లతో బక్కచిక్కి చిన్నబోయిన సీమ జనానికి కొత్త రాష్ట్రంలో కలిసుంటే కలదు సుఖమని ఎవరైన చెప్పగలరా?

గత వంద సంవత్సరాల చరిత్రలో రాయలసీమ వ్యవసాయ పారిశ్రామిక రంగాల అభివృద్ధిని వెనక్కి నెట్టేసి బడ్జెట్ కేటాయింపుల్లో సింహభాగం పొంది ఏ రంగం అభివృద్ధిలో చూసినా ఎన్నో రెట్లు ముందంజలో ఉన్న కోస్తా ప్రాంతం రెవెన్యూ ఆదాయంలో ముందు ఉండడం సహజమే. మరి రాయలసీమ ప్రాంతం లోటు బడ్జెట్లో ఉన్నదని ఆ ప్రాంతాన్ని పోషించడం కోస్తాంధ్రకు తలకు మించిన భారం కాబోతున్నదని పనిగట్టుకుని ఆంధ్రా మీడియా ప్రచారం చేస్తున్నది. రాయలసీమ ఆర్థిక వ్యవస్థలో పెను మార్పులు తీసుకొచ్చి అభివృద్ధిలో కొత్త పుంతలు తొక్కడానికి అవసరమైన కృష్ణా–పెన్నార్ ప్రాజెక్టు నిర్మాణం కాకుండా అడ్డుకున్నది ఎవరో తెలియదా? ఈ వాస్తవాన్ని పక్కకు పెట్టి చేస్తున్న అబద్ధపు ప్రచారం వెనుక దీర్ఘకాలిక కుట్ర దాగిఉంది. రాయలసీమ ఎన్నటికీ తన సొంత కాళ్లపై నిలబడి బతికే ఆర్థిక స్తోమత లేదని, కచ్చితంగా కోస్తాంధ్రతో అణిగిమణిగి ఉంటూ వారి దయా దాక్షిణ్యాల మీద ఆధారపడితేనే మనకు భవిష్యత్తు ఉంటుదనే మానసిక లొంగుబాటును సీమప్రజల మెదళ్లలో చొప్పించే వ్యూహమే అది.

రెక్కలు విరిగిన పక్షిలా అచేతనంగా కూలబడి ఉన్న రాయలసీమ

సమాజం ఏనాడో ఆంధ్ర అనే ఉచ్చులో ఇరుక్కుపోయింది. కోస్తా వారి ప్రాంతీయ పక్షపాతాన్ని, సాంస్కృతిక ఆధిపత్యాన్ని గుర్తించకుండా, ప్రశ్నించకుండా ఉండేందుకు మనమంతా ఆంధ్రులమనే సాంస్కృతిక ముళ్లకంచె సీమ ప్రజల మెదళ్లకు ఏనాడో చుట్టబడింది. రాయలసీమ అనే పదమే అనాగరికతకు, అగౌరవానికి సకల రంగాల పరాధీనతకు చిహ్నమని, ఆంధ్ర అనేది గొప్ప నాగరికతకు, సంస్కారానికి ఉన్నత ప్రతీకగా మొత్తం తెలుగుజాతికే ప్రతిరూపంగా చెలామణి అవుతున్నది కాబట్టి, రాయలసీమ ప్రజలు తాము రాయలసీమవాళ్లం అని ప్రకటించుకోడానికి కూడా న్యూనతగా భావించే పరిస్థితి ఉంది. నరనరానా ఇంకి ఉన్న పరాయికరణ భావన రాయలసీమకు ప్రతిబంధకంగా ఉంది. అందుకే రాయలసీమ భవిష్యత్తు గురించి, అవసరాల గురించి మాట్లాడే ప్రయత్నం ఎవరైనా చేస్తే వారిని ఆంధ్రజాతిని చీల్చే కుట్రదారులుగా అనుమానించే ఇంకొక పార్శ్వానికి కూడా రాయలసీమలో ఆమోదం ఉంది. ఇన్ని సంకెళ్ల మధ్య భౌతికంగానే కాక మానసికంగా కూడా ఆంధ్ర అనే ముళ్లకంచెలో ఇరుక్కుపోయిన రాయలసీమ సమాజం కొత్త రాష్ట్రంలో తమ హక్కుకై న్యాయమైన వాటాకై నోరు విప్పడం అంత సులువు కాదేమో అన్న అనుమానం కలగక మానదు. ఒకవేళ నోరు విప్పినా రాయలసీమ పాలక ముఠాల రాజకీయాలలో నలిగిపోవడం కూడా జరగవచ్చు

భౌగోళికంగా, సాంస్కృతికంగా ప్రత్యేకతలను కలిగిన రాయలసీమ, జీవన ప్రమాణాలు ఉద్యోగ ఉపాధి అవకాశాలు, ప్రాంతీయ చైతన్యం ఇలా అన్నింటిలోను కోస్తాకంటే చాలా అధమ స్థానంలో ఉంది. సమృద్ధిగా నీటి పారుదల వసతి ఉన్న కోస్తాలో హెక్టారుకు సగటు రాబడి లక్ష రూపాయలు ఉంటే రాయలసీమలో 40 వేలు కూడా లేదు. కోస్తాలో వ్యవసాయంలో వచ్చిన మిగులు సంపద వాణిజ్య పారిశ్రామిక రంగాల అభివృద్ధికి మళ్లుతుంటే సీమలో మాత్రం అందుకు పూర్తి భిన్నంగా పెట్టిన పెట్టుబడులు రాక రైతులు ఆత్మహత్యలు చేసుకుంటు న్నారు. మరోవైపు పారిశ్రామిక సేవా రంగాల అభివృద్ధి ఏ మాత్రం లేకపోవడంతో ఉన్నత విద్య అభ్యసించిన యువత దాదాపు 24 శాతం మంది వ్యవసాయ పనులలోనే కాలం గడుపుతున్నారు. ఈ పరిస్థితి కోస్తాలో 7 శాతం మాత్రంగానే ఉంది. తీవ్రమైన కరువులు దాని పర్యవసానంగా వలసలు, ఆత్మహత్యలు, ఆయుప్రమాణం తక్కువగా ఉండటం తదితర కారణాల వల్ల రాయలసీమ జనాభా వృద్ధిలో కూడా స్తబ్దత ఉంది. కోస్తాలో సగటున చ.కి కు 367 మంది ఉంటే ఆ సంఖ్య రాయలసీమలో 213 మాత్రమే. ఇలా ప్రభుత్వ సంస్థల అధ్యయనాలు లెక్కల ప్రకారం రాయలసీమ ప్రతి రంగంలో కోస్తా కంటే వెనుకబడే ఉంది. ఇంతటి భిన్నత్వం ప్రత్యేకతలు సంతరించుకున్న రాయలసీమ సమాజం కొత్త రాష్ట్రంలో తన వికాసానికై ప్రత్యేక అవసరాలకు అనుగుణంగా విధానాల రూపకల్పనను కలిగి ఉండడం చాలావసరం.

**2008-09 నాటికి కోస్తాంధ్రా రాయలసీమ ప్రాంతాల్లో 2ఎం(1), 2ఎం(2) సెక్షన్ల ప్రకారం రిజిస్టర్ అయిన పరిశ్రమలు**

| | పరిశ్రమలు | కార్మికులు |
|---|---|---|
| కోస్తాంధ్ర | 7,470 | 2,84,755 |
| రాయలసీమ | 2,502 | 73,312 |
| మొత్తం | 9,972 | 3,58,067 |

పట్టికలో ఉన్నవాటితో పాటు కోస్తాంధ్రలో పాడి పరిశ్రమ, కోళ్ల పరిశ్రమ, మత్స్యపరిశ్రమతో పాటు వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు కూడా ఉన్నాయి. అందుకని కొత్త రాష్ట్రంలో మొత్తంగా వందేళ్ల పాటు ఏకపక్షంగా కొనసాగుతూ వచ్చిన అసమ పంపిణీ సాంప్రదాయాన్ని పూర్తిగా తిరగ రాయకుండా రాయలసీమ భవిష్యత్తులో ఏ చిన్న మార్పును కూడా ఊహించలేం.

అసలు కొత్త ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు బీజప్రాయంలోనే తెలంగాణ బిల్లు కోస్తాంధ్ర సంపన్న పెట్టుబడిదార్ల అభివృద్ధి ప్రణాళికగా తయారైంది. 1956కు ముందు రాయలసీమలో ఉన్న రాజధానిని యథావిధిగా తిరిగి రాయలసీమలోనే పెట్టాలనే న్యాయమైన పద్ధతిని దిగ్విజయంగా నిరాకరించిన కోస్తా నాయకత్వం ఇంకో అడుగు ముందుకేసి కొత్త రాజధానికి కోస్తా అన్ని విధాల అనుకూలమంటూ వారి పెరటి తోటలోని మీడియా ద్వారా రాయలసీమ మెదళ్లను లొంగతీసుకునే పనిని ఎంతో చురుగ్గా చేస్తున్నారు. అందుకే తెలంగాణ రాష్ట్ర ఆమోదం సందర్భంగా 45 రోజుల్లో కొత్త రాజధాని అని చెప్పిన కేంద్ర మంత్రివర్గం ప్రభువులు, చివరికి కోస్తా పెట్టుబడిదారులు రాయలసీమ పాలక ముఠాల మధ్య కుదిరిన ఒప్పందంలో భాగంగా రాజధాని ఏర్పాటును మరో 6 నెలల కాలానికి పొడిగించారు. ఇక్కడ దీని వెనుక దాగి ఉన్న ఉద్దేశం ఏమిటంటే ఈలోపు ఎన్నికలు ముగిసి కొత్త రాష్ట్ర ముఖ్యమంత్రి ఎటూ రాయలసీమ వాడే ఉంటాడు కాబట్టి అప్పుడు రాజధానిని కోస్తాలో పెట్టుకోడానికి మార్గం సుగమం అవుతుంది. ఎందుకంటే ముఖ్యమంత్రి మీవాడే కదా అంటే సీమప్రజలు నిజమే కదా అని దానిని వ్యతిరేకించే అవకాశం ఉండదు. ఒకవేళ శ్రీబాగ్ ఒప్పందం ప్రకారం రాజధాని మాకే కావాలనే డిమాండును సీమప్రజలు లేవనెత్తితే అప్పుడు ముఖ్యమంత్రిగా ఉండేది సీమకు చెందినవాడే కాబట్టి ఆ డిమాండును తొక్కిపెట్టడం కూడా చాల సులువు.

ఏ ప్రాంతీయ అసమానతలు, వివక్షతలు తెలంగాణ ప్రజలు వేరే రాష్ట్రంగా విడిపోవడానికి కారణమో అవే అసమానతలు వివక్షతలు కోస్తా నుండి రాయలసీమకు ఉన్నప్పటికీ కనీసం తెలంగాణ గుణపాఠం నేపథ్యంలో కొత్త ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు సందర్భంగా కేంద్రం వాటిని పరిష్కరించి ఉండాల్సింది. అయితే అందుకు భిన్నంగా అసమానతలను మరింత తీవ్రతరం చేసింది. స్వయానా కేంద్రమే వేసిన శ్రీకృష్ణ కమిటీనే రాయలసీమ వెనకబాటుతనాన్ని అంగీకరించింది. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే చివరికి శ్రీకృష్ణ కమిటీ కూడా రాయలసీమ వెనుకబాటును గురించి చెప్పింది తెలంగాణ రాష్ట్ర డిమాండును

**రాయలసీమ, కోస్తాంధ్రల మధ్య ఉన్న అసమానతలకు కొన్ని సాక్ష్యాలు**

| | కోస్తాంధ్ర | రాయలసీమ |
|---|---|---|
| సగటు వర్షపాతం | 1100 మి.మీ | 700 మి.మీ |
| కృష్ణా జలాల కేటాయింపు | 527 టి.ఎం.సిలు | 140 టి .ఎం.సి లు |
| గోదావరి జలాల కేటాయింపు | 580 టి.ఎం.సిలు | ఒక చుక్క కూడా లేదు |
| సాగుభూమి (లక్షల ఎకరాల్లో) | 119.17 | 98.95 |
| కాలువల కింద సాగు అయ్యే భూమి (లక్షల ఎకరాల్లో ) | 71.64 | 13.44 |

తిరస్కరించడం కోసం తప్ప రాయలసీమ మీద ప్రేమతో కాదు. తెలంగాణలో ఉద్యమం ఉంది కాబట్టి దాన్ని పరిష్కరించిన కేంద్రం, దానికి ప్రతిగా కోస్తా పెట్టుబడిదారులకు కావలసినన్ని వరాలు ఇచ్చింది. కోస్తా పెట్టుబడిదారులకు దళారులుగా ఉన్న రాయలసీమ పాలక ముఠాలకు కొత్త రాష్ట్రంలో పదవుల భరోసా సమకూర్చింది.

సగటు వర్షపాతం 1100 మి.మీ.తో పాటు అపారమైన భూగర్భ జలాలు సైతం ఉన్న కోస్తాంధ్రకు కృష్ణానది జలాల్లో 80 శాతం హక్కుగా ఉన్నాయి. కేవలం 700 మి.మీ వర్షపాతంతో ప్రపంచంలోని అన్ని కరువులకు పుట్టినిల్లై, భూగర్భ జలాశయాలు సైతం అడుగంటిన రాయలసీమకు మాత్రం కేవలం 140 టి.ఎం.సి.లే హక్కుగా ఉన్నాయి. వాస్తవానికి ఖరీఫ్‌లో ఉండే వర్షపాతం 350 మి.మీ మాత్రమే. ఇంత తక్కువ వర్షపాతంతో జొన్న, కొర్ర, వేరుశనగ కుడా సరిగా పండవు. రాష్ట్రంలో సాగయ్యే 13లక్షల హెక్టార్ల వేరుశనగ పంటలో రాయలసీమ లోనే 11 లక్షల హెక్టార్లు సాగవుతుంది. ఒక్క అనంతపురం జిల్లాలోనే 8 లక్షల హెక్టార్లు ఉంది. జూన్ నెలలో ఒక వర్షం వచ్చినా రాయలసీమ రైతులు వేరుశనగ పంట వేస్తారు. ఆ తరువాత వర్షం రాక అది ఎండిపోవడం, చేసిన అప్పులు తీర్చలేక కుటుంబం గడవక అవమానాలతో ఆకలితో ఆత్మహత్యలకు పాల్పడడం రాయలసీమ చరిత్రంతా ఇదే. ప్రపంచంలో ఎక్కడైనా భూమిలో విత్తనం వేసిన రైతులు పంట దిగుబడి కోసం ఎదురుచూస్తారు. కానీ రాయలసీమ రైతులు పంట వేయగానే కరువును మానసికంగా ముందే అంగీకరించి ఇన్సూరెన్స్, నష్టపరిహారం వస్తుందా అని ఎదురుచూస్తారు. ఇంతటి కనాకష్టంతో సీమ ప్రజలు బతుకుతుంటే కాసింతైనా జాలి చూపి నీళ్లివ్వడానికి కోస్తాంధ్ర పాలకులు ఒప్పుకోక నిరాకరించి రాయలసీమ నాయకులకు ముఖ్యమంత్రి పదవులు మాత్రం ఇవ్వడం ఏమిటి? ఇక గోదావరి జలాల్లో ఆంధ్రప్రదేశ్‌కు వచ్చే 580 టిఎంసిల వాటాలో ఏకంగా నూరు శాతం కోస్తాకే హక్కు భుక్తం అయి ఉన్నాయి. కనీసం ఈ అన్యాయాన్ని ఎత్తిచూపే గుండె ధైర్యం ఏ ఒక్క రాజకీయ పార్టీకి లేకపోవడం రాయలసీమ ప్రజల దౌర్భాగ్యం.

రాయలసీమ కరువు నివారణకై 1878లో బ్రిటిష్ ప్రభుత్వం పామిన్ కమిషన్ వేసింది. 1938 రాజాజీ ప్రభుత్వం వేసిన పామిన్ కోడ్ మొదలు వేసిన ప్రతి కమిటీ చావు బతుకుల నుండి రాయలసీమ సమాజం విముక్తి కావలంటే ఉన్న ఏకైక మార్గం కృష్ణానదీ జలాలు రాయలసీమకు మళ్లించడమే అని చెప్పాయి. కానీ ఆంధ్రప్రదేశ్ పాలకులు కాదు కదా భారత ప్రభుత్వం కూడా ఈ పని చేయడానికి ఇష్టపడలేదు. బాధాకరమైన విషయం ఏమిటంటే బ్రిటిష్ ప్రభుత్వం రూపొందించిన నీటి పారుదల పథకాల కంటే, స్వాతంత్ర్యం అనంతరం రాయలసీమ వాడుకుంటున్న సాగునీరు చాల తక్కువ. ఇలాంటి నేపథ్యంలో ఎట్లా చూసినా తక్షణం కృష్ణా నదీ జలాల పునః పంపిణీ జరిగి దాదాపు కోటి ఎకరాల సాగు యోగ్యమైన భూమి ఉన్న రాయలసీమకు కృష్ణా జలాలను నూరు శాతం కేటాయించడం అత్యవసరం. దీన్ని ప్రాంతాలకు అతీతంగా దేశంలోని ప్రతి మనిషి సమర్థించాలి. కోస్తా ప్రాంతం కృష్ణానదిపై హక్కులు వదులుకొని కృష్ణా కంటే సమృద్ధిగా నీరున్న గోదావరిపై ఆధారపడాలి. అంటే రాయలసీమకు కృష్ణా, కోస్తాకు గోదావరి. నిజానికి అసలు సిసలైన సమన్యాయం అంటే ఇదే. ఇక రాజధాని కూడా శ్రీభాగ్ ఒప్పందం ప్రకారం రాయలసీమకే వదిలిపెట్టాలి. కొత్త సచివాలయంతో పాటు అన్ని రాష్ట్రస్థాయి కార్యాలయాల ఉద్యోగ నియామకాల్లో న్యాయమైన వాటా కల్పించాలి. అంతేగాక అన్ని క్యాటగిరీల ఉద్యోగాల భర్తీ రాష్ట్ర స్థాయిలో కాక ప్రాంతీయ స్థాయిలో జరగాలి. ఉద్యోగ ప్రమోషన్లలో కూడా ఇదే సూత్రాన్ని అమలుచేయాలి. ఇంత పక్కగా ఏర్పాట్లు జరగక పోతే విద్యారంగ అభివృద్ధిలో రాయలసీమ కంటే వందేళ్లు ముందుండి అన్ని విభాగాల కీలక అధికార హోదాల్లో పదవులు అనుభవిస్తున్న కోస్తా ప్రాంతంతో రాయలసీమకు కచ్చితంగా అన్యాయమే జరుగుతుంది. ఎందుకంటే ఎపిపిఎస్‌సి, యూనివర్సిటీలు, డైరెక్టరేట్ వంటి ఉద్యోగ నియామకాల బోర్డుల్లో ఆ ప్రాంతంవారే ఎక్కువగా ఉంటారు కాబట్టి.

ఇక అసెంబ్లీలో కూడా కోస్తా నుండి 123 మంది, రాయలసీమ నుండి 52 మంది శాసన సభ్యుల ప్రాతినిధ్యం ఉంది. దీన్ని శ్రీభాగ్ ఒప్పందంలో ఉన్న ప్రకారం రెండు ప్రాంతాల్లో సమాన ప్రాతిపదికన కాకపోయినా ఉన్న ప్రాంతీయ అసమానతల రీత్యా రాయలసీమలో ఆ సంఖ్యను కచ్చితంగా పెంచాలి. ఎందుకంటే అధిక సంఖ్యా బలంతో పాటు ప్రాంతీయ స్పృహ, చైతన్యం ఉన్న కోస్తా ప్రాంతం కింద రాయలసీమ ప్రయోజనాలు అన్యాయమైపోతాయి గనక. మరో ముఖ్యమైన అంశంగా రాయలసీమ జిల్లాల సంఖ్య కూడా పెంచవలసిన అవసరం ఎంతో ఉంది. 165.80 లక్షల ఎకరాల విస్తీర్ణం ఉన్నా రాయలసీమకు కేవలం నాలుగు జిల్లాలే ఉన్నాయి. 229.62 లక్షల ఎకరాలు ఉన్న (జనావాసానికి పనికిరాని సముద్ర తీరంతో కలిపి) కోస్తాకు తొమ్మిది జిల్లాలు ఉన్నాయి. కాబట్టి కొత్త రాష్ట్రంలో తక్షణం జరగవలసిన పని రాయలసీమ జిల్లాల సంఖ్యను ఎనిమిదికి పెంచడం.

కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి కేంద్రం ఇచ్చే రైల్వే ప్రాజెక్టులన్నింటిని కనీసం పది సంవత్సరాల పాటు రాయలసీమకు కేటాయించాలి. రాయలసీమలో కొత్త రైల్వే లైన్ల ఏర్పాటు అత్యవసరం. 1926లో మొదటి యూనివర్సిటీ ఆంధ్రలో పెట్టారు కాబట్టి ఇప్పుడు కేంద్రం ఇచ్చే మొదటి సెంట్రల్ యూనివర్సిటీని రాయలసీమలోనే పెట్టాలి. అపార ఖనిజ సంపద ఉన్న రాయలసీమలో వాటి అనుబంధ పరిశ్రమలు ఏర్పాటు కావలంటే బడ్జెట్ కేటాయింపుల్లో రాయలసీమ పారిశ్రామిక అభివృద్ధికి మొదటి ప్రాధ్యాన్యత ఇవ్వాలి. ఈవిధంగా ఆంధ్ర, రాయలసీమల మధ్య న్యాయమైన ఒప్పందాలు జరిగినప్పుడే కొత్త రాష్ట్రంలో రాయలసీమకు భవిష్యత్తు ఉంటుంది. ఆ వైపుగా తెలుగు ప్రజల ఐక్యత తెలుగు జాతి వికాసాల గురించి తపనపడే ప్రతి మనిషి అడుగులేయాలి. కోస్తా నుండి ఇంకొక వాదన కూడా వినిపిస్తూ ఉంది. రాయలసీమ వాళ్లు మాతో ఉంటే ఉండవచ్చు, లేకుంటే వెళ్లిపోవచ్చు గాని, ఇవి కావలి అవి కావలంటే కుదరదంటున్నారు. ప్రకృతిసిద్ధంగా వచ్చిన నదీ జలాలు ఎవరి సొంతం కాదు. సహజ న్యాయసూత్రాల ప్రకారంగానైనా ఎవరికి కరువు ఉందో, ఎవరికి వర్షపాతం తక్కువుందో వాళ్లకు నీళ్లమీద హక్కు ఉంటుంది. మరి ఆ ప్రకారంగా సిద్ధపడి రాయలసీమ రాష్ట్ర ఏర్పాటుకు సహకరించాలి. రాయలసీమ ప్రజల్లో ఇప్పుడు చైతన్యం లేకపోవచ్చు, కాని చరిత్ర ఎప్పటికీ ఒకేలా నడవదు.

*(రచయిత రిసెర్చ్ స్కాలర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎకనామిక్స్, యోగి వేమన యూనివర్సిటీ, కడప, కన్వీనర్ రాయలసీమ విద్యార్థి వేదిక)* వీ

# దేశం మనది, రక్షణ అమెరికాది

***భారతదేశం అమెరికాతో చేసుకున్న ఆయుధ సంబంధ ఒప్పందాలు ఆ దేశ బహుళజాతి ఆయుధ తయారీ సంస్థలకు లాభాలు చేకూర్చేవే తప్ప ప్రజలకు ఎటువంటి ఉపయోగం లేదని అంటున్నారు*** **వి. హనుమంతరావు**

ఏ దేశ రక్షణ అయినా, ఆ దేశ ప్రభుత్వానిది. అంటే మన్మోహన్ సింగ్, సోనియాగాంధీలు కాదు. వారు నిర్దేశించిన విధానాల పరిధిలో రక్షణ శాఖ ఆ బాధ్యతను నిర్వర్తిస్తుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సైనికులది, అంటే మన బిడ్డలు. ఈ ఆధునిక యుగంలో భూమ్మీద, ఆకాశంలో, సముద్రంలో రకరకాల ఆయుధాలతో రక్షణ బాధ్యతను నిర్వర్తిస్తుంటారు. ఈ రక్షణశాఖ ఎప్పుడూ, ఎల్లప్పుడూ ప్రభుత్వ రంగంలో ఉండాలని దేశ ప్రథమ ప్రధాని నిర్దేశించారు. ఆ విధానానికనుగుణంగా ఆయుధాలు తయారు చేసే పరిశ్రమలకు పునాదులు ఆయనే వేశారు.

దేశ రక్షణలో ఒక ముఖ్యమైన అంశం ఇరుగు పొరుగు దేశాలతో సత్సంబంధాలు కలిగి ఉండడం. కానీ, భారతదేశం స్వతంత్ర దేశంగా ఏర్పాటులో భాగంగా పాకిస్తాన్ విడిపోవడంతో సరిహద్దు సంఘర్షణలు యుద్ధానికి దారితీయడం, 1962లో చైనాతో సంఘర్షణ, బర్మాలో సైనిక పరిపాలనను, శ్రీలంకతో తమిళుల సమస్య, బంగ్లాదేశ్ ఏర్పాటు సందర్భంలో యుద్ధం చేయాల్సిన పరిస్థితి – ఇలా మొదటి మూడు దశాబ్దాల్లో సరిహద్దుల్లో ఉన్న దేశాలతో సత్సంబంధాలు నెలకొల్పుకొనే అవకాశమే లేని నేపథ్యంలో మన దేశ రక్షణకు బడ్జెట్లలో గణనీయమైన వాటా రక్షణ శాఖకు కేటాయించాల్సి రావడం జరిగింది. బంగ్లాదేశ్ ఏర్పాటు సందర్భంలో జరిగిన యుద్ధం తర్వాత ఇప్పటి వరకు మరో యుద్ధం జరక్కపోయినా, రక్షణ శాఖ బడ్జెట్ పెరుగుతూనే రావడానికి ముఖ్య కారణాలు. అమెరికా పాకిస్తాన్‌కు ఆధునిక ఆయుధాలు సరఫరా చేయడం, చైనాతో సత్సంబంధాలు నెలకొనకపోయినా, ఎప్పుడేమి జరుగుతుందనే భయం, పాకిస్తాన్‌తో దోస్తీ – ఈ రెండూ కారణంగా, మన దేశం కూడ ఆయుధీకరణ కొనసాగించడమే కాకుండా పాకిస్తాన్ ఏ మేరకు అమెరికా సహాయంతో ఏ మేరకు ఆయుధాల ఆధునీకరణ మేరకైనా మన దేశం కూడా ఆయుధాల ఆధునికీకరణ చేసుకోవాలనే నిర్ణయం మన రక్షణ శాఖ బడ్జెట్ పెరుగుదలకు అవధులు లేకుండా పోయాయి. ముఖ్యంగా సామాన్య ప్రజల జీవన ప్రమాణాల మెరుగుదలకు ఖర్చు చేయాల్సిన నిధులు రక్షణ శాఖ ఆధునీకరణ కోసం మళ్లించబడ్డాయి. దీనికి తోడు పారిశ్రామికవేత్తల అనుకూల విధానాలను అవలంబించడం ప్రారంభమై, ప్రజల కోసం చేయాల్సిన ఖర్చుకు కోతపడిందనే విషయం ఇక్కడ అప్రస్తుతం.

పచ్చగడ్డి వేస్తే భగ్గుమని మండే పరిస్థితులు పెట్టుబడిదారీ విధానాన్ని ప్రపంచ వ్యాపితంగా విస్తరించాలని అమెరికా లక్ష్యమైతే, సోషలిజం పరిధిలోకి తీసుకురావాలని సోవియట్ యూనియన్ – వీరిద్దరి మధ్య ఏర్పడిన పరోక్ష యుద్ధ పరిస్థితులను భారతదేశానికి అనుకూలంగా ఉపయోగించుకోవాలనే వ్యూహంతో, అమెరికా పాకిస్తాన్‌కు ఆయుధ సరఫరా చేస్తే, మనదేశం సోవియట్ యూనియన్ వైపు దృష్టి సారించింది. ఆ దేశం నుంచి ఆధునికాయుధాల కొనుగోలు ప్రారంభించింది. ఈ మార్పును గమనించిన అమెరికా కావాలంటే మీక్కూడా ఆయుధాలు సరఫరా చేస్తాం అని రంగంలో దిగిందంటే దానికి నాలుగు కారణాలు – అమెరికాలో ఆయుధ సామగ్రి తయారు చేసే బహుళజాతి సంస్థలు అమెరికా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకొని రావడం; ఆయుధాల కొనుగోళ్లలో పాకిస్తాన్ – ఇండియా మధ్య పోటీ పెట్టి అమెరికా ఆయుధ బేహారులకు లాభాలు చేకూర్చడం; రక్షణ ఆయుధాల తయారీలో దేశీయంగా స్వయం పోషకత్వం సాధన దిశగా (అదెంత చిన్న ప్రయత్నమైనా) దేశం చేస్తున్న ప్రయత్నాన్ని మొగ్గలోనే తుంచివేయడం; రష్యా ఆధారిత కొనుగోళ్లను దెబ్బతీసి తనవైపు దృష్టి సారించేలా చేయడం.

ఇందుకు దేశం ఆర్థిక పరిస్థితి గతి తప్పడం తోడ్పడింది. ఇందిరా గాంధీ రెండవసారి అధికారంలో ఉన్నప్పుడు ఆ క్లిష్ట పరిస్థితి నుంచి బయట పడడానికి అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) నుంచి రుణం తెచ్చుకోవడాన్ని గమనించిన అమెరికా పావులు కదపడం ప్రారంభించింది. చంద్రశేఖర్ ప్రభుత్వం దేశ కోశగారంలో ఉన్న బంగారాన్ని బ్రిటన్‌లో కుదువపెట్టి రుణం తెచ్చుకోవడం వరకు తెర వెనుక నుండి, కుడితిలో పడ్డ ఎలుక చందంగా దేశం గిలగిలలాడుతున్న తరుణంలో తన పరోక్ష ఆయుధమైన ప్రపంచ బ్యాంక్ అనే చెక్‌మేట్‌తో దేశంలో ప్రవేశించింది. అంతవరకు ఆసియా దేశాల పరిరక్షణ సంస్థకు అధ్యక్షుడిగా ఉన్న మన్మోహన్‌సింగ్ బోర్డు తిప్పేసి, బ్యాంకు నిధులను షరతులతో తెచ్చుకొనేలా పి.వి. నరసింహారావును ఒప్పించి, మునిగి పోతున్న దేశ నావను ఒడ్డుకు చేర్చాడు. స్వతంత్ర భారతం పరాధీన భారతమైపోయింది. అమెరికాధీన భారతదేశంగా మారిపోయింది.

ప్రస్తుత తరం భారత ప్రజలకు ఆ తర్వాత జరుగుతూ వచ్చిన పరిణామాలు, మార్పులు, వ్యవసాయంలో స్వయం పోషకత్వాన్ని సాధించిన దేశాన్ని పరాధీన దేశంగా మార్పుకు, పరిశ్రమల రంగాన్ని కార్పొరేటీకరణను ప్రోత్సహించే వైపుగా మళ్లించడం లాంటి చర్యలను మన్మోహన్‌సింగ్ చేపట్టేలా ప్రత్యక్ష పరోక్ష ఒత్తిడులను పెంచడం నిత్యకృత్యమైపోయింది. ఇవన్నీ భారతదేశం ఆర్థికంగా అమెరికా ఆధారపడడం ఒక ఎత్తు అయితే, ప్రస్తుత రాష్ట్రపతి, అప్పటి రక్షణశాఖ మంత్రి ప్రణబ్ ముఖర్జీ 2005లో అమెరికా వెళ్లి దేశ రక్షణ శాఖలో అమెరికా ప్రవేశానికి ఒప్పందం చేసుకొని రావడంతో రక్షణ రంగంలో కూడ దేశం పరాధీన భారతమైపోయింది. రక్షణ శాఖ కేంద్ర ప్రభుత్వ

ఆధీనంలో ఉండాలని నెహ్రూ విధాన నిర్ణయం చేస్తే, అదే పార్టీకి చెందిన మన్మోహన్ ప్రభుత్వం, నెహ్రూ కుటుంబ వారసురాలిగా చక్రం తిప్పుతున్న సోనియాగాంధీ చూస్తుండగానే అమెరికా నిర్దేశిత రక్షణ ఆయుధాల ఆధారిత దేశంగా దిగజారిపోయింది. స్వతంత్రమా, నీవెక్కడ? ఈ ఆధారిత పరిణామాన్ని గురించి ఇంగ్లిష్ పత్రికల్లో, విదేశాల నుంచి వచ్చే వార, పక్ష, మాస పత్రికల్లో వార్తలు, వ్యాఖ్యలు పుంఖాను పుంఖాలుగా వస్తున్నా, తెలుగు పత్రికల్లో చోటు చేసుకోకపోవడం విచారకరం. ఈ విదేశీ ఆయుధ ఆధారిత రక్షణ శాఖ భారత – అమెరికా సంబంధాల గురించి విశ్లేషిస్తూ తరచుగా 'హిందూ' పత్రికలో రాసే కాలమిస్టు బ్రహ్మ బెలానీ జనవరి 14న రాసిన వ్యాసంలో వెల్లడించిన విషయాలను తెలుగు పాఠకులతో పంచుకోవడం ఈ వ్యాసం ఉద్దేశం. పైన చెప్పినదంతా నేపథ్యం మాత్రమే. 'ఆయుధీకరణలో పరాధీనత వైపుగా' అనేది ఆ వ్యాసం శీర్షిక.

2005 అణు ఒప్పందంలోనే అమెరికా ఆయుధాల కొనుగోలు విషయం ప్రస్తావించబడింది. ఒక్క దశాబ్ద కాలంలోనే రష్యా, ఇజ్రాయిల్ దేశాల నుంచి ఆయుధాల కొనుగోళ్లను తోసిరాజని, వంద మిలియన్ డాలర్ల విలువగల ఆయుధాలను అమెరికా నుంచి భారతదేశం కొనుగోళ్లు బిలియన్ల డాలర్లకు పెరిగిపోయాయి. నిన్నా, ఇవాళ రాయబార కార్యాలయాల రంధీ జరుగుతున్న సమయంలోనే 1.01 బిలియన్ డాలర్ల విలువగల మిలిటరీ ట్రక్కుల కొనుగోలుకు ఒప్పందాలు చేసుకొంది. మన దేశం కొనుగోలు చేయడానికి మన్మోహన్ సెప్టెంబర్‌లో అమెరికా వెళ్లినప్పుడు ఒప్పందం చేసుకొని వచ్చారు. 2006 నుంచి కేవలం ఏడు సంవత్సరాల కాలంలో కొనుగోలు చేస్తామని మన్మోహన్ చేతుల్లో చెయ్యివేసి వచ్చారు.

ఆయుధాల తయారీలో స్వయం పోషకత్వం వైపు పయనించకుండా రష్యా నుంచి ఆయుధాల దిగుమతి విధానం స్థానంలోనే అమెరికా ఆధారిత విధానాన్ని అవలంబించడం దేశ రక్షణ క్షేమమా అనే ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. ప్రపంచం మొత్తంలో రక్షణాయుధాల వ్యాపారాల్లో పది శాతం భారతదేశానిదే. ఇలా దిగుమతుల మీద ఆధారపడినప్పుడు, ఆ రక్షణాయుధాలకు (ఉదాహరణకు ట్రాక్టర్లు) ఏవైనా విడిభాగాలు అవసరమైతే, మళ్లీ అమ్మకందారు మీద ఆధారపడాల్సి వస్తుందనే విషయం భారత ప్రభుత్వం గమనంలో ఉంచుకొందా? ఒకవేళ యుద్ధమే వస్తే, మన రక్షణ రంగంలో లోటుపాట్ల గుట్టు రట్టవ్వదా? రక్షణ ఆయుధాల కొనుగోళ్లలో అవినీతి (ఉదాహరణ బోఫోర్స్) మయం కావడానికి ఎక్కువ అవకాశాలున్నాయి. అమెరికా తన రక్షణ శాఖ ఖర్చును తగ్గించుకోవడానికి ప్రయత్నిస్తోంది. ఇతర దేశాల్లో రక్షణ ఆయుధాల మార్కెట్ టైట్‌గా ఉంది. ఈ పరిస్థితుల్లో అమెరికాలోని రక్షణ ఆయుధాల తయారీ సంస్థలు భారతదేశం మార్కెట్‌ను కబళించడానికి మరింత గట్టిగా ప్రయత్నిస్తున్నాయి. అమెరికాలో తయారయ్యే ఆయుధ సామగ్రికి గిరాకీ ఒక్క ఇజ్రాయిల్‌ను మినహాయిస్తే భారతదేశమే అతి పెద్ద మార్కెట్. మన దేశ రక్షణశాఖ అమెరికా నుంచి కొనుగోళ్ల మీద ఎంతగా ఆధారపడి ఉందో అర్థమవుతుంది. మరో విషయమేమిటంటే అమెరికా సరఫరా చేసే ఆయుధ సామగ్రి అంతా స్వయం రక్షణకు పనికి వచ్చేవి కాగా, రష్యా సరఫరా చేసేవి దాడిచేయడానికి (అఫెన్సివ్) పనికివచ్చేవి. ఇవీ హిందూ పత్రిక వ్యాసంలో విషయాలు.

ఈ కొనుగోళ్లు, అమ్మకాలతో ప్రజలకు సంబంధమే లేదు. అరవయ్యవ దశకంలో పాకిస్తాన్, చైనాలతో జరిగిన సరహద్దు యుద్ధాల్లో దేశాన్ని రక్షించుకోవడానికి ప్రజానీకం యావత్తూ ప్రత్యక్షంగా, పరోక్షంగా పాల్గొన్నారు. ప్రజలు పాల్గొనడం అసలు సిసలైన దేశ రక్షణ.

*(రచయిత వ్యవస్థాపక సంపాదకులు)* వీ

## వి.ఎచ్ కాలమ్

### పులిని చూసి...

**పు**లిని చూసి నక్క వాతలు పెట్టుకొందన్నట్లు, జపాన్, చైనాల్లో గంటకు 350 కిలోమీటర్ల వేగంతో బుల్లెట్ రైళ్లు నడుస్తాయనే వార్తలు చూసి మనదేశంలో కూడా అలా అంత వేగంతో నడిచే రైళ్లు ప్రవేశపెట్టే ఆలోచన ఏ బ్యూరాక్రాటో మంత్రుల చెవుల్లో ఊదడంతో ఆ దురద వాళ్లకు కూడా అంటుకొంది. ప్రాథమిక చర్యలు ప్రారంభమయ్యే ఉంటాయి. అలాంటి రైళ్లు నడపాలంటే ఎంత ఖరీదవుతుందో తెలుసా? ఇప్పటి రైళ్లలో ప్రయాణించే వారందరూ ఒక సంవత్సరంలో చెల్లించే టికెట్ ఛార్జీలు సంవత్సరానికి సుమారు అరవై వేల కోట్ల రూపాయలు. అంటే ముంబై – అహమదాబాద్ మధ్య (500 కిలోమీటర్లు) హైస్పీడ్ రైలు నడపడానికి కాబోయే ఖర్చు అంచనా (ఈ అంచనా రెండేళ్ల క్రితం వేసినవి) అరవై వేల కోట్ల రూపాయలు. ఇప్పుడీ అంచనా ఎన్ని రెట్లు పెరిగిందో అంచనా వేయడం కష్టం. ఈ హైస్పీడ్ రైలు మీద రైలు ఛార్జీ ఆ కిలోమీటర్‌కు ఆరు నుంచి ఎనిమిది రూపాయలవుతుందని అంచనా. అప్పటి నుంచి అన్ని ధరలు పెరిగాయి. విద్యుచ్ఛక్తి ఛార్జీలు, భూసేకరణ ఖరీదు పెరిగాయి. ఇప్పటి శతాబ్ది ఎక్స్‌ప్రెస్ కన్నా నాలుగు రెట్లు టికెట్ ఛార్జీ ఈ హైస్పీడ్ మీద ప్రయాణం ఖర్చు. ఈ లెక్కన 350 కిలోమీటర్ల వేగంతో ప్రయాణించే రైలు టికెట్ ఖర్చు ఎంతవుతుందో ఊహించుకోండి.

కార్పొరేట్ సంస్థల యజమానులకు వారి సొంత విమానా లున్నాయి. లేకపోతే విమానంలో ప్రయాణిస్తారు. సామాన్యులు ఆ రైలును చూడొచ్చు కాని ప్రయాణం చేయలేరు. మరెవరు ప్రయాణిస్తారు? అలాంటి రైలు మనలాంటి దేశంలో అవసరమా? బిజినెస్ స్టాండర్డ్ పత్రికలో వారం వారం సంపాదకీయం రాసే ఎ.ఎన్.నైనాన్ (ఈయన ఆ పత్రిక మాజీ సంపాదకులు) ప్రకారం ఒక బాంబు తయారు చేయడానికి ఎంత ఖరీదవుతుందో, ఇంకా ఊహ లోకంలో ఉన్న బులెట్ రైలుకు అంత ఖరీదవుతుంది. ఇప్పటికే సూపర్ – ఫాస్ట్ రైళ్లు నడుస్తున్నాయి. హైదరాబాద్ నుంచి ఢిల్లీల మధ్య ఒకే ఒక స్టాప్‌తో నడిచే రైలు నడుస్తున్నాయి. ఎక్కడ దొరికితే అక్కడ అప్పులు తెస్తేనే గాని రోజు గడవని గడ్డు పరిస్థితిలో ఉన్న మన దేశం ఇంత ఖరీదైన బులెట్ ట్రైన్ నడపగలదా? ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీ మోతగా ఉన్న మన దేశానికి ఇలాంటి రైలు అవసరమా? గాలిలో మేడలు కట్టే ఈ ప్రభుత్వం గానీ, వస్తే గిస్తే మోడీ ప్రభుత్వం గానీ ఈ ప్రతిపాదనను అటకెక్కించండి. వీ

# క్రాంతికారీ జనతన సర్కార్

***ఛత్తీస్‌గడ్‌లో ప్రభుత్వం చేస్తున్న ప్రజా సంక్షేమ కార్యక్రమాలలో ఎంత అవినీతి దాగుందో చెపుతూ, అదే రాష్ట్రంలో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా ద్వారా ప్రజల అభివృద్ధికి పాటుపడుతున్న క్రాంతికారీ జనతన సర్కార్ కార్యక్రమాలను వివరిస్తున్నారు*** **వరవరరావు**

ఇటీవల నేను జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో ఒక అంతర్జాతీయ సదస్సులో దండకారణ్యంలో క్రాంతికారీ జనతన సర్కార్ అమలు చేస్తున్నటువంటి ప్రత్యామ్నాయ ప్రజల అభివృద్ధి నమూనా గురించి మాట్లాడాను. అది శ్రమ మీద, సహకారం మీద ఆధారపడి వర్గపోరాటం ప్రాతిపదికగా ఐక్య సంఘటన నాలుగు వర్గాల పొందికతో అమలు అవుతున్నది. ముప్పై మూడేళ్ల క్రితం బస్తర్‌లోకి పీపుల్స్‌వార్ ప్రవేశించింది. అక్కడి ఆదివాసి ప్రజలతో మమేకమై మొదట అటవీ, రెవెన్యూ, పోలీసుల దౌర్జన్యాలను ప్రతిఘటించడంలో ఆదివాసులను చైతన్యపరిచి వారి విశ్వాసాన్ని చూరగొన్నారు. అట్లా అటవీ భూములను పోడు సేద్యంలోకి తెచ్చుకోగలిగారు. అటవీ సంపదపై ఆదివాసుల హక్కులను గుర్తింపచేయగలిగారు. ఆ తరువాత తెగ పెత్తందారులను, భూస్వాములను ప్రతిఘటించి భూస్వాధీనాన్ని ప్రోత్సహించారు. అట్లా మొదలైన భూస్వాధీన కార్యక్రమం విప్లవ భూసంస్కరణలకు బాటలు వేసింది. ఇవాళ బస్తర్‌లో భూమిలేని ఆదివాసి కుటుంబం లేదు. ఇవాళ బస్తర్ మొత్తం మీద భూమిని చదును చేసి, చదును చేసిన భూమిని ఆదివాసులందరికి పంచి, భూమి లేని ప్రజలు ఎవరూ లేకుండా పంపకాలు జరిపి, సహకార స్థాయిలోనో, సమష్టి స్థాయిలోనో స్థిర వ్యవసాయం చేస్తున్నారు. మాడ్ ప్రాంతంలో మాత్రమే ఇంక కాస్త పోడు వ్యవసాయం ఉన్నది అని చెప్పిన సందర్భంలో 'మీరు చెపుతున్న అభివృద్ధి నమూనా ఆసక్తిదాయకంగా ఉన్నది, ఇందులో స్వావలంబన ఉందంటున్నారు. ప్రజలు, ముఖ్యంగా స్థానిక ఆదివాసులే జనతన సర్కార్ నడుపుతున్నారని చెపుతున్నారు. పార్టీ సహకారం ఉందని మాటంటున్నారు. ఇదంతా బాగానే ఉందని గాని, ఇది ఒక పరిమితమైన స్థలం, ఒక పరిమితమైన కాలం నుంచే నడుస్తున్నది కదా! ఇది తీవ్ర నిర్బంధం వస్తే నిలుస్తుందా? ఎందుకంటే ఉత్తర తెలంగాణలోని ప్రజలు తీవ్ర నిర్బంధంతోనే నిలువలేదనే అంశాన్ని మీరే చెపుతున్నారు. దండకారణ్యం అడవి గనుక మావోయిస్టుల అజ్ఞాత జీవితానికి అనుకూలమైన స్థలం గనుక సాధ్యమైందని అనిపిస్తున్నది. కాని ఈ అభివృద్ధి నమూనాను అమలు చేయడం మాత్రమే కాకుండా, ప్రజలు రాజ్యాధికారం కోసం పోరాటం చేస్తున్నారని, ఇది సాయుధ పోరాటమని బాహాటంగా చెప్తున్నారు, ప్రదర్శిస్తున్నారు. ఇది తమ రక్షణ కోసం చేస్తున్నారు. ఇది నిలుస్తుందా, దీన్ని కాపాడుకుంటారా. శక్తిమంతమైన రాజ్యం, మొనగాడుగా ముందుకు వస్తున్నటువంటి అమెరికన్ సామ్రాజ్యవాదం ముందు. ఎందుకంటే ఇప్పటికింకా అర్ధసైనిక బలగాలు మాత్రమే ఉన్నవి. మాడ్‌లో సైన్యం దిగిందని అంటున్నారు గాని, సైన్యం ప్రత్యక్షంగా పాల్గొనడం లేదు. కశ్మీర్‌లో, ఈశాన్య రాష్ట్రాలలో లాగ. ఇది నిలుస్తుందా అనేది ఒక ప్రశ్న. రెండవది, ఇదంతా సంక్షేమం, అభివృద్ధే కదా, ఇటువంటి సంక్షేమ కార్యక్రమానికి ఏదైనా ఒక రాజకీయ పార్టీ అధికారంలోకి వచ్చి అధికారంలో నిలబడడం కోసమైనా ఇటువంటి సంక్షేమ కార్యక్రమాలను ఇంకా విస్తృత స్థాయిలో చేపట్టవచ్చు, ఎక్కువ కాలం చేయవచ్చు, ఇంకా ఎక్కువ అభివృద్ధి చూపెట్టవచ్చు కదా' వంటి ప్రశ్నలు వేసి, వాళ్లు ఉద్యమం పట్ల సానుభూతి, సంఘీభావం ప్రకటిస్తూనే, ఇదంతా ఆదివాసులు తాముగా నిర్వహించుకుంటున్న జనతన సర్కార్ అని చెపుతున్నారు కాబట్టి ఆదివాసుల మీద ఉండేటటువంటి ప్రేమ, సంఘీభావంతో అంగీకరిస్తూనే, మరి అటువంటప్పుడు ఎందుకు దీన్ని రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవడం అని, సాయుధ పోరాటం అని చెపుతారు? ఇది రాజ్యాన్ని కవ్వించడమే కదా అనే సందేహాన్ని వెలిబుచ్చారు. 'వాళ్లు చెపుతున్నది కూడా అభివృద్ధి గురించే కాదు, అభివృద్ధికే ప్రాధాన్యమిచ్చి నొక్కు దాని మీద ఉండాలని అనడం లేదు. దీని దిశ గురించి ఆలోచించమని అంటున్నారు. దీని దిశ స్వావలంబన. దీని ప్రాతిపదిక వర్గపోరాటం. ఇందులో ఉండేటటువంటి ప్రజలు, ఐక్య సంఘటనలో ఉండేటటువంటి నాలుగు వర్గాల పొందిక. ఇది బయటి సమాజం అర్థం చేసుకోవాలని వారు భావిస్తున్నారు. ముఖ్యంగా, దీని దిశ, పర్‌స్పెక్టివ్‌ను, డైరెక్షన్‌ను పట్టుకోవాలని అంటున్నారు' అని నేను వివరించడం జరిగింది. అయినా వాళ్లు సంతృప్తి చెందలేదు. ముఖ్యంగా ప్రజలు రాజ్యాధికారాన్ని చేపట్టడం, సాయుధ పోరాటం బాహాటంగా ప్రకటించడం అనేది వాళ్లు జీర్ణంచేసుకోలేక పోతున్నారు.

ఈ విషయాలే ఆలోచిస్తున్న క్రమంలో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లి మధ్య పేజీల్లో ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం ప్రకటించిన ఒక రంగు రంగుల ప్రకటన కనిపించింది. అందులో రమణ్‌సింగ్ ఫొటో ఉన్నది. వ్యవసాయ రంగంలో రైతాంగం చాలా పంట దిగుబడి సాధించినట్టుగా, వ్యవసాయంలో పాల్గొన్నట్టుగా ఉన్న చిత్రాలు ఉన్నాయి. అందులో ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం సర్వసమగ్ర అభివృద్ధిని అన్ని సామాజిక రంగాల్లో సాధించిందని, సామాజిక సంక్షేమాన్ని అన్ని వర్గాలకు సమకూర్చి పెట్టిందని, దాని గుర్తింపుగా ఒక నెలలోనే అఖిల భారత స్థాయిలో అగ్రస్థానంలో నిలిచినందుకు ఐదు అవార్డులు పొందిందని ఒక పెద్ద ప్రకటన వేశారు. ప్రభుత్వం మాత్రమే కాదు, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కూడా తన ఇటీవలి ప్రచురణలో 2013–14 బడ్జెట్‌ల అధ్యయనం చేస్తే, ఆయా రాష్ట్రాల ఆర్థిక స్థితిగతులు అధ్యయనం చేస్తే అందులో ఛత్తీస్‌గడ్ ప్రభుత్వమే అగ్రస్థానంలో ఉందని పేర్కొన్నట్లుగా ప్రకటించింది. దాని వివరాలు కూడా, అంటే అభివృద్ధి రేటును ప్రకటించేటటువంటి రిపోర్టులో దేశంలో అన్ని రాష్ట్రాల సగటు 11.4 శాతం ఉంటే ఛత్తీస్‌గడ్ 20.7 శాతంతో ఉన్నదని, అట్లాగే అక్కడి జిఎస్‌డిపి 14 శాతం ఉండి దేశంలోనే సామాజికరంగంలో ఖర్చు అనేది భారతదేశంలోనే అగ్రస్థానంలో ఉందని, ఛత్తీస్‌గడ్ రుణం తిరిగి ఇచ్చేటటువంటి స్థితిలో కూడి మిగిలిన రాష్ట్రాలతో పోల్చితే చాలా సమర్థవంతమైన స్థితిలో ఉన్నదని, అది చాలా సమర్థంగానూ, చాలా వివేకంతోనూ ఆర్థికరంగంలో వ్యవహరిస్తున్నదని ప్రకటించింది. ఆర్థిక రంగంలో సాధించినటువంటి ప్రగతి, సామాజిక ప్రమాణాలను ఉన్నతీకరించడంలో సాధించినటువంటి ప్రగతి విషయంలో మిగిలిన రాష్ట్రాల కంటే చాలా ముందుగా ఉన్నట్టుగా ప్రకటించినట్టుగా ఆ విషయం కూడా అందులో ప్రస్తావించారు.

ఇది ప్రభుత్వ ప్రకటన అని, ఈ రంగు రంగుల ప్రకటనలు అట్లాగే గణాంకాలు అబద్ధాలు అన్నట్టుగా కొట్టిపారేయవచ్చు అని కాసేపు అనుకున్నా,

దీన్ని ఎట్లా విశ్లేషించాల్సి ఉంటుంది అని ఆలోచిస్తుండగానే ఆశ్చర్యంగా మార్చ్ 6, 2014 హిందూ దినపత్రికలో పూర్తిగా దీనికి భిన్నంగా విద్యా రంగంలో సర్వశిక్షా అభియాన్ నిధులు ఛత్తీస్‌గడ్‌లో ఏమవుతున్నాయనే దృశ్యాన్ని సువోజిత్ బాగ్చి ఒక వ్యాసంగా రాశాడు. ఒక వ్యాఖ్యానంగా, ఒక రిపోర్ట్‌గా చెప్పాడు. 'స్కూల్ విత్‌ౌట్ చిల్డ్రన్, చిల్డ్రన్ విత్‌ౌట్ స్కూల్స్' – ఛత్తీస్‌గడ్‌లో పిల్లలు లేని పాఠశాలలు, పాఠశాలలు లేని పిల్లలు – బస్తర్‌లోకి సర్వశిక్షా అభియాన్ నిధులు, లేని పనులకు ప్రవహిస్తున్నాయి అని శీర్షిక పెట్టారు. మళ్లీ ఆయనే ఒకవైపు ప్రధానమంత్రి సలహాదారు టి.కె.ఎన్. నాయర్ ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం విద్యారంగంలో చాలా గొప్ప కృషి చేస్తోందని ప్రశంసించిన రోజే బస్తర్‌లోని దర్భాఘాట్ ప్రాంతంలో కోయన్‌పాద గ్రామంలో ఉన్న ప్రభుత్వ పాఠశాలలో 32 మంది పిల్లలు కనిపించడం లేదు అని రాశారు. పిల్లలు కనిపించలేదు అంటే అక్కడ వాస్తవానికి పాఠశాలే కనిపించలేదు. పాఠశాల కనిపించలేదు అంటే పాఠశాల భవనం కనిపించలేదని కాదు, కాని అక్కడి ఒక అధికారే చెప్పినట్టుగా మావోయిస్టు తిరుగుబాటు అనే నెపం పెట్టుకొని ఇక్కడికి విద్యాశాఖకు సంబంధించిన అధికారులు గాని, అధ్యాపకులు గాని ఎవరు రారు అనే అంశాన్ని కూడ చెప్పాడు. ఈ కోయన్‌పాదలో 2007 నుంచి గ్రామ పంచాయతీ ప్రభుత్వ పాఠశాల నిర్మాణం చేయడానికి 6.45 శాతం నిధులను కేటాయించింది. కాని అక్కడ ఏ నిర్మాణమూ జరగలేదు. మరి కోయన్‌పాదలో మావోయిస్టులు ఏమి లేరు. ఈలోపల దానికి కేటాయించిన నిధులలో దాదాపు నాలుగు లక్షల రూపాయలు పంచాయతీకి చేరినవి. 32 మంది పిల్లలు అక్కడ చదువుతున్నట్టుగా నమోదు అయింది.

మధ్యాహ్నం అయ్యే వరకు ఒక క్రమెట్లు, కొన్ని ఇనుప పాత్రలు ఆ ప్రాంతంలో మనకు కనిపిస్తాయి. ఒక తరగతి గది మేక్‌షిఫ్ట్ క్లాస్‌రూమ్ లాంటి ఒక తరగతి ఉందని మనకి భావన కల్పిస్తారు. అక్కడ పది మంది పిల్లలు మాత్రమే అకామడేట్ కాగలుగుతారు. ఏమిటిదంతా, ఇక్కడ లేని బడి ఉన్నట్లు, ఇక్కడేదో 30 లేదా 40 పిల్లలు మధ్యాహ్న భోజనం చేసినట్టు కనిపిస్తున్నది, చూడబోతే పది మంది పిల్లలు కూడ పట్టరు కదా అని అడిగితే, విద్యార్థులు వచ్చింద్రు, మధ్యాహ్నం భోజనం చేసింద్రు, వెళ్లిపోయింద్రు అని అక్కడ ఉండేటటువంటి ప్రధాన అధ్యాపకుడు కాశీరాం మోర్ చెపుతారు.

ఈ నిధులన్నీ కూడ ప్రభుత్వ సర్వశిక్షా అభియాన్ నుంచి వస్తాయి. స్వయంగా కాశీరాం మోర్ చెప్పిన ప్రకారమే ఇటువంటి కాగితం మీద ఉండేటటువంటి బడులు కోయన్‌పాద గ్రామం దాని చుట్టూ ఉండేటటువంటి గ్రామాల్లో ఎన్నో ఉన్నాయి. మరి లేని పాఠాశాలలకు నిధులు ఎందుకు ఇస్తున్నారు అనేది ఆయన స్వయంగా చెప్పడమేమిటంటే, మీరు ఏవయితే కాగితం మీద బడులని చెపుతున్నారో వాటిని వాస్తవంగా ఉండేటటువంటి బడులుగా మార్చమని నేను ఎన్నో సార్లు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాను, కాని అవి ఏవీ జరగలేదని ఆయన అన్నాడు.

సుకుమా జిల్లాలో ఉండేటటువంటి చింతగుఫా ఆశ్రమ పాఠశాల రెసిడెన్షియల్ స్కూల్‌కు వేరే సమస్య ఉన్నది. కాగితం మీద ఆ బడిలో రెండు వందల మంది విద్యార్థులు చదువుతున్నారు. కాని, ఎట్టి పరిస్థితిలో అక్కడ నలభై మందికి మించి కనిపించరు. ఒక ఉపాధ్యాయుడు ఏం చెబుతాడంటే కొందరికేమో ఆరోగ్యాలు బాగాలేవు, కొందరేమో స్టడీ లీవ్ మీద అంటే అధ్యయన సెలవు మీద పోయారని అంటాడు. గత సంవత్సరం ఇదే విలేకరి మార్చ్ నెలలో రెండు సార్లు ఈ ప్రాంతానికి వెళ్లాడు. ఈ రెండు సందర్భాలలో కూడా ఎప్పుడూ యాభై మందికి మించి అక్కడ విద్యార్థులు కనబడలేదు. ఆ బడుల్లో ప్రతి విద్యార్థికీ నెలకు రు. 950 రాజీవ్‌గాంధీ శిక్షా మిషన్ కింద ఇవ్వబడతాయి. కనుక కాగితం మీద ఈ విద్యార్థుల కోసం రెండు లక్షల రూపాయలు పంపబడుతాయి. వాళ్ల ఆహారం కోసం అనుకోండి, పోషణ కోసం అనుకోండి. కాని ఎప్పుడు యాభై మందికి మించి విద్యార్థులు ఉండరు. పాఠశాలలో నమోదయిన సంఖ్య వంద ఉన్నప్పటికీ తొంభై వేల రూపాయల ఖర్చు ఏ నెల కూడా జరిగే అవకాశం లేదు. ఈ రాజీవ్ గాంధీ విద్యా మిషన్ కింద ఇట్లా అరవై ఆశ్రమ పాఠశాలలు నిర్వహించబడుతున్నాయి.

ఇక్కడికి కొద్ది దూరంలో ఉన్న చింతల్నార్ ఆశ్రమ పాఠశాలలో కూడా ఇటువంటి నిధుల దుర్వినియోగమే కనిపిస్తోంది. ఈ విషయమే గతంలో 'హిందూ పత్రిక'లో రిపోర్ట్ చేసినప్పుడు పదకొండు మంది ఉపాధ్యాయులను తొలగించారు. ఒకే అంతస్తు ఉన్నటువంటి పాఠశాల భవనం నిర్మాణం చేశారు. ఇది జరిగేటప్పటికి ఆదివాసులకు విద్య అనే నెపంతో విపరీతమైన అవినీతి విద్యారంగంలో చోటు చేసుకుంటోంది. నిర్మాణం అవుతున్నప్పుడే ఒక సెప్టిక్ ట్యాంక్ కూలిపోయింది. ఎందుకంటే ఏ మాత్రం నాణ్యత లేనటువంటి సామగ్రిని అందులో వాడారు. ఈ విషయం అక్కడ ఉండేటటువంటి ఒక ఉపాధ్యాయుడు చెప్పాడు. అక్కడ మరుగుదొడ్లు పనిచేయడం లేదు. అక్కడే పాఠశాల ముందున్నటువంటి ఖాళీ స్థలంలో రాత్రిపూట తమ కాలకృత్యాలు తీర్చుకోవడానికి పొమ్మని చెప్తున్నారు, లేదా అడవిలోకి పొమ్మని చెప్తున్నారు. అక్కడ ఉండేటటువంటి కొత్త భవనం పైకప్పు కూలిపోయే స్థితిలో ఉన్నది. అంతటా చీలికలు వచ్చినై. నిర్మాణం కోసం వాడిన సామగ్రి అంతా చవకబారుదని అర్థమవుతూనే ఉన్నది. ఇదంతా ఆ బిల్డింగ్ కాంట్రాక్టర్ పని అని అర్థమవుతూనే ఉన్నది. కారణం ఏమిటని ఆ కాంట్రాక్టర్‌ని అడిగితే, మేం ఏం చేయాలి, మాకు వచ్చే నిధులలో 30 శాతం అధికారులకే ఇవ్వాల్సి ఉంటుందని చెప్పాడు. దీంతో ఏమైపోయిందంటే తాము పంపిస్తున్న నిధుల దుర్వినియోగాన్ని, లంచగొండితనాన్ని, అవినీతిని అరికట్టలేమని భావించిన ఈ రాజీవ్ గాంధీ శిక్షా మిషన్ అధికారులు అట్లైతే ఈ నిధులను తగ్గిస్తే అయిపోతుంది కదా అనే నిర్ణయానికి వచ్చారు. ఈ మిషన్ కోసం వంద కోట్ల రూపాయల నిధులు కేటాయించబడితే ఇప్పుడు మేం పదిహేను కోట్ల రూపాయలు మాత్రమే పంపించాం, ఎందుకంటే ఆ వంద కోట్లు పంపిస్తే మీరు ఎంత తింటారో కదా అని, మీరు ఎంత బుక్కుతారో అని మాకు ఆందోళన అవుతుందని చెబుతున్నారు. ఇది స్వయంగా ఛత్తీస్‌గడ్ రాజీవ్‌గాంధీ శిక్షా మిషన్ ప్రధాన అధికారి రేనా కాంబ్లే చెబుతున్నటువంటి విషయం. ఈ పదిహేను కోట్లు అనేది కూడ టిప్ ఆఫ్ ది ఐస్‌బర్గ్ అంటే పైకి కనిపిస్తున్నటువంటి మంచు శిఖరం లాంటిది. ఎందుకంటే ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం తన బడ్జెట్‌లో 12 శాతం, 54,661 కోట్ల రూపాయల బడ్జెట్‌లో 6550 కోట్ల రూపాయలు పాఠశాల విద్య కోసం కేటాయించింది. ఇందులో అత్యధిక శాతం జీతాలు చెల్లించడానికి పోతది. రెండు వేల కోట్ల రూపాయలు ఆదివాసుల విద్య కోసం ఖర్చు చేయబడతదని స్వయంగా ఛత్తీస్‌గడ్ ప్రభుత్వ విద్యా మంత్రి, ఆదివాసి శాఖ మంత్రి కేదార్ కాశ్యప్ చెపుతూ ఉన్నాడు.

ఇక అంగన్‌వాడీ విషయాలు చూస్తే ఇంతకన్న బలహీనంగా ఉన్నాయి. ఒకవైపు ఆర్థిక సర్వే ఈ అంగన్‌వాడీలకు ఇస్తున్న నిధులతో వృద్ధి రేటు చాలా పెరుగుతుంది అని చెపుతున్నాయి. దక్షిణ బస్తర్‌లో అంగన్‌వాడీలలో చూస్తే ప్రతిరోజు పిల్లలు ఆకలితో గడుపుతున్నారు. పిల్లబాజి, మిస్మా అనే సుక్మా జిల్లాలో రెండు గ్రామాలలో అంగన్‌వాడీలు చూస్తే ఈ పథకం పూర్తిగా విఫలమైనట్టు కనిపిస్తున్నది. పిల్లలు మాల్‌న్యూట్రిషన్‌తో అంటే తీవ్రమైన పోషకాహార లోపంతో బాధపడుతున్నట్టుగా కనిపించింది. ఈ కేంద్రాలు పిల్లలకు బియ్యం, గజ్జి రాకుండా ఉండేటటువంటి సబ్బులు, పప్పు ధాన్యాలు, పల్లీలు, చిక్కుళ్లు, చెరుకు గడలు ఇయ్యాలని నియమం ఉన్నది. కాని ఇక్కడ ఇవేవీ కనిపించవు.

గత రెండు నెలలుగా స్థానిక డిస్ట్రిబ్యుషన్ సొసైటీ నుంచి అంటే పంపకం చేయాల్సినటువంటి సంస్థ నుంచి ఆహారమే రాలేదనని పిల్లబాజి కేంద్రంలో ఉండేటటు వంటి జయంతి బిశ్వాస్ అనే ఉపాధ్యాయుడు చెప్పాడు. పిల్లలు చీలికలు, పీలికలు అయినటువంటి బట్టలు వేసుకున్నారు. వారిదగ్గర ఉండే చదువుకునే పుస్తకాలు, నోట్ బుక్కులు చిరిగిపోయి, గోడ మీద కనిపిస్తున్నాయి.

ఈ కేంద్రంలో పనిచేస్తున్నటువంటి ఒక ఆదివాసి స్త్రీకి ఈ నెల జీతమే రాలేదు. గత రెండు సంవత్సరాలుగా జీతం సరిగా రావడం లేదని బిశ్వాస్ చెప్పాడు. ఇదంతా ఏమిటంటే కాగితం మీద ఉన్నది తప్ప, అంటే ఈ నిధులు కేటాయించినట్టు, ఆహారం పంపినట్టు, జీతాలు ఇచ్చినట్టు కాగితం మీదే ఉంది తప్ప ఆచరణలో ఏమీ లేదు. మరి ఆ మహిళకేమో తనకు జీతం ఇస్తున్నట్టు రాసుకుంటున్నారనే విషయం కూడ తెలవదని అక్కడికి వెళితే తెలిసింది. ఈ పిల్లబాజి, మిస్మా పక్కన ఉన్నటువంటి అంగన్‌వాడీ సరిగ్గా ఉన్నట్టే కనిపిస్తది కానీ, అక్కడ కూడ ఆహారం మాత్రం కనిపించలేదు. అంగన్‌వాడీని బాగానే నిర్వహిస్తున్నది గానీ ఆహారం మాత్రం అందించడం లేదు.

ఇవి కాకుండా ఇక్కడ ఉండేటటువంటి ముఖ్యంగా బస్తర్‌లో ఉండే పిల్లలకు కొన్ని సామాజికమైన, మానసికమైన సమస్యలు కూడా ఉన్నాయి. ఆదివాసులు తమ పిల్లలను ఆశ్రమ పాఠశాలలో పెట్టడమనేది ఇక్కడ చాలా పెద్ద చర్చనీయాంశమైంది. ఎందుకంటే తమ కుటుంబాలకు దూరంగా ఉండే ఈ పిల్లలు మానసికంగా కుంగిపోతున్నారు. కాని వాళ్లకి మానసికమైన చికిత్స చేసేటటువంటి ప్రయత్నం ఎవరూ చేయడం లేదు. యూనిసెఫ్ ఈ విషయంలో కొంత పనిచేయాలని ఆలోచించింది కాని, అది మధ్యలోనే ఆగిపోయింది. దానివల్ల జరిగే మేలుకంటే కీడే ఎక్కువ జరిగింది. ఈ విషయాన్ని అక్కడ ఉండే ఒక ప్రాజెక్ట్ కోఆర్డినేటర్ చెప్పాడు.

అన్నిటికంటే మించింది ఇక్కడ ఉండే మహిళల మీద, పిల్లల మీద జరిగే లైంగిక అత్యాచారం. చాలా విషయాలు బయట పడుతున్నాయి. బీజాపూర్ జిల్లాలోనూ, సుక్మాలోనూ ఆరోగ్యం కోసం పని చేసే రెడ్‌క్రాస్ కేంద్రాలు రెండు మూతపడిపోయినాయి. పాఠశాలల్లో ఎక్కడా ఉపాధ్యాయులు కనిపించరు. జిల్లా కేంద్రాలలోనూ, ప్రధాన నగరాలలోనూ ఉన్న బడులు మినహాయిస్తే బస్తర్ ప్రాంతంలో ఏ సమయంలోనైనా మీరు వెళ్లండి 30 శాతం ఉపాధ్యాయుల కంటే ఏ పాఠశాలలో కనిపించడం అనేది లేనే లేదు. గత కొద్ది సంవత్సరాలుగా రెండు డజన్ల బడులలో ఎన్నడూ ఆ బడులలో ఉండాల్సిన ప్రధాన ఉపాధ్యాయుడు కనిపించలేదు. వాళ్లు ఎప్పుడు ఎందుకు కనిపించరు అనే దానికి వారు చెప్పే కారణం ఏమిటంటే, మేం మాకు వచ్చే టపాల్ తీసుకోవడానికి, ఇవ్వడానికి హెడ్‌క్వార్టర్స్ పోవాల్సి ఉంటుంది. ప్రధాన ఉపాధ్యాయులే కనబడకపోతే ఉపాధ్యాయులు ఎట్లా కనిపిస్తారు అంటే ఈ సమాధానం వస్తుంది. లేదా వాళ్లు శిక్షణ కోసం పోయారని చెపుతారు. లేదా నక్సలైట్లు మమ్మల్ని వేధిస్తున్నారని చెపుతారు. చింతల్నార్‌లోనూ, చింతగుఫాలోనూ ఈ వస్తున్న నిధుల దుర్వినియోగం, తీవ్రమైన లంచగొండితనం గురించి ప్రస్తావిస్తే అక్కడ ప్రధాన ఉపాధ్యాయుల్లో ఒక ప్రధాన ఉపాధ్యాయుడు స్వయంగా సువోజిత్ బాగ్చికే లంచం ఇవ్వడానికి ప్రయత్నం చేశాడు. మీకెంత కావాలంటే అంత డబ్బు ఇస్తానని అన్నాడు. ఇదేమిటి అని అడిగితే సిగ్గుపడుతూ ఇది ఇక్కడి ఆచారమండి అని చెప్పాడు.

రామకృష్ణ మిషన్ నారాయణ్‌పూర్‌లో 1975లో పాఠశాలలు పెట్టింది, చాలా లోతట్టు ప్రాంతంలో. అంటే మాడ్ ఆ ప్రాంతంలో. అవి బాగా నడిచాయి. కాని 1980లో మీరు ఈ పాఠశాలలను మూసేయాలని స్వామీజీలకు మావోయిస్టులు హెచ్చరికలు చేశారు. ఎన్నడూ ఇక్కడ మావోయిస్టులు గత మూడు దశాబ్దాల్లో ఏ ఒక్క ఉపాధ్యాయునికి ఎటువంటి నష్టం కలిగించ లేదు, కష్టం కలిగించలేదు. మరి ఎందుకు ఈ బడులు మూసేయించారు అంటే, ఈ రామకృష్ణ మిషన్ స్కూళ్లలోని ఒక స్కూల్లో అర్ధసైనిక బలగాలు వచ్చి దిగాయి. ముఖ్యంగా అబూజ్‌మడ్‌లోని కుండ్ల అనే చోట ఉండే పాఠశాలలో అర్ధసైనిక బలగాలు వచ్చి దిగాయి. మేము ఈ అర్ధసైనిక బలగాలను వచ్చి ఉండమని కోరలేదు, కాని వాళ్లు వచ్చారు అని మిషన్ వాళ్లు చెప్పారు. ఎన్నికల సమయంలో వచ్చారు అని చెప్పారు. ఇట్లా వచ్చిన వాళ్లు ఇక్కడే శాశ్వతంగా ఉండిపోయే ప్రమాదం ఉంది గనుక మీరు ఇక పాఠశాలలు నడపవద్దని వాళ్లను హెచ్చరించారు. కాని పాఠశాలలో అర్ధసైనిక బలగాలు ఉండడం వల్ల రామకృష్ణ మిషన్ పాఠశాలలు మూసేయమని స్వామీజీలకు చెపుతున్నారు తప్ప ఈ మూడు దశాబ్దాలలో అట్లా లేనటువంటి పాఠశాలలో టీచర్లను మావోయిస్టులు వేధించినట్టు ఒక్క ఉదాహరణ కూడ లేదు. నిధులను దుర్వినియోగం చేయడం, లంచగొండితనం వంటి అననుకూలమైన పరిస్థితులు ఉన్నప్పటికి కూడ బస్తర్‌లో ఆదివాసులు తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలలకి పంపించాలని అనుకుంటున్నారు. తమ పిల్లలు చదవాలని అనుకుంటున్నారు. ఆ చదువులు కూడ ప్రభుత్వ పాఠశాలల్లోనే జరగాలని కోరుకుంటున్నారు. కాని చూడబోతే, రాజ్యానికే, ప్రభుత్వానికే ఇక్కడ మావోయిస్టులు లేదా మావోయిస్టులతో ఘర్షణ అనేది మంచి చదువు ఆదివాసులకు ఇవ్వకపోవడాకి ఒక మంచి సాకుగా కనిపిస్తున్నది.

ఈ విషయంలో పాఠశాల విద్యకు, ఆదివాసుల అభివృద్ధికి బాధ్యుడైనటువంటి మంత్రి కేదార్ కాశ్యప్‌ని అడిగితే బస్తర్‌లో లోతట్టు ప్రాంతాల్లోకి నిధులు పంపించి పాఠశాలలు, అంగన్‌వాడీలు నిర్వహించడం సమస్యగా ఉన్నది. వచ్చే పాఠశాల సంవత్సరం నుంచి కలెక్టర్లనే స్వయంగా వెళ్లి అక్కడ పర్యవేక్షించమని చెపుతాను, అక్కడ ఉపాధ్యాయులను గ్రామసభలకు తమ హాజరు చెప్పాల్సిందిగా కూడా సమాచారం పంపిస్తాను. ఎందుకంటే గ్రామస్తులు టీచర్లు వస్తున్నారో లేదో చెపుతారు. వాళ్లకు ఉండే ఫిర్యాదులేవో చెపుతారు. ఏమైనా సరే విద్యాశాఖ పర్యవేక్షణాధికారి అక్కడికి వెళ్లాల్సి ఉంటది. బస్తర్‌లో మూడు వేల ఆదివాసి ఆశ్రమ పాఠశాలలు ఉన్నవి, ఆదివాసి శాఖ కింద. అవి కాక రెండు వందలు, రెండు వందల యాభై వేరే పాఠశాలలు ఉన్నవి. వాటికి ప్రాథమిక పాఠశాల విద్యాశాఖ నుంచి నిధులు అందుతున్నాయి. ఆదివాసి ఆశ్రమ పాఠశాలకు రెండు వేల కోట్ల రూపాయల నిధులు అందుతున్నాయి. ఆదివాసి అభివృద్ధి కోసం స్వతంత్రమైనటువంటి నిధుల ఏర్పాటు జరుగుతున్నది. ఇవి సరిగా ఖర్చు అయ్యేటట్టు కూడా మేం చూస్తాం అని అన్నాడు కాని, కలెక్టర్ వెళ్లడం అనేది ఒక పెద్ద రక్షణ బలగం లేకుండా జరుగదు. ఏ సహాయమైనా, సాంఘిక సంక్షేమమైనా, ఆదివాసి సంక్షేమమైనా ఆదివాసి లోతట్టు ప్రాంతాలకు పోవడమంటే అదొక పెద్ద ఆర్భాటం తోటి, జయరాం రమేశ్ భాషలో భద్రతతో 'కూడిన అభివృద్ధి' అనే రూపంలో అర్ధసైనిక బలగాలతో పోతుంది. అర్ధసైనిక బలగాలు ఆదివాసి లోతట్టు ప్రాంతాలకు పోవడమంటే దాడికి పోవడంగానే అక్కడి ఆదివాసులు భావిస్తారు. కనుక వాస్తవానికి ఆదివాసుల సంక్షేమానికి ఆ సంక్షేమం అమలు కావడానికి మధ్యన సైన్యం అనేది ఒక పెద్ద ఆటంకంగా ఉంటూ ఉన్నది. ప్రభుత్వం నిధులు కేటాయిస్తూ, అవి ఖర్చు కాకుండా తన అధికార యంత్రాంగమే తినడానికి మావోయిస్టులను సాకుగా చూపుతున్నది. కనుక వేల వేల కోట్ల రూపాయలు ఆదివాసుల పేరుతో ఖర్చు అయ్యేటటువంటి ఒక అభివృద్ధి నమూనాకు స్వయంగా క్రాంతికారీ జనతన సర్కార్ నాయకత్వంలో శ్రమ, సహకారం, సమష్టి భావన అనే భావనే ప్రధాన నిధి అయిన అభివృద్ధి నమూనాకు మధ్యన ఉన్నదే అసలైన ఘర్షణ. చాలా విచిత్రంగా నిధులు చేరి దుర్వినియోగం అయి, లంచగొండి తనానికి తావయ్యే స్థితికి అర్ధసైనిక బలగాలు కారణమైతే, ఇటువంటి నిధులు ఏవీ అవసరం లేకుండా జనతన సర్కార్ నిర్ణయాలు అభివృద్ధి క్రమంలో అమలు కావడానికి అక్కడి ప్రజాసైన్యం దోహదం చేస్తున్నది. కనుక క్రాంతికారీ జనతన సర్కార్ ప్రజాసైన్యం రక్షణలో అభివృద్ధి కార్యక్రమాలను అమలు చేసి, స్వావలంబన, శ్రమ సహకారంతో అభివృద్ధిని సాధించడం అనేది వర్గపోరాటాన్ని అర్థం చేసుకుంటే తప్ప అర్థమయ్యే స్థితి కాదు. వర్గపోరాటం, దానికి ఎదురుగా ఒక రాజ్యం, దోపిడీ పాలకవర్గాలకు అండ ఇచ్చే ఒక రాజ్యం నిలబడిందనే విషయాన్ని మళ్లీ వర్గ దృష్టితో చూస్తే తప్ప, ఒక ప్రజాస్వామ్య దృష్టితో చూస్తే తప్ప ఇందులో ఇమిడి ఉండేటటువంటి అంశం ఏమిటో బుద్ధిజీవులు అర్థం చేసుకోవడం సాధ్యం కాదు.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం నాయకులు)* వీ

# మన కాలానికి కావలసిన అంబేద్కర్

*అంబేద్కర్ రచన 'అనిహిలేషన్ ఆఫ్ కాస్ట్' తాజా ప్రచురణ సందర్భంగా చెలరేగిన వివాదాన్ని విశ్లేషిస్తున్నారు*

**ఆనంద్ తెల్ తుంబ్డె**

'మనకు అంబేద్కర్ కావాలి, ఇప్పుడే, తక్షణమే' అని ఔట్‌లుక్ పత్రిక (మార్చ్ 10, 2014)లో అచ్చయిన ఇంటర్వ్యూలో అరుంధతీ రాయ్ అన్నారు. అంబేద్కర్ రాసిన 'ది అనిహిలేషన్ ఆఫ్ కాస్ట్' వివరణలతో కూడిన కొత్త కూర్పును న్యూఢిల్లీ ప్రచురణ సంస్థ నవయాన ప్రచురించిన సందర్భంగా ఆమె ఈ మాట అన్నారు. ఆ పుస్తకానికి ఆమె 'ది డాక్టర్ అండ్ ది సేంట్' పేరుతో 164 పేజీల పరిచయం రాశారు. మూల గ్రంథం దాదాపు వంద పేజీలది మాత్రమే కాగా, ప్రస్తుతం అది 415 పేజీల ఉద్గ్రంథమైంది.

**వివాదం**

ఆమె రాసిన పరిచయం ఇప్పటికే దళిత బృందాలలో అనవసరమైన వివాదాన్ని సృష్టించింది. అప్పుడప్పుడే దళిత సాహిత్యం ఆవిర్భవిస్తున్న 1970లలో దళిత సాహిత్యాన్ని ఎవరు సృష్టించవచ్చు అని జరిగిన చర్చను ఈ వివాదం గుర్తుకు తెస్తోంది. దళితులుగా పుట్టినవారు మాత్రమే ఆ పని చేయవచ్చునని అప్పటి దళిత నాయకులు వాదించారు. అంబేద్కర్ ను గాని, ఆయన పుస్తకాన్ని గాని పరిచయం చేసేవారు తమ కుల ధ్రువీకరణ పత్రం (షెడ్యూల్డ్ కులం అని) తీసుకురావాలని వాదించే అటువంటి అస్తిత్వవాద స్థిరాభిప్రాయమే ప్రస్తుత వివాదంలో కూడ ప్రతిఫలిస్తున్నది. అయితే అంబేద్కర్ గురించీ, ఆయన రచనల గురించీ ఎందరో దళితేతరులు గతంలో రాసి ఉండగా, ప్రత్యేకంగా అరుంధతీ రాయ్ గురించే అటువంటి వివాదం ఎందుకు తలెత్తిందో చూడడం ఆసక్తికరంగా ఉంటుంది. అది ఆమెకు ఉన్న కీర్తి వల్లనా? లేక మధ్యతరగతి దళితులలో ఆమె పట్ల మావోయిస్టు సానుభూతిపరురాలు అనే అపకీర్తి వల్లనా? బహుశా రెండో కారణానికే ఎక్కువ అవకాశం ఉండవచ్చు. కమ్యూనిజంతో సుదూరమైన సంబంధం ఉన్నదనే విషయమైనా వారిలో అసమ్మతినీ, తిరస్కరణనూ ప్రేరేపిస్తుంది.

ఈ వివాదం వెనుక ఉన్న ఉద్దేశం ఏమైనప్పటికీ తప్పనిసరిగా ఇది అవాంఛితమైనది. సోషల్ మీడియాలో వెలువడిన చౌకబారు 'ఏకవాక్య' వ్యాఖ్యలను పక్కనపెట్టినా, ఆమోదనీయ స్థాయిలో వెలువడిన ప్రధాన అభ్యంతరాలలో ఆమె అంబేద్కర్‌ను పరిచయం చేయడానికి అనవసరమైన స్థాయిలో గాంధీజీని చిత్రించిందనేది ఒకటి. ఆ పని చేయడానికి అసలు ఆమెకు ఉన్న అర్హత ఏమిటనేది మరొకటి. పరిచయంగా చెప్పుకున్నప్పటికీ ఆమె వ్యాసం నిజంగా అంబేద్కర్ గ్రంథానికి పరిచయం కాదనేది మరొకటి. ఈ అభిప్రాయాలు సరైనవేనని అనుకున్నప్పటికీ, వాటిని అంత గట్టిగానూ వ్యతిరేకతతోనూ వ్యక్తీకరించవలసిన అవసరం లేదు. వాస్తవానికి, అరుంధతీ రాయ్‌లోని సృజనాత్మక రచయిత్రి అంబేద్కర్ గ్రంథాన్ని యథాతథంగా ఎంచుకోలేదు. ఆ గ్రంథం మీద ప్రతిస్పందనగా తన హరిజన్ పత్రికలో గాంధీజీ రాసిన వ్యాసం నేపథ్యంలో అంబేద్కర్‌కూ గాంధీజీకీ మధ్య జరిగిన చర్చ ఆమెకు వస్తువు. ఆ విషయాన్ని పొడిపొడిగా, యాంత్రికంగా చర్చించేబదులు, అంబేద్కర్ నూ మధ్యేమార్గ హిందూ సమాజానికి ప్రతినిధిగా గాంధీజీనీ పోల్చి చూపితే కులాల సమస్యను ఇంకా ఎక్కువ శక్తిమంతంగా ముందుకు తీసుకురాగలనని ఆమె అనుకున్నారు. ఇక అర్హత విషయానికి వస్తే, ఆమె తాను రాస్తున్న విషయాన్ని అర్థం చేసుకోవడానికి చాల శ్రమించారు. అయినా ఆమె రచనలేవీ ఎప్పుడూ ఏదో సాధికార స్థానం నుంచి మాట్లాడుతున్న భ్రమ కల్పించలేదు. ఆమె శైలివల్ల అవి సాధారణ లోకజ్ఞానపు స్థాయి నుంచి నిష్పాక్షికంగా ఉంటాయి. బహుశా అందువల్లనే ఆమె రచనలు మేధావులనబడే వాళ్లకన్న ఎక్కువగా సాధారణ ప్రజలను ఆకట్టుకుంటాయి.

**నిజమైన అంబేద్కర్, నిజం కాని అంబేద్కర్**

అయితే చాల ఆసక్తికరమైన వాదన దళితుల నుంచి కాక, ఆశ్చర్యకరంగా ఒక అగ్రకుల జర్నలిస్టు నుంచి వచ్చింది. (లైవ్ మింట్ పత్రికలో 2014 మార్చ్ 18న ప్రచురించిన జి. సంపత్ వ్యాసం 'బి ఆర్ అంబేద్కర్, అరుంధతీ రాయ్, సొంతం చేసుకునే రాజకీయాలు'). నియంగిరి కొండలలోని బాక్సైట్‌ను అక్కడి ఆదివాసులకే వదిలేయాలని వాదించే ఆమె, దళితులకు ఏకైక ఆస్తి అయిన అంబేద్కర్‌ను వారికే ఎందుకు వదిలేయలేదని ఈ వ్యాసం అరుంధతీ రాయ్‌ని సవాల్ చేసింది. ఈ వాదన ఆసక్తికరంగానే ఉంది గాని దాని అంతస్సూచన ప్రమాదకర మైనది. ఎవరినైనా కులం ప్రాతిపదిక మీద 'ఇతరులు' అని నిర్వచించి వారి వ్యవహారం అక్రమమని కొట్టివేయడం సులభం. దళితుల సాంస్కృతిక మంచితనానికి అంబేద్కర్ మూర్తీభవరూపం కావచ్చు. అయినా ఆయనను దళితులకు మాత్రమే పరిమితం చేసి దడి కట్టడమంటే ఆయనను సంపూర్ణంగా అవమానించడమే. దళితుల ప్రయోజనాలకు అపారమైన చెరుపు చేయడమే. నియంగిరి కొండలను ఆదివాసులకు వదిలెయ్యాలనేది ప్రస్తుతం కొనసాగుతున్న అభివృద్ధి నమూనాను ప్రగతిశీలంగా ప్రశ్నించడం. కాని అంబేద్కర్ ను దళితులకే వదిలేయా లనడం బాబాసాహెబ్ అంబేద్కర్ చెప్పిన కుల నిర్మూలన కార్యక్రమాన్ని ధ్వంసంచేసే అభివృద్ధి నిరోధకత్వమే అవుతుంది.

ఆశ్చర్యకరంగా ఈ వివాదం అసలు విషయాన్ని దాటి చాల ముందుకు పోయింది. ఆ అసలు విషయమేమంటే ప్రచురణకర్తల పచ్చి వ్యాపార తర్కం. అదే ప్రాథమికంగా అరుంధతీ రాయ్ చేత పరిచయం రాయించింది. వేర్వేరు సందర్భాలలో వేర్వేరు సమస్యలపై ఆమె తీసుకున్న నిర్భయమైన ప్రజానుకూల వైఖరి, బుకర్ బహుమతి గ్రహీతగా ఆమె కీర్తిని ఇనుమడింప జేయడంతో, ఆమె పరిచయం వల్ల ఈ పుస్తకానికి ప్రపంచవ్యాప్త ప్రచారం దొరుకుతుంది. అంతేకాదు, ఆమె రచన ఏదైనా తప్పనిసరిగా వివాదాన్ని సృష్టిస్తుందని గత అనుభవం చెపుతున్నది. ఇదంతా కలిసి పుస్తకానికి ఇబ్బడి ముబ్బడిగా అమ్మకాలు ఉంటాయి, ప్రచురణకర్తకు లాభాలు సంపాదించిపెడతాయి. నవయాన ప్రచురణ సంస్థ ఇవన్నీ ఉద్దేశపూర్వకంగా

ఆలోచించిందా లేదా తెలియదు గాని, ఇటువంటి ప్రచురణకర్తల స్థిరపడిన వ్యాపార వ్యూహాలను ఎవరూ తప్పుపట్టడానికి వీలులేదు. ఎందుకంటే ఏ ప్రచురణకర్త అయినా వ్యాపార సూత్రాలను అనుసరించవలసిందే. నవయాన సాధారణంగా 'కుల-వ్యతిరేక' పుస్తకాలు వేస్తుందని ఇటీవల వచ్చిన పేరు ఎలా ఉన్నప్పటికీ అంబేద్కర్ మీద ప్రశంసాపూర్వకంగానూ, ఆరాధనా పూర్వకంగానూ ఉండే సాహిత్యం అచ్చువేయడం ఒక ఎత్తు, కులాల నిర్మూలనను సమర్థించడం మరొక ఎత్తు. కొద్దిమంది లేవనెత్తిన ఈ వివాదం సమసిపోయిన తర్వాత, దళితులలో అత్యధికులు తమ దేవుడిని ఆరాధించడంలో అరుంధతీరాయ్ కూడ జత కలిసిందని గర్వపడవచ్చు కూడ. అంబేద్కర్ పట్ల ఇటువంటి ప్రతి ఒక్క ఆరాధనా రూపమూ నిజానికి కుల అస్తిత్వాన్ని బలోపేతం చేస్తున్నది, కుల నిర్మూలనా కార్యక్రమం నుంచి ప్రత్యక్షంగా దూరం జరుపుతున్నది.

అంబేద్కర్‌ను ఆమోదించడం దానికదిగా కుల వ్యతిరేక భావాలను వ్యాపింపజేయడంతో సమానం కానక్కరలేదు. ఇవాళ ప్రజామోదం ఉన్న రాజకీయ నాయకులందరిలోకీ అంబేద్కర్ అత్యున్నత స్థానాన నిలుస్తాడు. ఆయన గురించిన, లేదా ఆయన పైన, విగ్రహాలు, ఫొటోలు, సమావేశాలు, పుస్తకాలు, పరిశోధన, సంస్థలు, పాటలు, లేదా మరే ఇతర ప్రచార సాధనాల సంఖ్య విషయంలో ఆయనతో పోటీకి రాగల మరొక నాయకుడు లేడు. విచిత్రమేమంటే, ఇప్పుడు సినిమాలలోనూ, టెలివిజన్ ఎపిసోడ్లలోనూ కూడ ఆయన బొమ్మ ఒక స్థిరమైన వస్తువు అయిపోయింది. ఐతే కుల వివక్ష, కుల అత్యాచారాలు, కుల సంఘాలు, కుల చర్చలు, వగైరా సందర్భాలలో బైటపడుతున్నట్టుగా కులతత్వం కూడ సమాంతరంగా విస్తరిస్తున్నట్టు కనబడుతున్నది. ఈ పరస్పర విరుద్ధమైన పరిణామాన్ని వివరించాలంటే నిజమైన అంబేద్కర్ నుంచి నిజం కాని అంబేద్కర్‌ను వేరు చేయాలి. దళిత ప్రజానీకంలో మొగ్గతొడుగుతున్న మౌలిక మార్పు చైతన్యాన్ని అడ్డుకోవడానికి స్వార్థపర శక్తులు ఆ అబద్ధపు అంబేద్కర్ విగ్రహాలను నిర్మిస్తూ ఉన్నారు. నిగూఢమైన, నిజమైన అంబేద్కర్‌ను ఈ విగ్రహాలు సాదా సీదా చిహ్నంగా, రాజ్యాంగ నిర్మాతగా, గొప్ప జాతీయవాదిగా, రిజర్వేషన్ల సృష్టికర్తగా, గట్టి కమ్యూనిస్టు వ్యతిరేకిగా, ఉదార ప్రజాస్వామిక వాదిగా, మహా పార్లమెంటేరియన్‌గా, దళితుల విముక్తి ప్రదాతగా, బోధిసత్వుడుగా, వగైరా చిహ్నాలలో అలంకరిస్తున్నాయి. ప్రమాదరహితుడైన, యథాస్థితివాది అయిన అంబేద్కర్ విగ్రహాలుగా ఇవన్నీ ఎక్కడచూస్తే అక్కడ విస్తరిస్తూ నిజమైన అంబేద్కర్ పట్ల తీసుకోవలసిన సకారాత్మక, మౌలిక, విప్లవ దృక్పథంపై నీడలు కమ్ముతున్నాయి.

**ఏ అంబేద్కర్?**

రాజ్యపు క్రియాశీల మద్దతుతో స్వార్థపరశక్తులు సాగిస్తున్న ఈ ప్రతీకల వెనుక దాగిన కుతంత్రాలు ఏవైనప్పటికీ, ఎటువంటి సైద్ధాంతిక ఘనీభవత్వం లేని ఆచరణవాదిగా జీవితపర్యంతం సాగిన అంబేద్కర్ క్రమపరిణామం ఆయనను స్వాభావికంగా అర్థం చేసుకోవడం కష్టమయ్యే వ్యక్తిగా మార్చింది. కులాలను మూసిపెట్టిన వర్గాలుగానూ, ఆ మూసివేతకు కారణం అంతర్వివాహ-బాహ్యవివాహ వ్యవస్థగానూ సూత్రీకరించిన యువ అంబేద్కర్, విశాల హిందూ సమాజం మేల్కొంటుందనీ, కులాంతార వివాహాల వంటి సాంఘిక సంస్కరణలను చేపడుతుందనీ, తద్వారా కులాలు మూసివేతనుంచి తెరుచుకుని వర్గాలుగా మారుతాయనీ ఆశించాడు. ఇందుకు భిన్నంగా మహద్ చెరువు పోరాటం తర్వాత అంబేద్కర్ సవర్ణ హిందువుల ఉగ్ర ప్రతిస్పందనలతో నిరాశచెంది, తన లక్ష్యాన్ని సాధించ డానికి రాజకీయాలవైపు దృష్టి సారించాడు. ఇస్లాంలోకి మతాంతరీకరణ జరుపుతామని ఆయన చేసిన హెచ్చరికలను దళితులకు ప్రత్యేక రాజకీయ అస్తిత్వం కోసం చేసినవిగా చూడాలా, లేక సాంఘిక సంస్కరణ చేపట్టడం కోసం సవర్ణ హిందువుల మీద చేసిన ఒత్తిడిగా చూడాలా? ఇక ఆ తర్వాత కులాలతో సంబంధం లేకుండా కార్మికవర్గాలలో తన నియోజకవర్గాన్ని విస్తరించుకోవాలనే ఉద్దేశంతో ఇండిపెండెంట్ లేబర్ పార్టీ (ఐఎల్‌పి) ఏర్పాటు చేసిన 1930ల అంబేద్కర్ ఉన్నాడు. అదే భారతదేశంలో మొట్టమొదటి వామపక్ష పార్టీ అని వాదించవచ్చు. ఆ సమయంలో ఆయన కమ్యూనిస్టులతో కలిసి నడిచాడు. కాని అదే సమయంలో కులాలను తప్పించుకోవడానికి ఏదో ఒక మతం లోకి మారే నిర్ణయాన్ని కూడ ప్రకటించాడు. ఇక 1940ల అంబేద్కర్ మాటేమిటి? ఆయన ఇప్పుడు కులంలోకి తిరిగివచ్చాడు, ఐ ఎల్ పి ని రద్దు చేశాడు. షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫెడరేషన్ స్థాపించాడు. ఆందోళనా రాజకీయాలను వ్యతిరేకించాడు. కార్మిక మంత్రిగా వలస ప్రభుత్వంలో చేరాడు. లేదా స్వతంత్ర భారత రాజ్యాంగంలో రాజ్య సోషలిజం భాగం కావాలని ప్రతిపాదిస్తూ స్టేట్స్ అండ్ మైనారిటీస్ రాశాడు. కాంగ్రెస్ కు అత్యంత బలమైన ప్రత్యర్థిగా ఉండిన అంబేద్కర్ ఉన్నాడు. కాంగ్రెస్ తో సహకరించి అఖిలపక్ష ప్రభుత్వంలో చేరి, రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రవేశించడానికి కాంగ్రెస్ మద్దతు స్వీకరించిన అంబేద్కర్ ఉన్నాడు. అంతిమంగా రిజర్వేషన్ల రూపం పొందిన ప్రాతినిధ్య తర్కాన్ని ప్రతిపాదించి, దళితులలో కొన్ని అభివృద్ధి చెందిన శక్తులు తమ సమాజ ప్రగతికి సహకరించగలవని ఆశించిన అంబేద్కర్ ఉన్నాడు. విద్యావంతులైన దళితులు తనకు ఆశాభంగం కలిగించారని బహిరంగంగా విచారం ప్రకటించిన అంబేద్కర్ ఉన్నాడు.

భారత రాజ్యాంగ నిర్మాత అయిన అంబేద్కర్, తమ సమస్యల పరిష్కారం కోసం రాజ్యాంగ పద్ధతులను మాత్రమే అనుసరించాలని దళితులకు సలహా ఇచ్చిన అంబేద్కర్ ఉన్నాడు. లేదా, ఆ రాజ్యాంగాన్ని అత్యంత పరుష పదజాలంతో విమర్శించి, దాన్ని తగులబెట్టే మొదటి వ్యక్తిగా తానే ఉంటానన్న అంబేద్కర్ ఉన్నాడు. చివరిగా, తన సొంత నిర్ణయాలను అంచనా కట్టుకోవడానికి దాదాపు గీటురాయిగా మార్క్స్ ను ప్రస్తావిస్తూ వచ్చిన అంబేద్కర్ ఉన్నాడు. లేదా, బౌద్ధాన్ని స్వీకరించి దాన్ని భారతదేశంలో కమ్యూనిజానికి వ్యతిరేకంగా అంతిమ రక్షణదుర్గం (ఈ మాటలు అంబేద్కర్ అధ్యయనాల పండితురాలు ఎలియనార్ జెలియట్ ఉపయోగించినవి) గా తయారుచేసిన అంబేద్కర్ ఉన్నాడు. లేదా ఈ ప్రపంచాన్ని వీడిపోవడానికి కొద్ది రోజుల ముందు బుద్ధుడినీ, మార్క్స్ నూ సానుకూలంగా పోలుస్తూ, ఇద్దరి లక్ష్యం ఒకటేననీ, కాకపోతే దాన్ని సాధించడంలో వారి మార్గాలు వేరు వేరనీ, మార్క్స్ మార్గం కన్న బుద్ధుడి మార్గం మేలనీ రాసిన అంబేద్కర్ ఉన్నాడు. వీరిలో ఏ అంబేద్కర్ నిజమైన అంబేద్కర్? ఇవన్నీ ఆయన గురించి స్థూల చిత్రణలలో కొన్ని మాత్రమే. ఇవన్నీ ఆయనను సులభంగా ఒక చట్రంలోకి దించి అర్థం చేసుకోవడం సమస్యాత్మకమని చెప్పడానికి మాత్రమే. ఎవరైనా ఇంకా లోతులకు వెళ్తే, ఇంకా తీవ్రమైన సమస్యలెన్నో తలెత్తే అవకాశం ఉంది.

ఈ భూమి మీద కుల వైరస్ జీవించి ఉన్నంతవరకూ అంబేద్కర్ తప్పనిసరిగా అవసరమే. కాని చాలమంది దళితులు భావోద్వేగపూరితంగా భావిస్తున్నట్టుగా పాత అంబేద్కర్ మరొక అవతారం ఎత్తడంగా కాదు. చివరికి అరుంధతీ రాయ్ కోరుకున్నట్టుగా 'ఇప్పుడే తక్షణమే' అనే పద్ధతిలో కూడ కాదు. ఆయన కాలంలో ఉన్నప్పటికంటె మరింత చిక్కుముడిగా మారిన వర్తమాన కుల సమస్యలను ఎదుర్కోవడానికి తగినట్టుగా తప్పనిసరిగా ఆయనను నిర్మించుకోవలసి ఉంది.

*(రచయిత ముంబై లోని కమిటీ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ డెమొక్రటిక్ రైట్స్‌లో పనిచేసే పౌరహక్కుల కార్యకర్త. 'ఆంటీ ఇంపీరియలిజం అండ్ అనిహిలేషన్ ఆఫ్ కాస్ట్స్', 'ఖైర్లాంజి' వంటి అనేక పుస్తకాలు రాశారు)* వీ

# కుల సమస్య - మార్క్సిస్టు అవగాహన - ఒక నోట్ - 2

***భారత సమాజంలో అతి ముఖ్యమైన, క్లిష్టమైన కుల సమస్యను మార్క్సిస్ట్ దృక్పథం నుంచి ఎలా అర్థం చేసుకోవాలనే ప్రశ్నపై మావోయిస్టు రాజకీయ ఖైదీల మధ్య జరిగిన చర్చను వివరిస్తున్నారు*** **రవి**

*(గత సంచిక తరువాయి...)*

**భా**రతీయ మార్క్సిస్టులు కులాన్ని విశ్లేషించడంలో చేసిన రెండు తప్పుల వల్ల అది ఆచరణలో కూడా తప్పులకు దారి తీసింది. కులాన్ని భారతదేశ నిర్దిష్ట పరిస్థితిలో వర్గపు ఒక ప్రత్యేక రూపంగా గ్రహించక దానిని ఒక ఉపరితల అంశంగా పరిగణించడం మొదటి తప్పు కాగా. పునాది మారితే ఉపరితల అంశం ఆటోమెటిక్‌గా అదృశ్యమవుతుందనే యాంత్రిక అవగాహన కలిగి ఉండడం రెండవ తప్పు. సైద్ధాంతికంగా ఈ తప్పు అవగాహన ఎత్తుగడలలోనూ, ఆచరణలోనూ సీరియస్ తప్పులకు దారితీసింది. కుల వ్యతిరేక పోరాటానికి ప్రాధాన్యత తగ్గింది. సామాజిక అభివృద్ధి క్రమంలో పరిష్కృతమయ్యే సమస్యగా కులసమస్యను పరిగణించారు. ఆచరణలో – కులానికి సంబంధించిన సమస్యలు ఎదురైనప్పుడు 'వర్గ ఐక్యత' దెబ్బ తింటుందనుకుంటే వాటి నుంచి తప్పించుకోవడమో, నిర్లక్ష్యం చేయడమో చేశారు. ఉదాహరణకు, గతంలో మార్క్సిస్టులు నాయకత్వం వహించిన కిసాన్‌సభ పాత జమీందారీ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడినప్పుడు కుల అణచివేత, వివక్షవంటి విషయాలను లేవనెత్తితే రైతాంగపు వర్గ ఐక్యత దెబ్బతింటుందనే అవగాహనతో వాటిని లేవనెత్తేది కాదు. కార్మిక రంగంలో కూడా ఒకనాటి మార్క్సిస్టులు నాయకత్వం వహించిన ట్రేడ్ యూనియన్లలో ఇదే జరిగింది. ఇందువల్ల దళితుల్లో తలెత్తిన అపనమ్మకం, దూరం ఈ నాటికీ కొనసాగుతున్నాయి. కమ్యూనిస్టు ఉద్యమానికి చాలా సహజ మిత్రునిగా ఉండవలసిన దళిత ఉద్యమం ఆ ఉద్యమంతో దూరంగా ఉంటోంది. పూర్తిగా కాకపోయినా కమ్యూనిస్టుల గత కాలపు తప్పు అవగాహన, ఆచరణలు కూడా ఇందుకు కారణం.

అయితే ఈ రోజు కులానికి సంబంధించిన పునాది – ఉపరితలాల చర్చ అర్థ విహీనమైన చర్చగా మారిపోయింది. గత వంద సంవత్సరాల్లో వస్తుగత పరిస్థితి పూర్తిగా మారిపోయింది. అత్యధిక ప్రజలకు (అగ్రకులాలు, శూద్రులకు) కులం ప్రధానంగా ఉపరితలాంశమే. కులమే నేడు సమాజంలో వర్గస్థితిని నిర్ణయించడం లేదు. ఒక్క దళితులకు సంబంధించినంత వరకు మాత్రమే కులం ఉపరితల అంశాలతో పాటు పునాదిలో భాగంగానే ఉందని చెప్పవచ్చు. ఇందులో కూడా విభిన్నవర్గాలు అస్తిత్వంలోకి వచ్చాయి. అవి క్రమంగా కులంతో విడివడుతున్నాయి. కాబట్టి 21వ శతాబ్దంలో ఈ విషయంపై వాదోపవాదాలు ప్రయోజనరహితమైనవి. ఒక చరిత్రకారుడికి ఈ విషయం గురించి ప్రాధాన్యత ఉండొచ్చు కానీ మార్పు కోసం నిమగ్నమైన ఉద్యమానికి దాని విలువ లేదు. ఈ చర్చ గత జల సేతు బంధనం లాంటిది.

పునాది – ఉపరితలాలకు సంబంధించిన మరొక అంశం ఉంది. పునాదిలో వచ్చే పరిణామాలు నూతన ఉపరితల అంశాలకు (కొత్త సిద్ధాంతం, రాజకీయాలు, సంస్కృతి, ఆచారాలు, పాలనా రూపాలు వంటివి) దారి తీస్తాయి. దీనర్థం పాత ఉపరితల అంశాల రూపాలు మాయమౌతాయనో, నాశనమౌతాయనో కాదు. చాలా సార్లు పాత ఉపరితల అంశాలకు కొత్త జవసత్వాలు లభిస్తాయి. నూతన పునాదికి అనుగుణంగా మార్పులు, చేర్పులు, సర్దుబాట్లు చేసుకునైనా ఇలా జరగవచ్చు లేదా నూతన పునాదియే తన అవసరాలకు అనుగుణంగా వాటిలో మార్పులు చేసి అవలంబించవచ్చు. అట్లా అవి నూతన రూపాల్లో బతికి బట్టకట్టవచ్చు. ఉదాహరణకు పునాదిలో ఎన్నో గుణాత్మక మార్పులు చోటు చేసుకున్నా, ఎన్నో వ్యవస్థలు మారినా పితృస్వామ్యం ఉంటూనే వచ్చింది. పెట్టుబడిదారీ విధానంలో కూడా కొనసాగుతూనే ఉంది. ఇందుకు కారణమేమిటంటే – అస్తిత్వంలోకి వచ్చిన ప్రతి ఉత్పాదనా వ్యవస్థ కూడా ఆ వ్యవస్థకు సంబంధించిన దోపిడీ రూపాలను కొనసాగించడానికి పితృస్వామ్యం ఉపయోగకరంగా కనిపించింది. అమెరికాలో నరజాతి (race) పై ఆధారపడిన బానిస వ్యవస్థ ఎప్పుడో రూపు మాసిపోయినా నల్ల జాతి ప్రజల పట్ల వివక్ష మాత్రం కొనసాగుతూనే ఉంది. అమెరికా పెట్టుబడిదారీ వ్యవస్థ, ఆ సమాజం ఈ వివక్ష వల్ల పాదార్థిక లాభం పొందడమే దీనికి కారణం. అదే విధంగా భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం పెంపొంది, అభివృద్ధి అయినా కూడా వివక్ష, ప్రిజుడిస్ రూపంలో కులం కొనసాగడం, దళితులపై హింసాత్మక రూపం తీసుకోవడం లేదా కుల గుర్తింపు సర్వత్రా వ్యాపించి ఉండటం ఎందుకంటే కులం భూస్వామ్య వర్గ ప్రయోజనాలకే కాక, పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలకు కూడా ఉపయోగకరంగా ఉండటమే. దోపిడీ, పీడనల పాత రూపాలను నూతన దోపిడీ వర్గాలు తమ ప్రయోజనాలకు ఉపయోగపడే మేరకు మలుచుకొని ఉపయోగించుకుంటాయనేది తెలిసిన విషయమే.

ఈ పునాది, ఉపరితలాల అంశంలో మరొక వైరుధ్య భరితమైన విషయం చర్చించకపోతే అది అసంపూర్ణమే అవుతుంది. కులం ఉపరితలాంశం అని భావించిన కమ్యూనిస్టులు కానీ, కుల సమస్య / దళిత సమస్య వర్గసమస్యలో అంతర్భాగమే అని, లేదా పునాది, ఉపరితలాలు రెండింటికీ సంబంధించిన సమస్య అంటున్న నక్సలైట్లు / మావోయిస్టులు కానీ ఆ సమస్యను పరిష్కరించడానికి మాత్రం ప్రధానంగా పని చేసింది, పునాది సంబంధాలను మార్చడానికి. అంటే నిర్ణాయకమైన ఉత్పత్తి సంబంధాలను మార్చటానికి. ఉదా: దున్నేవారికే భూమి అన్నప్పుడు అందువల్ల లాభపడే భూమిహీనులు, పేద రైతులలో 80–90 శాతానికి పైగా దళితులు / వెనుకబడిన కులాలకు చెందినవారే. కులం ఆవిర్భావానికి సంబంధించి మార్క్సిస్టు విశ్లేషణలో కూడా పునాదికి సంబంధించిన విషయాలకే పెద్ద పీట ఉంది. అంటే కుల ఆవిర్భావపు మూలాల్లో ఉన్న శూద్రకులాల, దళితుల శ్రమదోపిడీ, ఉత్పత్తి సాధనాల యాజమాన్యం నుంచి వంచితులు కావడానికి వర్ణ / కుల విభజన ఎట్లా ఉపయోగపడిందీ, వంటి అంశాలు చాలా కీలకమైనవి.

ఇక కమ్యూనిస్టులు కులాన్ని ఉపరితల అంశంగా విశ్లేషించారని విమర్శించేవారు (ఈ విమర్శ సరియైనదే అనేది పైనే వివరంగా చూసాం) మాత్రం కుల సమస్య ఆవిర్భావంలో ప్రధానంగా చూసేది బ్రాహ్మణవాద భావజాలాన్ని. ఈ భావజాలం లేకుండా కులవ్యవస్థే లేదనేది నిజమే అయినా భావజాలాన్ని మాత్రమే చూసి దాని వెనకాల ఉన్న ఆర్థిక పునాదిని చూడకపోవడం ఈ వాదంలోని లోపం. కులం ఆవిర్భావంలోనే కాక, దాని పరిష్కారంలోనైతే అంబేద్కర్ కానీ, ఇతర దళితవాదులు కానీ పునాదిని మార్చే ప్రయత్నం గురించి చర్చించేది దాదాపు శూన్యం. పరిష్కారమంతా ఉపరితల

మార్పుపైనే. కుల నిర్మూలన కోసం ప్రత్యేకంగానే కులవ్యతిరేక పోరాటంపై కూడా కేంద్రీకరించి పని చేయకపోవటంలో విప్లవ పార్టీలు కూడా గతంలో సైద్ధాంతికంగానూ, ఆచరణలోనూ కొంత లోపం కలిగి ఉన్నప్పటికీ ఆ లోపాన్ని విప్లవకారులైతే దూరం చేసుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు కానీ, కుల సమస్యను మార్క్సిస్టులు పునాదిలో భాగంగా చూడలేదని ఏ విమర్శనైతే దళితవాదులు చేశారో ఆ విషయానికే సంబంధించి అంబేద్కర్‌వాదులు / దళితవాదులు సైద్ధాంతికంగానూ, ఆచరణలో కూడా ఉపరితల అంశాలపై మాత్రమే పోరాటం చేస్తున్నారనేది గ్రహించకపోవడమే పరస్పర వైరుధ్యమైన అంశం.

కులానికి సంబంధించి కమ్యూనిస్టుల సిద్ధాంత ఆచరణలో లోపాన్ని గురించి చర్చించేవాళ్లు సి.పి.ఐ, సి.పి.ఎం.లకు, మావోయిస్టులకు మధ్య ఎటువంటి తేడా లేకుండా ఒకే గాటనకట్టి విమర్శించడం చూస్తాం. కొంతమంది ఇది దురుద్దేశ్యపూర్వకంగా చేస్తే, కొంతమంది సమాచారలోపం వల్ల చేస్తున్నారు. మావోయిస్టులు రివిజనిస్టులతో తెగతెంపులు చేసుకొన్నాక కులసమస్యపై అవగాహనలోనూ ఆచరణలోనూ మార్పు జరుగుతూ వచ్చింది. 'విప్లవానికి బాట', 'ఎత్తుగడల పంథా' వంటి డాక్యుమెంట్లలో ఈ సైద్ధాంతిక మార్పు స్పష్టమవుతుంది.

"వాస్తవంగా ఆర్థిక సమస్యలపై జరిగేవే వర్గపోరాటాలని భావించడం గానీ, సాంఘిక సమస్యలను విడదీసి చూడటం గానీ సరైంది కాదు. మనదేశంలో కుల వ్యవస్థ స్వభావాన్ననుసరించి కులాల సమస్య సారాంశంలో వర్గసమస్యయే. మన అవగాహనను అనుసరించి ప్రస్తుతం మన సమాజంలో కొనసాగుతున్న వివిధ వైరుధ్యాలలో ఫ్యూడలిజానికి విశాల జనసామాన్యానికి మధ్యగల వైరుధ్యం ప్రధానమైనది. ఈ వైరుధ్యం కులాల రూపంలో ఎలా ప్రతిబింబిస్తుందో చూద్దాం. రైతాంగంలో ఫ్యూడల్ భూస్వాములు గానీ, పెట్టుబడిదారీ భూస్వాములుగానీ సగటున ఆరేడు శాతం మించి ఉండరు. నేటి కులాల ప్రకారం నూటికి 90కి పైగా భూస్వాముల కుటుంబాలు అగ్రకులాలని చెప్పబడే బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, రెడ్డి, వెలమ, కాపు కులాలకు చెందినవే. అలాగే వెనుకబడినవని చెప్పబడే యాదవ, చాకలి, మంగలి, పెరిక, గౌడ, మున్నూరుకాపు వగైరా కులాలకూ, షెడ్యూల్డు కులాలుగా పిలవబడుతున్న మాల, మాదిగ, డెక్కలి, నేతకాని వగైరా కులాలకూ చెందిన కుటుంబాల్లో నూటికి 90కి మించి నిరుపేద రైతులు, వ్యవసాయ కూలీలు. అందులో ప్రత్యేకించి షెడ్యూల్డ్ కులాలలో నూటికి 95 కుటుంబాలకు పైగా కేవలం వ్యవసాయ కూలీలుగానే జీవిస్తున్నారు. అందువల్ల కుల ప్రాతిపదికపై చూస్తే ప్రజాస్వామిక విప్లవానికి ఇరుసుగా ఉన్న వ్యవసాయ విప్లవం అగ్రకులాలనబడే వాటికీ, వెనుకబడ్డ కులాలనే వాటికి మధ్యనే కొనసాగుతుందని బోధపడుతుంది. అందుకే ప్రపంచమంతటా జాతుల సమస్య ఎలా సారాంశంలో వర్గసమస్యయో అలా మనదేశంలో కుల సమస్య కూడా సారాశంలో వర్గసమస్యయే".

"అయితే బహిరంగంగా ప్రజాస్వామిక విప్లవమన్నా, వ్యవసాయ విప్లవమన్నా అగ్రకులాలకు వ్యతిరేకంగా వెనుకబడిన కులాలు చేయవలసిన విప్లవమేనని నూటిగా ఎందుకు సిద్ధాంతీకరించరాదు? అలాంటి పిలుపునివ్వకూడదు. భూస్వాములలో 90 శాతం అగ్రకులాలనబడే వాటికి చెంది ఉన్నారే కాని, ఆ కులాలకు చెందిన మొత్తం ప్రజానీకంలో అత్యధిక భాగం ఏదో ఒక రూపంలో భూస్వాముల దోపిడీకి లేదా అణచివేతకు గురి అవుతున్న వారే. అలానే వెనుకబడిన కులాలనబడే వాటిల్లో కూడా 90 శాతం నిరుపేద రైతులు, వ్యవసాయ కూలీలే అయినా అందులో నూటికి ఒకరిద్దరు భూస్వాములు గానీ, దళారీ లేదా బ్యూరోక్రటిక్ బూర్జువాలకు చెందినవారు గానీ లేకపోలేదు. అందువల్ల వ్యవసాయ విప్లవం అగ్రకులాలనబడే వాటికీ, వెనుకబడిన కులాలనబడే వాటికీ మధ్య జరుగుతున్న విప్లవం కాదు."

పై సైద్ధాంతిక అవగాహన అప్పటివరకూ ఉన్న రివిజనిస్టు అవగాహనకు ఎంతో భిన్నమైన అవగాహన. ఆంధ్రప్రదేశ్‌లో దళిత ఉద్యమం లేవనెత్తిన ప్రశ్నల నేపథ్యంలో కుల సమస్య విషయంలో మావోయిస్టు పార్టీ తను చేసిన కృషిని సమీక్ష చేసుకుని 'కులసమస్య మన దృక్పథం' పాలసీ పేపరును రూపొందించుకుంది. అందులో కులాన్ని పునాది అంశంగా గుర్తించారు. ఇది సిద్ధాంతరంగంలో ఒక ముందడుగు. ఈ అభివృద్ధి క్రమం కొనసాగుతూనే ఉంది. దీన్ని చూడ నిరాకరించి చేసే ఏ చర్చ అయినా నిజాయితీ రహితమైన చర్చే. కొంత పునరుక్తి దోషం ఉన్నప్పటికీ కులం గురించిన పునాది ఉపరితలాల సంబంధాన్ని సంక్షిప్తంగా ఇలా చూడవచ్చు.

భూస్వామ్య భారతదేశంలో కులం పునాది – ఉపరితలాలకు రెండిటికీ సంబంధించినది. ఉత్పత్తి సంబంధాల రీత్యా పునాదిలో అంతర్భాగం. నిచ్చెన మెట్ల బ్రాహ్మణవాద భావజాలరీత్యా ఉపరితలంలోనూ అంతర్భాగమే. ఈనాడు దళితుల విషయంలో మినహా ఇతర కులాలకు సంబంధించినంత వరకూ ప్రధానంగా ఉపరితల సమస్యే. దళితుల విషయంలో పునాది – ఉపరితల అంశాలు రెండింటిలోనూ కుల సమస్య ఉంది. పునాదిలో సమూలమైన మార్పు సంభవించినా, అంటే విప్లవానంతరం ఉత్పత్తి సంబంధాల్లో కులపు పాత్రను పూర్తిగా నిర్మూలించినా కూడా సాంస్కృతిక, సామాజిక రంగాల్లో కులం సుదీర్ఘకాలం ప్రభావం సలుపుతూనే ఉంటుందనే విషయాన్ని గ్రహించినపుడు కూడా కులపు ఉపరితలపు స్వభావపు ప్రాధాన్యం అర్థమవుతుంది. అయినా పునాదికి సంబంధించినంతవరకూ పైన చూపినట్టు ఎన్నో మినహాయింపులు ఉన్నాయి. కాబట్టి కులనిర్మూలనలో నిమగ్నమయ్యే ఉద్యమకారులకు చారిత్రకంగా తప్ప పునాది – ఉపరితలాల చర్చ ఉపయోగకరమైనదేమీ కాదు.

**కులం ఎందుకు రావణ కాష్టంలా రగులుతూనే ఉంది?**

సమాజంలో ఎన్నెన్నో గణనీయమైన మార్పులు జరిగినా కులం ఎందుకు అంతం కావటం లేదనేది ఒక అంతుపట్టని సవాలుగా ఉంది.

కుల చైతన్యం, కుల అస్తిత్వాలు, కుల వివక్ష వీటి సర్వవ్యాపిత లక్షణం వంటి వాటిని సాధారణంగా మార్క్సిస్టులు భారతదేశంలో ఇంకా ప్రజాస్వామిక విప్లవం పూర్తికాలేదనే కారణంతో వివరిస్తారు. పెట్టుబడిదారీ సంబంధాలు మనదేశంలో భూస్వామ్య సంబంధాలను విప్లవ పోరాటంతో కూలదోయడం ద్వారా కాక సంస్కరణలు, ఇముడ్చుకోవడం వంటి వాటి ద్వారా పెంపొందాయనీ, ఈ ఫ్యూడల్ / కుల సంస్కృతిని విప్లవ పోరాటంతో ఎదుర్కొని అంతమొందించని కారణంగా అది బతికి బట్ట కడుతోందనీ కూడా వివరిస్తారు. స్థూలంగా చూస్తే ఇది సరియైనదే. అయితే ఒకవేళ భారతదేశంలో ఫ్రాన్సులో మాదిరిగా పెట్టుబడిదారీ వ్యవస్థ విప్లవాత్మకంగా నెలకొని ఉంటే కులం వంటి రాచపుండ్లకు సమూలంగా చికిత్స జరిగేది అనే ఒక ఊహే తప్ప భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం అట్లా పెరగలేదనేది ఒక వాస్తవం. మనదేశంలో పెట్టుబడిదారీ విధానం వలసవాదపు నేపథ్యంలో భూస్వామ్యంతో సర్దుబాట్లు, ఇమడటం ద్వారానే పెరిగింది. దాన్ని తిరగతోడలేం.

ఇది వరకే చూసినట్టు పెట్టుబడిదారీ విధానం కూడా తన ప్రయోజనాలు నెరవేరుతాయనుకున్నప్పుడు దోపిడీ, పీడనల పాత రూపాలను కూడా కాపాడుతుంది, పెంపొందిస్తుంది. భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం కుల చైతన్యం, కుల అస్తిత్వాలు, కులపు ప్రిజుడిస్‌లు, వీటిని వెన్నంటి ఉండే కుల వివక్షలను కొనసాగించడం తన ప్రయోజనాలకు సానుకూలమైనదని భావించింది. కాబట్టి మన దేశంలో భూస్వామ్య వర్గమే కాక పెట్టుబడిదారీ వర్గం (దాంతో పాటు భారతదేశంలో ఆమేరకు సామ్రాజ్యవాదం) కూడా కులం కొనసాగుతున్న మేరకు దానికి వర్గ పునాదిగా పనిచేస్తోంది. కులపు కొనసాగింపు పెట్టుబడిదారీ వర్గానికి ప్రత్యక్షమైన ఆర్థిక ప్రయోజనాల రీత్యానే కాకుండా (అది కూడా ముఖ్య కారణమైనప్పటికీ) ప్రధానంగా రాజకీయ

కారణాల రీత్యా చాలా ప్రయోజనకారి. కులాన్ని వారి పాలనా స్థిరత్వం కోసం, సామాజిక అదుపుకు బాగా ఉపయోగించుకోవచ్చు.

ఇక ప్రత్యక్ష ఆర్థిక లాభాల విషయానికి వస్తే కుల అణచివేతను, మరీ ముఖ్యంగా దళితులకు వ్యతిరేకంగా, కొనసాగించడం వల్ల ఫ్యూడల్ భూస్వాములతో పాటు, పెట్టుబడిదారీ భూస్వాములకు (బూర్జువాజీకి కూడా) చవక శ్రమ, ఉచిత సేవలు వంటి లాభాలు దొరుకుతాయి. ఇక పెట్టుబడిదారీ పారిశ్రామిక రంగంలో నైతే దళితులను అత్యంత తక్కువ స్థాయి / 'హీనమైన' పనుల్లో నియుక్తి చేస్తే తక్కువ వేతనాలతోనే పని కానిచ్చుకోవచ్చు.

అయితే కులవ్యవస్థ కొనసాగటం వల్ల పెట్టుబడిదారీ వర్గానికి (దళారీ బడా బూర్జువాజీకీ, సామ్రాజ్యవాదులకు కూడా) ఒనగూరుతున్నది ఈ ఆర్థిక లాభాలు కాదు. సంపూర్ణమైన సామాజిక విభజన, విడగొట్టే స్వభావం – ఇవీ పెట్టుబడిదారీ వర్గానికి ఒనగూరే ప్రధాన లాభాలు. వర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేయటానికి ఇది అత్యంత శక్తివంతమైన సాధనం. నియంత్రణ, అదుపు దీనితో సులభం. సామాజిక అసంతృప్తిని దారి మళ్లించవచ్చు. విప్లవ ప్రతీఘాతుక సామాజిక, రాజకీయ సమీకరణలకు ఇది ఎంతో తోడ్పడుతుంది. ఇవన్నీ వర్గ పాలన సుస్థిరంగా కొనసాగేందుకు తోడ్పడేవి. అంతిమంగా ఈ సుస్థిరత ఆర్థికంగా వర్గదోపిడీని కొనసాగించటానికి తోడ్పడుతుంది. కులవ్యవస్థ తాకిడిని దళితులు ఎదుర్కోవడానికి ప్రాథమిక కారణం ఏమిటంటే కులభావన ప్రజలలోని ఇతర కులాల్లో కొనసాగాలంటే అందుకు అన్నింటికంటే ఉత్తమమైన మార్గం ఒక దళిత కులమంటూ ఉండటం. దళిత కులం లేకపోతే ఆధిక్యతా – హీనభావనలు, ఉన్నత – తక్కువ కులాల భావన; మనం – వాళ్లు అనే భావన, ప్రిజుడిస్ వంటివాటిని అంత సులభంగా కొనసాగించటం సాధ్యం కాదు. పైన పేర్కొన్న పెట్టుబడిదారుల రాజకీయ, సామాజిక అవసరాలు కులభావనను సర్వ వ్యాపితం చేసి, కొనసాగించడానికి కీలక కారణం మాత్రమే కాక కుల అణచివేత దాదాపు దళితులపైనే కేంద్రిత మవడానికి కూడా కారణం. రాజ్య యంత్రాంగపు అన్ని అంగాలు – అణచివేత యంత్రాంగం, న్యాయవ్యవస్థ, పాలనా యంత్రాంగం, ఎన్నికల వ్యవస్థ, పార్లమెంటరీ సంస్థలు అన్నీ పెట్టుబడిదారులు తదితర పాలక వర్గాల ప్రయోజనాల కోసం కులాన్ని రక్షించడంలో తోడ్పడతాయి, అందుకోసం పనిచేస్తాయి. విభిన్న పద్ధతుల్లో అవి కులభావన నిలిచి ఉండే పరిస్థితులను బలోపేతం చేస్తాయి, పునఃసృష్టిస్తాయి. ఈ విషయాన్ని, దీని పరిణామాలను గురించి మార్క్సిస్టులకు లోతైన అవగాహన ఉండాలి. వాళ్లు దళిత / కులవ్యతిరేక ఉద్యమాలను కూడా ఈ విషయం గురించి ఒప్పించాలి. ఎందుకంటే ఈ అవగాహన లేకుండా కులనిర్మూలనా ఉద్యమాలు ఈ రోజు ఉన్న నిజమైన శత్రువును గుర్తించలేవు. కాబట్టి పునరుక్తి దోషం ఉన్నా, మళ్లీ ఒకసారి నొక్కి చెప్పవలసిన విషయమేమిటంటే – ఈ రోజు కులవ్యవస్థ ఉన్న / పరిణమించిన తీరు భూస్వామ్య సంబంధాలు ఏమేరకు ఉంటే ఆమేరకు వాటి అవసరాలను తీర్చటానికే కాక ప్రస్తుతపు వర్గ పాలనను కొనసాగించడానికి పెట్టుబడిదారుల చేతిలో కూడా ఒక ముఖ్యమైన సాధనం.

పై రెండు కారణాలతో పాటు, కుల భావన, కుల గుర్తింపులు నిలదొక్కుకొని ఉండడానికి మరి రెండు అంశాలు కూడా కారణం. అందులో ఒకటి బూర్జువా ఎన్నికల వ్యవస్థ, మరొకటి రిజర్వేషన్లు. ఈ రెండూ కూడా మొదటి ముఖ్యమైన కారణంతో పూర్తి స్వతంత్రమైనవో లేదా సంబంధం లేనివో కావు కానీ వీటి ప్రాముఖ్యత వీటికి ఉంది.

బూర్జువా ఎన్నికల విధానం, అందులో కుల సమీకరణకు ఉన్న కీలక పాత్ర వల్ల అది వాటికవిగా ప్రతీఘాతుకమైన కుల గుర్తింపులను నిరంతరంగా బలోపేతం చేస్తుంది, పునఃసృష్టిస్తుంది. పాలకవర్గాలు తమ అధికార నిర్మాణాలను నిలబెట్టుకోవడానికి పాలక వర్గాల ముందున్న అతి చవకైన, ప్రభావవంతమైన మార్గం, కుల సమీకరణలు చేయడం. ఇక దోపిడీకి గురవుతున్న ప్రజలకు బలమైన వర్గచైతన్య లోపం ఉన్నప్పుడు తమ కులపువాళ్లు అధికార ప్రతిష్టల స్థానాల్లో ఉన్నప్పుడు తమకేదో ఒరుగుతుందన్న భ్రమ కులసమైక్యత (కాస్ట్ అసోసియేషన్)తో కలుగుతుంది. గ్రామస్థాయి నుంచి రాష్ట్రస్థాయి దాకా ఎన్నికల ప్రక్రియ తమ, తమ కులాల ప్రతినిధులు అధికార స్థానాల్లో ఉంటే తమకు ఏదో కొంత ఒనగూడుతుందనే ఆశ కల్పిస్తూనే ఉంటుంది. (చాలా సందర్భాల్లో ఇది భ్రమగానే మిగిలిపోతుంది. అప్పుడప్పుడూ ఏదో కొంత విదిలించి పాలకవర్గాలు ఈ భ్రమను చాలా జాగ్రత్తగా పెంచి పోషిస్తున్నాయి.) ఎన్నికల్లో పాల్గొనే ఏ ఒక్కరూ (అది అభ్యర్థి కావచ్చు, ఓటరు కావచ్చు) కులం నుండి తప్పించుకోలేనంతగా అది వ్యాపించి ఉంది. కుల గుర్తింపులు, కుల భావనలను మళ్లీ మళ్లీ బలోపేతం చేయడంలో ఈ విశాలమైన ఎన్నికల నెట్‌వర్క్ ఒక ముఖ్యమైన భూమిక నిర్వహిస్తోంది. లేకపోతే అనునిత్యం ఎదుర్కోవలసిన వర్గ దోపిడీ, జీవికకై పోరాటాల ఒత్తిడిలో కులం వెనుకపట్టు పట్టేదే.

ఇక రిజర్వేషన్ల విషయానికి వస్తే – దళితులకే కాక వెనుకబడిన కులాలకు (ఒబిసిలకు) రిజర్వేషన్లు బలంగా సమర్థనీయమైనవి. అయినంత మాత్రాన కులభావన, గుర్తింపులు కొనసాగడంలో అవి నిర్వహిస్తున్న నెగెటివ్ పాత్ర పట్ల మనం కళ్లు మూసుకోకూడదు. ఉద్యోగ రిజర్వేషన్లలో ఒక చిన్న ముక్క కోసం జరిగే స్పర్థ / పోరాటం కుల భావన, కుల గుర్తింపులను బలంగా చాటుకునేందుకు కారణమైంది. దీనివల్ల విభజనలు పెరిగాయి. కోటాల్లో ఉపకోటాల కోసం డిమాండ్ల వల్ల దళిత ఐక్యత దెబ్బతిన్నది. అట్లాగే వెనుకబడిన కులాలు కూడా రిజర్వ్‌డ్ కోటాల్లోకి చేరడం కోసం పోటాపోటీగా కొట్లాడుతున్నారు. ఈ కుల రిజర్వేషన్ల కోసం కొట్లాట వల్ల నిరుద్యోగానికి వ్యతిరేకంగా ఐక్యపోరాటం అనేది వెనకబాటు పట్టింది. ఈ నెగెటివ్ అంశం ఉన్నప్పటికీ రెండు కారణాల వల్ల రిజర్వేషన్లను సమర్థించాలి. మొదటిగా – అది ఒక సంస్కరణ. ఒక పాక్షిక డిమాండుగా అది కుల వివక్ష, ప్రిజుడిస్‌లతో కూడుకున్న సమాజంలో కొంత మెరుగుదలకు దారి తీస్తుంది. రిజర్వేషన్లే లేకపోతే అన్ని రకాల సదుపాయాలు, అవకాశాలు ఉన్న అగ్రకులాలకే సర్వత్రా ఏకఛత్రాధిపత్యం ఉండేది. ఈ ఆధిపత్యాన్ని దెబ్బతీయడానికి దళితులకు, వెనుకబడిన కులాలకు రిజర్వేషన్లు ఒక అవకాశాన్ని కల్పిస్తాయి. ఇక రెండవ కారణం ఏంటంటే రిజర్వేషన్లు కుల వివక్షను, అణచివేతను ఎదుర్కుంటున్న ప్రజల బలమైన డిమాండు కాబట్టి; దానివల్ల వారికి ఎంతో కొంత లాభం చేకూరుతుంది కాబట్టి చాలా బలంగా వాటిని సమర్థించాలి. అయినా ఈ రిజర్వేషన్ల వ్యవస్థ కులభావనకు ఉన్న విభజించే, ముక్కలు చెక్కలు చేసే లక్షణాలను పెంపొందింపజేస్తుంది అనేది కూడా గుర్తించాలి.

కులం ఆధారంగా విభాజితమైన సమాజంలో కొరతగా ఉండే వనరుల పంపకం కానీ డిమాండు కంటే చాలా తక్కువగా ఉన్న సరుకులు కానీ డబ్బు ఎక్కువ చెల్లించేవారికో లేక తన కులం వాళ్లకో ఇవ్వడం చాలా సహజంగా జరుగుతుంది. చాలాసార్లు ఈ రెండూ కలిసి పనిచేయవచ్చు. కులం కనెక్షన్ల వల్ల ఈ లాభాలు ఒనగూరుతున్నాయంటే అది కూడా కులాన్ని, కులానుబంధాలను, కుల గుర్తింపును బలోపేతం చేస్తుంది.

కులం నిలదొక్కుకోవడానికి పైవన్నీ కొన్ని కారణాలు మాత్రమే. ఇంకా ఎన్నో కారణాలు ఉన్నప్పటికీ, పై కారణాలకు, ఇవ్వవలసినంత ప్రాముఖ్యత ఇవ్వటం లేదు. గతంలో కొందరు మార్క్సిస్టులు రిజర్వేషన్లకున్న పై నెగెటివ్ అంశాన్ని నొక్కి చెప్పి రిజర్వేషన్ల విధానాన్నే వ్యతిరేకించే వారు. కానీ అది తప్పు వాదన. ఎప్పుడైనా సరే ఏ వ్యవస్థనైతే రద్దు చేయాలని కోరుకుంటామో ఆ వ్యవస్థకు సంస్కరణలు నూతన ఆయువు పోస్తాయి. శ్రమశక్తి అమ్మకంలో మెరుగైన పరిస్థితులను డిమాండు చేస్తే దాని సైడ్ ఎఫెక్ట్ వల్ల శ్రమశక్తిని అమ్మే పరిస్థితులకు కొత్త జీవం లభిస్తుంది. అంత మాత్రాన వేతనాల పెరుగుదలను డిమాండు చేయడం మానం కదా! అట్లాగే రిజర్వేషన్లు కూడా!

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత రాజకీయ ఖైదీ, తేనూఘాట్, బొకారో జిల్లా, ఝార్ఖండ్)* వీ

# రిలయన్స్ గ్యాస్ బందిపోటు వివరాలు

***అధికారంలో ఉన్నవారి అండతో దేశ వనరులను కొల్లగొట్టే విద్యలో సిద్ధహస్తులైన అంబానీలు గ్యాస్ వెలికితీసే పేరుతో ఈ దేశ ప్రజాధనాన్ని ఎలా లూటీ చేస్తున్నారో వివరించే స్థూల సమాచారం - ఆధారం: ఇంటర్నెట్***

కొంతకాలంగా రిలయన్స్ గ్యాస్ (సహజవాయు) ధరల వివాదం గురించి పత్రికలలో, టెలివిజన్ ఛానళ్లలో వార్తలు, వ్యాఖ్యలు వస్తున్నాయి. రిలయన్స్ జోక్యంతో కేంద్ర మంత్రివర్గంలో మంత్రుల శాఖలు మారాయనే దగ్గరినుంచి రిలయన్స్ అధినేత ముఖేష్ అంబానీ అటు కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ ను, ఇటు భాజపా నాయకత్వంలోని ఎన్‌డిఎను తన జేబులో పెట్టుకుని తిరుగుతున్నాడనేంతవరకు ఎన్నో ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. ఈ వివాదం సుదీర్ఘమైనదీ, సంక్లిష్ట మైనదీ. కాని ఆసక్తిగల పాఠకుల కోసం క్రోడీకరించిన ప్రధాన వివరాలు ఇవి:

1. కెయిర్న్ అనే యూరప్‌కు చెందిన చమురు, సహజవాయు వ్యాపార బహుళజాతి సంస్థ కృష్ణా - గోదావరి బేసిన్‌లో అపారమైన సహజవాయు నిక్షేపాలు ఉన్నాయని 1990లలో కనిపెట్టింది. భూమి మీదా, సముద్రం మీదా అధికారం భారత ప్రభుత్వానిదే గనుక భూమి మీద, సముద్రం మీద బావులు తవ్వి ఈ సహజవాయు నిక్షేపాలు వెలికి తీయడంలో ప్రభుత్వ సంస్థలకు, ప్రైవేటు సంస్థలకు సమాన అవకాశాలు ఇచ్చే ఉద్దేశంతో భారత ప్రభుత్వం 1997-98లో నూతన అన్వేషణా, అనుమతుల విధానం (న్యూ ఎక్స్ ప్లోరేషన్ అండ్ లైసెన్సింగ్ పాలసీ - ఎన్ఇఎల్‌పి) ప్రకటించింది.
2. ఎన్ఇఎల్‌పి మొదటి విడత ప్రకారం ప్రభుత్వ అధీనంలో ఉన్న చమురు క్షేత్రాలలో కొత్త అన్వేషణలు జరిపి, అభివృద్ధి చేయడానికి ఆసక్తి ఉన్న కంట్రాక్టర్లను వేలం పాటకు పిలిచారు. రిలయన్స్ ఇండస్ట్రీస్ 90 శాతం, కెనడాకు చెందిన నికో రిసోర్సెస్ పది శాతం వాటాలతో ఏర్పడిన సంయుక్త సంస్థ ఈ వేలాన్ని పాడి మొత్తం 24 క్షేత్రాలలో 12 క్షేత్రాలను కైవసం చేసుకుంది.
3. అప్పటి నుంచి ఇప్పటి వరకు ఎన్ఇఎల్‌పి మరికొన్ని విడతల వేలం పాటలు జరిగాయి. రిలయన్స్ మరి కొన్ని క్షేత్రాలను కూడ సంపాదించింది.
4. ఈ వేలం పాటలలో ప్రభుత్వ సంస్థ ఒఎన్‌జిసి, బహుళజాతి సంస్థ కెయిర్న్ వగైరాలను ఓడించి రిలయన్స్ - నికో ఎన్నో చమురు క్షేత్రాలను గెలుచుకుంది.
5. ఈ వేలం పాటల మౌలిక అంశాలు రెండు: వేలం పాడేవారు తమ లాభాలలో భారత ప్రభుత్వానికి ఎంత వాటా ఇవ్వజూపుతారు, ఆ వేలం పాడేవారు తమ నిర్వహణా వ్యయాలను ఎంత తక్కువగా చూపగలరు అనేవే. ఆ నిర్వహణావ్యయాలు కూడ ఏటేటా మారుతూ ఉండవచ్చు. ఈ రెండు వేలం పాట నిబంధనలు ఆ తర్వాత కొద్దిగా మారాయి గాని ఆ మార్పులు అంత ప్రధానమైనవి కాదు.
6. ఈ మొత్తం వ్యవహారాన్ని మామూలు పద్ధతిలో అర్థం చేసుకోవాలంటే: అన్ని చమురు, సహజవాయు క్షేత్రాల యజమాని ప్రభుత్వమే. వీటిలో కొన్ని భూమి మీద, కొన్ని తక్కువ లోతు జలాలలో, మరికొన్ని చాల లోతయిన జలాలలో ఉంటాయి. మొత్తానికి అన్నీ భారత ప్రభుత్వ పాలనా ప్రాంతంలో ఉండేవే. వేలం పాటలో ఆ క్షేత్రాన్ని గెలుచుకునే సంస్థ తన సొంత ఖర్చు మీద అక్కడ అన్వేషణలు జరిపి, అక్కడి చమురు, సహజవాయు నిలువలను వెలికితీసి అభివృద్ధి చేస్తుంది. తనకు ఎంత ఖర్చవుతుందో లెక్కవేసుకుని ఆ పునాది మీదనే వేలంలో పాల్గొంటుంది. అంటే ఖర్చు ఎంత తక్కువైతే అంత మంచిదన్నమాట. ఒకసారి అక్కడ సహజవాయు నిక్షేపాలు ఉన్నాయని తేలితే ఆ కంపెనీ మొట్టమొదట తాను ప్రకటించిన ఖర్చును రాబట్టుకోవడానికి అనుమతిస్తారు. ఆ తర్వాత తన ఆదాయంలో ముందు ఒప్పుకున్న వాటా ప్రభుత్వానికి చెల్లించవలసి ఉంటుంది. ఒకవేళ అన్వేషణల తర్వాత అక్కడ సహజవాయు నిక్షేపాలు లభించకపోతే, ఆ సంస్థ ఆ క్షేత్రాలను ప్రభుత్వానికి తిరిగి ఇచ్చేస్తుంది. మొత్తం 24 క్షేత్రాలలో 13 క్షేత్రాలు ప్రభుత్వానికి ఇలా తిరిగి వచ్చాయి. అతి తక్కువ వ్యయంతో చమురు క్షేత్రాలను అన్వేషించి, నిర్వహించడం, ఆదాయంలో ప్రభుత్వానికి ఎక్కువ వాటా ఇస్తామని కట్టుబడడం అనే రెండు ప్రమాణాల మీద ఆధారపడి మాత్రమే ప్రభుత్వం ఆయా క్షేత్రాలను ఆయా సంస్థలకు అప్పగించింది. అంటే ప్రతి సందర్భంలోనూ తనకు ఎక్కువ ఆర్థిక లాభం ఉండాలని ప్రభుత్వం లెక్కలు కట్టుకుంది.
7. అంటే మొత్తంమీద, వేలంపాటలో గెలవడం అంటే ఒక ప్రభుత్వ ఆస్తి మీద నిర్ణీత పద్ధతిలో పనిచేసుకోవడానికి ఒప్పందం కుదరడం అన్నమాట. ఆ కంపెనీ తాను వాడే యంత్రసామగ్రి స్థిర ఖర్చులు, సిబ్బందికీ, నిర్వహణకూ అయ్యే చలన ఖర్చులూ లెక్క కట్టుకుని ప్రభుత్వానికి, అంటే ప్రజలకు సహజవాయువు ఉత్పత్తి చేసి పెడుతుందన్నమాట.
8. ఇటువంటి మొదటి ఒప్పందాలు 2000లో కుదిరాయి. రిలయన్స్ తన క్షేత్రంలో సహజవాయువును కనిపెట్టింది. ఆ సహజవాయువును అమ్మడానికి ప్రభుత్వరంగ సంస్థ ఎన్‌టిపిసితో 2002లో 17 సంవత్సరాల దీర్ఘకాలిక ఒడంబడిక కుదుర్చుకుంది. ఈ ఒడంబడిక ప్రకారం రిలయన్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ సహజవాయువు మిలియన్ బ్రిటిష్ థర్మల్ యూనిట్ (ఎంబిటియు) లకు 2.34 డాలర్ల ఖరీదు చొప్పున ఎన్‌టిపిసికి అందజేస్తుంది. ఈ ధరకే 2002 నుంచి 2019 వరకు సహజవాయువు సరఫరా చేయగలమని, ఆ ధర తమ ప్రస్తుత, భవిష్యత్తులో మారనున్న వ్యయానికి కూడ సరిపోతుందని రిలయన్స్ ఒప్పందంలో రాసింది.
9. కొద్దిరోజుల తర్వాత అంబానీ కుటుంబంలో చీలిక వచ్చింది.

అన్నదమ్ములిద్దరూ విడిపోయారు. అప్పుడు అనిల్ అంబానీ తన ఇంధన ప్రాజెక్టు ఆర్ఎన్ఆర్ఎల్‌కు అన్న ముఖేష్ అంబానీకి చెందిన రిలయన్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ నుంచి సహజవాయువు సరఫరా కావాలని కోరడం వివాదం అయింది. చివరికి ఎన్‌టిపిసి కి ఇచ్చిన ధరకే ఆర్ ఎన్ ఆర్ ఎల్ కు కూడ ఇవ్వడానికి అంగీకారం కుదిరింది.

10. ఈ సమయంలోనే అంతర్జాతీయంగా సహజవాయువు ధరలు గణనీయంగా పెరిగాయి. అదేమీ ఉత్పత్తి వ్యయాలు పెరగడం వల్ల కాదు. సరఫరా-గిరాకీ వ్యత్యాసాల వల్ల, ఉత్పత్తి వ్యయం ఎలా ఉన్నప్పటికీ తమ ఇష్టం వచ్చినట్టు ధర నిర్ణయించవచ్చుననుకునే ఒపెక్ దేశాల సమాఖ్య గుత్త విధానాల వల్ల జరిగింది.

11. విస్తారమైన చమురు, సహజవాయు నిక్షేపాలు ఉన్న భారతదేశం వంటి దేశాలకు ఈ ధరల పెరుగుదల వార్త శుభవార్తే కావాలి. ప్రభుత్వ క్షేత్రాన్ని కౌలుకు తీసుకుని, బావులు తవ్వే రిగ్గు పరికరాలు, సిబ్బంది జీతాల ఖర్చులు దాదాపు స్థిరంగానే ఉండగా తన సొంతఖర్చులతో ఉత్పత్తి చేసే కౌలుదారుకు ఈ ధరల పెరుగుదల వ్యవహారంతో జరిగే మార్పేమీ లేదు.

12. కాని ప్రభుత్వరంగ ఎన్‌టిపిసి ని, తన సొంత సోదరుడిని ఇబ్బంది పెట్టడానికి ఇదే మంచి అవకాశమని ముఖేష్ అంబానీ భావించాడు. తండ్రి అడుగుజాడల్లో నడుస్తూ, ప్రభుత్వ విధానాలను మార్చి లాభాలు దండుకోవడం అనే తండ్రి నేర్పిన విద్యను పాటించాడు. తాను ఈ కాంట్రాక్టు పొందడానికి ప్రభుత్వం ఏ షరతులను పెట్టిందో, తాను ఏ షరతులకు అంగీకరించాడో ఆ షరతులనే భగ్నం చేయడానికి 2009లో తీవ్రంగా ప్రయత్నించాడు.

13. తమకు ప్రభుత్వం చెల్లించే ధరను ఎంబిటియుకు 2.34 డాలర్ల నుంచి 4.20 డాలర్లకు పెంచవలసిందిగా అప్పుడు ఆ శాఖకు మంత్రిగా ఉండిన ఎస్ జైపాల్ రెడ్డిని రిలయన్స్ కంపెనీ కోరింది. మంత్రిత్వశాఖ అది కుదరదని చెప్పింది. తమ ఉత్పత్తి వ్యయం పెరిగిందని రిలయన్స్ కారణం చూపింది. కాని అదే సమయంలో సముద్రంలోని చమురు బావి దగ్గరినుంచి గ్యాస్ ను తీరానికి తీసుకువచ్చేందుకు తమకు అవుతున్న వాస్తవ వ్యయం 0.8945 డాలర్లు అని రిలయన్స్ కంపెనీ లిఖిత పూర్వకంగానే ప్రకటించి ఉంది. అంటే అది ఒక డాలర్ కన్న తక్కువ - తొంభై సెంట్లు కూడ కాదు. ఆ లెక్కన వారు అప్పటి ధర మీదనే ఒక్కొక్క ఎంబిటియుకు 1.44 డాలర్ల చొప్పున లాభం పొందుతున్నారన్న మాట. కాని ఇబ్బడి ముబ్బడిగా లాభాలు పెంచుకోవడానికి, తమ దగ్గర సహజవాయువు కొంటున్న ప్రభుత్వాన్ని, అనిల్ అంబానీని ఇబ్బంది పెట్టడానికి ముఖేష్ అంబానీ వేసిన ఎత్తు ఇది.

14. సంబంధిత శాఖ మంత్రి తమ కోరికను తిరస్కరిస్తే ముఖేష్ మౌనంగా ఉండిపోలేదు. రిలయన్స్ అతి ఎక్కువగా పాల్పడే మరొక ఎత్తుగడకు పూనుకున్నాడు. ఆ మంత్రిత్వశాఖ నుంచి జైపాల్ రెడ్డిని తొలగింపజేశాడు. ఆ స్థానంలో తాను చెప్పినట్టు వినే మురళీ దేవరాను నియమించేలా చేశాడు. అప్పటి ఆర్థిక మంత్రి, ప్రస్తుత రాష్ట్రపతి ఈ విషయమై ఒక తాత్కాలిక కమిటీని సమావేశ పరిచేలా ఆ తొత్తుమంత్రి ఒక పథకం రచించాడు. ఆ తాత్కాలిక కమిటీకి సాధికార కమిటీ అని పేరు పెట్టారు. ఆ కమిటీ చేసిన పనల్లా ముఖేష్ అంబానీ కోరిక, ఎంబిటియు సహజవాయువుకు 4.20 డాలర్లు ఇవ్వాలనేది సరైనదేనని ఆమోదం తెల్పడం.

15. ఈ ధర చాల ఎక్కువ అని అటు అనిల్ అంబానీ, ఇటు ఎన్‌టిపిసి న్యాయస్థానానికి వెళ్లాయి. ఆ కేసు న్యాయస్థానాలలో ఇంకా సాగుతూనే ఉంది. ఈ న్యాయస్థాన విచారణలో ప్రభుత్వం తన సొంత ప్రభుత్వ రంగ సంస్థ అయిన ఎన్‌టిపిసికి అండగా నిలవలేదు. ఈమధ్యలో అనిల్ అంబానీకి ఏమి ఆశ చూపారో తెలియదు గాని ఆయన ఈ కేసు గురించి మౌనం వహించాడు.

16. ప్రస్తుతం ముఖేష్ అంబానీకి ప్రభుత్వం చెల్లిస్తున్న సొమ్ము ఆయన అడిగినంత హెచ్చు ధరే. అంటే మన నేల మీద, మన సముద్రాలలో, మన సహజవాయువును తవ్వితీసి మనకిచ్చినందుకు మన పన్నులలోంచి అప్పనంగా అంత ధర చెల్లిస్తున్నామన్నమాట. ఆ గ్యాస్ ధర పెరుగుదల మన ఎరువుల కర్మాగారాలలో ఉత్పత్తి వ్యయం మీద ప్రభావం చూపుతుంది. మన ఆహారం మీద, మన రవాణా వ్యవస్థ మీద, మన నెలవారీ ఖర్చుల మీద ప్రభావం చూపుతుంది. అయితే కథ ఇక్కడితో అయిపోలేదు. అన్న అంబానీ మన జీవితాలను మరింత ఇబ్బంది పెట్టేందుకు కొత్త పన్నాగాలు పన్నుతున్నాడు.

17. వేలం పాటలో చమురు క్షేత్రం గెలుచుకున్నవారు మొదట తమ పెట్టుబడి ఖర్చులు రాబట్టుకున్నాకనే ప్రభుత్వంతో లాభాలు పంచుకోవాలనే నిబంధన ఒప్పందంలో ఉందని గుర్తుందా? 2004లో మణిశంకర్ అయ్యర్ ఈ శాఖ మంత్రిగా ఉండగా, రోజుకు 40 మిలియన్ మెట్రిక్ స్టాండర్డ్ క్యూబిక్ మీటర్ల సహజవాయువు ఉత్పత్తి చేయడానికి అవసరమైన 239 కోట్ల డాలర్ల కొత్త పెట్టుబడి పెట్టడానికి అనుమతించమని రిలయన్స్ నుంచి ప్రభుత్వానికి ఒక లేఖ అందింది. దీన్ని రూపాయల్లో చెప్పాలంటే రు. 10,000 కోట్ల కొత్త పెట్టుబడి అన్నమాట. వాస్తవానికి ఈ లేఖ అర్థమేమిటంటే ఈ పదివేలకోట్లు సమకూరేదాకా ఆదాయంలో ఒక్కపైసా కూడ ప్రభుత్వంతో పంచుకోకుండా ఉండడం అని.

18. రెండు సంవత్సరాలు తిరగకుండా మణిశంకర్ అయ్యర్ ను కూడ ఆ కుర్చీలోంచి తన్ని తగలేసిన రిలయన్స్ తమ మిత్రుడు మురళీ దేవరాను ఆ స్థానానికి తీసుకొచ్చింది. ఈ మురళీ దేవరా రిలయన్స్ వారి పెట్టుబడి వ్యయం నాలుగు రెట్లు పెరగడానికి, అంటే 880 కోట్ల డాలర్ల పెట్టుబడికి, అంటే రు. 50,000 కోట్ల పెట్టుబడికి అనుమతించాడు. కాకపోతే ఇంత పెట్టుబడి పెట్టినా ఉత్పత్తి సామర్థ్యం రెట్టింపు మాత్రమే అయింది. నిజానికి ఎక్కడైనా అదనపు పెట్టుబడి వ్యయం సాపేక్షికంగా తక్కువగానే అవసరమవుతుంది. ఉన్న బావుల సామర్థ్యం రెట్టింపు కావాలంటే దానికి అవసరమైన పెట్టుబడి మదుపు తగ్గుతుంది. ఉత్పాదకత పెరుగుతుంది. పైగా రిలయన్స్ తనకు ముడిసరుకులు సరఫరా చేసేవారికి ఎప్పుడూ సమయానికి బిల్లులు చెల్లించదని, వీలయినంతవరకు ఖర్చులు తగ్గించుకుంటుందని అందరికీ తెలిసిందే.

19. రిలయన్స్ దురాశ అక్కడితో అయిపోలేదు. భారత ప్రజల ఆస్తి మీద జరిగే అన్వేషణల ఫలితం భారత ప్రజలకు అందకుండా చేయడమే ముఖేష్ అంబానీ లక్ష్యం. భారత ప్రజలకు చెందిన చమురు క్షేత్రాలలో దొరికే సహజవాయువును అమ్ముకుని రు. 50,000 కోట్లు కూడబెట్టుకునే దాకా ముఖేష్ భారత ప్రజలకు ఒక్క పైసా కూడ ఇవ్వదలచుకోలేదు. రిలయన్స్‌కు ఇలా రు. 40,000 కోట్ల అదనపు సొమ్ము ముట్టజెప్పడానికి కారణమేమిటని అడిగితే మురళీ దేవరా అసలా విషయమే తనకు

గుర్తులేదన్నాడు. 'మంత్రిగా పనిచేసిన వారికి అంత చిన్న వివరాలు గుర్తుంటాయా' అని ఆయన ఎదురు ప్రశ్నించాడు. రు. 40,000 కోట్లు అప్పనంగా అప్పగించడం ఆయనకు చిన్న వివరం అన్నమాట!

20. ఈ దొంగల దోపిడీకి, లేదా బంగారు తొడుగుకు మరొక రుజువు సిఎజి నివేదికలో దొరికింది. సింగపూర్ లో బయో మెట్రిక్స్ అనే ఎవరికీ తెలియని సంస్థ ఒకటి ఉంది. రిలయన్స్ ధరలు పెంచడం వల్ల ఆ సంస్థకు లాభం చేకూరింది. దానికి ప్రతిఫలంగా అది రిలయన్స్‌లో రు. 6,500 కోట్లు పెట్టుబడి పెట్టింది. ఆ పెట్టుబడి కూడ ఏ హామీ లేకుండానే భారత బ్యాంకులు దానికి ఇచ్చిన రుణం నుంచే పెట్టింది. ఈ వ్యవహారమంతా సింగపూర్ లోని భారత రాయబార కార్యాలయం పరిశోధనలో బయటపడింది. అసలు ఈ వ్యవహారం ఎంత అసంబద్ధంగా ఉందో చూడండి. ఎవరికీ తెలియని ఒక సింగపూర్ కంపెనీ పేరు చెప్పుకుని ఎవరో ఒకరు ఒక భారతీయ బ్యాంకులోకి అడుగుపెడతారు. ఒక భారతీయ కంపెనీలో వాటాలు కొనడానికి తనకు రు. 6,500 కోట్లు అప్పు ఇమ్మని అడుగుతారు. ఏ హామీ లేకుండానే ఆ అప్పు తీసుకుని అది రిలయన్స్ లో పెట్టుబడి పెడతారు! అయితే ఆ సింగపూర్ కంపెనీని నడుపుతున్నది రిలయన్స్ కు చెందిన కీలకవ్యక్తులే. అంటే సింగపూర్ లో ఒక బేనామీ కంపెనీ తెరిచి, దాని దగ్గరినుంచి ఏవో కొన్నట్టు కాగితాలు పుట్టించి, దానికి చెల్లింపులు జరిపి, మళ్లీ ఆ డబ్బులను వెనక్కి రిలయన్స్ లోకే రప్పించడం జరిగిందన్నమాట. ఎంత సులభమైన మార్గం ఇది!

21. ఆ తర్వాత ఏమయిందో తెలుసా? సింగపూర్ లోని భారత రాయబార కార్యాలయ పరిశోధన కథ కంచికి పోయింది. సిఎజి వినోద్ రాయ్‌ను ఆ పదవి నుంచి తొలగించి శశికాంత శర్మ అనే మరొక అధికారిని నియమించారు. ఈ శశికాంత శర్మ మాజీ రక్షణ శాఖ కార్యదర్శి. ముడుపులను, లంచాలను ఏయే మార్గాలలో రప్పించాలో తెలిసిన నిపుణుడని ఆయుధవ్యాపారులు చెప్పుకుంటారు.

22. అయితే అది అక్కడితో అయిపోలేదు. కాంగ్రెస్ ప్రభుత్వాన్ని తన ఇష్టప్రకారం లొంగదీసుకోవడంలో అంబానీల సామర్థ్యం కొనసాగింది. ధర ఇంకా సరిపోలేదని, 4.20 డాలర్ల కన్న కూడ ఎక్కువ కావాలని రిలయన్స్ కొత్తపాట అందుకుంది. తన కోరిక నెరవేర్చుకునేందుకు అది హఠాత్తుగా చమురు బావుల నుంచి ఉత్పత్తిని పెద్ద ఎత్తున తగ్గించి చూపడం మొదలుపెట్టింది. అంటే, 'మాకు ఎక్కువ ధర కట్టి ఇవ్వకపోయారో, అవి మీ బావులే అయినా సరే మేం ఉత్పత్తి ఆపేస్తాం' అని బెదిరించడం మొదలు పెట్టిందన్నమాట.

23. ఎప్పటి లాగే ప్రభుత్వం జీ హుజూర్, జో హుకుం అంది. రంగరాజన్ అనే పాత గులామీ అధికారి నివేదికకు దుమ్ముదులిపి అమలు చేయడానికి సిద్ధపడింది. ఆయన ఎంత హాస్యాస్పదమైన లెక్కలు వేశాడంటే, కొత్త ధర ఎంబిటియుకు 8.40 డాలర్లు, అంటే ప్రస్తుత ధర కన్న సరిగ్గా రెట్టింపు ఉంటే బాగుంటుందని సిఫారసు చేశాడు. అంటే మనం మన బావుల్లో నుంచి సహజవాయువు తీసి ఇచ్చినందుకు రిలయన్స్‌కు నాలుగు రెట్ల ధర కట్టి ఇస్తున్నామన్న మాట. మొత్తం పెట్టుబడి వ్యయం సుదీర్ఘమైనదైనా అది కూడ వాళ్లకు దక్కింది. నిర్వహణా వ్యయం వస్తున్న ఆదాయంలో పదో వంతు కూడ కాదు. నిజానికి ప్రపంచానికంతా ఏకైక సహజవాయు మార్కెట్ అయిన అమెరికాలో దాని ధర ఇప్పటికీ ఎంబిటియుకి ఐదు డాలర్ల కన్న తక్కువ. ఈ ధర వారి సొంత బావుల్లో దొరికే సహజవాయువును అమ్మగా వచ్చే లాభాలతో కూడ కలుపుకుని. కాని మనదగ్గర మాత్రం మన బావుల్లోనుంచి తవ్వితీస్తున్న కంపెనీకి మనం దానికి రెట్టింపు కన్న ఎక్కువ ఇస్తున్నాం.

24. ఈ లెక్క కుదరగానే రిలయన్స్ హఠాత్తుగా, ఏదో మంత్రం పారినట్టుగా, తనకు విపరీతంగా నిక్షేపాలు ఉన్నాయని, భవిష్యత్తులో తన సామర్థ్యం విపరీతంగా పెరిగిపోతుందని ప్రకటించి, తన స్టాక్ మార్కెట్ ధరలను పెంచుకుంది. అప్పటికే భారతీయ జనతా పార్టీ, కాంగ్రెస్ రెండూ కూడ ముఖేష్ అంబానీ జేబులో ఉన్నాయి. కాని హఠాత్తుగా ఊహించని సంఘటన ఒకటి జరిగింది. ఆమ్ ఆద్మీ పార్టీ అనే సమస్య వచ్చి పడింది. దొంగతనం, అవినీతి నేరారోపణ లతో పైన చెప్పిన పేర్లతో పాటు అంబానీ పేరు కూడ కలిపి ఎఫ్ఐఆర్ లు దాఖలయ్యాయి. ఇక ముఖేష్ అంబానీ చేయగలిగినదంతా చేసి, భాజపాను, కాంగ్రెస్ ను కలిపి ఎఫ్ఐఆర్‌లు దాఖలయిన 72 గంటల్లో ఆమ్ ఆద్మీ పార్టీ ప్రభుత్వాన్ని కూలదోయించాడు.

25. అయితే దానితో ఈ ప్రక్రియ ఆగిపోలేదు. ఏప్రిల్ 1 నుంచి అమలులోకి వచ్చేలా ఎంబిటియు ధరను 4.20 డాలర్ల నుంచి 8.40 డాలర్లకు పెంచుతూ మంత్రిత్వ శాఖలు నిర్ణయం తీసుకున్నాయి. ఎన్నికలు జరిగే లోపల, ఈ మొత్తం వ్యవహారం ప్రజలకు తెలిసే లోపల ధరల పెరుగుదల జరిగిపోవాలి. ఎన్నికల్లో ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు?

26. కాని అరవింద్ కేజ్రీవాల్, ఆమ్ ఆద్మీ పార్టీ మౌనంగా ఉండిపోలేదు. ఈ దోపిడీ మీద ఎన్నికల సంఘానికి ఫిర్యాదు చేశారు. ఎన్నికల సంఘం ఈ ఫిర్యాదును అంగీకరించి ప్రభుత్వ ఉత్తర్వులను, ధరల పెంపుదలను 60 రోజుల పాటు వాయిదా వేసింది. అంటే జూన్ 1 దాకా కొత్త ధరలు అమలు లోకి రావు. ఐనా అంబానీకి పెద్దగా విచారం ఉన్నట్టు లేదు. ఇప్పుడు కాంగ్రెస్ నుంచి మోడీ వైపుకు మొగ్గి, ఎన్నికల తర్వాత తన కోరిక నెరవేరుతుందని నమ్మకంగా ఉన్నాడు.

27. ఐతే ఇదంతా 8.40 డాలర్ల దగ్గర ఆగిపోవడం లేదు. ఈ చిన్న చిన్న అంశాలలో చూడవలసింది మొత్తంగా ఉన్న పన్నాగం. తోలుబొమ్మల ఆటగాడు ఇప్పుడు మోడీ వెనుక దారాలు కదిలిస్తున్నాడు. గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వ అధీనంలోని ఒక సహజవాయు సంస్థ కేంద్రప్రభుత్వానికి ఒక అభ్యర్థన పంపింది. ఎంబిటియుకు 14 డాలర్లు చెల్లించాలని ఆ అభ్యర్థన. అంటే అంతర్జాతీయ మార్కెట్ ధరలకు నాలుగు రెట్లు అన్నమాట. అంటే ప్రజాధనం నుంచి, ప్రజలు చెల్లించిన పన్నుల ఆదాయం నుంచి ప్రభుత్వం అదనంగా సంవత్సరానికి రు. 25,000 కోట్లు అంబానీలకు అప్పగిస్తుందన్నమాట. మోడీని వెనుక నుంచి ఆడిస్తున్నందుకు ముఖేష్ అంబానీకి దక్కనున్న ఫలితం అది. ఇక మోడీని దేశమంతా తన విమానాల్లో తిప్పుతున్న అదానీకి మనం ఎంత చెల్లించబోతున్నామో ఎవరికి తెలుసు? ఇలా సహజవాయువు ధరలు పెరిగినకొద్దీ మన పరిశ్రమలకు అందే సహజవాయువు ధర పెరిగిపోతుంది. మన ఎరువుల కర్మాగారాలకూ, మన రవాణాకూ, మన ఇంధన వనరులకూ, బొగ్గుకూ, అన్నిటికీ ధరలు పెరిగిపోతాయి. అంటే మనం రోజువారీ వాడే సరుకులన్నిటికీ మనం ఎక్కువ ధరలు చెల్లించవలసి వస్తుంది. వీ

# బాల్కో వ్యతిరేక పోరాట విజయగాథ

***మూడు దశాబ్దాల కింద ఒడిశాలోని గంధమార్ధన్ గ్రామీణ ప్రజలందరూ ఏకతాటిపై నిలిచి బాల్కో కంపెనీకి వ్యతిరేకంగా పోరాడి బాక్సైట్ తవ్వకాలను ఆపిన చరిత్రను చెపుతున్నారు నటాషా***

ఈ రోజు దేశంలో భారత పాలకవర్గాల సిబిబి, ఎంఎన్‌సిల అనుకూల బానిస ఆర్థిక, రాజకీయ విధానాల మూలంగా నిర్వాసిత (విస్థాపన) సమస్య ఒక ముఖ్యమైన సమస్యగా మారింది. వలస పాలన నుండే నిర్వాసిత సమస్య ఉన్నప్పటికీ అధికార మార్పిడి జరిగిన తరువాత నుండి గడిచిన 66 ఏళ్లకాలంలో దేశ వ్యాప్తంగా నిర్వాసిత సమస్య ఎన్నోరెట్లు అధికంగా పెరిగింది. భారీ నీటిపారుదల ప్రాజెక్టులు, గనుల తవ్వకాలు, కార్ఖానాల నిర్మాణం, ఎస్ఇజడ్‌ల మూలంగా ఎక్కువ సంఖ్యలో ప్రజలు నిర్వాసితులయ్యారు. అందులోనూ ఎక్కువ మంది ఆదివాసులు, దళితులు ఉన్నారు. ఒడిశా రాష్ట్రంలో కూడా నిర్వాసిత సమస్య ఒక గంభీరమైన సమస్యగా ఉంది. నీటి వనరులు, పచ్చని అడవులు, పుష్కలమైన ఖనిజ సంపదకు నిలయమైన ఈ రాష్ట్రంపై దోపిడి దారులైన సిబిబి, ఎంఎన్‌సిల గద్ద కాళ్లు కేంద్రీకృతమై ఉన్నాయి. ఒడిశాలో విస్థాపన సమస్య ఎంత సుదీర్ఘమైనదో దానికి వ్యతిరేకంగా ప్రజా పోరాటాల చరిత్ర కూడా అంతే సుదీర్ఘమైనది. మాచ్‌ఖండ్ జల విద్యుత్ ప్రాజెక్ట్ వ్యతిరేక పోరాటం, హీరాకుడ్ ప్రాజెక్ట్ వ్యతిరేక పోరాటం, రెంగాలి డ్యాం వ్యతిరేక పోరాటం, గంధమార్ధన్‌లో బాల్కో వ్యతిరేక పోరాటం, చిలికా, కాశీపూర్, గోపాల్‌పూర్, పారద్వీప్ దగ్గరి పోస్కో వ్యతిరేక పోరాటం, కళింగనగర్, లోయర్ సుక్తేల్, లోయర్ ఇంద్ర, నియంగిరి, పూజారి పల్లి వరకు ప్రజలు విస్తాపన సమస్యకు వ్యతిరేకంగా అరెస్టులను లాఠీలను తూటాలను లెక్క చేయకుండా నెత్తురోడుతూ పోరాడిన చరిత్రే. తాము పుట్టిపెరిగిన మట్టికోసం, జల్ జంగల్ జమీన్ పై తమ హక్కును కాపాడుకోవడానికి త్యాగాలు చేసిన చరిత్రే. అయితే దారి పొడువునా నాయకత్వాల మితవాద అవకాశవాద విద్రోహాలకు గురవుతూ చాలవరకు విజయం సాధించకుండానే నీరుగార్చ బడ్డాయి. ఇందులో కొన్ని పోరాటాలు మాత్రమే చివరి వరకు రాజీలేని పోరాటం చేసి విజయం సాధించగా మరికొన్ని పోరాటాలు ఇంకా దృఢంగా కొనసాగుతున్నాయి. 80వ దశకంలో పాలకవర్గాల మెడలువంచి విజయం సాధించిన పోరాటాల్లో గంధమార్ధన్‌లో జరిగిన బాల్కో వ్యతిరేక పోరాటం మొదటిది కాగా, క్షిపణి పరీక్ష కేంద్రం (సెంటర్) నిర్మాణానికి వ్యతిరేకంగా జరిగిన బలియాపాల్ ప్రజల పోరాటం రెండవది. వేదాంతకు వ్యతిరేకంగా పోరాడి ఇటీవల విజయం సాధించిన నియమగిరి ప్రజల పోరాటం మూడవది. దేశవ్యాప్తంగా విస్తాపన వ్యతిరేక పోరాటాల్లో పాల్గొంటున్న ఈ తరం యువతకు మూడు దశాబ్దాల కింద జరిగిన బాల్కో వ్యతిరేక పోరాట విజయగాదను తెలియజేయడమే ఈ వ్యాస లక్ష్యం. ఈ పోరాటం మరో ప్రత్యేకత ఏమిటింటే ఈ పోరాటం జరిగే నాటికి ఒడిశాలో మావోయిస్టు ఉద్యమం లేదు. కొంతమంది ప్రజల పక్షాన ఆలోచించే నిజాయితీపరులైన యువకులు పూనుకొని ప్రజలందరికి సంఘటితం చేసి రాజీలేని పోరాటాన్ని కొనసాగించడం ద్వారా విజయం సాధించారు. చరిత్రలోకి వెలితే, పశ్చిమ (వెస్ట్) ఒడిశాలోని బొలంగీర్, బార్‌గడ్, నవపాడ జిల్లాల సరిహద్దుల్లో 90 కిలోమీటర్ల పొడవైన, ఎత్తైన పర్వతమాల గంధమార్ధన్. అనేక రకాల వనమూలికలకు నిలయం. సంవత్సరం పొడవునా ప్రవహించే జరనులులకు ఆంగ్ నది, సుక్తేల్ నదులకు జన్మస్థలి. 200 మిలియన్ టన్నులకు పైగా బాక్సైట్ ఖనిజపు నిలువలు ఉన్నాయి. 1981లో బాక్సైట్ తవ్వకానికి భారత్ అల్యూమినియం కార్పొరేషన్ (బాల్కో) కు లీజుకు ఇస్తూ అప్పటి ఒడిశా రాష్ట్ర ప్రభుత్వం తీర్మాణం చేసింది. 1983 మే 13న అప్పటి ఒడిశా ముఖ్య మంత్రి ద్వారా బాక్సైట్ గని ప్రారంభించాల్సి ఉండింది. ఈ వార్త తెలిసిన వెంటనే గంధమార్ధన్ చుట్టుగల గ్రామాల పెద్దమనుషులు కొంతమంది సిఎంకు లేఖ రాశారు. అందులో గని ప్రారంభిస్తే మేము ఆత్మాహుతి చేసుకుంటామని హెచ్చరించారు. పదంపూర్‌లో విద్యార్థులు సిఎం కాన్వాయ్‌ని అడ్డుకునే ప్రయత్నం చేయగా అరెస్ట్ చేసి జైలుకు పంపారు. ప్రజల నిరసన మధ్యనే గని ప్రారంభమై బాక్సైట్ తవ్వకం ఒకటిన్నర సంవత్సరాల కాలం నిరాటంకంగా కొనసాగింది. 18 నెలల నిశబ్దం తరువాత 1985 ఫిబ్రవరిలో గంధమార్ధన్ పర్వతాలకు ఉత్తర దిశన గల పైక్‌మాల్‌లో బాల్కోకు వ్యతిరేకంగా పెద్ద నిరసన సభ జరిగింది. ఇందులో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొని తమ నిరసన తెలియజేశారు. 1985 వేసవిలో పైక్‌మాల్ ప్రాంతంలో జాతీయసేవా సంస్థ వాళ్ల శిభిరం నిడిచింది. సంబల్‌పూర్ విశ్వవిద్యాలయం విద్యార్థులు ఈ శిభిరంలో పాల్గొని నెల రోజులపాటు ప్రతి రోజు పైక్‌మాల్ చుట్టూ ఉన్న గ్రామాల ప్రజల వద్దకు వెళ్లి ప్రజల్లో బాక్సైట్ తవ్వకానికి వ్యతిరేకంగా గూడు కట్టుకొని ఉన్న మనోభావాల్ని అధ్యయనం చేశారు. శిభిరం ముగిశాక 1985 ఆగస్టు 19న 19 మంది ఉత్సాహవంతులైన యువకులతో 'గంద మార్ధన్ సురక్షా యువపరిషత్' నిర్మాణం అయింది. అప్పటి నుండి యువపరిషత్ సభ్యులు ప్రతిరోజు 'బాల్కో హటావో – గంధమార్ధన్ బచావో' 'అమర్ దాబి మాన్ సర్కార్ – బాల్కో అసూర్ నహీ దర్కార్ (మా డిమాండ్ ఒప్పుకో సర్కార్ – బాల్కో రాక్షసుడు మాకు అవసరం లేదు) అని రాసి ఉన్న బ్యానర్లు సైకిల్లకు కట్టుకొని గ్రామ గ్రామం తిరుగుతూ ప్రచారం చేసేవాళ్లు. దీనితో ప్రజల్లో కొంత ధైర్యం వచ్చింది. తెగించి పోరాడి గంధమార్ధన్‌ను కాపాడుకోవాలనే పట్టుదల పెరిగింది.

ప్రజల్లో పెరిగిన ధైర్యాన్ని, చైతన్యాన్ని గమనించి ఉద్యమ నాయకత్వం పోరాటాన్ని మరో మెట్టుకు అభివృద్ధి చేశారు. ప్రచార దశను దాటి

బ్లాక్ సెంటర్లను ఘెరావ్ చేసే పోరాట రూపాన్ని తీసుకున్నారు. అదే సమయంలో చిప్కో ఉద్యమ నాయకుడు సుందర్ లాల్ బహుగుణ యువ పరిషత్ ఆహ్వానం మేరకు ఈ ప్రాంతానికి వచ్చి నలబై గ్రామాల్లో జరిగిన సభల్లో ఉపన్యసించి తన సంఘీభావాన్ని ప్రకటించి ప్రజల్లో ఉత్తేజాన్ని కలిగించారు. ఉద్యమం మరింత ఊపందుకుంది. అప్పుడు జరిగిన రెండు సంఘటనలు ప్రజల కోపం కట్టలు తెంచుకునేలా చేసింది.

ఒకటి, గంధమర్ధన్ కొండల కింద ఉత్తర బాగాన ప్రకృతిసిద్ధమైన పండ్లతోటల వనం ఉండేది. చుట్టుపక్కల గల 5,6 గ్రామాల (మన్ బంగ్, కొడేర్ పస) ప్రజలకు అదే జీవనాధారం. బాల్కో కంపెని నీటి అవసరాల కోసం ఆ ప్రాంతంలో డ్యాం నిర్మించటంతోపండ్లవనం అందులో మునిగి పోయి ప్రజలు జీవనాధారం కోల్పోయారు.

రెండు, పైక్ మాల్ దగ్గర నరసింహనాథ్ మందిరం ఉంది. ఈ మందిరంలోని ప్రాచీన గరుధ స్థంభం బాల్కో కంపని బాక్సైట్ కోసం రోజూ జరుపుతున్న పేలుళ్ల మూలంగా బీటలువారి కూలిపోయింది. ఈ రెండు ఘటనలు ప్రజలకు పుండు మీద కారం చల్లినట్లు అయింది. ప్రజల్లో ఎలాగైనా సరే బాల్కో కంపెనిని ఇక్కడ నుండి తరిమివేయాలనే పట్టుదల మరింత పెరిగింది. ప్రజలు ఎక్కడికక్కడ మిలిటెంట్ గా కదిలి రాస్తారోకో పోరాట రూపం ఎంచుకున్నారు. బాల్కో కంపెని ఆస్థుల్ని ద్వంసం చేయటం, వాహనాలను అడ్డుకోవటం మొదలగు రూపాల్లో పోరాటం కొనసాగింది. పోరాటంలో మహిళల భాగస్వామ్యం ఉద్యమాన్ని మరో మలుపు తిప్పింది. బ్రహ్మండీహి(కొడేర్ పస) గ్రామానికి చెందిన రుద్నబోయి,జిట్కి గ్రామానికి చెందిన జమున దరువ,పదు బోయి లాంటి మహిళలు ఉద్యమంలో క్రియాశీల పాత్ర పోషించి తర్వాత కాలంలో అమరులయ్యారు. గంధమర్ధన్ ను రక్షించటానికి పోరాడి అమరులయిన వాళ్ల జ్ఞాపకార్థం రుద్నబోయి స్వగ్రామమైన కొడేర్ పసలో 2013 నవంబర్ లో స్మారక స్థూపాన్ని నిర్మించి ఆవిష్కరించారు. ఈ సందర్భంగా పోరాటకాలంలో జైలు జీవితం గడిపిన నలబై మందిని సన్మానించారు. ఇంకా కొంతమంది కోర్టు కేసులకు తిరుగుతూనే వున్నారు.

పోరాటం కొనసాగుతున్న కాలంలోజరిగిన మరో ఘటన ప్రజల్ని బాగా కదిలించింది. దుంగిరిపాలి గ్రామానికి చెందిన జాంబవతి బిశ్రా అనే మహిళ తన పాలు తాగే పసిపిల్లలిద్దర్ని (కవల పిల్లలు) తీసుకుని బాల్కో వాహనాలకు అడ్డంగా పడుకుంది. మా బొందిలో ప్రాణాలుండగా వాహనాలను కదలనిచ్చే ప్రసక్తే లేదని తెగేసి చెప్పింది. జాంబవతి సాహసం ప్రజల్లో మరింత తెగింపును పెంచింది. పోరాటం మరింత ఉధృతమయింది. పోరాటం విస్తృత ప్రచారం పొందింది. అనేకమంది మద్దత్తు పొందింది. చివరికి బూర్జువా ప్రతిపక్ష పార్టీలు సైతం తమ ఓటు బ్యాంక్ రాజకీయాల కోసం పోరాటానికి మద్దత్తు ఇవ్వక తప్పలేదు. లాఠీలకు అరెస్టులకు వెరవకుండా చివరివరకు దృఢంగా పోరాడి ప్రజలు విజయం సాధించారు. ప్రజాబలం ముందు పాలకులు తలవంచి బాల్కో కంపెనికి ఇచ్చిన లీజును రద్దు చేయడంతో బాల్కో వ్యతిరేక పోరాటం తన విజయగాథను చరిత్ర పుటల్లో నమోదు చేసుకుంది.

ఈరోజు పాలకవర్గాలు దేశంలో అమలు జరుపుతున్న అభివృద్ధి నమూన మూలంగా లక్షలాది మంది ప్రజలు ఇల్లు వాకిలి కోల్పోయి జల్ జంగల్ జమీన్ పై అధికారం కోల్పోయి కట్టుబట్టలతో నిర్వాసితులుగా మారి చెట్టుకొకరు పుట్టకొకరుగా చెల్లాచెదురవుతున్నారు. పిడికెడు మంది దళారి పెట్టుపడిదారులు, బహురాష్ట్రీయ కంపెని యజమానులైన సామ్రాజ్యవాదుల జేబులు నింపుతూ వాళ్ల మోచేతి నీళ్లు తాగడానికి అలవాటు పడిన పాలకులు ప్రజల ప్రయోజనాల గురించి ఆలోచిస్తారనుకోవడం అత్యాశే. సంపదను కొల్లగొట్టుకు పోయేవాడి అభివృద్ధి నమూనెప్పుడూ విధ్వంసపూరితంగానూ వినాశకరంగానే వుంటుంది. ఈ అభివృద్ధి నమూన మూలంగా ప్రజలకు ఉద్యోగాలు దొరికి జీవితాలు బాగుపడుతాయని పాలకులు చేసే ప్రచారం పచ్చి బూటకం అనే విషయం 66 ఏండ్ల అనుభవం చెప్తూనే ఉంది. ప్రజల్ని నిర్వాసితుల్ని చేసి పర్యావరణాన్ని దెబ్బతీసి విషపూరితమైన జల వాయు ధ్వని కాలుష్యాలతో ప్రజల్ని రోగాల పాలుచేసే అభివృద్ధి నమూనాను తిరస్కరించాలి. ప్రజల ప్రయోజనాలే సర్వోపరిగా వుండే ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూన కోసం పోరాడాలి. దేశవ్యాప్తంగా కొనసాగుతున్న విస్తాపన్ వ్యతిరేక పోరాటాలన్నీ ఒక్క తాటిమీదికి రావాలి. నష్టపరిహార చెల్లింపుల డిమాండ్లకే పరిమితం కాకుండా పాలకవర్గాల వినాశకరమైన అభివృద్ధి నమూనాను అడ్డుకునేలా బలమైన ఉద్యమాన్ని నిర్మించాల్సిన అవసరం ఉంది. అప్పుడే మన కాళ్లకింది నేల మనకు దక్కుతుంది . మన జల్ జంగల్ జమీన్ మనకు మిగులుతుంది. గంధమార్ధన్, బలియాపాల్, నియమగిరి ప్రజల పోరాటాల స్ఫూర్తితో ముందుకు సాగాలి.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్ట్)* వీ

**రాబోయే సంచికలలో...**

- **క్రికెట్ ఓ విష జ్వరం - జె.ఆర్. నాగభూషణం**
- **పోలీసు వ్యవస్థ - కోర్టులు - జైళ్లు - చిమ్మె జాన్ బర్నబాస్**
- **కల్లోల సాగరం - కోస్తా తీరం - ఇక్బాల్ ఎంజి**
- **రుణ మాఫీ రైతుకు శాపం - ముప్పాళ్ల భార్గవశ్రీ**
- **మైనింగ్ మాఫియాపై చింతలూరు దళితుల పోరాటం - హేమా వెంకట్రావ్**
- **ఆదివాసులను అన్ని విధాలుగా ఆదుకోవాలి - డా. ఇమ్మానేని సత్యసుందరం**
- **జన్యు మార్పిడి పంటలు జనం కోసం కాదు - ఎండి. నాగమణి**

# పతనావస్థలో ప్రజారోగ్యం

***పెట్టుబడిదారీ దేశాలు మూడవ ప్రపంచ దేశాలను ఒక మార్కెట్‌గా మలుచుకొని వాటికి అప్పులిచ్చి లొంగదీసుకుంటూ, ప్రజా ఆరోగ్యాన్ని సైతం ప్రైవేట్ రంగానికి దాసోహం చేస్తున్న తీరును వివరిస్తున్నారు డా. నళిని***

ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యుహెచ్ఒ) నిర్వచనం ప్రకారం ఆరోగ్యం అంటే కేవలం జబ్బు లేకపోవడమే కాదు. ఒక మనిషి శారీరకంగా, మానసికంగా, సామాజికంగా ఆరోగ్యంగా ఉండడమే సంపూర్ణమైన ఆరోగ్యం అవుతుంది. ఆరోగ్యం అనేది ప్రజల ప్రాథమిక హక్కు. అది ప్రపంచ సామాజిక లక్ష్యం. ఆరోగ్యాన్ని పరిరక్షించే దిశగా ప్రత్యేకంగా ఒక వైద్య ఆరోగ్య శాఖని ఏర్పాటు చేసినా గాని, ఆరోగ్యాన్ని నిర్దేశించే అంశాలు ఆ శాఖ పరిధిని దాటి ఇతర రంగాలతో సమ్మిళితమవుతాయి. అంటే, ప్రజల ఆర్థిక స్థితి, కొనుగోలు శక్తి, ఆహారం, నివాసం, పారిశుద్ధ్యం, జీవన విధానం, అంటువ్యాధులు, పర్యావరణం, తాగునీరు, వ్యాయామం, మానసిక స్థితి – ఇలా ఎన్నో అంశాలు సజావుగా ఉంటేనే సంపూర్ణమైన ఆరోగ్యాన్ని సాధించగలం. ఈ అంశాలన్నీ ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తూనే ఉంటాయి.

ఒక దేశం ఎంత అభివృద్ధి చెందిందో తెలుసుకోవడానికి ఆ దేశంలో స్త్రీల స్థితి ఒక సూచిక ఎలా అవుతుందో, ఆరోగ్య స్థితిని తెలుసుకోవడానికి ప్రధానంగా మాతా శిశు సంరక్షణ స్థాయి ఒక సూచిక అవుతుంది. కానీ స్థూలంగా చెప్పుకోవాలంటే ప్రపంచ ఆరోగ్య సంస్థ నాలుగు ఆరోగ్య స్థాయి సూచికలని నిర్దేశించింది. అవి, ఆరోగ్య విధానం, సామాజిక ఆర్థిక స్థితి, వైద్యసహాయం, ఆరోగ్య స్థాయిలకు సంబంధించినవి. ఆరోగ్య విధాన సూచికలు అంటే, అందరికీ ఆరోగ్యాన్ని సాధించాలనే రాజకీయ నిబద్ధత, వనరుల పంపిణి, ప్రజల భాగస్వామ్యం, నిర్మాణం, పని పద్ధతి. మన దేశంలో ఈ సూచికలు ఎలా ఉన్నాయో చూస్తే, పరిస్థితి అర్థమవుతుంది.

అందరికీ ఆరోగ్యాన్ని సాధించాలనే రాజకీయ నిబద్ధత లేకపోవడం మన దిగజారుతున్న ఆరోగ్య వ్యవస్థకి ముఖ్యకారణం. స్వాతంత్ర్యానంతరం మూడు అంచెల ఆరోగ్య వ్యవస్థని స్థాపించాలని నిర్ణయించుకున్నారు. 1946లో భోర్ కమిటీ నివేదిక ప్రకారం ప్రజల ఆరోగ్యం, ప్రభుత్వ బాధ్యత. అలా 60వ దశకం మధ్య వరకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల మీద కేంద్రీకరించి, ముఖ్యమైన మందుల్ని సరఫరా చేసి, జాతీయ కార్యక్రమాలను చేపట్టారు. అలా మశూచిని నిర్మూలించగలిగాం. క్షయని కొంత మేరకు నియంత్రించగలిగాం. మలేరియా నివారణ చర్యలు చేపట్టాం. కానీ 60లో వచ్చిన కరువుల వల్ల అమెరికా నుంచి ఆహారాన్ని దిగుమతి చేసుకున్నాం – అదే సాకుగా వాళ్లు ఎన్నో షరతులు పెట్టారు. వాటన్నిటికీ తలవొగ్గి మనం కుటుంబ నియంత్రణ వైపు కేంద్రీకరించాం. ఈ కార్యక్రమంతో ఇతర వ్యాధి నిరోధక జాతీయ కార్యక్రమాలు తుడిచిపెట్టుకు పోయాయి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు కూడా వైద్యాన్ని అందించడం కంటే కుటుంబ నియంత్రణ కేంద్రాలుగా ఎక్కువ పని చేశాయి. 80వ దశకంలో క్రమంగా ప్రైవేట్‌రంగం బలం పుంజుకుంది. మన దేశంలో 80 శాతం ఆరోగ్య సేవలని ప్రైవేట్ సంస్థలు కైవసం చేసుకున్నాయంటే అతిశయోక్తి కాదు. అయితే, 1978లో ఆల్మా ఆటా ప్రకటనకి కట్టుబడి ఉండాలని ప్రపంచ ఆరోగ్య సంస్థకి చెందిన దేశాలు నిర్ణయించాయి. దాని ప్రకారం ప్రాథమిక ఆరోగ్య సేవలపై కేంద్రీకరించాలి. ప్రజలందరి ఆరోగ్యాన్ని పరిరక్షించాలి. కానీ మనదేశం ఆ లక్ష్యాన్ని చేరుకోకపోగా, ఇతర దేశాలతో పోలిస్తే ఆరోగ్యపరంగా చాలా వెనుకబడిపోయింది. అందుకని మాతృమరణాలని తగ్గించి, ఆసుపత్రుల్లో పురుళ్లు పోసుకునే స్త్రీల సంఖ్యని పెంచడం కోసం జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ (ఎన్ఆర్‌హెచ్ఎం) ని ఏర్పరిచారు. అయితే ఇది కేంద్ర ప్రభుత్వ పర్యవేక్షణలో పని చేస్తుంది. అందువల్ల ఆయా రాష్ట్రాల కేటాయింపుల్లో, వినియోగంలో అస్తవ్యస్తత చోటు చేసుకుంటోంది. క్రమంగా ఇది కూడా ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్యంగా (పిపిపి) మారుతోంది. ప్రభుత్వం ప్రస్తుతం ప్రైవేట్ రంగంలో ఇన్సూరెన్సు ద్వారా అందించే ఆరోగ్య సేవల వైపుకి ప్రజలని నెట్టుతోంది. ఆరోగ్యశ్రీ పథకాల వంటి అసమగ్ర పథకాలు కూడా అటే అడుగేస్తున్నాయి. దాని గురించి తర్వాత చూద్దాం.

ఆరోగ్య సేవల్లో వనరుల పంపిణీ విషయానికి వస్తే, ప్రణాళికా సంఘం మన నికర జాతీయ ఆదాయం (జిడిపి)లో ఆరోగ్య కేటాయింపుల్ని ఒక శాతం నుంచి రెండు శాతానికి పెంచాలని నిర్ణయించుకుంది. నిజానికి 1950 – 56లో మొదటి పంచవర్ష ప్రణాళికలో ఆరోగ్యానికి 3.3 శాతం వెచ్చించారు. అది క్రమంగా తగ్గుతూ ఇప్పుడు 0.9 శాతానికి దిగజారింది. మొదటి ప్రణాళికలో తాగునీటి సదుపాయం, అంటువ్యాధుల నియంత్రణ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలపై దృష్టి, సిబ్బంది శిక్షణ వంటివి ప్రాధాన్యతని సంతరించుకున్నాయి. కానీ క్రమంగా ప్రాథమిక ఆరోగ్యం ఒక ఎండమావిగా మారుతోంది. ఇవాళ మనదేశ జనాభా తమ ఆరోగ్య అవసరాల కోసం నికర జాతీయ ఆదాయంలో ఆరు శాతం ఖర్చు పెడుతున్నారు. కానీ అందులో ఒక్క శాతం మాత్రమే ప్రభుత్వం ఖర్చు పెడుతోంది. మిగిలిన ఐదు శాతం జబ్బు పడిన వాళ్ల జేబులోది! ప్రజల భాగస్వామ్యాన్ని మన పాలకులు ఎంత చక్కగా నిర్వచించారో కదా!

ఇక ఆరోగ్య విధానంలో నిర్మాణం, పని పద్ధతి ఎంత అధ్వాన్నంగా ఉంటున్నాయో ఏ గ్రామస్తుడిని అడిగినా చెప్తారు. మనం రాసుకున్న విధానం ప్రకారం ప్రతి ఐదువేల జనాభాకి (కొండ ప్రాంతాల్లో మూడు వేల జనాభాకి) ఒక సబ్ సెంటర్, ముప్ఫైవేల జనాభాకి (కొండ ప్రాంతాల్లో ఇరవైవేల జనాభాకి) ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం (పిహెచ్‌సి) లక్షా ఇరవై వేల మందికి (కొండల్లో 80 వేల మందికి) ఒక సామాజిక ఆరోగ్య కేంద్రం (సిహెచ్‌పి) ఉండాలి. కానీ ఇప్పటికీ సరిపడినన్ని ఆరోగ్య కేంద్రాలు లేవు. ఉన్న వాటిలో సదుపాయాలు అరకొరగానే ఉన్నాయి.

ఇటీవల జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ (ఎన్ఆర్‌హెచ్ఎం) ఇచ్చిన నివేదిక ప్రకారం కూడా మన దేశంలో ఎనిమిది శాతం పిహెచ్‌సిల్లో డాక్టర్లు లేరు. 39 శాతం పిహెచ్‌సిల్లో లాబ్ టెక్నిషియన్‌లు లేరు. 17.7 శాతానికి మందులు పంపిణీ చేసే ఫార్మసిస్టు లేడు. 54 శాతం పిహెచ్‌సిలకి కాన్పుల గది లేదు. లాబ్ లేదు. 80 శాతం పిహెచ్‌సిలకి ఫోన్లు లేవు. 77 శాతానికి రవాణా సౌకర్యం లేదు. 58 శాతం పిహెచ్‌సిల్లో మాత్రమే కాన్పులు జరుగుతున్నాయి. 22 శాతంలో మాత్రమే నవజాత శిశువులకి వైద్యం అందుతోంది. 20 శాతంలో మాత్రమే తగినంత శిక్షణ పొందిన సిబ్బంది ఉన్నారు. మనదేశంలో రిజిస్టరైన అల్లోపతి డాక్టర్లు 683582 మంది ఉన్నారు. ప్రతి సంవత్సరం, 29500 మంది డాక్టర్లు ఉత్తీర్ణులవుతున్నారు. కానీ గ్రామాల్లో సేవలందించడానికి ఎవరూ సుముఖంగా లేరు. అక్కడి వాతావరణం, పని పరిస్థితులు అనుకూలంగా లేవనేది వారి వాదన. అందుకే గ్రామీణ సేవలకి కేటాయించిన డాక్టర్లలో 67 శాతం గైర్హాజరవుతున్నారు. ఎలా చూసినా 1634 జనాభాకి ఒక అల్లోపతి డాక్టరు మాత్రమే ఉన్నారు.

మాతాశిశు మరణాల రేటు తగ్గించాలని, తక్కువ ధరకే నైపుణ్యం గల వైద్యాన్ని అందరికీ అందించాలని, అంటు వ్యాధుల్ని, ఇతర వ్యాధుల్ని నియంత్రించాలని, సంపూర్ణమైన ఆరోగ్య సేవలని అందరికీ అందుబాటులోకి తేవాలని, జనాభాని నియంత్రించాలని, ఆరోగ్యకరమైన జీవన విధానాలని వృద్ధి చేయాలని లక్ష్యంగా పెట్టుకుని 2005లో జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ (ఎన్ఆర్‌హెచ్ఎం) ఏర్పడింది. ఇప్పటికీ అమల్లో ఉన్న పది కార్యక్రమాలని దీనిలో విలీనం చేశారు. అలా మాతాశిశు సంరక్షణ, అంటువ్యాధుల నివారణ, కుష్టు, టిబి, క్యాన్సర్, కంటి చూపు, దంతవైద్యం, అనుబంధ వైద్యాలు వగైరా కార్యక్రమాలన్ని దీని పరిధిలోకి వచ్చాయి. అయినా గాని మన వ్యవస్థలో పెద్దగా మార్పు రాలేదు. ఎందుకంటే, ఎన్నిటిని అనుసంధానించినా, ప్రధానంగా ప్రైవేటీకరణ వైపు మొగ్గు చూపే విధానం ఫలితాలని ఇవ్వలేకపోతోంది. ఇప్పటికీ ప్రజలు తమ సొంత సొమ్ముతోనే వైద్యం చేయించుకుంటు న్నారు. 20 శాతం గ్రామానికి మాత్రమే ప్రాథమిక ఆరోగ్య సేవలందు తున్నాయి. 74 శాతం గ్రామాలకి మందులు లేవు. 70 శాతం జనాభాకి పారిశుద్ధ్య సౌకర్యం లేదు. 38 శాతం జనాభాకి తాగునీటి సౌకర్యం లేదు. అంటువ్యాధులు మహమ్మారిగా ప్రబలుతూనే ఉన్నాయి. టీకాల ద్వారా నివారించగల వ్యాధులకి సైతం పిల్లలు బలవుతూనే ఉన్నారు.

ప్రపంచ ఆరోగ్య సంస్థ ఇచ్చిన సామాజిక ఆర్థిక సూచికల ప్రకారం చూసినా మన ప్రజారోగ్యం కుంటుపడుతూనే ఉంది. జనాభా పెరుగుదల, నికర జాతీయ ఆదాయం, రాబడి పంపిణీ, పని పరిస్థితులు, అక్షరాస్యత, గృహవసతి, ఆహార సరఫరా అనే సూచికలు ఆశాజనకంగా లేవు. ఇంకా 26 శాతం నిరక్షరాస్యులున్నారు. సంవత్సరానికి సుమారు 1.76 శాతం జనాభా పెరుగుతోంది. నిరుద్యోగం, కూడు, గూడు, గుడ్డ కొరత 70 శాతం జనాభాని పీడిస్తూనే ఉన్నాయి. ఇక రాబడి పంపిణీ విషయానికి వస్తే, బడ్జెట్ కేటాయింపుల్లో ఆరోగ్యాన్ని వెనక్కి నెట్టేశారు. నికర జాతీయ ఆదాయంలో 2.5 శాతం ఆరోగ్యానికి కేటాయించాలని ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నాగాని అది 0.9 శాతం మించడం లేదు. మన రాష్ట్రంలో రు. 1,61,000 కోట్ల బడ్జెట్‌లో, రు. 6,481 కోట్లు ఆరోగ్యానికి కేటాయించారు. అంటే, సుమారుగా రూపాయికి 16 పైసలు కూడా సామాన్య మానవుడి ఆరోగ్యం కోసం ఖర్చుపెట్టడం లేదు. గతంలో ఆరోగ్యశ్రీకి రు. 1400 కోట్లు ఖర్చుపెడితే, ఇప్పుడు దాన్ని రు. 1600 కోట్లకి పెంచారు. ఇది పోను మిగిలిన 4880 కోట్లలో జీతాలకి 70 శాతం కేటాయిస్తే, మిగిలేది రు. 1214 కోట్లు. దీనితోనే రెండు, మూడవ అంచెల వైద్యాన్ని మెరుగుపరచాలి! నిలోఫర్ వంటి పిల్లల ఆసుపత్రిని పూర్తి స్థాయిలో మెరుగుపరచాలంటే వెయ్యికోట్ల రూపాయలు ఖర్చు అవుతుందనే అంచనా చూస్తే ఈ బడ్జెట్ కేటాయింపులు ఏ మూలకి సరిపోతాయో అర్థమవుతుంది. (ఇప్పటికీ 1100 మంది ఇన్‌పేషెంట్ల కోసం నిలోఫర్‌లో 450 పడకలు మాత్రమే ఉన్నాయి).

ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్దేశించిన వైద్య సహాయ సూచికల్లో వైద్య సదుపాయాల ఏర్పాటు, అవి అందుబాటులో ఉండడం, ఉపయోగకరంగా ఉండడం, నాణ్యంగా ఉండడం అనేవి ముఖ్యమైనవి. అయితే, పైన ఇప్పటికే చెప్పుకున్నట్టు, అవి ప్రమాణాలకు అతి దూరంలో ఉన్నాయి. నాణ్యమైన ప్రజోపయోగమైన వైద్య సదుపాయాలు ప్రజలకి అందుబాటులో లేనేలేవు.

అందుకే కష్టమైనా ఇష్టమేనంటూ అందరూ ప్రైవేట్ ఆసుపత్రులకే పరుగెడుతున్నారు. ఎవరికైనా ప్రభుత్వాసుపత్రికి వెళ్లమని సలహా ఇస్తే, అది పనికిరాని సలహాగా తీసిపారేసే పరిస్థితి ఉంది. ఒకప్పుడు 40 ఏళ్ల క్రితం వైద్య విద్యార్థులే కాక రాజకీయ నాయకులు సైతం ప్రభుత్వాసుపత్రుల్లో వైద్యం చేయించుకునే వారు. మరి ఇప్పుడు ప్రసిద్ధిగాంచిన ఆ వైద్యులేరి? ఆ సేవాతత్పరత ఏది? విద్యలాగానే వైద్యం కూడా వ్యాపారమైపోయి ప్రైవేట్ రంగం కోరల్లో చిక్కుకుపోయింది. పేరుగాంచిన వైద్యులంతా ప్రభుత్వ కళాశాలల్లో చదివి ప్రైవేట్ ఆసుపత్రుల్లో హెచ్చు వేతనాల కోసం, రాబడి కోసం, పరపతి కోసం ప్రయత్నిస్తూ పేద ప్రజలకి దూరమైపోతున్నారు.

ఇక ఆరోగ్యస్థాయి సూచికలను చూస్తే, అవి మన లక్ష్యానికి చాలా దూరంలో ఉన్నాయి. సార్వత్రిక ఆరోగ్య పరిరక్షణ (యూనివర్సల్ హెల్త్‌కేర్) నినాదాన్ని 2005లో ప్రపంచ ఆరోగ్య అసెంబ్లీ ఆమోదించింది. ఇప్పటికి 50 దేశాలు తమ పౌరులందరికీ ఉచిత వైద్యాన్ని అందిస్తున్నాయని అంతర్జాతీయ కార్మిక సంఘం పేర్కొంది. ప్రపంచ జనాభాలో మన దేశ జనాభా 15 శాతం మాత్రమే. కానీ ప్రపంచ వ్యాప్తంగా సంభవించే శిశు మరణాల్లో 23 శాతం, ప్రసవానంతరం తల్లుల మరణాల్లో 20 శాతం, క్షయ బాధితుల్లో 30 శాతం, కుష్టు వ్యాధి బాధితుల్లో 68 శాతం, పోలియో పీడితుల్లో 50, ఎయిడ్స్ బాధితుల్లో 14 శాతం, మన దేశంలోనే ఉన్నారు. పోషకాహార లోపానికి గురయ్యే పిల్లల్లో ఎక్కువ శాతం కూడా ఇక్కడే ఉన్నారు. తక్కువ బరువుతో పుడుతున్న శిశువుల్లో 42 శాతం, అంటే దాదాపు 83 లక్షల మంది, మనదేశంలోనే ఉన్నారు. ప్రపంచ వ్యాధుల్లో ఐదవ వంతు మనవే. అతిసారలో మూడవ వంతు, తల్లుల అనారోగ్యంలో నాలుగవ వంతు, పోషకాహార లోపంలో, మధుమేహంలో, గుండె జబ్బుల్లో ఐదవ వంతుగా ఉన్నాం. శిశు మరణాల రేటుని వెయ్యి పుట్టుకలకి 30కి తగ్గించాలని లక్ష్యంగా పెట్టుకుంటే, ఇప్పటికీ అది 47 గానే ఉంది. అలాగే, తల్లుల మరణాల రేటుని లక్ష కాన్పులకి 100కి తగ్గించాలని లక్ష్యంగా పెట్టుకుని, ఇంకా 212 దగ్గరే ఉన్నాం. ఐదేళ్ల లోపు పిల్లల మరణాల రేటు కూడా వెయ్యికి 35 లక్ష్యంగా కాగా, అది ఇప్పటికి 65 దాటే ఉంది. ఈ మరణాలకి ప్రధాన కారణం అంటువ్యాధులు అని రూఢి అయ్యాక మన ఆరోగ్య వ్యవస్థ మీద, పారిశుద్ధ్య కార్యక్రమాల మీద, జాతీయ టీకా విధానం మీద అనుమానాలు రాక తప్పదు.

పోషకాహార లోపం, మంచినీటి సౌకర్యం లేకపోవడం, పారిశుద్ధ్య

లోపం, నిరక్షరాస్యత, అంటువ్యాధుల నియంత్రణ నివారణల్లో లోపం అనేవి ఈ సూచికలన్నిటి మీద ప్రభావం చూపుతున్నాయి.

ఆరోగ్య వ్యవస్థలో ఉండవలసిన సంపూర్ణత్వాన్ని, అందుబాటు తనాన్ని, ఆమోద యోగ్యతని, ప్రజల భాగస్వామ్యాన్ని, ఆర్థికంగా అందుబాటులో ఉండడాన్ని విస్మరించి మనం గ్రామాలని నిర్లక్ష్యం చేస్తున్నాం. వ్యాధి నివారణ కంటే చికిత్సపై మొగ్గు చూపిస్తున్నాం. పాక్షిక సేవలు అందిస్తూ సార్వజనీనతకి తిలోదకాలిస్తున్నాం. ఈ లోపాలకి కారణం ఏమిటి? ప్రజా వ్యతిరేక శక్తులు ఎలా పని చేస్తున్నాయి? పై లోపాలని సరిదిద్దుకోలేని పరిస్థితిలో మనం ఎందుకున్నాం? ఆరోగ్య వ్యవస్థలో ప్రైవేటీకరణ ఎందుకు, ఎలా పెంపొందుతోంది?

అన్నిరంగాల్లో లాగానే వైద్యంలో కూడా ప్రైవేటీకరణ చోటు చేసుకుంటోంది. మన రాష్ట్రం ప్రపంచ బ్యాంకు నుంచి వైద్యరంగం కోసం రుణసాయం పొందింది. అయితే, అందుకు ప్రపంచ బ్యాంకు కొన్ని షరతులు విధించింది. యూజర్ ఛార్జీల పేరిట ఎక్స్‌రే, సిటిస్కాన్, ఎంఆర్‌ఐ వంటి పరీక్షల కోసం డబ్బు వసూలు చేయడం, ఒపి టిక్కెట్ల కోసం కూడా డబ్బు వసూలు చేయడం, ప్రభుత్వ బీమా పథకాన్ని బలహీనం చేసి, 'స్టార్ ఇన్సూరెన్స్' ద్వారా బీమా పథకాన్ని అమలు చేయడం, ప్రైవేట్ సంస్థలని ప్రోత్సహించడం, బహుళజాతి సంస్థల వ్యాపారం కోసం ప్రజారోగ్యాన్ని ఫణంగా పెట్టడం, పేటెంట్ చట్టాన్ని సవరించి, మన మందులపై హక్కుని హరించడం – ఇవన్నీ కలిసి మనల్ని ప్రజారోగ్య సాఫల్యతకి దూరం చేస్తున్నాయి. వ్యాధి నివారణకి, ప్రాథమిక ఆరోగ్య సంరక్షణకి ఏ మాత్రం ప్రాధాన్యతనివ్వకుండా, ప్రైవేట్ సంస్థల ద్వారా మూడవ స్థాయి ఉన్నత ఆరోగ్య సంరక్షణని మాత్రమే ప్రోత్సహిస్తోంది ప్రభుత్వం.

పేదరిక రేఖకి దిగువనున్న కుటుంబాలకి సంవత్సరానికి రెండు లక్షలమేర వైద్య సహాయం అందించే పథకంగా 2006లో ఆరోగ్యశ్రీని రాజశేఖరరెడ్డి అమలు చేశాడు. పేదలకి కార్పొరేట్ వైద్యాన్ని అందుబాటులోకి తెచ్చిన దేముడుగా ప్రజలు ఆయన్ని శ్లాఘించారు. అయితే, అది నిరుపేదలకి అన్ని రకాల వైద్యాన్ని అతి చేరువగా తెచ్చిందనే అపోహ ప్రబలంగా నాటుకుపోయింది. కానీ నిజానికి ఏం జరుగుతోంది? వ్యాధుల నివారణకి బదులు ఆరోగ్యశ్రీ అత్యున్నత చికిత్సని ప్రోత్సహిస్తుంది. ఉదాహరణకి మలేరియా, టైఫాయిడ్, కలరా వంటి ప్రాణాంతకమైన సాధారణ వ్యాధులని అరికట్టే విధంగా దోమల నియంత్రణని, మంచినీటి సౌకర్యాన్ని, పారిశుద్ధ్య పరిరక్షణని ఆరోగ్యశ్రీ పట్టించుకోదు. అలాగే, ఈ వ్యాధులు సోకిన వెంటనే చేయవలసిన చికిత్స కూడా దీని పరిధిలోకి రాదు. ఇలాంటి సాధారణ వ్యాధుల వల్ల కొన్ని కేసులు తీవ్రమైన అనారోగ్యానికి గురై, మెదడు వాపుగానో, ఫిట్స్‌గానో పరిణమిస్తే తప్ప అవి ఆరోగ్యశ్రీ కిందకి రావు. వాటికి కూడా, వెన్నులోంచి నీరు తీస్తేనో, వెంటిలేటర్ మీద పెడితేనో మాత్రమే ఆరోగ్యశ్రీ కింద డబ్బు మంజూరవుతుంది. అలానే ఊపిరితిత్తుల వ్యాధులు ప్రాణాంతకమై ఉన్నత వైద్యం అవసరమైతేనే, వెంటిలేటర్ మీదకి వెళ్తేనే ఆరోగ్యశ్రీ వర్తిస్తుంది.

క్షయ, న్యుమోనియా, బ్రాంకైటిస్, ఉబ్బసం, బ్రాంకిమోలైటిస్ వంటి వాటికి చేసే ప్రాథమిక చికిత్స, చిన్న చిన్న పట్టణాల్లో కూడా చేయగలిగిన చికిత్స దీని పరిధిలోకి రాదు. అలా ఎన్నో అవకతవకలతో కూడుకున్న ఈ పథకం 80 శాతంగా ఉన్న సాధారణ వ్యాధులకి జరిగే చికిత్సని పరిగణనలోకి తీసుకోదు. దాని కింద 950 వైద్య ప్రక్రియలు మాత్రమే ఉన్నాయి. వాటిలో దాదాపు అన్ని మూడవ స్థాయి రిఫరల్ ఆసుపత్రుల్లో జరిగే అత్యున్నత వైద్య ప్రక్రియలు మాత్రమే. వాటిలో కూడా ఆపరేషన్లే ఎక్కువ. కానీ అపెండిసైటిస్ ఆపరేషన్ మామూలుగా చేస్తే ఆరోగ్యశ్రీ వర్తించదు. లాప్రోస్కోపుతో అపెండిక్స్‌ని తొలగిస్తే మాత్రమే ఆరోగ్యశ్రీ కింద డబ్బు వస్తుంది. కొన్ని గుండె ఆపరేషన్లని పేదలకి అతి చేరువగా తీసుకొచ్చిన మాట వాస్తవమే గాని, ఆ తర్వాత చేయాల్సిన సుదీర్ఘకాలపు ఫాలో అప్ దీని పరిధిలోకి రాదు. ఒక్కొక్క వ్యాధికి ఏది సరైన వైద్యం అని నిర్ధారించే శాస్త్రీయమైన ప్రోటోకాల్‌కి బదులు ఆ జబ్బుకి ఏది ఖరీదైన ప్రక్రియో దాన్ని మాత్రమే పరిగణించడం ఈ పథకంలోని ప్రధాన లోపం. అందుకే గర్భ సంచుల తొలగింపు సొమ్ము చేసుకునే ప్రక్రియగా దుర్వినియోగం అయ్యాక మాత్రమే దాన్ని అపగలిగారు.

ఇంకా, తెల్లరేషన్ కార్డులని దొడ్డి దోవన సంపాదించిన కొందరు ధనికులు ఈ పథకాన్ని కూడా కబ్జా చేస్తున్నారు. అలాగే, అవసరం ఉన్నా లేకపోయినా ఆరోగ్యశ్రీ కిందకి వచ్చే ఆపరేన్లని విచ్చలవిడిగా చేస్తూ కొందరు డాక్టర్లు లక్షలు గడిస్తున్నారు. దొంగ టెస్టు రిపోర్టులు, దొంగ కార్డులు వీరి పనిని సులభతరం చేస్తున్నాయి. ప్రభుత్వ ఆసుపత్రుల్లో కూడా ఈ పథకాన్ని అమలు చేయడంతో వరుస క్రమంలో జరగవలసిన ఆపరేషన్లు వెనుకబడిపోతున్నాయి. ఆరోగ్యశ్రీ కింద వచ్చే డబ్బు కోసం సర్జన్లు ఆరోగ్యశ్రీ కేసుల్నే ముందు చేస్తున్నారు. జబ్బు నయమైతే డబ్బు చెల్లించే విధంగా కాక ఆపరేషన్‌కి ఇంత అనే విధానం వల్ల చాలా నష్టం జరుగుతోంది. శరీరం మీద ఆపరేషన్ గుర్తు మాత్రమే మిగిలి జబ్బు నయంకాని కేసులు ఉంటున్నాయి. ఎందుకంటే, ఆపరేషన్ తర్వాత జరగాల్సిన వైద్యం ఆరోగ్యశ్రీ పరిధిలోకి రాదు. ఏకేసు ఆరోగ్యశ్రీ కిందకి వస్తుంది, దాన్ని ఏ ఆసుపత్రికి పంపాలి, ఎవరి పర్యవేక్షణకి పంపాలి అని నిర్ణయించే ఆరోగ్య మిత్ర బృందాలు కూడా పైరవీలు చేసి ఈ పథకం వల్ల చాలా లాభపడుతున్నాయి. ప్రస్తుతం ఆరోగ్యశ్రీ అమలవు తున్న తీరు వల్ల అది ప్రాథమిక వైద్యానికి అందవలసిన నిధుల్ని మింగే యడమేకాక, కార్పొరేట్ ఆసుపత్రులకు లాభాలు చేసిపెట్టే విధానంగా పనిచేస్తోంది. దాని వల్ల మన రాష్ట్రంలోని వైద్యసేవల విధానం పూర్తిగా వక్రీకరించబడుతోంది. నివారణ చర్యలు, ప్రాథమిక ఆరోగ్యం కుంటు పడుతున్నాయి. ఉచిత వైద్యం ఇప్పటికీ పేదలకి అందని ద్రాక్షగానే మిగిలిపోతోంది.

ఆర్థిక సంస్కరణల పేరుతో 90వ దశకంలో చొచ్చుకొచ్చిన నయా లిబరల్ ధోరణుల వల్ల ఆరోగ్యంపై ప్రభుత్వం వెచ్చించే మొత్తం తగ్గిపోయి, ప్రైవేటు ఆసుపత్రుల బొక్కసాలు నిండుతున్నాయి. ఐదు నక్షత్రాల హోటళ్లన్నీ కార్పొరేట్ ఆసుత్రులుగా రూపుదిద్దుకున్నాయంటేనే వైద్యం ఎలా వ్యాపారంగా మారిందో అర్థమవుతుంది. నికర జాతీయ ఆదాయంలో 0.9 శాతం ప్రభుత్వ ఆరోగ్య బడ్జెట్ కేటాయింపులైతే, 4.2 శాతం ప్రైవేట్ వైద్యానికి ఖర్చవతున్నాయి. రైతుల్లో 25 శాతం మంది అనారోగ్యం కారణంగా దారిద్ర్య రేఖ దిగువకి దిగజారిపోతున్నారని గణాంకాలు చెప్తున్నాయి. రైతుల ఆత్మహత్యలకి ఈ అప్పులు కూడా ఒక కారణమని రుజువైంది. మందులులేని, సరైన పరీక్షలు లేని, డాక్టర్లులేని ప్రభుత్వ ఆసుపత్రులు ప్రజల్ని ప్రైవేట్ ఆసుపత్రులవైపు నెడుతున్నాయి. వెయ్యి మంది రోగులకి ఒక్క డాక్టరు ఉంటే వైద్యం ఎలా జరుగుతుంది?

ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఉన్న చేంతాడంత లైనుని దాటాలంటే లంచం, శుభ్రమైన పక్కబట్టలు కావాలంటే లంచం, మంచి ఆహారం కావాలంటే లంచం, మంచి వైద్యం కావాలంటే తన ప్రైవేట్ క్లినిక్‌కి సాయంత్రం రమ్మని చెప్పే డాక్టరు సేవా తత్పరత! డాక్టర్ల శిక్షణ కోసం, వైద్య సిబ్బంది

శిక్షణ కోసం ప్రభుత్వం ప్రజాధనాన్ని దాదాపు మనిషికి నెలకి 500 రూపాయల చొప్పున ఖర్చు చేస్తుంది. కానీ వాళ్లు పట్టభద్రులై, అధిక జీతాల కోసమో, లాభాల కోసమో ప్రైవేట్ ఆసుపత్రుల్లో ఉద్యోగాలకి చేరుతున్నారు. లేదా కార్పొరేట్ ఆసుపత్రుల్లో షేర్ హోల్డర్లవుతున్నారు. అదీ కాకపోతే విదేశాలకి ఎగిరి పోతున్నారు. ఇది పేదలని వెక్కిరించడం కాదా! ప్రజాధనాన్ని దుర్వినియోగపరచడం కాదా!

ఎంబిబిఎస్ పూర్తయాక ఒక సంవత్సరం, పిజి పూర్తయాక ఒక సంవత్సరం తప్పని సరిగా గ్రామీణ ప్రాంతాల్లో పనిచేయాలనే కొత్త నియమం వల్ల డాక్టర్ల కొరత కొంతవరకు తీరవచ్చు. కానీ మందులు లేని, సరైన వసతులు లేని ఆసుపత్రుల్లో వీరు ఎలాంటి సేవలు అందించ గలరనేది వేచి చూడవలసిందే. స్వాతంత్ర్యానంతరం ఆరోగ్యరంగంలో ప్రైవేట్ భాగస్వామ్యం 8 శాతం మాత్రమే ఉండేది. కానీ ఇప్పుడు 93 శాతం ఆసుపత్రులు, 64 శాతం పడకలు, 80-85 శాతం డాక్టర్లు, 80 శాతం ఔట్ పేషెంట్లు, 57 శాతం ఇన్‌పేషెంట్లు ప్రైవేట్ రంగంలోనే ఉన్నారు. వైద్యంపై ప్రజలు సొంతంగా ఖర్చు చేసే సొమ్ము 87 శాతంగా ఉంది. ఇది ఏ ఇతర దేశాల్లోనూ లేదు.

ప్రభుత్వేతర ఎన్‌జిఒలు కూడా ఈ పరిస్థితిని ఆసరా చేసుకొని వైద్యంలోకి చొచ్చుకొని వెళ్తున్నాయి. అలా గ్రామీణ ప్రాంతాల్లో వైద్య సేవలు 60 శాతం ప్రభుత్వం చేతిలో, 40 శాతం ప్రైవేట్ రంగంలో ఉంటే, పట్టణాలలో 10 శాతం ప్రభుత్వం కింద, 90 శాతం ప్రైవేట్‌పరంగా ఉంటున్నాయి. 1991 ఆర్థిక సంస్కరణల కింద ప్రభుత్వం ప్రైవేట్ సంస్థలకి సబ్సిడీల వర్షం కురిపించింది. వారికి మంచి మంచి స్థలాలని అతి తక్కువ ధరలకి కేటాయించింది. (రోగుల్లో 25 శాతానికి ఉచిత వైద్యం అందించాలనే నిబంధన అందులో ఉన్నాగాని అది ఎప్పుడో బుట్టదాఖలై పోయింది). ఆ ప్రైవేట్ ఆసుపత్రులు దిగుమతి చేసుకునే మందుల మీద, పరికరాల మీద పన్నుల రాయితీలు కల్పించింది. ఆ ఆసుత్రుల్ని నెలకొల్పే డాక్టర్లకి ఎన్నో రాయితీలిచ్చింది. జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ కూడా ఇప్పుడు ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్యం వైపు వేగంగా అడుగులు వేస్తోంది.

ఇప్పటికీ మనదేశంలో ప్రజలు అతిసారతో, మలేరియాతో, టైఫాయిడ్‌తో, పొంగుతో, పోషకాహారలేమితో చనిపోతున్నారంటే ప్రాథమిక వైద్య సదుపాయాలు ఎంత అధ్వాన్నంగా ఉన్నాయో తెలుస్తోంది. అలానే, ప్రైవేట్ ఆసుపత్రులపాలై అప్పులతో కునారిల్లుతూ ఆత్మహత్యలు చేసుకుంటున్న ప్రజలు ప్రభుత్వ నిర్లక్ష్యానికి గుర్తులు. ఎక్కడైనా ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి దగ్గరలో ప్రైవేట్ ఆసుపత్రి ఉంటే కనుక ఆ ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి అదనపు నిధులు కేటాయించకూడదనే ప్రపంచ బ్యాంకు షరతులోనే ప్రభుత్వ విధానం దాగుంది. చికిత్స కోసం పేద ప్రజలు వెచ్చిస్తున్న సొమ్ము వల్ల వారు పేదరికంలో కూరుకుపోతున్నారు. ఆరోగ్యానికి, పేదరికానికి ఉన్న ప్రత్యక్ష సంబంధం వల్ల వైద్య సేవల ప్రైవేటీకరణ ఆత్మహత్యా సదృశ్యమవుతోంది. సార్వజనీన ఆరోగ్యసేవలని తుంగలో తొక్కి, రోగ నివారణవైపు ఎలాంటి కేంద్రీకరణ లేక, ప్రాథమిక ఆరోగ్య సేవలని నిర్లక్ష్యం చేస్తోంది ప్రభుత్వం. మనకంటే మెరుగైన విధానాలు అవలంబించడం వల్ల మనకంటే పేద దేశమైన బంగ్లాదేశ్ మాతాశిశు మరణాల రేటుని గణనీయంగా తగ్గించుకోగలిగింది.

ప్రపంచీకరణ పేరుతో వచ్చిన స్వేచ్ఛావాణిజ్య విపణి ధనికులకి మేలుచేసి పేదల్ని మరింత పేదరికంలోకి నెడుతోంది. ప్రభుత్వం విద్యకి, వైద్యానికి కేటాయింపులు తగ్గించి, అన్ని రకాల రాయితీలని, సబ్సిడీలని రూపుమాపి ప్రజలని ఇక్కట్ల పాలు చేస్తోంది. మరోవైపు, బహుళజాతి సంస్థలకి పన్నులు తగ్గించి, కరెంటు చార్జీలు తగ్గింపు వంటి రాయితీలు ప్రకటిస్తోంది. అభివృద్ధి చెందిన దేశాల్లో పేరుకుపోతున్న అదనపు సొమ్ము అక్కడ మాంద్యం కారణంగా ఉత్పత్తి కార్యక్రమాలకి పని రాకుండా పోయాక, బహుళజాతి సంస్థలు మనదేశంలాంటి అభివృద్ధి చెందుతున్న దేశాల్లో మార్కెట్‌ని వెతుక్కున్నాయి. అలాగే పెట్టుబడిదారీ బ్యాంకులు రుణాల పేరుతో మన మీదకి సొమ్ము గుప్పించాయి. వారి సరుకులకి, పెట్టుబడికి అభివృద్ధి చెందుతున్న దేశాలు విలువైన వాణిజ్యాన్ని అందించాయి.

అలా మనదేశం అప్పు రూపంలో ప్రపంచ బ్యాంకు గుప్పెట్లో చిక్కింది. ప్రస్తుతం మనదేశం ప్రపంచ బ్యాంకుకి, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థకి, ఇతర విదేశీ బ్యాంకులకి దాదాపు నాలుగు లక్షల కోట్ల రూపాయలు రుణపడి ఉంది. అంటే, ప్రతి భారతీయుడి నెత్తి మీద సుమారు నాలుగు వేల రూపాయల రుణభారం మోపబడి ఉందన్న మాట! అలా అభివృద్ధి చెందిన దేశాలు తమ ఆర్థిక సంక్షోభాన్ని అతి చాకచక్యంగా పేద దేశాలకి బదిలీ చేశాయి. ఫలితంగా, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో పేదరికం గణనీయంగా పెరిగింది. ధనికుల, నిరుపేదల మధ్య తారతమ్యం పెరిగింది. పోషకాహార లోపం, శిశు మరణాలు, నిరుద్యోగం, నిరక్షరాస్యత పెరిగాయి. ఆహార భద్రత కొరవడింది.

ప్రజోపయోగమైన అన్ని రకాల రాయితీలు ఒకటొకటిగా రద్దయి పోతున్నాయి. ఉచిత ఆరోగ్య సేవలకి బదులు హెల్త్ ఇన్సూరెన్స్ వైపు మొగ్గు పెరుగుతోంది. తిండికి లేక సతమతమవుతున్న నిరుపేదలు హెల్త్ ప్రీమియంలు ఎలా కడతారన్నది పాలకులకి తోచదా? ఎన్ని ఉపాధి పథకాలున్నా అవి సంవత్సరం పొడుగునా ఉపాధి కల్పించలేక పోతున్నాయి. వాణిజ్య పంటల పేరుతో రైతులు నష్టపోతున్నారు. పంట నష్టం, ఆరోగ్య సమస్యల వల్ల అప్పులు, చివరికి రైతుల ఆత్మహత్యలు! అందుకే, వందన శివ అన్నట్లు, 'మన ప్రభుత్వం తన మీదే యుద్ధం ప్రకటించింది!'

అందుకే, ఆరోగ్యం సరుకుగా మారే పరిస్థితిని అరికట్టాలంటే ప్రైవేటీకరణని వ్యతిరేకించాలి. అలాంటి పరిస్థితులని కల్పిస్తున్న జాతీయ, అంతర్జాతీయ విధానాలని వ్యతిరేకించాలి. సమగ్రమైన ప్రాథమిక ఆరోగ్య విధానం మాత్రమే ఉచిత సార్వజనీన ఆరోగ్య సేవలని అందిచగలదు. ప్రజల అవసరాలకు అనుగుణంగా వైద్య విధానం రూపొందగలదు. మన ఆరోగ్య వ్యవస్థ బాగుపడాలంటే ప్రాథమిక ఆరోగ్యం మెరుగవ్వాలి. నిధుల కేటాయింపు పెరగాలి. వైద్య సిబ్బంది నైపుణ్యం పెరగాలి. అందరికీ ఆరోగ్యాన్ని అందించాలనే సంసిద్ధత పెంపొందాలి. సామాజిక భాగస్వామ్యం పెరగాలి. ఆరోగ్య సేవలు అందరికీ అందుబాటులోకి రావాలి. ఆరోగ్యాన్ని ఒక వరంగా కాక ఒక ప్రాథమిక హక్కుగా చూసిన నాడే ఇది సాధ్యమవుతుంది.

సరైన విధానాలు అవలంబిస్తే ప్రజలకి మెరుగైన వైద్య సేవలు అందించవచ్చని చాలా దేశాలు నిరూపించాయి. సోషలిస్టు సమాజంలో ఈ మార్పు ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ మార్పు ఎలా సాధ్యమయిందో, అది ఎలా అమలయిందో, వివిధ దేశాల నమూనాల ద్వారా మరో వ్యాసంలో తెలుసుకుందాం.

*(రచయిత చిన్న పిల్లల వైద్యురాలు)* వీ

# అఫ్ఘనిస్తాన్, ఇరాక్ ప్రతిఘటన పోరాటాలు

***అత్యంత అధునాతన మిలిటరీ ఆయుధాలతో, యుద్ధ టెక్నాలజీతో తమ దేశాన్ని ఆక్రమించిన లక్షలాది అమెరికా, నాటో సైన్యాలను ఓడించిన అఫ్ఘన్, ఇరాక్ ప్రజల పోరాటాలను వివరిస్తున్నారు*** **నర్సింహ**

**బా**గ్దాద్‌లోని ఒక రద్దీ మార్కెట్ ప్రదేశం. అమెరికా సైనికులు తమ అత్యంత అధునాతన ఆయుధాలతో పహరా కాస్తున్నారు. దూరంలో ఒక కారు ఆగింది. అద్దాలు కిందికి దింపారు. ఒక పెద్ద గన్. దాన్ని అమెరికన్ సైనికులకు గురిపెట్టాడు షార్ప్ షూటర్ (దూరం నుండి గురి తప్పకుండా పేల్చగలిగే వారు). బుల్లెట్ కేవలం ముఖానికి మాత్రమే తగలాలి. ఎందుకంటే తలపై సైనిక హెల్మెట్ ఉంటుంది. శరీరానికి బుల్లెట్ ప్రూఫ్ జాకెట్ ఉంటుంది. గన్‌ను గురిపెట్టి ఉంచాడు. (లేదా ఉంచింది, ఎందుకంటే ఇరాక్‌లో ఎందరో మహిళలు షార్ప్ షూటర్లుగా శిక్షణ తీసుకొని అనుమానం రాకుండా తిరుగుబాటులో పాల్గొంటు న్నారు). జనం అడ్డుగా లేనప్పుడు ట్రిగ్గర్ నొక్కగానే అమెరికా సైనికుని మొహం ముక్కలుగా పేలిపోయి, వెంటనే కిందికి ఒరిగిపోయాడు. మిగతా సైనికులకు శబ్దం వినబడిందే తప్పించి, ఎక్కడి నుండి ఆ శబ్దం వచ్చింది, అసలు ఏమి జరిగిందో అంతా అయోమయంగా ఉంది. ఇంకో బుల్లెట్ తగిలి ఇంకో సైనికుడి మొహం పేలిపోయింది. సైనికులు రోడ్డు బ్లాక్ చేయకముందే ఆ కారు వెళ్లిపోయింది. ఈ ఘటనను మొదటి నుండి చివరి వరకు ఆ షార్ప్ షూటరే స్వయంగా విడియో తీశాడు. దాన్ని యూట్యూబ్ వెబ్‌సైట్‌లో పెట్టారు. (ఇలాంటివి ఎన్నెన్నో విడియో లున్నాయి). ఇరాక్‌లో, జరుగుతున్న 'అర్బన్ గెరిల్లా వార్‌ఫేర్' (పట్టణ గెరిల్లా యుద్ధతంత్రం)కు ఈ సంఘటన ఒక మచ్చు తునక.

◆ ◆ ◆

అమెరికా సైనిక వాహనాలు అఫ్ఘనిస్థాన్‌లోని కొండ ప్రాంతాల గుండా వెళుతున్నాయి. వాటిలో తమకు కావలసిన ఆహార పదార్థాలు, పెట్రోల్, గ్యాస్ తదితరాలను తీసుకెళ్తున్న వాహనాలు కూడా ఉన్నాయి. అటుపక్క కొండపై ఉన్న తాలిబన్ గెరిల్లాలు అకస్మాత్తుగా గుళ్లవర్షం కురిపించడం మొదలుపెట్టారు. అమెరికా సైనికులు తమ వాహనాల నుండి బయటకు రాలేని, ఎదురు కాల్పులు చేయలేని పరిస్థితి. వారు వైర్‌లెస్ ద్వారా ఏరియల్ బ్యాక్ అప్ (హెలికాప్టర్ల ద్వారా తమకు రక్షణ కల్పించడం) అడిగి, అవి రావడానికి పట్టిన గంట సమయం వరకు నాన్ – స్టాప్‌గా వేలాది బుల్లెట్ల వర్షం కురిపించి కనీసంగా నలభై అమెరికా సైనికులను హతమార్చి, వారి వాహనాలను నుజ్జు నుజ్జు చేసి, అమెరికన్ల సైనిక హెలికాప్టర్లు రాగానే అంతా ప్యాకప్ చేసుకొని వెళ్లిపోయారు. తాలిబన్లు ఇదంతా డాక్యుమెంటరీ సినిమాలాగా మొదటి నుండి చివరి వరకు విడియో తీసి యూట్యూబ్ వెబ్‌సైట్‌లో పెట్టారు (ఇలా ఎన్నెన్నో విడియోలున్నాయి). అఫ్ఘనిస్థాన్‌లో జరుగుతున్న తాలిబన్ల గెరిల్లా పోరుకు ఇదో మచ్చుతునక మాత్రమే.

◆ ◆ ◆

ఇరాక్‌లో ఈ గెరిల్లా పోరు ప్రధానంగా పట్టణ ప్రాంతాలలో కేంద్రీకృతమయి అర్బన్ గెరిల్లా వార్‌ఫేర్ సూత్రాల ప్రకారం నడుస్తుంటే, అఫ్ఘనిస్థాన్‌లో ప్రధానంగా గ్రామాలు కేంద్రంగా నడుస్తున్నది. అయితే, ఈ రెండు దేశాలలో కూడా తమ దేశాన్ని ఆక్రమించిన అమెరికా దురాక్రమణ సైన్యాలకు వ్యతిరేకంగా ఈ గెరిల్లా యుద్ధం నడుస్తున్నది.

2012 చివరిలో ఇరాక్ నుండి అమెరికా తన సైన్యాలను వెనుకకు రప్పించుకున్నప్పటికీ, వారి తొత్తులైన ఇరాక్ పాలక వర్గాల సైన్యానికి వ్యతిరేకంగా వారి పోరు నడుస్తున్నది. ఇంగ్లిష్‌లో వెతికితే యూట్యూబ్‌లో ఇలాంటి చాలా విడియోలే దొరుకుతాయి కాని ఇంకా లోతుగా వారి గురించి పరిశోధన చేయాలనుకున్నా, వారు మాట్లాడే మాటలు అర్థం కావాలన్నా ఇరాక్ విషయంలో అయితే అరబిక్ భాష తెలియాలి. అఫ్ఘనిస్థాన్ విషయంలో పష్తూన్, ఫార్సీ, ఉర్దూలు తెలియాలి.

మొత్తం ప్రపంచంలో ఆయుధ టెక్నాలజీలో అమెరికాను మించిన దేశం లేదు. 1960 దశకంలో ఒక చిన్న బలహీనమైన, పేద దేశమైన వియత్నాంపై తనకున్న అత్యంత శక్తివంతమైన ఆయుధాలతో, యుద్ధ విమానాలతో, కనీసం పది లక్షల సైనికులను దింపి యుద్ధం చేసినప్పటికీ, ఆ దేశ ప్రజలు ఏకమై, అమెరికాను గెరిల్లా పోరుతో చిత్తుగా ఓడించారు. ఆ కాలంలో వియత్నాం యుద్ధంలో చనిపోయిన లేదా గాయపడిన అమెరికన్లు తెలువని వ్యక్తి అమెరికాలో ఉండేవాడు కాదంటే ఎంత ఘోరంగా అమెరికా ప్రజలు నష్టపోయారో తెలుసుకో వచ్చు. యుద్ధం వలన వేల కోట్లు ఆర్జించిన పెట్టుబడిదారులు, సైనికాధికారులు, రాజకీయ నాయకులు, మిలిటరీ కాంట్రాక్టర్లు ఫైవ్‌స్టార్ హోటళ్లలో, ఎసి గదుల్లో సుఖాలు అనుభవిస్తూ, 'దేశ రక్షణ' కొరకు 'దేశ భక్తితో సైన్యంలో చేరండి, 'దేశానికి సేవచేసి జన్మ ధన్యం చేసుకోండి' అనే మోసపూరిత ప్రకటనలు తమ తొత్తు మీడియా ద్వారా చేయించి, లక్షలాది అమాయక పేద, మధ్య తరగతి ప్రజలు సైనికులుగా మారేట్టు ఒక ఉన్మాద మానసిక వాతావరణాన్ని దేశమంతా కల్పించి వారి చావులకు, వైకల్యాలకు, ఆత్మహత్యలకు, మానసిక సమస్యలకు కారణమయ్యారు.

యుద్ధంలో లాభాలు గడించిన పాలకవర్గాలు నోట్లు లెక్కించు కుంటుంటే, చావకుండా మిగిలిన సైనికులు మాత్రం తమ కష్టాలను లెక్కించుకునే దీనస్థితి. ఇలాంటి అంశాలను అమెరికా వారే తీసిన 'ప్లటూన్', 'డియర్ హంటర్', 'బార్న్ ఆన్ ఫోర్త్ ఆఫ్ జులై', 'అపోకలిప్స్ నౌ' వంటి ఎన్నో సినిమాల్లో (వాస్తవ సంఘటనల ఆధారంగా) చూపించారు. ప్రజలు ఒకవైపు తమ చేదు అనుభవాలతో బతుకుతూ

ఉంటే, అమెరికా పాలక వర్గాలు మాత్రం తాము ఒక బలహీన దేశానికి చెందిన ప్రజల చేతిలో ఓడిపోవడాన్ని చేదు అనుభవంగా తీసుకొని దానికి కారణాలు వెతికారు. చిన్నస్థాయి (మంద్రస్థాయి) యుద్ధాలు అంటే గెరిల్లా యుద్ధాలలో (దీనినే లో – ఇంటెన్సిటీ కాన్‌ఫ్లిక్ట్స్ లేదా అన్‌కన్‌వెన్షనల్ వార్ లేదా అసిమ్మెట్రికల్ వార్‌ఫేర్ అని అంటారు) గెలవడానికి కావలసిన ఆయుధ టెక్నాలజీ, యుద్ధ వ్యూహాలు అభివృద్ధి చేయాల్సిన అవసరాన్ని గుర్తించి, ఆ వైపు అడుగులు వేశారు. 1990లో సోవియట్ రష్యా విచ్ఛిన్నంతో తమకున్న అతిపెద్ద శత్రువు బలహీనమై పోయినందున, ఇక భవిష్యత్‌లో అమెరికా ఆధిపత్యానికి ప్రథమ శత్రువు వివిధ దేశాల్లో అమెరికాకు వ్యతిరేకంగా జరిగే గెరిల్లా యుద్ధాలేనని గుర్తించి, మరింతగా తమ పరిశోధన మొదలు పెట్టారు. గత 40 ఏళ్లుగా అనూహ్యంగా అభివృద్ధి అవుతూ వస్తున్న కంప్యూటర్, సాటిలైట్, ఎలక్ట్రానిక్ టెక్నాలజీలను అత్యధిక స్థాయిలో వాడుతున్నది ఈ రకమైన మిలిటరీ టెక్నాలజీ కొరకే. వియత్నాం యుద్ధంలో ఇలాంటి టెక్నాలజీ లేకనే ఓడిపోయామని, ఇక తమకు తిరుగులేదని నిర్ణయించుకొని, తమ ఆర్థిక లాభాల కొరకు అక్టోబర్ 2001లో అఫ్ఘనిస్థాన్‌ను, మార్చ్ 2003లో ఇరాక్‌ను ఆక్రమించుకున్నారు. తమ దోపిడీ ప్రజలకు అర్థంకాకుండా చేయడానికి ఆ దేశాల ప్రజలపై తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించారు. ఇంతకు అమెరికా తన ఆయుధ సంపత్తితో ఈ రెండు దేశాల్లో విజయం సాధించిందా?

ముందుగా అమెరికా ఈ రెండు దేశాల్లో వాడిన కొన్ని మిలిటరీ టెక్నాలజీలను పరిశీలిద్దాం. మైన్‌ప్రూఫ్ ఆర్మర్డ్ హంవీస్ అంటే మందు పాతరలకు కూడా పేలని అత్యంత ఆధునాతన సైనిక వాహనాలు. వాస్తవంగా జరిగినదేమిటి? ఎక్కువ స్థాయి సామర్థ్యం కల మందు పాతరలకు అవి విచ్ఛిన్నమయి అమెరికా సైనికులు చనిపోయారు. కొందరు కాలిపోయారు. మరి కొందరు వికలాంగులయ్యారు. చాలా మంది ఆ ధాటికి మానసిక స్థిమితం కోల్పోయారు. ఎలాంటి మందుపాతరలైనా తట్టుకునే శక్తి ఉన్న కదిలే వాహనాన్ని తయారు చేయడం అసంభవం. కేవలం అమాయక సైనికులను మభ్యపెట్టి తమ స్వార్థం కొరకు వారిని బలి తీసుకోవడానికి అమెరికా పాలక వర్గాలు ఇచ్చిన శుష్క భరోసా అని తేలింది.

రెండవది మానవ రహిత యుద్ధ విమానాలు లేదా డ్రోన్‌లు. అమెరికాలోని నెవెడా రాష్ట్ర ఎడారిలో ఉండే కమాండ్ సెంటర్‌లో పైలట్లు కూర్చొని అఫ్ఘనిస్థాన్, ఇరాక్ దేశం గగనతలంలో ఎగిరే మానవ రహిత విమానాన్ని కంట్రోల్ చేస్తున్నారు. ఇది సాటిలైట్ టెక్నాలజీ ద్వారా సాధ్యం. తిరుగుబాటుదారుల సెల్‌ఫోన్ నెంబర్ తెలిస్తే, దాని ద్వారా వారున్న ప్రదేశం తెలుసుకొని లేదా క్షేత్రస్థాయిలో ఇన్‌ఫార్మర్ ద్వారా తిరుగుబాటుదారుల ప్రదేశం తెలుసుకొని అక్కడికి మానవ రహిత విమానం పంపుతారు. అమెరికా నుండి ఆ విమానం ఆపరేట్ అయినప్పటికీ, అది దిగడం, దాన్ని పార్క్ చేసి పెట్టడం ఇరాక్ లేదా అఫ్ఘనిస్థాన్ దేశంలోనే. వీటిలో రెండు రకాలు. ఒకరకం కేవలం ఫొటోలు లేదా విడియోలు తీయడానికి. రెండవ రకం (ఇవి సైజులో పెద్దవి) మిస్సైల్స్‌ను కూడా వదలగలవు. ఇవి విజయం సాధించాయా? అమెరికా ప్రభుత్వ స్వంత పరిశోధనలో తేలిందేమంటే డ్రోన్ దాడులల్లో అమాయక ప్రజలే అత్యధిక స్థాయిలో చనిపోయారు. తిరుగుబాటుదారుల కన్నా అమాయక ప్రజలనే ఎక్కువగా బలి తీసుకున్నారు. స్కూలు పిల్లలను, పెళ్లి బృందాలను, అర్ధరాత్రి ఏదో ఎమర్జెన్సీలో భాగంగా గుమిగూడిన ప్రజలను తిరుగుబాటుదారులుగా భావించి చంపిన ఉదంతాలు వేలాదిగా ఉన్నాయి. అఫ్ఘనిస్థాన్ తాలిబన్ల తిరుగుబాటుకు మద్దతుగా లక్షలాది ప్రజలు నిలబడడానికి కారణం అమెరికా తమ డ్రోన్ దాడుల్లో ప్రజలను కూడా చంపడమే. మానవ రహిత విమానాలు తిరుగుబాటు దారుల సంఖ్యను తగ్గించడం కన్నా పెంచడంలోనే ఎక్కువ ఉపయోగ పడుతున్నాయి.

## యుద్ధంలో మీడియా పాత్ర

అఫ్ఘనిస్థాన్, ఇరాక్ తిరుగుబాటు ఉద్యమాల గురించి పాశ్చాత్య దేశాల మీడియా, వారు రాసిన దానిని యథాతథంగా ప్రచురించే భారత మీడియా తిరుగుబాటుదారులను టెర్రరిస్టులుగా చిత్రీకరిస్తున్నాయి. వారి దేశాలను ఆక్రమించుకొని, లక్షలాది ప్రజలను చంపుతూ, వారి వనరులను కొల్లగొడుతూ తిరిగి వారినే టెర్రరిస్టులుగా ముద్రవేస్తున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా తిరుగుబాటు సంస్థలపై పాలకవర్గాలు జరుపుతున్న దుష్ప్రచారానికి అవధులు లేవు. వారిపై ప్రజల్లో అసహ్యం ఏర్పడడానికి ఎన్ని ఎత్తుగడలతో దుష్ప్రచారం చేయాలో అంతా చేస్తున్నాయి.

చైనాలో కమ్యూనిస్టు విప్లవం విజయవంతం కావడానికి రెండు రోజుల ముందు కూడా ఆ దేశ పాలకవర్గాలు తమ ఆదీనంలో ఉన్న రేడియో మాధ్యమం ద్వారా 'ప్రభుత్వ బలగాలు విప్లవకారులను చావుదెబ్బతీస్తున్నాయి. వారు అన్ని ప్రాంతాల్లో ఓటమిపాలై పారిపోతున్నారు. వారం లోపలే దేశమంతా తిరిగి ప్రభుత్వ బలగాల చేతుల్లోకి రాబోతుంది' అంటూ ప్రచారం చేశారు. ఈ రోజు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న తిరుగుబాటు ఉద్యమాల పట్ల కూడా ఇలాంటి దుష్ప్రచారమే జరుగుతున్నది. ఇంటర్‌నెట్‌తో సహా అన్నిరకాల మాధ్యమాలను పాలకవర్గాలు వాడుకుంటున్నాయి.

ఏప్రిల్ నెలలో 'ది హిందూ' ఆంగ్ల దిన పత్రిక పాశ్చాత్య మీడియాను కాపీ కొడుతూ అఫ్ఘనిస్థాన్ ఎన్నికలపై రాసిన సంపాదకీయంలో తాలిబన్‌ల సంఖ్య కేవలం ముప్పయివేలు మాత్రమే అని, అంతే కాకుండా వారికి ప్రజల మద్దతు లేదని, అందుకే ప్రజలు పెద్ద సంఖ్యలో ఓటింగ్‌లో పాల్గొన్నారని రాసింది. కేవలం ముప్పై వేల గెరిల్లాలు, అదికూడా ప్రజల మద్దతు లేకుండా మెజారిటీ దేశ భూభాగాన్ని తమ ఆధీనంలో ఎలా ఉంచుకోగలుగుతారు.

తిరుగుబాటు ఉద్యమాల గురించి ప్రాథమిక అవగాహన ఉన్నవారికి ఎవరికైనా తెలిసే వాస్తవం ఏమంటే ప్రజల మద్దతు, తిరుగుబాటులో ప్రజల ప్రత్యక్ష పాత్ర లేనట్లయితే ఎంత మంది గెరిల్లాలు ఉన్న ఉద్యమమైనా అనతికాలంలోనే అణిచివేయ బడుతుంది. అందుకే తిరుగుబాటు ఉద్యమాల గురించి వాస్తవాలు తెలుసుకోవడానికి పాలక వర్గాల మీడియాను నమ్మితే పూర్తి తప్పుడు అవగాహనకు దారితీస్తుంది.

ఈ విమానాలు థర్మల్ ఇమేజింగ్ ద్వారా మనిషి కదలికలను చూపుతాయి గాని, ఆ మనిషి చేతిలో ఆయుధం ఉందా లేదా ఆ మనిషి మగనా, ఆడనా, ఏ వయసు వ్యక్తి లాంటి ఏ వివరాలు చూపలేవు. దాంట్లోనే దాని బలహీనత ఉంది. అది కూడా దాని కెమెరా కేంద్రీకరించ గలిగే కొన్ని అంగుళాల పరిధి వరకు మాత్రమే. ఉదాహరణకు పది వేల ఫీట్లపై ఎగురుతున్న ఒక మానవ రహిత విమానానికి కనీసం ఇరవై కిలోమీటర్ల 'ఏరియల్ వ్యూ' (ఆకాశం నుండి కనబడే భూ ప్రాంతం) ఉంటుంది. ఆ ఇరవై కిలోమీటర్లలో ఎక్కడైనా మనుషులు ఉన్నారా అని తెలుసుకోవాలంటే (తుపాకులను పట్టుకొని తిరిగే తిరుగుబాటుదారు లను అది ఎలాగూ ప్రత్యేకంగా గుర్తించలేదు), ఆ పైలట్ ఆ మానవ రహిత విమానానికి ఉన్న థర్మల్ ఇమేజింగ్ సెన్సార్‌ను (శరీరం వదిలే వేడిని గుర్తించే పరికరం) ఆన్ చేస్తే అది కొన్ని చదరపు అడుగుల పరిధిలో ఉన్న మనుషుల కదలికలను మాత్రమే చూపుతుంది. అంతేగాని కిలోమీటర్ల కొలది పరిధి మొత్తాన్ని ఒకేసారి చూపలేదు. ఈ లెక్కలో అయిదు కిలోమీటర్ల పరిధి మొత్తాన్ని స్కాన్ చేయడానికి ఆ పైలట్‌కు ఒక రోజు పైనే పడుతుంది. ఒకవేళ మనుషులు భవంతులలో ఉన్నా, గుహల్లో ఉన్నా, రాళ్లు, చెట్ల చాటుకు ఉన్నా, వాతావరణం మేఘావృతమైనా మనుషులను ఆ సెన్సార్ గుర్తించలేదు.

మానవ రహిత విమానాలు తిరుగుబాటుదారుల పాలిట మృత్యు శకటాలని, వీటిని ఉపయోగించి వారిని కేవలం కొన్ని రోజుల్లోనే ఏరిపారేస్తామని, తిరుగుబాటుదారులను, వారికి మద్దతుగా ఉండే ప్రజలను భయభ్రాంతులకు, నైరాశ్యానికి గురిచేసే కుట్రలో భాగంగా అమెరికా సైన్యాలు ఆ రెండు దేశాల్లో ప్రచారం చేశారు. అమెరికా బానిస మీడియా ఈ ప్రచారంలో పాలుపంచుకుంది. వాటిని దింపిన ఒక సంవత్సరం తరువాత అర్థమయిందేమంటే, మానవరహిత విమానాలను తయారు చేసే కంపెనీలు తమ లాభాల కొరకు ఒకవైపు, సైనికాధికారులు, రాజకీయ నాయకులు వాటిని కొనడం వలన తమకు లభించే లంచాల కొరకు ఇంకోవైపు, కంపెనీలు ఇచ్చే ప్రకటనల డబ్బులకు ఆశపడి అబద్ధాల మీడియా మరోవైపు, మొత్తంగా వీరందరూ కలిసి ప్రజల చెవుల్లో పువ్వులు పెట్టారు. యుద్ధమంటేనే వ్యాపారమని తెలువని అమెరికా మిలిటరీ, పారా మిలిటరీ సైనికులు, మానవ రహిత విమానాలు తమను కాపాడుతాయన్న భరోసాతో వెళ్లి బలి అయ్యారు. మొత్తంగా చూస్తే, మానవ రహిత విమానం విడియో గేమ్‌కు ఎక్కువ, రియల్ గేమ్‌కు తక్కువ. చెట్లు అతితక్కువగా ఉండి పై నుండి చూస్తే మనుషులు స్పష్టంగా కనబడే ఇరాక్, అఫ్ఘనిస్థాన్‌లలో ప్రతి రోజు కొన్ని వేల కొలది మానవ రహిత విమానాలు నిఘా చేస్తుంటాయి. ఫలితం ఏంటి? అమెరికా చిత్తుగా ఓడిపోయి ఇరాక్ నుంచి ప్యాకప్ చేసుకొని వెళ్లిపోయింది. 2014 చివరిలో అఫ్ఘనిస్థాన్ నుంచి కూడా పారిపోబోతుంది. 2012 మార్చ్‌లో ఒబామా అఫ్ఘనిస్థాన్‌లో తాలిబన్ల నడ్డివిరిచామని, వారు కోలుకోలేకుండా చేశామని అన్నాడు. ఈ రోజు పరిస్థితి ఏమంటే, దేశ రాజధాని కాబూల్ నుండి 40 కిలోమీటర్ల తర్వాత తాలిబన్ల రాజ్యమే నడుస్తున్నది. దక్షిణ, తూర్పు అఫ్ఘనిస్తాన్‌లు పూర్తిగా తాలిబన్ల కంట్రోల్‌లోనే ఉన్నాయి. కనీసంగా 50 శాతం దేశం పూర్తిగా తాలిబన్ల ఆధీనంలో ఉంది. ఇంకో 30 శాతం వరకు, గెరిల్లా యుద్ధ సూత్రాలకనుగుణంగా తాము బలంగా ఉంటే తమ ఆధీనంలో ఉంచుకోవడం, లేకపోతే వదిలివేయడం లాంటి పద్ధతిలో ఉంది.

ఇరాక్‌లో అమెరికా పరాజయం మరింత దారుణం. అమెరికా దురాక్రమణ తర్వాతే అక్కడ తిరుగుబాటు ఉద్యమాలు పుట్టాయి. 2012 చివరలో అమెరికా సైన్యాలు వెళ్లిపోయాయని చెప్తున్నా అక్కడ ఇప్పటికీ 20 వేల వరకు అమెరికా సైనికులు ఉన్నారు. వీరు కాకుండా హ్యాలీబర్టన్, బ్లాక్‌స్టోన్ లాంటి అమెరికాకు చెందిన ప్రైవేట్ ఆర్మీ సైనికులు (వీరంతా మాజీ ప్రభుత్వ సైనికులే) లెక్కలేనంతగా ఉన్నారు. పైగా అమెరికన్లు వాడిన యుద్ధ టెక్నాలజీని ఇరాక్ సైన్యానికి ఇచ్చారు. ఈ రోజుకు కూడా ఇరాక్ సైన్యానికి అమెరికన్లే శిక్షణ ఇస్తున్నారు. వందల కొలది మానవ రహిత విమానాలు, యుద్ధ విమానాలు, హెలికాప్టర్లు లాంటివి నిత్యం తిరుగుతున్నా, 2014 జనవరిలో ఇరాక్ తిరుగుబాటుదార్లు దేశ రాజధాని బాగ్దాద్‌కు కేవలం యాభై కిలోమీటర్ల దూరంలోని ఫలూజా అనే అతి పెద్ద పట్టణాన్ని అలాగే రమది అనే పట్టణాన్ని తమ ఆధీనంలోకి తీసుకున్నారు. ప్రభుత్వ పోలీసులు, మిలిటరీ ఆ పట్టణాలను ఖాళీచేసి వెళ్లిపోయారు. ఇరాక్ – సిరియా దేశ సరిహద్దుల్లో ఉన్న రాష్ట్రాలన్నీ ఇప్పటికీ తిరుగుబాటుదారుల చేతుల్లోనే ఉన్నాయి.

మరింత ఆశ్చర్యకరమైన విషయమేమంటే మార్చ్‌లో బాగ్దాద్ పట్టణ శివారు ప్రాంతం అయిన అబుగ్రేబ్‌లో ముందే ప్రకటించి కొన్ని వందలాది వాహనాలతో (వీటిలో ఇరాక్ లేదా అమెరికన్ సైన్యం నుండి స్వాధీనం చేసుకున్న యుద్ధ ట్యాంకర్లు, సైనిక శకటాలున్నాయి) తిరుగుబాటుదార్లు మిలిటరీ పరేడ్ నిర్వహించారు. అది కొన్ని గంటలపాటు జరిగింది. ఇదే రకమైన మిలిటరీ పరేడ్‌ను ఫలూజాలో కూడా నిర్వహించారు. వీటి విడియోలు ఇంటర్నెట్‌లో ఉన్నాయి. మరో నాలుగైదు పెద్ద పట్టణాలలో తిరుగుబాటుదారుల ఆధిపత్యమే ఉంది. జూలై 2013లో బాగ్దాద్ శివారు అబుగ్రేబ్ సెంట్రల్ జైలుపై (ఈ జైలునే అమెరికన్లు చిత్రహింసలకు వాడుకున్నారు) దాడిచేసి, తమ వారిని విడిపించుకున్నారు. తిరుగుబాటుదారుల మిలిటరీ పరేడ్ జరిగిన నెలరోజుల లోపే దేశంలోనే అతి పెద్దదైన ఈ జైలును మూసివేసినట్టు 15 ఏప్రిల్, 2014 నాడు ఇరాక్ రక్షణ శాఖ ప్రకటించింది. దేశ రాజధాని శివారులో ఉన్న ఈ జైలు ప్రాంతం రక్షణ పరంగా 'చాలా సున్నితమైన ప్రదేశం'లో ఉన్నందున మూసివేసినట్లు ప్రకటించడం ద్వారా తిరుగుబాటుదారుల ప్రాబల్యం ఎంతగా ఉన్నదో పరోక్షంగా ఒప్పుకున్నది. ఇరాక్ మొత్తంగా తిరుగుబాటుదారుల చేతుల్లోకి వెళ్లే సమయం ఎంతో దూరంలో లేదని పరిస్థితులను పరిశీలిస్తే అర్థమవుతుంది.

అమెరికా సామ్రాజ్యవాదులకు చెందిన రాండ్ కార్పొరేషన్ అనే ఒక పరిశోధనా సంస్థ అమెరికా సైన్యం కొరకు 2011లో జరిపిన ఒక పరిశోధనా పత్రాన్ని వెలువరించారు. 2001 నుండి 2011 వరకు ఇరాక్, అఫ్ఘనిస్థాన్‌లలో అమెరికా వాడిన సైనిక శక్తిని లెక్కవేశారు. ఈ పరిశోధన దిమ్మతిరిగే వాస్తవాలను తెలుపుతున్నది. ఆ పది సంవత్సరాల కాలంలో, అమెరికా ప్రభుత్వం తన సైన్యం నుండి 74 శాతం బలగాలను ఇరాక్, అఫ్ఘనిస్థాన్‌లలో దింపింది. అలాగే, 66 శాతం నేవీ బలగాన్ని, 59 శాతం వాయుసేనను, 61 శాతం మెరైన్ బలగాలను దింపింది. ఈ రెండు దేశాల్లో బలగాలు ఎక్కువగా అవసరమని, 2002లో ఆఫీసుల్లో డెస్క్‌వర్క్‌కు కనీసంగా ఉంచాల్సిన బలగాన్ని 33 శాతం నుండి 28

శాతంకు తగ్గించి వారిని కూడా యుద్ధరంగానికి పంపారు. లక్షలాదిగా ఉన్న అమెరికా సైనిక బలగాలలో కేవలం 14,000 సైనికులు మాత్రమే ఎన్నడూ ఇరాక్, అఫ్ఘనిస్థాన్ యుద్ధంలో (2001 తర్వాత) పాల్గొననివారు. అంటే, ఎన్ని లక్షల అమెరికా సైన్యాలు ఈ రెండు దేశాలపై జరిపిన యుద్ధంలో పాల్గొన్నాయో అర్థం చేసుకోవచ్చు. 4.12 లక్షల సైనికులు ఒకటి కన్నా ఎక్కువసార్లు ఈ రెండు దేశాల యుద్ధరంగంలో గడపవలసి వచ్చింది. ఈ లెక్క కేవలం అమెరికా ప్రభుత్వానికి పనిచేసే రక్షణ బలగాలది. దాదాపు ఐదు లక్షల వరకు ప్రైవేట్ సైనికులు అమెరికా నుండి వెళ్లినట్టు పరిశీలకులు భావిస్తున్నారు. వీరు కాకుండా తొమ్మిది లక్షల ఇరాక్ సైన్యం. వీరు కూడా కాకుండా ఇరాక్ పోలీసులు, ప్రైవేట్ సైన్యాలు.

ఇన్ని లక్షల సాయుధుల అరాచకాన్ని ఎదుర్కొంటూ ఈ రోజు తిరుగుబాటుదారులు ఈ స్థాయి విజయాలు సాధించారంటే వారికి ఎంతగా ప్రజల మద్దతు ఉందో అర్థమవుతుంది. ఇక అఫ్ఘనిస్థాన్ విషయానికి వస్తే అమెరికా సైన్యాలకు తోడుగా లక్షలాది అఫ్ఘన్ సైన్యాలు, అఫ్ఘన్ నార్తర్న్ అలయన్స్ వారి ప్రైవేట్ సైన్యాలు, అమెరికాకు తోడుగా వచ్చిన వివిధ దేశాల నాటో సైన్యాలు (వీటిలో బ్రిటిష్ సైనికులే యాభై వేలు). ఇన్ని లక్షల సైనికుల దాడిని ఎదుర్కొంటూ కూడా తాలిబన్లు దేశ రాజధానికి 40 కిలోమీటర్ల తర్వాత ప్రాంతంతో సహా మెజారిటీ దేశాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకోగలిగారంటే వారికి ప్రజల మద్దతు ఎంతగా ఉందో అర్థంచేసుకోవచ్చు.

2001 నుండి 2012 వరకు ఇరు దేశాల్లో అమెరికన్ సైనికులు, ప్రైవేట్ కాంట్రాక్టర్లు (వీరు ప్రైవేట్ సైనికులు) 13 వేల మంది చంపబడ్డారు. ఇది కేవలం యుద్ధంలో చనిపోయిన వారు. అసలు అమెరికా సైన్యంలో ఎక్కువగా చనిపోతున్నది ఆత్మహత్యలతోనే. యుద్ధంలో పాల్గొని మానసికంగా దెబ్బతిని, తమ దేశానికి తిరిగి వచ్చిన తర్వాత ఆత్మహత్యలు చేసుకున్న వారి సంఖ్య లెక్కేలేదు. అలాగే యుద్ధం కలిగించిన పి.టి.ఎస్.డి అనే మానసిక వ్యాధి నుంచి ఉపశమనం కొరకు మద్యాన్ని అతిగా సేవించి ఆక్సిడెంట్లలో చనిపోయిన వారు, ఇతరులపై కాల్పులు జరిపి, తాము కాల్చుకొని చనిపోయిన వారు, వీరి లెక్క ప్రభుత్వం చెప్పడం లేదు.

ఇక వికలాంగులైన అమెరికా సైనికులకు (ప్రైవేట్ సైనికులు కాదు) లెక్కే లేదు. కాళ్లు చేతులు కొట్టివేయబడిన వారు, మందుపాతరలలో కాళ్లు విరిగిన వారు, ఇలా మొత్తంగా చూస్తే లక్షలలో ఉంటారు. శారీరక, మానసిక వైకల్యంతో అమెరికా ప్రభుత్వం వద్ద నమోదు చేసుకున్న (వీరందరు ఈ పది సంవత్సరాల మధ్యలో ఇరాక్, అఫ్ఘనిస్థాన్‌లో పనిచేసిన వారే) వారు 6 లక్షల 75 వేల వరకు ఉన్నారు. సైనికులు తమతోటి సైనికులపై (బాధితుల్లో ఆడ, మగ, ఇద్దరూ ఉన్నారు) జరిపిన లైంగిక అత్యాచారాల కేసులు ఎన్నో ఉన్నాయి. అమెరికాకు చెందిన 21 శాతం మహిళా సైనికులు తమ తోటి సైనికుల చేత లైంగిక అత్యాచారానికి గురయ్యారు.

ఈ రెండు దేశాల్లో తిరుగుబాటుదారుల చేతుల్లో చంపబడిన పదమూడు వేల అమెరికా సైనికులే కాకుండా, అమెరికా దురాక్రమణకు మద్దతుగా నిలిచిన ఇరాక్, అఫ్ఘన్, బ్రిటన్, కెనడా, జర్మనీ, పోలండ్ లాంటి దేశాల సైనికులు మొత్తంగా 23,000 సైనికులు ప్రజల తిరుగుబాటులో చంపబడ్డారు. వీరు కాకుండా ప్రైవేట్ సైన్యాలకు చెందిన వారు, ఇన్‌ఫార్మర్లుగా పనిచేసిన వారు ఎందరు చంపబడ్డారో ఏ ప్రభుత్వం లెక్క చెప్పడం లేదు.

అమెరికా సైన్యానికి ఇరాక్‌లో వంట పని చేసిన నాకు తెలిసిన ఒక తెలుగు వ్యక్తి తన అనుభవాలను చెప్పాడు. భారత దేశానికే చెందిన తన సహోద్యోగులు నలుగురైదుగురు చంపబడ్డారు. వీరు ఏ లెక్కలో కనబడరు. ఎందుకంటే వీరు ఎక్కడ కూడా అమెరికా సైన్యాలకు పనిచేస్తున్నట్టుగా రికార్డ్ ఉండదు.

ఇక అమెరికన్ సైన్యాల చేతిలో చంపబడ్డ వారి లెక్కకు అంతేలేదు. 'యునైట్ అగేనెస్ట్ వార్' అనే ఒక సంస్థ తెలిపిన వివరాల ప్రకారం కేవలం ఇరాక్‌లోనే పది లక్షల ఇరాకీలు అమెరికా చేతిలో చంపబడ్డారు. అఫ్ఘనిస్థాన్‌లో కూడా ఈ సంఖ్య చాలా ఎక్కువ స్థాయిలో ఉంటుంది.

కేవలం తమ ఆర్థిక లాభాలకోసం, కట్టుకథలు అల్లి ఆ రెండు దేశాలను ఆక్రమించుకొని, ఆ దేశాల ప్రజలు, తమ దేశ సైనికులు కొన్ని లక్షలమంది చనిపోవడానికి కారణమైన అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రపంచ ప్రజలకు, ప్రపంచ శాంతికి ప్రథమ శత్రువు అనడంలో సందేహం లేదు. ఈ అత్యంత కిరాతక అమెరికా, నాటో సామ్రాజ్యవాద దేశాల సైన్యాలను ఇరాక్, అఫ్ఘన్ ప్రజలు వీరోచితంగా ఎదుర్కొంటూ, తమ దేశాన్ని తమ ఆధీనంలోకి తీసుకుంటూ, విజయం వైపు పరుగులు తీస్తున్న వారి పోరాటాలకు మద్దతు తెలుపవలసిన అవసరం ప్రపంచ శాంతిని కోరుకునే ప్రతి ఒక్కరిపై ఉన్నది. ఈ రెండు దేశాల ప్రజా పోరాట విజయాలు వియత్నాం ప్రజల విజయం తర్వాత మళ్లీ ప్రపంచ ప్రజలకు నేర్పుతున్న పాఠం ఏంటంటే, ప్రజలు ఏకమై తిరగబడితే ప్రపంచంలోనే అత్యంత శక్తివంతమైన ఆయుధ సంపత్తి ఉన్నా, లక్షలాది సైనిక బలగాలను దింపినా, ఎంత అదునాతనమైన మానవ రహిత యుద్ధ విమానాలు, సాటిలైట్ సాంకేతిక పరిజ్ఞానం ఉన్నా, ప్రజల చేతిలో ఓడిపోక తప్పదు. ప్రజలు ఎవరివైపు ఉంటే వారే గెలుస్తారు గాని, ఆయుధ సంపత్తి, సైనిక బలగం ఉన్నంత మాత్రాన గెలువలేరని అఫ్ఘనిస్థాన్, ఇరాక్ ప్రజలు మరోసారి నిరూపించారు.

(ఈ వ్యాసంలో ఉదహరించిన యూట్యూబ్ విడియోల లింకులను వీక్షణం వెబ్‌సైట్‌లోని కామెంట్ పేజీలో పెట్టడం జరిగింది. ఆసక్తి కలవారు వాటిని చూడవచ్చు.)

వీ

*(రచయిత పరిశోధకుడు)*

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.*

# పరిశోధనా గ్రంథాలు, అధ్యయన పత్రాలపై ఆంక్షలెందుకు?

**- ఎ. రాజేంద్రబాబు**

వీక్షణం ఏప్రిల్ 2014 సంచికలో 'హిందూ మత చరిత్ర – వెండీ డానిగర్ పుస్తకం' శీర్షికతో ఒక విలువయిన వ్యాసం ప్రచురితమయింది. వ్యవస్థను తన గుప్పిట్లో ఉంచుకోవాలని సదా ప్రయత్నించే మౌఢ్య మత వర్గాలు, వారిని పెంచి పోషించే పాలక ముఠాలు సత్యశోధనలో ఉత్సుకత ఉన్న పరిశోధకుల పట్ల ఎంత క్రూరంగా ప్రవర్తిస్తాయో, వారిని, వారి అధ్యయనాలను వెలుగులోకి రాకుండా తొక్కి పెట్టడానికి ఎలా ప్రయత్నిస్తాయో రచయిత సురేష్ కొలిచాల సవివరంగా తెలిపే ప్రయత్నం చేశారు. వారి కృషికి, వారి పరిశోధనా తత్పరతకు అభినందనలు తెలుపుతూనే, వారి వ్యాసం నాలో ఒక చిన్న సంశయాన్ని మిగిల్చిందన్న విషయాన్ని పాఠకుల ముందుంచుతున్నాను.

'వెండీ డానిగర్ హిందూ మతానికి వ్యతిరేకంగా ఏమీ రాయలేదు, హిందూ మతాన్ని కించపరిచే ఉద్దేశ్యం ఆమెకు లేదు' అని సురేష్ కొలిచాల అభిప్రాయపడ్డారు. హిందూ మతాన్ని కూలంకషంగా చర్చించిన 'హిందూ మత చరిత్ర' అనే పుస్తకంలో కొన్ని ముఖ్యమైన విషయాలు స్పృశించలేదని చెపుతూనే హిందువులను అవమానించే అంశాలు ఈ పుస్తకంలో ఎక్కడా లేవని అన్నారు. హిందూ మతాన్ని కించపరిచే ఉద్దేశ్యం లేనపుడు ఆ పుస్తకానికి వ్యతిరేకంగా అంత తీవ్రమయిన చర్య ఎందుకు తీసుకున్నారు అన్న అర్థం స్ఫురిస్తుంది. అంటే, హిందూ మతాన్ని కించపరిచే, అవమానపరిచే అంశాల ప్రస్తావన ఉంటే, ఆ పుస్తకాన్ని మార్కెట్లోంచి ఉపసంహరించి మిగిలిపోయిన పుస్తకం కాపీలనన్నింటిని తగలబెట్టెయ్యాలని నిర్ణయం తీసుకున్న పెంగ్విన్ ప్రచురణా సంస్థ చర్య సరైనదే అవుతుందా అన్న సంశయం రాకమానదు. ప్రజాస్వామ్యానికి కావలసిన ప్రాథమిక అవసరం భావ ప్రకటనా స్వేచ్ఛ కాదా? సజీవంగా ఉన్న వ్యక్తిని అవమానపరిస్తే అది కుసంస్కారమవుతుంది కాని, పరిశోధనలో తేలిన కొన్ని విషయాలు, కొన్ని భావనలు కొంతమందిని బాధపెడతాయన్న సాకుతో వాటిని అణిచిపెట్టడం ఇంకేమన్నా అవుతుంది కాని ప్రజాస్వామ్యం మాత్రం కాదు. సురేష్ కొలిచాల అభిప్రాయాలను అర్థం చేసుకోవడంలో నా అవగాహనా లోపం ఏమైనా ఉంటే మన్నించండి కాని, ఈ విషయంపై చర్చించడం మాత్రం అవశ్యకం.

ఏది ఏమైనా, భారతదేశంలో ప్రస్తుతం నెలకొని ఉన్న ప్రత్యేక పరిస్థితులలో ఇలాంటి వ్యాసాలు రావడం చాలా అవసరం. ఇలాంటి చర్చ బహుముఖాలుగా చోటుచేసుకుని, భావ ప్రకటనా స్వేచ్ఛకు ఆటంకాలు లేని వాతావరణం దేశంలో ఆవిష్కరించబడాలి. దేశంలో ప్రస్తుతం నెలకొని ఉన్న ప్రత్యేక పరిస్థితి ఏమంటే, హిందూ మత వాద సంస్థ అయిన ఆర్ఎస్ఎస్‌లో పూర్తికాలం పనిచేయడంకోసం యువకుడిగా ఉన్నప్పుడే తన భార్యను, కుటుంబాన్ని వదిలివేయడానికి సిద్ధపడ్డ ఇప్పటి గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ భారత ప్రధానమంత్రి పదవి చేపట్టాలని కొంత మంది బలంగా భావించడమే ఆ ప్రత్యేక సందర్భం. వర్ణవ్యవస్థలో తప్పేమీలేదని, కొంతమంది పుట్టుకతోనే పంచములని, అడవుల్లో నివసించే వాళ్లు రాక్షస జాతి అని ఆర్ఎస్ఎస్ వాదం. అదే మోడీ వాదమని గుజరాత్‌లో నిరూపితమయింది. హిందువులు పవిత్ర స్థలంగా భావించే వారణాసి నుండి పార్లమెంట్‌కు పోటీచేస్తూ మోడీ అదే సందేశాన్ని ప్రజలకు చేరవేశాడు. నిజంగా మోడీ 'అభివృద్ధి'కి సంకేతం అయితే, వెనుకబడిన అభివృద్ధికి నోచుకోని 'పాలమూరు' లాంటి చోటు (గుజరాత్‌ను వదిలిపెట్టి ఉత్తరప్రదేశ్ వెళ్లినపుడు తెలంగాణకు రావడానికి అభ్యంతరమెందుకు) నుండి ఆయన పోటీ చేసి ఉంటే అర్థవంతంగా ఉండేది కాని ఆయన హిందూ మత ధర్మానికి ప్రతినిధిగా పోటీ చేస్తున్నాడు కాబట్టి, వారణాసి నుండే పోటీకి దిగాడు. రేపు మోడీ ప్రధానమంత్రి అవుతాడా కాడా అన్నది ఈ సమాజపు చోదక శక్తుల బలం బలహీనతల మీద, సమాజంలో ఉండే విరుద్ధాంశాలు ఎలా పరిష్కరించబడతాయి అనే అంశం మీద ఆధారపడి ఉంటుంది. మోడీ ప్రధాన మంత్రి అయినా కాకపోయినా ఆయన ప్రాతినిధ్యం వహిస్తున్న భావజాలం మాత్రం వేళ్లూనుకునే ప్రమాదం ఉంది. ఆ భావజాలానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్యాన్ని వాంఛించేవాళ్లు, లౌకిక వాదులు సమాజంలో పురోగామి వాతావరణం వృద్ధి చెందడానికి కృషి చేయాలి. అందుకు ఇలాంటి వ్యాసాలు, ఈ చర్చలు అవసరం.

ఈ సందర్భంగా నాలుగైదు దశాబ్దాల క్రితం తెలుగు సాహిత్యంలో మినుకుమన్న ఒక సంఘటన గుర్తుచేస్తాను. సనాతన సాంప్రదాయ సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించిన విశ్వనాథ సత్యనారాయణ రాసిన 'రామాయణ కల్పవృక్షం' కావ్యాన్ని పివి నరసింహరావు హిందీలోకి అనువాదం చేస్తే ఆ పుస్తకానికి జ్ఞానపీఠ అవార్డు లభించింది. అదే సమయంలో, రంగనాయకమ్మ 'రామాయణ విషవృక్షం' రాశారు. వాల్మీకి రామాయణంలోని కథనే, అవే సంఘటనలే తన వ్యాఖ్యలతో, తాను రామాయణ కథను అవలోకించిన పద్ధతిలో రాశారు. రాముని కథను వ్యంగ్య ధోరణిలో తూర్పార బట్టారు. ఆనాడు అది పెద్ద సంచలనమే! ఆ రోజుల్లో దిగంబర కవులు సృష్టించిన తిరుగుబాటు వాతావరణం, విప్లవ రచయితల సంఘం, సృజన లాంటి కొన్ని పత్రికల వారి సాంస్కృతిక పోరాటం, పౌరహక్కుల సంఘాల ప్రజాస్వామిక పోరాటాలతో తెలుగు సమాజంలో అభ్యుదయ వాతావరణం నిండుగా ఉండింది. రంగనాయకమ్మ 'రామాయణ విషవృక్షాన్ని' తెలుగు ప్రజలు ఆదరించారు. సాంప్రదాయ వాదులు తమలో తాము కుళ్లి చచ్చారు కాని ఆ పుస్తకాన్ని, పుస్తక ప్రభావాన్ని అడ్డుకునే ప్రయత్నం చేయలేకపోయారు.

ఇప్పుడు పుస్తకాలను, పరిశోధనలనే కాదు ఫేస్ బుక్‌లో పంపే మెసేజ్‌లనే భరించలేకపోతున్నారు. గత దశాబ్దపు చివరి రోజుల్లో షికాగో యూనివర్సిటీలో ఆచార్యునిగా పనిచేసిన కన్నడ మేధావి ఎకె రామానుజం రాసిన 'మూడు వందల రామాయణాలు, అయిదు ఉదాహరణలు...' అన్న అధ్యయన పత్రాన్ని ఢిల్లీ యూనివర్సిటీ పాఠ్యాంశాల నుండి తొలగిస్తే దేశ వ్యాప్తంగా రావల్సినంత వ్యతిరేకత రాలేదు. భారత మేధావి వర్గం ఆ విషయాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. కోర్టు ఒక కమిటీ ఏర్పాటు చేసి ఆ కమిటీ ప్రతిపాదనలను బట్టి నిర్ణయం తీసుకొమ్మని ఆదేశించింది. కమిటీలో మెజారిటీ సభ్యులు ఆ వ్యాసం బి.ఎ. (చరిత్ర) పాఠ్యాంశంగా ఉండాలని తీర్పు చెప్పినా విశ్వవిద్యాలయ అధికారులు పెడచెవిన బెట్టి విద్యార్థులు వివిధ రామాయణాల గురించి తెలుసుకోవాల్సిన అవసరం లేదన్నట్టుగా కరికులం నుంచి తొలగించారు. దానికి ఎబివిపి విద్యార్థుల ఒత్తిడి కారణం.

మనం సాధారణంగా నమ్మే రామాయణ కథకు భిన్నంగా వ్యాఖ్యానాలను రామానుజన్ తన పరిశోధనలో వెల్లడి చేశాడు. ఉదాహరణకు విమలాసూరి రాసిన 'పీమ చరియ' అనే జైన రామాయణంలో రావణునిది గొప్ప వ్యక్తిత్వంగా తీర్చిదిద్దారు. హిందూ మతంలోని బ్రాహ్మణ వర్గాలు రావణున్ని ప్రతి నాయకునిగా చిత్రించడంపై తీవ్ర వ్యాఖ్యానాలు చేశారు. కోతుల సమూహం అతి బలవంతులయిన రావణుడి సైన్యాన్ని ఎట్లా లొంగదీసు కున్నారని ఎద్దేవా చేశారు. కుంభకర్ణుడు ఆరు నెలలు నిద్రపోవడం సహజ విరుద్ధమని కొట్టిపారేశారు.

ఇన్ని రామాయణాలు ఉన్నప్పుడు వాల్మీకి రాసిన రామాయణాన్నే ఎందుకు ప్రామాణికంగా తీసుకోవాలి అన్న ప్రశ్న సహజంగా ఉద్భవిస్తుంది. రామానుజం వ్యాసాన్ని విద్యార్థులు అధ్యయనం చేస్తే రాముడు పురాణ పురుషుడా, చారిత్రక పురుషుడా అన్న చర్చ కొత్త పుంతలు తొక్కుతుంది. అప్పుడు అయోధ్య రామ జన్మభూమి అవ్వాలని ఏముంది! రాముని అస్తిత్వాన్ని గురించి ఎన్నో ప్రశ్నలు మొలకెత్తుతాయి.

ప్రశ్నలకు జవాబులు వెతకడంతో ప్రారంభమయ్యే పరిశోధన సాధారణ నమ్మకాలను ప్రశ్నిస్తుంది. ప్రజల విశ్వాసాలపై వ్యాపారం చేసే సమాజ ఆధిపత్య వర్గాలు సత్య పరిశోధనలకు ఎక్కువ ప్రభావం లేకుండా జాగ్రత్త పడుతాయి. ప్రశ్నించే సాంప్రదాయాన్ని రక్షించుకోవడం, పరిశోధనా తత్వాన్ని కాపాడుకోవడం మేధావుల బాధ్యత. ఆ బాధ్యత నిర్వర్తిస్తున్న వీక్షణం పత్రికకు అభినందనలు. వీ

తన అధ్యయనంలో తేలిన విషయాలనే రామానుజం చెప్పాడు. ఒక రామాయణంలోని కథతోనే ఆయన తన వ్యాసం ప్రారంభించాడు. రాముని కాలి ఉంగరం జారి పాతాళంలో పడిపోతుంది, దాన్ని తీసుకు రమ్మని హనుమంతుణ్ణి పంపుతాడు. అక్కడ హనుమంతుడు ఒక పళ్లెంలో వందల వేల ఉంగరాలు చూస్తాడు. అవన్నీ వివిధ రాముళ్ల వేళ్ల నుండి జారిపడినవే! ఆ పళ్లెంను కాపలా కాస్తున్న పాతాళరాజు 'అంతమంది రాముళ్లు ఉన్నారు, నీక్కావలసిన రాముని ఉంగరం వెతుక్కో'మ్మంటాడు. 'అయినా నీవు తిరిగి వెళ్లేసరికి అక్కడ రాముడు ఉండడు. ఆయన అవతారం చాలించే సమయం వచ్చినపుడు ఆయన వేలి ఉంగరం ఇలా జారి పడిపోతుంది. వాటికి కాపలాగా నేనిక్కడ ఉన్నాను' అంటాడు. పద్నాల్గవ శతాబ్దంలో కుమార వ్యాస అనే కన్నడ కవి రామాయణం వద్దనుకొని మహాభారతం రాయడానికి పూనుకున్నాడట. ఎందుకంటే రామాయణం రాసిన కవుల భారంతో మూలుగుతున్న భూమండలాన్ని మోస్తున్న పున్నాగ సర్పం ఉచ్ఛ్వాస నిశ్వాసాలను విన్నాడట. అందుకని రామాయణం వైపు పోదలుచుకోలేదట! రామాయణాన్నే ఒక శాస్త్రంగా భావించి దాని పరిశోధకుడిగా మారిన కెమిలి బుల్కె (1950) రామాయణాలు మూడొందలని లెక్కగట్టాడు. ఈ వ్యాసంలో రామాయణం గురించి విద్యార్థుల విజ్ఞాన పరిధిని పెంచే అంశాలు ఎన్నో ఉన్నా హిందూ మత విలువలకు వ్యతిరేకంగా ఉన్న జైన రామాయణం గురించి కూడా రామానుజం పేర్కొనడమే పాఠ్యాంశాల జాబితాలో నుండి ఈ వ్యాసం తొలగింపుకు కారణమయి ఉంటుంది.

*(...4వ పేజీ తరువాయి)*

*గుర్తుపట్టడానికి వీలుండేది. పాఠకుల వీక్షణంలో లేఖలు, మాక్సింగోర్కీ, పి.సాగర్‌లవి చాలా తీవ్రంగా ఉన్నా అవి యథార్థాలే. రంగనాయకమ్మను ఎంత తిట్టినా, విమర్శించినా, 'తత్వశాస్త్రం – చిన్న పరిచయం' పుస్తకంలోని కార్మిక వర్గ విప్లవ నియంతృత్వం వంటి వ్యాసాలు అంత సులభంగా ఎవరైనా రాయగల్గు తున్నారా? ఆమెలో హేళన, ఆత్మస్తుతి, గర్వం, వ్యంగ్యాల్ని తేలికగా తీసుకుని, విషయ వివరణ చేసే పద్ధతిని అభినందించాల్సిందే. మార్క్సిస్టు తత్వశాస్త్రం గురించి ఎందుకు రాసినా ఆమె చెప్పినంత సుందరంగా ఎవ్వరూ చెప్పలేక పోతున్నారన్న నిజం ఒప్పుకోవాలి. ఎన్నికల్ని చూసి దడుచుకొని చావడానికి మార్గాలు ఎన్నడమే విషయంగా సంపాదకీయమా, చావు సమస్య పరిష్కారం కాదన్న చైతన్యాన్ని కల్గించాలి కానీ... పత్రికను బతికించడానికి ఉడతా భక్తిగా తోడ్పడతాను. పత్రికను ఆపొద్దు. ఆపొద్దు.*

**– ఎస్. హజరత్ అలీ**
*గుంటూరు*

**వీ***క్షణం మార్చ్ సంచికలో వేణుగోపాల్ రాసిన వ్యాసం పై ఏప్రిల్ నెలలో మాగ్జిం గోర్కీ రాసిన ఉత్తరానికి స్పందనగా, జ్ఞానం, విద్య మీద గుత్తాధిపత్యాన్ని విజయవంతంగా సవాలు చేసిన వర్గాలు తెలంగాణలోని ప్రకృతి వనరుల మీద గుత్తాధిపత్యం కోసం పాకులాడడంవల్లే తెలంగాణ ప్రజలలో వేరు రాష్ట్రం మీద భ్రమలు కల్పించామన్నది వాస్తవం కాదా? 1973లో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమానికి నాయకత్వం వహించిన వర్గాలే 2013లో సమైక్యాంధ్ర నినాదం అందుకోలేదా. దీనికి 1983లో తెలుగుదేశం అధికారంలోకి వచ్చిన అనంతర పరిణామాలు కారణం కావా? రామోజీలు, జయభేరీలు, నార్నే ఎస్టేట్స్, ఫిలింనగర్‌లు తెలంగాణ ప్రజలను నిర్వాసితులను చేయకుండానే ఏర్పడ్డాయా? కె.సి.ఆర్‌కి, వేణుగోపాల్‌కి హైదరాబాద్‌ని వదులుకోవాల్సి వచ్చినా కారంచేడులూ, నీరుకొండలూ, పదిరి కుప్పంలూ, కంచికచర్లలూ మన ఆధీనంలోనే ఉన్నాయి. సంతోషిద్దాం.*

**– లూసన్**
*గుంటూరు*

**వీ***క్షణం ఫిబ్రవరి సంచికలో తిరుపతిని అయోధ్యగా మార్చే అవకాశం ఉన్నట్టు రచయిత రాసిన వ్యాసానికి హనుమాన్ చౌదరి రాసిన ఉత్తరంలో హిందువుల గుళ్లు కూల్చి దాని స్థానంలో మసీదు కట్టినారు అని తన వేదన వ్యక్తం చేశారు. కాని కొన్ని వేల బౌద్ధ ఆరామాలు హిందు రాజులు కూల్చిన సత్యం విదితమే. చరిత్రలో ఇలాంటి సంఘటనలక కారకులు ప్రజలుకారు, పాలకులు. కాబట్టి, వీక్షణం పత్రిక ఇలాంటి వ్యాఖ్యలకు అంతగా ప్రాధాన్య మివ్వరాదు అని నా భావన. దేశ వ్యాప్తంగా జైలు జీవితం గడుపుతున్న రాజకీయ, సాధారణ ఖైదీలు జైలులో ఎదుర్కొంటున్న సమస్యలపై ఒక వివరణాత్మకమైన వ్యాసం రాయించగలరని మనవి.*

**– ముత్తన్నగారి రాజేందర్ రెడ్డి**
*భూంపల్లి, మెదక్*

**అం***బేద్కర్ జయంతి సందర్భంగా వీక్షణం ఏప్రిల్ సంచికలో వ్యాసం వస్తుందని ఆశించాం, కాని రాలేదు. ప్రతి నెల సందర్భోచితమైన అంశాలపై వ్యాసాలు వచ్చేలా చూడగలరని మనవి.*

**– బి. జయరాజ్**
*హైదరాబాద్*

**వీ***క్షణం ఏప్రిల్ సంచికలో 'తెలంగాణ ఉద్యమంలో ఎన్‌జిఒల ప్రమాదం' అనే వ్యాసం ఈ ఎన్నికల వాతావరణంలో రాదగినదిగా భావిస్తున్నాను. దోపిడీ పాలకవర్గాలు ప్రజల్ని మభ్యపెట్టేందుకు ఎంతో ముందు జాగ్రత్తలు తీసుకుంటారు. వారి మీద వారికే నమ్మకం పోయినపుడు ప్రజల్లో అభాసు పాలుకాకుండా ముందుగానే మేల్కొని ప్రజలపక్షం వహించే సంస్థల్ని నీరుగార్చేందుకుగాను పోటీగా కొత్త కొత్త నకిలీ సంస్థల్ని తయారు చేసి సమాజం మీదికి వదులుతారు. వాటి పోషణ బాధ్యత తీసుకుంటారు. ఇదేగదా దోపిడీ పాలకుల చాణక్య నీతి. నిజాయితీగా ప్రజలకు సేవచేసే వర్గాన్ని అంతమొందించి తమకు, తమ వర్గానికి సేవ చేసే సంస్థల్ని ప్రజల ముందుకు తెచ్చి ప్రజల్ని మభ్యపెట్టడంలో పాలకవర్గాలు అవలంబించే ఎత్తుగడేగదా! పాలక వర్గాలవారి నకిలీ సంస్థల్ని గురించి చాలా వివరంగా రాసిన రచయితకు నా కృతజ్ఞతలు. రంగనాయకమ్మ పుస్తక పరిచయంలో భాగంగా రాసిన ఒక భాగం సులభశైలిలో పాఠకులకు అర్థమయ్యే విధంగా అందించినందుకు వారికి నా కృతజ్ఞతలు.*

**– కడియాల సుబ్బనాచారి**
*దుత్తలూరు, నెల్లూరు*

## భుల్లర్‌కు క్షమాభిక్ష

**1993** సెప్టెంబర్‌లో ఢిల్లీలో జరిగిన బాంబు పేలుళ్ల కేసులో దోషి అయిన దేవేందర్ భుల్లర్‌కు ట్రయల్ కోర్టు విధించిన మరణ శిక్షను సుప్రీం కోర్టు మార్చ్ 31న యావజ్జీవ కారాగార శిక్షగా మార్చింది. భుల్లర్‌ను ట్రయల్ కోర్టు 2001 ఆగస్టులో దోషిగా తేల్చి మరణ శిక్ష విధించింది. 2003లో భుల్లర్ పెట్టుకున్న క్షమాభిక్ష పిటిషన్‌పై నిర్ణయం తీసుకోవడంలో ప్రభుత్వం జాప్యం చేయడంతో పాటు ప్రస్తుతం ఆయన ఆరోగ్య పరిస్థితిని కూడా దృష్టిలో ఉంచుకొని ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ పి. సదాశివం నేతృత్వంలోని నలుగురు సభ్యుల సుప్రీం కోర్టు ధర్మాసనం ఈ నిర్ణయం తీసుకుంది.

## అత్యాచార నిందితులకు మరణ శిక్ష

ముంబైలోని శక్తి మిల్స్‌లో 2013 జూలై, ఆగస్టుల్లో వేర్వేరు ఘటనల్లో ఇద్దరు యువతులపై సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు. అత్యాచారానికి పాల్పడ్డ నిందితులైన విజయ్ జాదవ్, కాసిం బెంగాలీ, సలీం అన్సారీలకు మరణ శిక్ష విదిస్తూ ప్రిన్సిపల్ జడ్జి శాలిని ఫన్సల్కార్ ఏప్రిల్ 4న తీర్పునిచ్చారు.

## బాబ్రీ మసీదు కూల్చివేత కుట్రే

**1992** డిసెంబర్ 6న బాబ్రీ మసీదు కూల్చివేతలో పాల్గొన్న 23 మందిపై కోబ్రాపోస్ట్ స్టింగ్ ఆపరేషన్ నిర్వహించింది. ఈ విధ్వంసంలో సంఘ్ పరివార్‌కు చెందిన వివిధ అనుబంధ సంస్థలు క్రియాశీల పాత్ర పోషించినట్లు తేలిందని ఆ సంస్థ ఏప్రిల్ 4న వెల్లడించింది. అప్పటి అగ్రనేతలకు పూర్తిస్థాయిలో తెలిసే ఈ సంఘటన జరిగిందని ఆ సంస్థ నిర్ధారించింది.

## హిజ్రాలు థర్డ్ జెండర్

సమాజంలో ఇప్పటి వరకు రెండు జెండర్ (ఆడ, మగ) లే ఉండగా హిజ్రాలను థర్డ్ జెండర్‌గా గుర్తించాలని సుప్రీం కోర్టు ఏప్రిల్ 15న తీర్పు వెలువరించింది. హిజ్రాలకు ప్రత్యేక హక్కులు కల్పించాలని సుప్రీం కోర్టు.. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదేశాలు జారీచేసింది. విద్య, ఉపాధిలో సమాన హక్కులు కల్పించాలని న్యాయస్థానం ఆదేశించింది. హిజ్రాలకు సమాన హక్కులు కల్పించాలన్న పిటిషన్‌పై ఏప్రిల్ 15న విచారణ జరిపిన కోర్టు ఈ మేరకు తీర్పును వెల్లడించింది.

## ఎస్‌సి, ఎస్‌టి చట్టం కింద లక్షల కేసులు

ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం 1989 కింద 2001-12 మధ్య దేశంలో 1.22 లక్షల కేసులు నమోదయ్యాయి. ఈ కాలంలో బిజెపి నేతృత్వంలోని ఎన్‌డిఎ, కాంగ్రెస్ నేతృత్వంలోని యుపిఎ కూటములు అధికారంలో ఉన్నాయి. ఢిల్లీకి చెందిన స్వచ్ఛంద సంస్థ 2001-12 మధ్య దేశవ్యాప్తంగా ఈ చట్టం కింద నమోదైన కేసుల్ని ఏప్రిల్ 22న విశ్లేషించింది. జాతీయ నేర సమాచార గణాంక నివేదికల ఆధారంగా చూస్తే 2001లో అత్యధికంగా 13,113 కేసులు దేశవ్యాప్తంగా నమోదయ్యాయి.

## కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్

కశ్మీర్‌లోని సోఫియా జిల్లాలో ఏప్రిల్ 25న జరిగిన ఎన్‌కౌంటర్లో ఒక జవాను, ముగ్గురు కాశ్మీర్ మిలిటెంట్లు మృతిచెందారు. ఒక జవాను గాయపడ్డారు. కరేవా మలీనో గ్రామంలోని ఓ ఇంట్లో మిలిటెంట్లు ఉన్నట్లు ఏప్రిల్ 24న రాత్రి తమకు సమాచారం అందిందని ఓ సైనికాధికారి తెలిపారు. అక్కడకు చేరి వారిని లొంగిపోవాల్సిందిగా కోరాం, వారు కాల్పులు జరిపారు. ఏప్రిల్ 25 తెల్లవారుజామున ఆ ఇంటిని పేల్చివేశామన్నారు. దీంతో ఇంట్లో ఉన్న ముగ్గురు మిలిటెంట్లు మృతిచెందారన్నారు.

## అత్యాచార నిందితుల ఆస్తుల జప్తు

సామూహిక అత్యాచారం కేసులో పరారీలో ఉన్న 20 మంది నిందితుల అస్తులను జప్తు చేయాలని స్థానిక న్యాయస్థాం ఏప్రిల్ 25న ఆదేశించింది. గత సంవత్సరం ముజఫర్‌నగర్‌లోని పుగానా గ్రామంలో మతఘర్షణల సందర్భంగా ఐదుగురు మహిళలపై సామూహిక అత్యాచారం జరిపారు. వారి ఇల్లను తగలబెట్టారు. ఈ కేసులో మొత్తం 22 మందిని ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్) నిందితులుగా గుర్తించింది. ఇద్దరు అరెస్టవగా 20 మంది ఫరారీలో ఉన్నారు.

## మహిళా చీఫ్ జస్టిస్‌లు

ఢిల్లీ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా జస్టిస్ జి. రోహిణి (58) నియమింపబడ్డారు. ఇంతవరకు ఆమె ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో సీనియర్ న్యాయమూర్తిగా ఉన్నారు. సుప్రీం కోర్టు చీఫ్ జస్టిస్ పి. సదాశివం నేతృత్వంలోని న్యాయమూర్తుల కొలీజియం ఆమె పేరును న్యాయ మంత్రిత్వ శాఖకు సిఫారసు చేసింది. ఢిల్లీలోని రాజ్ నివాస్‌లో లెఫ్టినెంట్ గవర్నర్ నజీబ్ జంగ్ సమక్షంలో జస్టిస్ రోహిణి ఏప్రిల్ 21న ప్రమాణ స్వీకారం చేశారు. ఉత్తర గోవా ప్రిన్సిపల్ – సెషన్స్ జడ్జిగా ఉన్న అనూజా ప్రభుదేశాయ్ బాంబే హైకోర్టు చీఫ్ జస్టిస్‌గా నియమించబడ్డారు. దీంతో ఈ పదవి పొందిన తొలి గోవా మహిళగా ఆమె రికార్డులకు ఎక్కారు.

## సుప్రీం కోర్టు సి.జె.గా రాజేంద్ర మల్ లోథా

భారత సుప్రీం కోర్టు 41వ ప్రధాన న్యాయమూర్తిగా జస్టిస్ రాజేంద్ర మల్ లోథా (64) నియమితులయ్యారు. రాజ్యాంగంలోని 124వ ఆర్టికల్, రెండో ప్రకరణ ప్రకారం రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఏప్రిల్ 11న ఆమోద ముద్ర వేశారు. లోథా ఏప్రిల్ 27 నుంచి ప్రధాన న్యాయమూర్తిగా బాధ్యతలు నిర్వహిస్తారని న్యాయ మంత్రిత్వశాఖ ప్రకటించింది. లోథా జోత్‌పూర్‌లో జన్మించారు. 1973లో రాజస్థాన్ బార్ కౌన్సిల్‌లో పేరు నమోదు చేసుకొని హైకోర్టు న్యాయవాదిగా ప్రాక్టిస్ ప్రారంభించారు.

## కొనసాగుతున్న లోకసభ ఎన్నికలు

**2014** లోకసభ ఎన్నికలు దేశవ్యాప్తంగా సాగుతున్నాయి. ఇప్పటివరకు మొత్తంగా ఏడు దశలలో 349 స్థానాలకు ఓటింగ్ జరిగింది. మొదటి దశలో (ఏప్రిల్ 7న) 6, రెండవ దశ (ఏప్రిల్ 9న) 6, మూడవ దశ (ఏప్రిల్ 10న) 91, నాల్గవ దశ (ఏప్రిల్ 11న) 1, ఐదవ దశ (ఏప్రిల్ 12న) 7, ఆరవ దశ (ఏప్రిల్ 17న) 121, ఏడవ దశ (ఏప్రిల్ 24న) 117 స్థానాలకు ఓటింగ్ జరిగింది. ఇంకా మిగిలిన స్థానాలకు మూడు దశలలో ఓటింగ్ జరుగనుంది. ఫలితాలు మే 16న వెలువడనున్నాయి. వీ

## స్లోవాకియా అధ్యక్ష ఎన్నికలు

మార్చ్ 29న జరిగిన స్లోవాకియా అధ్యక్ష ఎన్నికల్లో స్వతంత్ర అభ్యర్థి ఆంద్రెజ్ ఖిస్కా వామపక్ష ప్రధానమంత్రి రాబర్ట్ ఫికో మీద భారీ ఆధిక్యంతో 59.4 – 20.6 శాతం ఓట్లతో విజయం సాధించాడు.

## అఫ్ఘనిస్తాన్ అధ్యక్ష ఎన్నికలు

తాలిబాన్ దాడులు, బెదిరింపులు, హత్యల నడుమ ఏప్రిల్ 5న అఫ్ఘనిస్తాన్ అధ్యక్ష ఎన్నికలు జరిగాయి. ప్రజలు అధిక సంఖ్యలో ఓటింగ్‌లో పాల్గొన్నారు. ఫలితాలు ఇంకా వెలువడాల్సి ఉంది. ప్రాథమిక సర్వే ఫలితాలు మాజీ విదేశాంగ మంత్రి అబ్దుల్లా అబ్దుల్లా సమీప ప్రత్యర్థి అషాఫ్ మీద ఆధిక్యంలో ఉన్నట్లు వెల్లడించాయి. కాగా నెల రోజులుగా తాలిబన్ దళాలు జరుపుతున్న దాడుల్లో చనిపోయిన సైనికుల సంఖ్య రెండు వందలు దాటింది.

## రువాండ మారణకాండ 20వ వార్షికోత్సవం

ఏప్రిల్ 6, 1994లో వంద రోజులపాటు జరిగిన నరమేధపు జ్ఞాపకార్థ వార్షికోత్సవం ఏప్రిల్ 7న రువాండా రాజధాని కిగాలిలో ఆనాడు మిగిలిన వాళ్ల చేత జరిగాయి. ఈ వార్షికోత్సవానికి ఐక్యరాజ్య సమితి కార్యదర్శి బాన్‌కీమూన్ ఇతర అగ్రదేశాల అధినేతలు రువాండా అధ్యక్షుడు పాల్‌కగామెతో సహా పాల్గొన్నారు.

## బిసావు – గినియా అధ్యక్ష, పార్లమెంట్ ఎన్నికలు

ఏప్రిల్ 13న బిసావు దేశంలో అధ్యక్ష, పార్లమెంట్ ఎంపికకుగాను ఎన్నికలు జరిగాయి. పశ్చిమాసియాకు చెందిన ఈ దేశం పోర్చుగల్ నుండి నాలుగు దశాబ్దాల క్రితం స్వాతంత్ర్యం పొందింది. మాదకద్రవ్యాల వ్యాపారం సైనిక కుట్రలలో నిండిన ఈ దేశం గత రెండేండ్లుగా ట్రాన్సిషనల్ సైనిక ప్రభుత్వ పాలనలో ఉంది.

## మాసిడోనియా అధ్యక్ష ఎన్నికలు

మేలో మాసిడోనియా పార్లమెంట్‌కు ఎన్నికలు జరుగనున్న నేపథ్యంలో ఏప్రిల్ 13న నూతన అధ్యక్షుని ఎంపికకు గాను ఎన్నికలు జరిగాయి. ప్రస్తుత అధ్యక్షుడు జిజాన్ ఇవనోవ్ 30 శాతం ఓట్లు, ప్రత్యర్థి సివో వెండరోవ్‌స్కీ 16 శాతం ఓట్లు పొందినట్లు ప్రాథమిక ఫలితాలు సూచించాయి. ఏ ఒక్కరూ 50 శాతం ఓట్లు పొందకపోవడంతో ఎన్నికలను ఏప్రిల్ 27న తిరిగి నిర్వహించనున్నారు.

## ఉక్రెయిన్ – రష్యా

క్రిమియా సోవియట్ రష్యాలో అంతర్భాగమైన తర్వాత తూర్పు ఉక్రెయిన్‌లో పాశ్చాత్య అనుకూల ప్రభుత్వానికి, రష్యన్ మాతృభాషగా కలిగిన రష్యా మద్దతుదార్లకు ఘర్షణలు మొదలైనాయి. రష్యా మద్దతుదార్లు డొంటెస్క్ స్లావియాన్స్క్ నగరాలను స్వాధీనం చేసున్నాయి. ప్రభుత్వం ప్రకటించి అమలు చేయబూనని 'ఉగ్రవాద వ్యతిరేక ఆపరేషన్' ఫలించలేదు. ఈ అంతర్యుద్ధ నివారణకు శాంతి పరిష్కారానికి జెనీవాలో ఏప్రిల్ 17న యురోపియన్ యూనియన్, అమెరికా, ఉక్రెయిన్, రష్యా ప్రతినిధుల మధ్య జరిగిన చర్చల ఒప్పంద తీర్మానాలను ఉల్లంఘిస్తున్నారంటూ ఇరుపక్షాలు పరస్పరం అరోపించుకున్నాయి. పశ్చిమ మద్దతు ప్రభుత్వానికి, రష్యా తిరుగుబాటుదారు లకు అమెరికా తన పూర్తి మద్దతును ప్రకటించింది.

## నైజీరియాలో విద్యార్థుల కిడ్నాప్

నైజీరియాలోని బోర్నో రాష్ట్రంలోని చిబోక్ ప్రాంతం నుండి వంద మందికి పైగా పాఠశాల విద్యార్థినులను ఏప్రిల్ 15న బొకొహరామ్ ఇస్లామిక్ తీవ్రవాదులు అపహరించుకుపోయారు. దీంతో స్కూల్ అధికారులు, తల్లిదండ్రులు ప్రభుత్వానికి సత్వర చర్యలు తీసుకోవాల్సిందిగా విజ్ఞప్తి చేశారు. సైనికులు అపహరించిన వారిలో ఒకరిని పట్టుకోగా వంద మంది విద్యార్థినులను విడిపించారు. ఇంకా ఎనిమిది మంది జాడ తెలియడం లేదు. అదే రోజు రాజధాని అబుజా నగర శివారుల్లో బస్‌స్టేషన్‌లో జరిగిన బాంబు దాడిలో 75 మంది దాకా మరణించారు.

## బ్రెజిల్‌లో ఆందోళనలు

బ్రెజిల్‌లోని సాన్‌సాల్వడార్‌లో పోలీసులు సమ్మెకు దిగారు. ఈ ఆందోళన క్రమంలో బ్రెజిల్‌లో తీర నగరంలో ఏప్రిల్ 15, 16 తేదీల్లో లూటీలు, హత్యలు జరిగాయి. ఈ దాడుల్లో 39 మంది హత్యకు గురయ్యారు. వేతనాల్లో పెరుగుదల, పదోన్నతులు మొదలైన డిమాండ్లతో పోలీసులు ఆందోళన బాట చేపట్టారు. కాగా బహియా న్యాయస్థానం ఈ సమ్మె చట్ట వ్యతిరేకమని, సమ్మె రోజుల్లో జరిగిన నష్టానికి గాను రోజుకు 2200 డాలర్ల జరిమానాను పోలీసు సంఘానికి విధించడంతో పోలీసులు సమ్మె విరమించారు.

## ఈజిప్ట్ అధ్యక్ష ఎన్నికలు

ఈజిప్ట్ అధ్యక్ష ఎన్నికలు సమీపిస్తున్న నేపథ్యంలో మాజీ సైనికాధికారి అబ్దెల్ ఫతా ఎల్ – సిసికి పోటీగా వామపక్ష హమ్‌దీన్ సబ్బాహి నామినేషన్ వేశారు. కాగా ప్రస్తుత సైనిక ప్రభుత్వానికి బహిష్కృతనేత మోర్సీ మద్దతుదారులు ముస్లిం బ్రదర్‌హుడ్ వర్గాలకు ఘర్షణలు తీవ్రంగా కొనసాగుతున్నాయి. ఈజిప్ట్ న్యాయస్థానం మోర్సీ మద్దతుదార్లు 529 మందికి మరణశిక్షను విధించింది. కైరో సుయజ్‌ల నడుమ ఒక పెట్రోలింగ్ సైనిక వాహనం మీద ముస్లిం బ్రదర్‌హుడ్ తిరుగుబాటుదారులు దాడిచేయడంతో ఇద్దరు పోలీసు అధికారులు చనిపోయారు.

## అల్జీరియా అధ్యక్ష ఎన్నికలు

ఉత్తరాఫ్రికా ఒపెక్ (ఒపిఇసి) దేశమయిన అల్జీరియా అధ్యక్ష ఎన్నికలు ఏప్రిల్ 17న జరిగాయి. ప్రస్తుత అధ్యక్షుడు అబ్దెల్ అజిజ్ బౌటెఫ్లికా వరుసగా నాల్గవసారి అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ఎన్నికల సందర్భంలో అల్‌ఖైదా ఇస్లామిక్ తీవ్రవాదులు పెట్రోలింగ్ సైనికుల మీద జరిపిన దాడిలో పదకొండు మంది సైనికులు చనిపోయారు.

## ఇరాక్ పార్లమెంట్ ఎన్నికలు

ఇరాక్ పార్లమెంట్‌కు ఏప్రిల్ 30న సాధారణ ఎన్నికలు జరుగనున్నాయి. 328 స్థానాలకు 900 మందికి పైగా పోటీ పడుతున్న నేపథ్యంలో ఇరాక్ భద్రతా దళాలు ఏప్రిల్ 3న 40 మందికి పైగా దాష్‌గాంగ్ సభ్యులను హతమార్చినట్లు ఇరాక్ ఆంతరంగిక మంత్రిత్వ శాఖ తెలిపింది.

## దక్షిణ కొరియా పడవ ప్రమాదం

దక్షిణ కొరియాలో ఏప్రిల్ 16న యాత్రకు వెళ్లిన ఒక భారీ నౌక సముద్రంలో మునిగిపోయింది. మొత్తం 476 మందితో బయలుదేరిన ఈ నౌకలో ఎక్కువగా విద్యార్థులే ఉన్నారు. సముద్రం మధ్యలో మునిగిపోవడం ప్రారంభం కావడంతో కొందరు దూకి ప్రాణాలను రక్షించుకోవడానికి ప్రయత్నించారు. ఈ క్రమంలో సహాయకులు కేవలం 174 మంది ప్రాణాలను మాత్రమే కాపాడగలిగారు. సముద్రం నుంచి దాదాపు రెండు వందల మంది మృతదేహాలను వెలికితీశారు. ఇంకా వంద మందికి పైగా జాడ తెలియడం లేదు. ప్రమాదం విషయం తెలియగానే నౌక కెప్టెన్, కొంత మంది సిబ్బంది పారిపోయి తమ ప్రాణాలు దక్కించుకున్నారు. నౌక వైస్ కెప్టెన్ ఈ దుర్ఘటనకు నుంచి ప్రాణాలతో బయటపడ్డా, దుర్ఘటనతో విచలితుడయి ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ దుర్ఘటనకు బాధ్యత వహిస్తూ దక్షిణ కొరియా ప్రధాన మంత్రి చుంగ్ హాంగ్ రాజీనామా చేశాడు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎ.మల్లేశ్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చుయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 మార్చ్ నుండి 31 మార్చ్ 2014 వరకు జిల్లాలలో 13 అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1136)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 12 | 16 | 4 | 5 | 2 | 2 | 1 | 2 | 4 | – | 2 | 22 | 14 | – | – | – | 3 | 5 |
| మహబూబ్‌నగర్ | – | 2 | – | 17 | 13 | 1 | – | – | – | 1 | 11 | 20 | 15 | 10 | 52 | 20 | – | – | – | – | 2 |
| హైదరాబాద్ | – | – | – | 12 | 8 | – | – | – | – | 2 | 5 | 8 | – | 1 | 26 | 15 | – | – | – | 8 | – |
| మెదక్ | – | 6 | – | 2 | 2 | – | – | – | – | – | – | – | – | – | 4 | 4 | – | – | – | – | – |
| వరంగల్ | – | – | – | 6 | 6 | 4 | 7 | 9 | – | – | – | – | – | 4 | 9 | 8 | – | – | – | – | 1 |
| నల్గొండ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| అనంతపురం | – | 3 | 3 | 10 | 13 | 1 | 1 | – | – | 3 | 1 | 7 | 3 | 2 | 37 | 9 | – | – | – | – | 5 |
| ఖమ్మం | – | 2 | – | 9 | 15 | 6 | 9 | 5 | 1 | 2 | 4 | 2 | 2 | 1 | 26 | 18 | – | – | – | – | 1 |
| నిజామాబాద్ | – | – | – | 6 | 5 | 2 | 1 | – | – | 3 | 5 | 4 | 3 | 2 | 21 | 17 | – | – | – | – | – |
| కరీంనగర్ | 3 | 6 | 3 | 4 | 5 | 8 | 7 | 9 | 11 | 9 | 14 | 6 | 3 | 2 | 20 | 10 | – | – | – | – | 3 |
| చిత్తూరు | – | – | – | 9 | 16 | – | – | – | – | – | 8 | 11 | 14 | – | 39 | – | – | – | – | – | – |
| కర్నూలు | – | 1 | – | 3 | 4 | 6 | 6 | 9 | 7 | 6 | 2 | 4 | 6 | 2 | 30 | 21 | – | – | – | – | 3 |
| శ్రీకాకుళం | – | – | – | 6 | 9 | 1 | 5 | – | – | 5 | – | – | 6 | 2 | 16 | 9 | – | – | – | – | – |
| విశాఖపట్నం | 1 | – | – | 6 | 5 | – | 1 | – | – | 7 | 1 | – | 6 | – | 10 | 14 | – | – | – | 9 | 1 |
| **మొత్తం** | **5** | **22** | **6** | **102** | **117** | **32** | **42** | **35** | **21** | **37** | **53** | **66** | **58** | **28** | **312** | **159** | **–** | **–** | **–** | **20** | **21** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రరాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని | | |
| పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| సమాధిలోకి సామ్రాజ్యవాదం | డి. పాపారావు | 200 |
| కొత్తకోణం | ఎనిశెట్టి శంకర్ | 80 |
| ఫారన్‌హీట్ 451 | ఎనిశెట్టి శంకర్ | 90 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| కశ్మీర్‌లో ఒక నిషిద్ధ రాత్రి | బషారత్ పీర్ | రు. 150 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| టాల్‌స్టాయ్ పరిచయ వ్యాసాలు | యన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు | 30 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| జనతన జైత్రయాత్ర | విరసం ప్రచురణ | 20 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |

### కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్యంలో కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| గంగానమ్మ | విజయ | 15 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| ఒంద్రుమట్టి | నల్లూరి రుక్మిణి | 170 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 154 - May 2014 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/04/2014 • Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

# ఎందరో అభిమానుల కోరిక
# వీక్షణం ఎటువంటి పరిస్థితిలోనూ ఆగిపోగూడదు
# రచయితల సమావేశం ప్రతిన
# వీక్షణం మనుగడ కోసం శాయశక్తులా కృషి చేద్దాం
# మూలనిధి ఏర్పాటు చేద్దాం

---

## వీక్షణం ఆర్థిక సమస్యల నుంచి గట్టెక్కి చిరకాలం కొనసాగాలంటే

- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరమూ కనీసం మరొక చందా చేర్పిద్దాం
- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరమూ మన చందాతో పాటు కనీసం రు. 100 వీక్షణం మూలనిధికి విరాళంగా ఇద్దాం
- కళాశాలలను, విద్యాసంస్థలను, ప్రభుత్వ, ప్రైవేటు గ్రంథాలయాలను వీక్షణం చందాదారులుగా చేర్పించి వీక్షణం మరింత మంది పాఠకులకు చేరువయ్యేలా చూద్దాం
- ప్రతి న్యూస్ ఏజెంట్ దగ్గరా వీక్షణం విడిప్రతులు అమ్మకానికి ఉండే ఏర్పాట్లు చేద్దాం
- ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉన్న పాఠకులు, అభిమానులు తమ బాధ్యతగా సంవత్సరాదాయంలో కనీసం ఒక శాతం వీక్షణం మూలనిధికి విరాళంగా ఇచ్చేలా చూద్దాం
- సామాజిక జీవితంలో క్రియాశీలంగా ఉన్న, విస్తృత పరిచయాలు ఉన్న వీక్షణం అభిమానులు తమకు తెలిసిన దాతల నుంచి వీక్షణం మూలనిధికి విరాళాలు సేకరించేలా చూద్దాం
- విద్యాసంస్థల, ఆరోగ్య సంస్థల, సాధారణ వ్యాపార సంస్థల నిర్వాహకులతో పరిచయాలు ఉన్న అధ్యాపకులు, మిత్రులు, సామాజిక కార్యకర్తలు వీక్షణం కోసం ఆయా సంస్థల వ్యాపార ప్రకటనలు ఇప్పించేలా చూద్దాం
- వీక్షణం ప్రచారం కోసం, ఆర్థిక సహాయం అర్థించడం కోసం మన ప్రాంతాలలో సమావేశాలు ఏర్పాటు చేద్దాం

---

వివరాలకు

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao